# అలంకార శాస్త్ర చరిత్రము.

## ప్రథమ భాగము.



శ్రీవిజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాలలో నాంధ్రగీర్వాణ

భాషాధ్యాపకుడు,

మేడేపల్లి వెంకటరమణాచార్యుడు

రచించినది.



మొదటిమార్పు 100 ప్రతులు





ఖరీదు 1 రూపాయి.

# అలంకార శాస్త్ర చరిత్రము.

## ప్రథమ భాగము.






శ్రీవిజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాలలో నాంధ్రగీర్వాణ

భాషాధ్యాపకుడు,


మేడేపల్లి వెంకటరమణాచార్యుడు


రచించినది.




మొదటికూర్పు 100 ప్రతులు






ఖరీదు 1 రూపాయి.

# అలంకార శాస్త్ర చరిత్రము.

## ప్రా చీ న ద శ.

మనుష్యజాతి యెంతప్రాచీనమయినదో కవనముకూడ నంతప్రాచీనమయినది. మనుష్యజాతి వారిప్రాచీనతమగ్రంథములన్నియుఁ గవితామయములు కవనరూప మగు భాషలో నలంకారములుండకమానవు. హిందువులవేదము, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, క్రైస్తవుల బైబిలు, పారశీకుల ఛందోవస్థానము, మహమ్మదీయుల ఖురాను మొదలగు ప్రాచీనగ్రంథము లత్యుత్కటసారస్వతా వేశముతోఁగూడిన మహానుభావుల ముఖములనుండి నిరర్గళధారగా స్వయంప్రసృతము లయిన కవితాస్రోతోరూపములు. వీనియందెల్లెడల నలంకారములుండును. ఇందుకు నిదర్శనముగా మనఋగ్వేదము, ఉపనిషత్తులు, పురాణములు, మొదలగువానినిఁ బరీక్షించినయెడల నిపుడు మనమెఱిఁగిన అలంకారసమూహమంతయుఁ గానరాకపోయినను, ఉపమ, రూపకము, అతిశయోక్తి, విరళముగాఁ గానవచ్చుచున్నవి. ఉపమ, రూపకము లేకుండ నేభాషయు వృద్ధినొందఁజాలదు. రూపకాలంకారము భాషాభివృద్ధికి ముఖ్యకారణమని బహుగ్రంథకర్తయగు కారలైల్ (Carlyle) వ్రాసియున్నాడు. ఋగ్వేదమందుపమాలంకారములు:—

I,—124—7 అభ్రాతేవపుంసఏతి ప్రతీచీ గర్తారు గివసనయేధనానామ్।
జాయేవపత్య ఉశతీసువాసా ఉషాహస్రేవ నిరిణీతేఅప్సః॥

టీ॥ సోదరులులేని స్త్రీ తండ్రిమొదలగువారికడ కెట్లుపోవునో మగడులేని యాఁడుది తనకు రావలసినధనమును రాఁబట్టుకొనుటకు కచ్చేరికెట్లుపోవునో కామము గల స్త్రీ వస్త్రాభరణాదులచే దేహము నలంకరించుకొని భర్తృసమీపమున కెట్లు చనునో, హాసము దంతపంక్తి నెట్లు ప్రకాశింపఁజేయునో, అట్లుసకలపదార్థములను బ్రకాశింపఁజేయు ఉషస్సు సూర్యుని నివాసస్థానమగు అంతరిక్షమునకుఁబోవుచున్నది. ఇందులో నాలుగుపమలు కలవు.

VII. 33—౮—సూర్యస్యేవవక్షథో జ్యోతిరేషాంసముద్రస్యేవ మహిమాగ
భీరః। వాతస్యేవ ప్రజవోనాన్యేనస్తోమో వసిష్టాఅన్యేత వేవః॥

టీ॥ ఓవసిష్ఠులారా! మీమహిమ సూర్యునిప్రకాశము వంటిది. సముద్రము వలె గంభీరమయినది. వాయువువలెఁ బ్రకృష్టజవముగలది. ఇందులో మూడుపమ లున్నవి.

I.—123—10 కన్యేవతన్వాశాశదానా ఏషిదేవి దేవమియక్షమాణం॥

టీ॥ ఓఉషోదేవీ కమనీయయగు కన్యకవలె నీవునునీశరీరముచే స్పష్టమగుచున్న దానవయి అభిమతములనొసంగు సూర్యునొద్దకుఁబోవుచున్నావు. దీనిలోనొక ఉపమ.

IV.—58—3 చత్వారిశృంగాత్రయోఅస్యపాదాద్వేశీర్షే సప్తహస్తాసో అస్య। త్రిధాబద్ధో వృషభోరోరవీతి మహోదేవో మర్త్యాన్ ఆవివేశ॥ ఇందులో రూపకాతిశయోక్తి.

I.—164—20 ద్వాసుపర్ణా సయుజాసఖాయాసమానం వృక్షం పరిషస్వ జాతే। తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి- అనశ్నన్నన్యో అభిచాకశీతి॥

టీ॥ శోభనములయిన ఱెక్కలుగలవి, సంతతము కలిసియుండునవి, పరస్పర మైత్రిగలవియగు రెండుపక్షులొక చెట్టు నాశ్రయించియున్నవి. ఆరెండుపక్షులలో నొకటి రుచిగలఫలము నాస్వాదించుచున్నది. మఱియొకపక్షి యేమియుఁదినకుండఁ బ్రకాశించుచున్నది. ఈఋక్కుని జగన్నాథపండితుడు రసగంగాధరములో నలంకార ప్రకరణమందతిశయోక్త్యలంకారమున కుదాహరణముగానిచ్చెను. "విషయిణావిష యస్య నిగరణమతిశయః, తస్యోక్తిః అతిశయోక్తిః" అని లక్షణముచెప్పెను. ఇచట నుపమానమగు పక్షులచే నుపమేయమగు జీవాత్మ పరమాత్మలు ఉపమానమగు వృక్ష శబ్దముచే నుపమేయమగు శరీరమును నిగీర్ణములయినవి.

ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః। మనసశ్చ పరాబుద్ధి బుద్ధేరాత్మామహాన్పరః। మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరఃపురుషాన్న పరం కించిత్సాకాష్ఠా సాపరాగతిః॥—కఠోపనిషత్తు 3 వల్లి ౧౦—౧౧.

ఇచటఁ బైశ్రుతిలో నశ్వములుగా రూపితములయిన యింద్రియములకంటె మార్గములుగాఁ బోల్పఁబడిన విషయములు వశపర్చుకొనుటయందు గష్టమయినవి. ఏలయనగా జితేంద్రియునిఁగూడ విషయసన్నిధియందు దుర్నిగ్రహములగు నింద్రియములు లోభపెట్టి ఆకర్షించును. విషయములకంటె మనస్సు వశపరచుకొనుటయందు

హెచ్చుకష్టముఁ గలిగించును. ఇట్లన మనస్సు విషయములఁగోరునదియై యుండఁగా విషయాసన్నిధానము మనఃప్రవృత్తి నడ్డలేదు. మనస్సుకంటె సారధిగా రూపితమయిన బుద్ధిని వశపఱచుకొనుట మిక్కిలికష్టము. బుద్ధికంటెఁ గర్తృత్వముగల వాడగుటచేఁ బ్రధానుడగు నాత్మను వశపఱచుకొనుట మఱింతకష్టము. జీవుడు సకల పురుషార్థసాధనమునకు శరీరాయత్తస్థితిగలవాడుగావున వానికంటె శరీరము వశపఱచుకొనుట ఎక్కువకష్టము. అంతకంటె సర్వాంతరాత్మయగు పరమపురుషుని వశపఱచుకొనుట కష్టము. ఇట్లుత్తరోత్తరముగా నొకదానికంటె మఱియొకటి వశపఱచుకొనుటయందుఁ గష్టమయినదని చెప్పబడినది. దీనికి సారాలంకారమని పేరు "ఉత్తరోత్తరముత్కర్షస్సార ఇత్యభిధీయతే" అని దానిలక్షణము. ఇదియు రసగంగాధరకారునిచే సారాలంకారమున కుదాహరణముగా నియ్యఁబడెను. "విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః। సోऽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్॥ ప్రణవోధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయోభవేత్॥" (ద్విముఁ-ఖం-౪) ఇత్యాదులయందు రూపకాలంకారము. ఆసీనోదూరంవ్రజతి శయానోయాతిసర్వతః। కస్తంమదామదందేవం మదన్యోజ్ఞాతుమిచ్ఛతి॥ కఠ (ప్ర-అ-ద్వి-వ-౨౧) ఇత్యాదులయందు విరోధాభాసము గానవచ్చుచున్నది.

(శ్వేతాశ్వతరోపనిషత్తు-ప్ర-అ-౪) తమేకనేమింత్రివృతం షోడశాన్తం శతార్ధారం వింశతిప్రత్యరాభిః। అష్టకైష్షడ్భిర్విశ్వ రూపైకపాశం త్రిమార్గభేదం ద్వినిమిత్తైకమోహం॥

టీ॥ కారణావస్థయనెడునొకకమ్మిగలది, సత్త్వరజస్తమస్సులనెడుమూడుచుట్లతోఁగూడినది, వికారరూపములగుపంచభూతములు, ఏకాదశేంద్రియములు అనుపదునారు అంచులుగలది, సాంఖ్యశాస్త్రోక్తములగు పంచాశత్ప్రత్యయ భేదములనెడు రేకులుగలది, దశేంద్రియములు, వానివిషయములు అను ఇరువదిపైపుటీలుకలది, ఆరు అష్టకములతో గూడినది, నానారూపమగు కామమనెడు త్రాడుగలది, పుణ్య పాపములు రెండును నిమిత్తముగాగల మోహమునుఁ బుట్టించునది, మూడుమార్గములయందుఁ బోవునది అగు చక్రమువలెనున్న కారణబ్రహ్మను ధ్యానింపుచున్నాము.

(శ్వే త-అ-౫) పంచస్రోతోంబుంపంచయోన్యుగ్ర వక్రాంపంచప్రాణోర్మింపంచబుద్ధ్యాదిమూలాం। పంచావర్తాంపంచదుఃఖౌఘవేగాం పంచాశద్భేదాం పంచపర్వామధీమః॥

టీ॥ చక్షురాదీంద్రియములను పంచప్రవాహములుకలది, అయిదుమూలముల చే నుగ్రమైనది, వక్రమైనది, పంచప్రాణములనెడు తరంగములుగలది, పంచవిషయములనెడు (శబ్ద స్పర్శరూపరసగంధములు) సుళ్లు (whirlpools) గలది, అయిదువిధములగు దుఃఖములను (గర్భ జన్మ జరా వ్యాధిమరణములు) ప్రవాహవేగములుగలది, లజ్జాఘృణాదులగు నేబదిభేదములతోఁ గూడినబుద్ధులే శాఖలుగాగలది, అవిద్యాస్మితారాగద్వేషాభినివేశములనెడు పంచ సోపానములతోఁగూడినది అగు నొకనదివలెనున్న పరబ్రహ్మమును ధ్యానింపుచున్నాము ఈరెండుమంత్రములలో మొదటిదానియందు సంసారమును చక్రరూపముగాను, రెండవదానియందు నదిగాను నిరూపించిచెప్పుటచే రూపకాలంకారము ఇదిసావ యవరూపకము. పైఁజూపింపబడినట్లు వేదమందు ఉపనిషత్తులయందేకాక స్మృతుల యందుఁగూడ విరళముగా నలంకారములు కానవచ్చుచున్నవి. "యానిశాసర్వ భూతా నాంతస్యాం జాగర్తిసంయమీ। యస్యాంజాగ్రతి భూతాని సానిశాపశ్యతోమునేః" అని భగవద్గీత. దీనిలో నతిశయోక్త్యలంకారము. కవికర్మనుగురించి శ్రుతియేయిట్లు చెప్పుచున్నది. "ఏకశ్శబ్దస్సుష్ఠు ప్రయుక్తస్స్వర్గేలోకే కామదుగ్భవతి, సమ్యక్ జ్ఞాతః" అనుటచే జాతివాచకములనియు, క్రియావాచకములనియు, గుణవాచకము లనియు యదృచ్ఛాశబ్దములనియు నాలుగుతెరగతులుగా విభజింపబడిన శబ్దములఁ జక్కఁ గాఁ దెలిసికొని "సుష్ఠుప్రయుక్తః" బాగుగా బ్రయోగింపబడినయెడల, "స్వర్గే లోకే కామదుగ్భవతి" ఐహికాముష్మిక ఫలప్రదాయియగును.

"బ్రహ్మైవరసః", "రసోవైసః", "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీభవతి" ఇత్యాదిశ్రుతులచేఁ గావ్యజీవాతువగు రసముకూడ నుపదేశింపబడుచున్నది.

అతిప్రాచీనమగు వేదమందీయలంకారము లిట్లు యాదృచ్ఛికముగాఁ బ్రయో గింపబడియున్నను వీనికి సరియయిన లక్షణనిరూపణము, వీనిలో నవాంతరభేదములు, వీనివర్గీకరణము (classification) మొదలగునవి వేదమునకుఁ దరువాత నెంతో దీర్ఘకాలమున కేర్పడినవి. ఇట్లు కాలక్రమమునఁ గావ్యసంబంధమగు సామగ్రి భాషలోఁ బెరిగినకొలది మనుష్యులు కావ్యలక్షణములను అలంకారలక్షణములను నిరూపించుటకుఁ దగిన నిర్వచనముల నాలోచింపఁదొడఁగిరి. క్రీస్తుశకమునకుముందే యీయలంకారశాస్త్రపు గురుతులు కొన్ని వాఙ్మయయందున్నట్లీవ్యాసమందు సమ ర్థింపఁబడును.

" వ్యాకరణకర్తపాణిన్యాచార్యుడుకూడ నొక కవిగానున్నట్లు గ్రంథనిదర్శనము వలనఁ గానవచ్చుచున్నది. ఔచిత్యవిచారచర్చాద్యనేక గ్రంథకర్తయగు క్షేమేంద్రుఁడు తానురచించిన సువృత్తతిలకమను గ్రంథమందు పాణినికి ఉపజాతివృత్తరచనయందసామాన్య ప్రావీణ్యముగలదని చెప్పియున్నాడు. "స్పృహణీయత్వచరితం పాణినే రుపజాతిభిః। చమత్కారైక సారాభి రుద్యానస్యేవ జాతిభిః॥ (3-30) రుద్రటుని కావ్యాలంకారమునకు వ్యాఖ్యానమువ్రాసిన "నమిసాధు" అను నొక జైనపండితుడు పాణిని పాతాళవిజయమను నొక మహాకావ్యమును రచించెనని చెప్పియున్నాడు. మహాకవులుకూడ ప్రామాదికముగాఁ దమకృతులయం దపశబ్దములను ప్రయోగించిరను సందర్భమందిట్లు వ్రాసెను. "తథాహిపాణినేః పాతాళవిజయే మహాకావ్యే" "సంధ్యావధూంగృహ్యకరేణ" "ఇత్యత్రగృహ్యేతిక్త్వాల్యబాదేశః" (౩-౮) మఱియొకచోట నిట్టి సందర్భమందే, "గతేర్ధరాత్రే పరిమందమందం గర్జంతియత్ప్రావృషికాలమేఘాః। అపశ్యతీవత్సమివేందుబింబం తచ్ఛర్వరీ గౌరివహుంకరోతి" ఇచట అపశ్యతీ అనునది తప్పు. వల్లభదేవుని సుభాషితావళియందు శార్ఙ్గధరపద్ధతియందుఁ బాణినిరచించిన శ్లోకములని కొన్నియుదాహరింపఁబడినవి.

"క్షుద్రస్వభావాన్యపి సంహతానినినాయభేదం కుముదానిచంద్రః। అవాప్య వృద్ధిం మలినాంతరాత్మా జడోభవేత్కస్య గుణాయవక్రః॥" (సుభాషి-33౬ పుట ౧౯౬౮ శ్లో). ఉపోఢరాగేణ విలోలతారకం తథాగృహీతం శశినానిశా ముఖం। యథాసమస్తంతిమిరాంశుకం తయాపురోపిరాగాద్గళితం నలక్షితం॥ (సుభాషిత-పుట 33౬-శ్లో॥ ౧౯౬౯).

వ్యంగ్యముచేననుగతమగు వాచ్యమే ప్రధానముగాఁ బ్రతియమానమగునని చెప్పుటకానందవర్ధనాచార్యుడు పైశ్లోకమును ధ్వన్యాలోకమందుదాహరించెను.

"ఇంద్రధనుః పాండుపయోధరేణ శరద్దధానార్ద్రనఖక్షతాభం। ప్రసాదయంతీ సకలంకమిందుం తాపంరవే రభ్యధికంచకార॥" ఈశ్లోకమును వామనుడలంకార సూత్రములో వాక్షేపాలంకారమున కుదాహరణముగా నిచ్చెను. అమరకోశ వ్యాఖ్యానములో రాయమకుటుడు "పయఃపృషంతిభిస్స్పృష్టావాన్తివాతాశ్శనైశ్శనైః" అను నొకశ్లోకము నుదాహరించి యిది పాణినివ్రాసిన జాంబవతీ విజయములోనిదని చెప్పెను. ఇందువలనఁ బాణిని మఱియొక కావ్యమునుకూడ వ్రాసినట్లు

తెలియవచ్చుచున్నది. కాని పదునొకండవశతాబ్దియందుఁ బుట్టిన యీగ్రంథకర్త ప్రాచీనతముఁడగు పాణినిగురించి వ్రాసిన వ్రాతలయందు విశ్వాసముగలవారలై యుండుట కొంతసాహసకృత్యమని నాయభిప్రాయము. వైయాకరణపాణినికంటె గవిపాణిని భిన్నుఁడనియే మనము నమ్మవలెను. వైయాకరణపాణినియే పాతాళవిజయమను కావ్యమును వ్రాసినవాఁడైనచో "గృహ్య", "అపశ్యతీ" మొదలగు నపశబ్దములను బ్రయోగించునా? కావున నీయిద్దరొక్కటిగా నేరరు. అయినను నమ్మదగిన ప్రమాణము మనకు లభించువరకు వీరుభయులొక్కటియే అని యొప్పుకొందము. ఏలయనగ నట్లుకానిచో నాప్తతములు విమర్శకులునయిన నమిసాధుక్షేమేంద్రులు పూర్వోక్తకావ్యకర్తృత్వమును పాణినికారోపింతురా? సదుక్తికర్ణామృతమును వ్రాసిన రాజశేఖరుడు కూడ "స్వస్తిపాణినయే తస్మై యస్యరుద్రప్రసాదః। ఆదౌ వ్యాకరణం కావ్యమను జాంబవతీ జయమ్॥" అనుశ్లోకమందు పాణినిమహావైయాకరణియై యుండుటయే కాక మహాకవియై యున్నాడనియు జాంబవతీవిజయమను కావ్యమును రచించెననియుఁ జెప్పుచున్నాడు. "సుబంధౌభక్తిర్నః క ఇహ రఘుకారే నరమతే ధృతి ర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయం। విశుద్ధోక్తిశ్శూరః ప్రకృతిమధురా భారవిగిర స్తథాప్యంతర్మోదం కమపి భవభూతిర్వితనుతే॥" అను సదుక్తికర్ణామృతశ్లోకములోఁ జెప్పఁబడిన "దాక్షీపుత్ర" శబ్దము పాణినినే చెప్పును గావున దీనిచేఁ బూర్వోక్తాంశము మఱింతబలపర్చఁబడుచున్నది.

కాత్యాయనుని కాలమందుగాని లేక యతని కాలముకంటె ముందుగాని ఆఖ్యాయికలని వ్యవహరింపబడు గద్యకావ్యవిశేషములుండెనని రుజువుచేయుటకుఁ గాత్యాయనుని వార్తికములే తగినంత సాక్ష్యమిచ్చుచున్నవి. "అధికృత్యకృతే గ్రంథే" (౪-౩-౮౭) అను సూత్రముతో సంబంధించిన "లుబాఖ్యాయికాభ్యోబహుళం" అను వార్తికమువలన నీయంశము స్పష్టమగుచున్నది. వరరుచికాత్యాయను లొక్కటియే అని తెలుపుటకు "తస్యాహం వసుదత్తాయాం జాతశ్శ్రుతధరాభిధః। కాత్యాయనో వరరుచి శ్చేత్యన్వర్థ కృతాహ్వయః॥" (౧-౨-౧౫) అను బృహత్కథామంజరీ శ్లోకమే మనకుఁ బ్రమాణము. సుభాషితావళిలో వరరుచివ్రాసినవని యనేకశ్లోకములు చూపింపబడినవి. రాజశేఖరుని సూక్తిముక్తావళిలోని యొకశ్లోకము వరరుచి కంఠాభరణమను నొక కావ్యమును రచించినట్లు చెప్పుచున్నది. "యథార్థతా కథంనామ్ని మాభూద్వరరుచేరిహ। వ్యధత్త కంఠాభరణం యస్సదారోహణప్రి

యః॥" "వ్యంచచ్చంచలచంచుచుంబనచల చ్చూడాగ్ర ముగ్రింపత చ్చక్రాకారక గాళకేసరసటాస్ఫారస్ఫురత్కంధరం। వారంవార ముదంఘ్రిచంచల ఘనభ్రిశ్యన్న ఖక్షణ యోర్దృష్ట్వా కుక్కుటయోర్ద్వయో స్థితిరతిక్రూరక్రమం యుధ్యతోః॥" "అపి నదివసః కింస్యాద్యత్ర ప్రియాముఖపంకజే మధుమధుకరీవాస్య ద్దృష్టిర్వ్యకాసిని పాస్యతి। తదనుచమృదుస్నిగ్ధాలాప క్రమాహిత నర్మణః సురత నచి వైరం గై స్సంగో మమాపి భవిష్యతి॥" పైనఁజెప్పబడిన యీనిదర్శనములవలనఁ గ్రీస్తుశకము నకు మున్ను నాల్గవ శతాబ్దమందుఁ గావ్యములున్నట్లు నిశ్చయింపబడుచున్నది. క్రీస్తుశకమునకు ముందు రెండవశతకమువాడైన మహాభాష్యకారుని (పతంజలి) కాలమందుఁ బ్రజలకుఁ గవనోత్సాహము మెండుగానున్నట్లు కానవచ్చుచున్నది. "లుబాఖ్యాయికాభ్యో బహుళమ్" అనువార్తికమునకు వ్యాఖ్యానము వ్రాయుచుఁ బతంజలి, వాసవదత్త, సుమనోత్తర, భైమరథి అను మూఁడాఖ్యాయికలను చెప్పెను.

"అధికృత్య కృతేగ్రంథే" "ఇత్యత్ర ఆఖ్యాయికాభ్యో బహుళం లుబ్వక్తవ్యః॥" వాసవదత్తా సుమనోత్తరా నచభవతి భైమరథీ (Kielhorn's edition of Mahabhashya, vol. II., p. 213). పతంజలి మహాభాష్యములో "కంస వధ, బలిబంధము" అను రెండుకావ్యములను చెప్పెను. "కంసవధ మాచష్టే కంసం ఘాతయతి, బలిబంధ మాచష్టే బలింబంధయతి" (M. B. vol. II., p. 34).

మహాభాష్యములోఁ బతంజలి తనకంటెఁ బ్రాచీనులయిన కవులు, గ్రంథకర్తలు వ్రాసినగ్రంథములనుండి వందలకొలది శ్లోకములనుదాహరించెను. అందులోఁ గొన్ని మిక్కిలిసొగసయినవి. చారిత్రాంశ విశేషములను దెలుపునవి. వీనిలోఁ గొన్నింటి నిచట వ్రాయుచున్నాను. అసిద్వితీయో నుససారపాండవం। సంకర్షణ ద్వితీయస్య బలంకృష్ణస్య వర్ధతాం (M. B. vol. I., పే-౪౩౬)జఘానకంసం కిలవాసుదేవః (vol. II., పే-౧౧౯) జనార్థనస్త్వాత్మచతుర్థ ఏవ (vol. III., పే-౧౪౩) ప్రియాంమయూరః ప్రతినర్త్యతీతి యద్వత్తంసం వరసర్తి తీషి హ్యాప్తః॥ (vol. III., పే-౩౩౭) ఆత్మంభరిశ్చరతియూధమసేవ మానః (vol. II., పే.౧౦౨) బుభుక్షితం నప్రతిభాతికించిత్ (vol. I., పే-౧౪౪) ఆవనాం తా దోదకాం తాత్ప్రియాం పాంథమనువ్రజేత్ (vol. I., పే-౩౪౦) కాలః పచతి భూతానికాలస్సంహరతి ప్రజాః (vol. II., పే-౧౬౭) క్షేమేనుభిక్షే కృతసంచయాని పురాణా నిరాజ్ఞాం వినయంతికోపం (vol. II., ౪౩౭) ఏతిజీవంత

మానందో నరంవర్షశతాదపి (vol. I., పే-౨౪౪) వరతనుసంప్రవదంతి కుక్కుటాః (vol. I., పే-౨౫౩).

పతంజలికిఁ దరువాతఁ జెప్పఁదగిన మహాకావ్యములు రామాయణము, మహాభారతము, వీని ప్రణయనకాలనిర్ణయమును గుఱించి విమర్శకులకు భిన్నాభిప్రాయములున్నవి క్రీస్తుశక ప్రారంభమందు రచింపఁబడినవని చెప్పినచో నంత వివాదాధ్యాసితమయి యుండదు. కవితారామణీయక పరసీమలయి వెలయు శ్లోకములీ రెండుకావ్యములలో నచ్చటచ్చట బహుళముగా గానవచ్చుచున్నవి. ఆనందవర్ధనుడు మొదలగు నాలంకారికులు రామాయణ మహాభారత శ్లోకములను తామురచించిన అలంకారగ్రంధములలో నేనేక స్థలములయందుదాహరించియున్నారు. రామాయణమందు మిక్కిలి సుందరమయిన వర్ణనలు మెండుగానున్నవి. యుద్ధకాండ నాల్గవ సర్గలో నున్న సముద్రవర్ణనము, సుందరకాండలో చంద్రవర్ణనము, కిష్కింధాకాండలో వర్షర్తు శరదృతువుల వర్ణనము మిగుల మనోహరములయియున్నవి. "హసన్తమివ ఫేనాఢ్యై ర్నృత్యన్తమివ చోర్మిభిః। చంద్రోదయ సముద్ధూతం ప్రతిచంద్ర సమాకులం। పినష్టీవ తరంగాగ్రై స్సముద్రః ఫేనచన్దనం। తదాదాయకరైరిందు ర్లిమ్పతీవదిగఙ్గనాః॥" (యుద్ధ ౪ సర్గ ౧౧౨—౧౧౩) హంసోయథా రాజతపంజరస్థస్సింహో యథామందరకందరస్థః। వీరోయథా గర్వితకుంజరస్థ శ్చంద్రోపివిభ్రాజ తథామ్బరస్థః స్థితఃకకుద్మానివ తీక్ష్ణశృంగో మహాచలశ్శ్వేత ఇవోచ్చశృంగః। హస్తీవజాంబూనదబద్ధశృంగో రరాజచన్ద్రః పరిపూర్ణశృంగః। శిలాతలం ప్రాప్య యథామృగేంద్రో మహారణంప్రాప్య యథాగజేంద్రః రాజ్యం సమాసాద్య యథానరేంద్ర స్తదాప్రకాశో విరరాజచంద్రః॥ (సుందర ౫ సర్గ) ఇట్టి లోకోత్తర వర్ణనాలంకృత కవితామయములగు నీభారత రామాయణములే తరువాతఁ బుట్టిన మహాకవులగు కాళిదాస భవభూతుల కవిత్వమునకు ప్రాధీనిఁ గలిగించినవి. "ఇతిహాసోత్తమాదస్మా జ్జాయంతే కవిబుద్ధయః। అస్యకావ్యస్య కవయోన సమర్థా విశేషణే। ఇదంకవి వరైస్సర్వైరాఖ్యాన ముపజీవ్యతే॥ (ఆదిప II) అని భారతమునుగురించియు, "కావ్యంరామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్। రసైశ్శృంగార కారుణ్య హాస్యవీర భయానకైః। రౌద్రాది భిశ్చసంయుక్తం కావ్యమే తదగాయతామ్॥ (బాలకా ౪ సర్గ) అని రామాయణమునుగురించియుఁ జెప్పబడియున్నది. దశరూపక కారుడగు ధనంజయుడు రామాయణము, బృహత్కథ మొదలగు వానినుండి కథలనుఁ దీసికొని నాటకములను వ్రాయుదని కవులకుపదేశింప

చున్నాడు. "ఇత్యాద్యశేషమిహవస్తు విభేదజాతం రామాయణాది చవిభావ్య బృహత్కథాంచ, ఆసూత్రయేత్తదనుసేతృరసామ గుణ్యాచ్చిత్రాం కథాముచిత చారువచః ప్రపంచైః (దశరూ. ౧ పరి-౬౧ శ్లో).

క్రీస్తుశక ప్రారంభమందు భరతఖండములో నత్యుదార రచనతోఁగూడిన గద్య పద్య కావ్యములు నిర్మింపబడినవని ప్రాచీనచరిత్రాంశ శోధనలవలన (Historical Research) నూతనముగాఁ గనుగొనబడినది. క్రీస్తుశకము రెండవ వత్సర శత కములో వ్రాయబడిన గిర్నర్ శాసనములలో (Girnar inscriptions) నొకదాని యందు దీర్ఘసమాసభూయిష్ఠము, ననుప్రాసయమకాది శబ్దాలంకార శోభితము నుపమారూపకాద్యర్థాలంకార ప్రచురమునగు నొకగద్యకలదు. దానిలో రుద్ర దాముడను మహాక్షత్రపుడు, మదోద్ధతిచే వీరమాన్యులయి తనకు లోఁబడని రాజుల నందరిని వధించెననియు, నతఁడు వ్యాకరణము, మీమాంస, సంగీతము, తర్కము మొద లగు శాస్త్రములలో నతిప్రవీణుడనియు వర్ణింపబడినది. "స్ఫుటలఘుమధురచిత్రకాన్త శబ్దసమయోదారాలంకృత గద్యపద్య ... ప్రమాణమానోన్మానస్వరగతివర్ణసారసత్వాదిభిః పరమలక్షణవ్యంజనైరుపేతకాన్తమూర్తినా ... శబ్దార్థ గాంధర్వ న్యాయాద్యానాం విద్యానాం మహతీనాం పఠనధారణ విజ్ఞానప్రయోగా వాప్తవిపులకీర్తినా (Indian Epigraphy, vol, 8, p. 44).

తరువాత నాల్గవశతాబ్దములోని యొకశాసనములో బాణుని గద్యశైలిని మించిన యొకగద్యకలదు. దానిలో "విద్వజ్జనోపజీవ్యానేక కావ్యక్రియాభిః ప్రతిష్ఠిత కవిరాజశబ్దస్య" సకల విద్వాంసుల కుపజీవ్యములగు ననేకకావ్యములను రచించినవాఁడగుటచేఁ గవిరాజనిపించుకొనిన సముద్రగుప్తుఁ డిందులో వర్ణింపబడెను. ఆ శాసనములోనే సముద్రగుప్తునికీర్తి "పశుపతేర్జటాజూటవివరగతనిరర్గళ ప్రవాహద్గంగా ప్రవాహోపమితా" అని వర్ణింపఁబడెను. "కృపణదీనానాథాతుర జనోద్ధరణ సమంత్ర దీక్షాద్యుపగతమనసః సమిద్ధస్య విగ్రహవతో లోకానుగ్రహస్య ధనదవరుణేంద్రా న్తకసమస్య, స్వభుజబల విజితానేక నరపతివిభవ ప్రత్యర్పణ నిత్యవ్యాపృతాయుత పురుషస్య, (Dr. Fleet's Gupta inscription.)

క్రీస్తుశకమునకు ముందువెనుక శతాబ్దములయం దలంకారశాస్త్రమను నొక శాస్త్రము నేర్పాటుచేయుటకుఁ దగినంతకావ్యసామగ్రి వృద్ధినొందినదని పూర్వోక్తాంశ ములవలన స్పష్టమగుచున్నది. కావ్యలక్షణము వాని నియమములు, వానివిధులు,

అలంకారముల లక్షణము, వాని నియమములు, మొదలగువానిని బరిష్కరించి వ్రాయుట క్రీస్తుశక ప్రారంభమందు మొదలయినదని యిక చెప్పఁబోవుచున్నాము. నూతనకావ్య రచన, అట్టి కావ్యమునకు లక్షణమునుఁ జెప్పు సూత్రములు, ఏకకాలమందే జంటగా బయలు దేరినవి.

మొట్టమొదట యాస్కుడు నిరుక్తమందుపమకిట్లు లక్షణముచెప్పియున్నాడు. "అథాత ఉపమా, యదతత్ తత్సదృశమితి గార్గ్యస్తదాసాం కర్మజ్యాయసా వాగుణేన ప్రఖ్యాతతమేన వాకనీయాంసంవా ప్రఖ్యాతంవా ఉపమిమీతే। అథాపికనీయసా జ్యాయాంసమ్" (నిరుక్తమ్ 3) ఇది కావ్యప్రకాశకారుడగు మమ్మటభట్టు చెప్పిన "సాధర్మ్యముపమా భేదే" అను లక్షణముతోఁ దుల్యముగా నున్నది. ఉపమానము సుప్రసిద్ధమయినదిగాను, గుణబాహుళ్యముగలదిగా నుండవలయునని సాధారణముగా నొక నియమముకలదు. ఉపమేయముకంటె నుపమానము తక్కువదియైయుండుట దోషము. యాస్కుడు "జ్యాయసా కనీయాంసమ్" (పెద్దవస్తువుతోఁ జిన్న వస్తువును పోల్చుట) అని సామాన్యనియమమును చెప్పి వేదమందుపమానముపమేయముకంటెఁ దరుచుగాఁ దక్కువదియై యుండునని తెలుపుటకు ఋగ్వేదశ్రుతి నొకదాని నుదాహరించెను. దీనిలో నశ్వినీదేవతులు దొంగలతో నుపమింపబడిరి

X—4—6. "తనూత్యజేవ తస్కరా వనర్గూ రశనాభిర్దశభిరభ్యధీతామ్। ఇయం తే అగ్నే నవ్యసీ మనీషా యుక్ష్వా రథం న శుచయద్భిరఙ్గైః॥".

పాణిని "ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే (II—౧—౫౬) "ఉపమానాని సామాన్య వచనైః" (II—౧—౫౫) అను సూత్రములయందుపమానోపమేయ సామాన్యధర్మములనుఁ బేర్కొనెను. బాదరాయణుని వేదాన్తసూత్రములయందుపమ, రూపకముగానవచ్చుచున్నది. "అతఏవచోపమా సూర్యకాదివత్" (3—౨—౧౮) పరబ్రహ్మము నానావిధ స్థానములయందున్నను, ఆయాయిస్థానములయందుండు దోషము లీతనికంటవు. ఈ హేతువునుబట్టి యేశాస్త్రములయందచ్చటచ్చట పరబ్రహ్మము జలమందుగాని దర్పణమందుగాని ప్రతిఫలించిన సూర్యాదులతోఁ బోల్పఁబడిరి. "ఆనుమానిక మప్యేకేషామితిచేన్న శరీరరూపక విన్యస్త గృహీతే ర్దర్శయతిచ। (I—౪—౧) ఈసూత్రమునకు విషయవాక్యమయిన "ఆత్మానం రథినంవిద్ధి శరీరం రథమేవచ" అను ఉపనిషద్వాక్యమందు ఆత్మను రథికునిగాను, శరీరమును రథముగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును పగ్గముగాను నిరూ

పించి యొకరూపకము చెప్పఁబడెను. భరతుడు నాట్యశాస్త్రమందుపమ రూపకము, దీపకము, యమకమునని నాలుగే అలంకారములని చెప్పినాడు. "ఉపమా దీపకంచైవ రూపకం యమకం తథా। కావ్యస్యైతే హ్యలంకారాశ్చత్వారః పరికీర్తితాః" (నాట్యశాస్త్రం, ౧౬—౪౧).

భరతముని వ్రాసిన నాట్యశాస్త్రము క్రీస్తునకుఁ దరువాత పంచమశతకముకంటెఁ బ్రాచీనము కాదని అలంకారశాస్త్రప్రణేతల కాలమును నిర్ణయించు ప్రకరణమందు నిశ్చయింపబడును. అశ్వఘోషుని బుద్ధచరిత్ర మలంకారశాస్త్ర నియమములు కొన్ని పుట్టిన తరువాత కాలమందు రచియింపబడియున్నట్లు కానవచ్చుచున్నది. ప్రతిసర్గకుఁ గొనయందు శ్లోకము లాకాలమందుఁ బ్రచురములుగానున్న వృత్తములకంటె విలక్షణమయిన వృత్తములలో వ్రాయబడినవి. ప్రతికవియు ననేకస్థలములయందు శబ్దాడంబరమయమగు కవనముఁ జెప్పుటకే ప్రయత్నించును. "హరితురగ తురంగ వత్తురంగ" ఇత్యాద్యనుప్రాసములఁ దరుచుగా వాడుకచేయును. బుద్ధచరిత్రకారుడు యథాసంఖ్యాలంకారమును వాడుకచేయుటయందు మిక్కిలి యభిలాషగలవాడు. ఈబుద్ధచరిత్ర మయిదవశతాబ్దిలో చైనాభాషలోను, ఏడవశతాబ్దిలో టిబెటుభాషలోను, అనువదింపబడెను గావున నిది క్రీస్తుశక మయిదవశతాబ్దికంటె ముందువ్రాయఁబడినదియయి యుండవలెను. సుబంధుడు వాసవదత్తలో శ్లేష, విరోధాభాసము ఉత్ప్రేక్ష మొదలగు నలంకారములను వ్రాసెను. "ప్రత్యక్షర శ్లేషమయ ప్రబంధ విన్యాస వైదగ్ధ్య నిధిర్నిబంధమ్" అను శ్లోకమందీ సుబంధుడు శ్లేషయందతి ప్రాగల్భ్యము గలవాడనని చెప్పుకొనుచున్నాడు. ఇతడు సత్కావ్యలక్షణమిదియని తన గ్రంథములో నిట్లు చెప్పెను. "సత్కవికావ్యబన్ధ ఇవానాబద్ధతుహినపాతః, దీర్ఘోచ్ఛ్వాస రచనాకులం సుశ్లేషవక్త్ర ఘటనాపటుసత్కావ్యవిరచనమివ," (పాదపూరణార్థమయి వాడుకచేయబడుతు, హి మొదలగు నిపాతలులేనిది, ఉచ్ఛ్వాసములనఁబడు గ్రంథవిచ్ఛేదములు గలది, శ్లేషతోగూడిన వక్త్రమను వృత్తవిశేషముగలది) శృంఖలాబంధము, ఉత్ప్రేక్ష, ఆక్షేపము, మొదలగు నలంకారముల నిందుఁ బొందుపరచెను. "శృంఖలాబంధో వర్ణగ్రథనాసు, ఉత్ప్రేక్షాక్షేపౌ కావ్యాలంకారేషు" కావ్యాలంకార సూత్రవృత్తిలో వామనుడు "విపరీతముత్కలికాప్రాయమ్" (1—3—25) అను సూత్రమునకు "కులిశ శిఖర ఖరనఖర ప్రచయ ప్రచండచపేటాపాటిత మత్తమాతంగ కుంభస్థల గళన్మదచ్ఛటాచ్ఛురిత చారుకేసర భార

భాసురము ఖేకేసరిణి'' అను వాసవదత్తా గద్యభాగము నుదాహరించుటవలన సుబంధు డాగవశతాబ్దముకంటెఁ దరువాతవాఁడు కాఁడని స్పష్టముగాఁ జెప్పవచ్చును ''కవీనా మగళద్దర్పో నూనం వాసవదత్తయా। శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరమ్'' అని బాణుడు తన హర్షచరిత్రోపోద్ఘాతయందు సుబంధుని గొనియాడెను. కావున శృంఖలాబద్ధము, శ్లేష, ఆక్షేపము, ఉత్ప్రేక్ష, వానిలక్షణము మొదలగునవి ఆరవశతాబ్దమునకు చాలకాలము నుండే వాడుకలోనికి వచ్చియున్నవని పూర్వోదాహృత ప్రమాణములచే నిశ్చయింపఁబడుచున్నది. బాణకవికాలమున కలంకారశాస్త్రము మిక్కిలి పెరిగినట్లు కానవచ్చుచున్నది. ఏలయనఁ గాదంబరిలో

(1) అక్షరచ్యుతకము:—దీనిలో నొకయక్షరముపోయిన మఱియొక యర్థము నిచ్చును. ఎట్లంటే—''కుర్వన్ దివాకరశ్లేషం దధచ్చరణడంబరం। దేవయా సా కరేణుః ప్రసరత్యసౌ॥'' ఇందులో కరేణుశబ్దమందు కకారమునుదీసివేయగా రేణువు ప్రసరించుచున్నదని యర్థమగును.

(2) మాత్రాచ్యుతకము:—దీనిలో నొకమాత్ర లోపింపగా నర్థాంతరమందు బర్యవసించును. ఎట్లన—''మూలస్థితిమధః కుర్వన్పాత్రైర్జుష్టో గతాక్షరైః। విః సేవ్యః కులీనస్య తిష్టతః పథికస్య సః॥'' దీనిలో ''విట'' అనుదానిని ''వట'' అని చేసి యడల నర్థము మారిపోవును.

(3) బిందుమతీ:—శ్లోకమందుండు వర్ణములకు మారుగా బిందువులుంచి నావర్ణములఁ గనుగొని శ్లోకమును జదువుట ఎట్లంటె—''త్రినయన చూడారత్నం మిత్రం సింధోః కుముద్వతీబంధుః। అయముదయతి ఘుసృణారుణ రమణీ వదనోపమశ్చంద్రః॥'' ఇందులోని వర్ణములను మారుగా నైత్వము, ఏత్వము, కొమ్ము దీర్ఘము, కొమ్ముడి మొదలగువానితోఁ గూడిన బిందువులను వ్రాసి వానిసహాయముతో నసలు శ్లోకమెద్దియో కనుగొనుట, బిందుమతి యనబడును.

(4) ప్రహేళిక:—ఇదిశబ్దార్థోపస్కారకమయి యమకాదులవలె రసపోషకము కాదు గావున నలంకారము కాదు. ''రసస్య పరిపంథిత్వాన్నాలంకారః ప్రహేళికా'' అని చెప్పుటచే నీ ప్రహేళిక రసభంజకము కావున నలంకారము కాదు. అయినను విదగ్ధజనగోష్టియందు సంభాషించు నేర్పుగలవారొరులకుఁ దమయభిప్రాయము తెలియకుండఁ బలుకవలెనని దీనిని వాడు

చేయుదురు. విదగ్ధముఖమండనమందు దీనిలక్షణమిట్లు చెప్పబడినది. "వ్యక్తీకృత్యక మప్యర్థం స్వరూపార్థస్య గోపనాత్। యత్ర బాహ్యాంతరావర్థౌ కథ్యేతే సా ప్రహేళికా"॥ (నిజమయిన యర్థమును దాచి మఱియొక యర్థము చెప్పుటవలన లోపల నొక యర్థము పైకి మఱియొక యర్థము దేనియందుండునో దానికి ప్రహేళికయని పేరు. ఆదిశాబ్ది, ఆర్థి యని రెండు విధములు).

ఆచార్యదండి స్వకృత కావ్యాదర్శమందార్థీ ప్రహేళికలో ననేక భేదములనుఁ జెప్పియున్నాడు. ఎట్లనగా:—

1. పదసంధిచే గూఢమయిన యర్థముగల ప్రహేళికకు సమాగతయని పేరు. ఉదా॥ "నమయాగోరసాభిజ్ఞం చేతఃకస్మాత్ప్రకుప్యసి। అస్థానరుదితైరేభి రలమాలోహితేక్షణే॥ టీక॥ అలోహితేక్షణే=(కోపముచే) నంతట నెఱ్ఱనైన కన్నులుగల దానా! మయా=మమ=నాయొక్క (ఇచట షష్ఠ్యర్థమందు తృతీయ). చేతః=మనస్సు, గోరసాభిజ్ఞం=పాలుపెరుగు మొదలగువాని నెఱింగినది, న=కాదు. నేను పాలుపెరుగు మొదలగువానిని హరింపలేదు, కస్మాత్ప్రకుప్యసి=ఎందుకుఁ గోపగించెదవు, ఏభిః=ఈ అస్థానరుదితైః=అయుక్తమయిన యేడ్పులచే, అలం=చాలును. కారణములేకుండ నేడువవలదు. ఇది పైకితోచెడు నర్థము. దీనిలో గూఢార్థమెట్లనగా—"మే-చేతః-అగసః-గసస్య-అభిజ్ఞం=నామనస్సితర నారీసంగమందాసక్తి కలదికాదు. నీకెందుకింతకోపము. "మేఅగోరసాభిజ్ఞం" అనుచోట "ఏచోఽయవాయావః" (౬-౧-౭౮) అను సూత్రముచే "మయాగోరసాభిజ్ఞం" అయినది. దీనిచేఁ బ్రకృతార్థము సంవృత్తమయినది. ఇది జనసమక్షమందుఁ గృష్ణుడు గోపికతోఁ జెప్పుమాట.

2. వంచిత:—తాను చెప్పఁబూనుకొన్న యర్థముకంటె వేరయిన ప్రసిద్ధార్థమునుఁ జెప్పుశబ్దమునుఁ బ్రయోగించి వినువారిని వంచించుట-వంచితయను ప్రహేళిక. ఉదా॥ కుబ్జామాసేవమానస్య యథా తే వర్ధతే రతిః। నైవంనిర్విశతో నారీరమరస్త్రీ విడంబినీః॥ కుబ్జతోఁగూడిన నీకెట్టియానందము వృద్ధినొందునో అట్టియానందము దేవతాస్త్రీ సదృశలయిన స్త్రీలతోఁగూడినను గలుగదని సహజమయిన యర్థము కాని గూఢార్థమందు కుబ్జాశబ్దమునకు కాన్యకుబ్జ నగరమనిగాని యచట స్త్రీయనిగాని యర్థము.

3. వ్యుత్క్రాంత:—వ్యుత్క్రాంతాతివ్యవహితప్రయోగాన్మోహకారిణీ.

పదములకతిదూరప్రయోగమువలన నర్థమియ్యక బుద్ధిని మోహపెట్టునది వ్యుత్క్రాం ఉ॥ దండేచుంబతి పద్మిన్యాహంసః కర్కశకంటకే। ముఖంవల్గురవంకుర్వం స్తు నాంగానిఘట్టయన్॥ టీ॥ హంసః=హంస, పద్మిన్యాః=పద్మలతయొక్క, కర్క కంటకేదండే=కఠినమయిన ముండ్లుగలనాళమందు, అంగానిఘట్టయన్=తన అవయ ములను వ్రాయుచు, వల్గురవంకుర్వన్=మనోహరమగు ధ్వనిఁజేయుచు, తుండేనపక్షి న్యా ముఖం చుంబతి=ముక్కుచేఁ బద్మలతాముఖమును ముద్దుపెట్టుకొనుచున్నది టీ లోఁ బదముల అన్వయము దూరముగా నుండుటనుబట్టి వ్యుత్క్రాంతయనఁబడును.

4. ప్రముషిత:—సాస్యాత్ప్రముషితాయ త్రిదుర్బోధార్థపదావళీ. దే యందుఁబదముల కర్థమేమియుఁ దెలియదో దానికిఁ బ్రముషితయని పేరు. ఉదా॥ ఖాతయః కనికాఃశ్లే స్ఫాతయఃస్ఫగ్హవల్గవః। చ దేస్త్రాక్షాద్భవంత్యత్రి వాయవో మమధారిణః॥ టీ॥ హేకని=ఓకన్యా। తే=నీయొక్క, చందే=మనోహరమయి కాశే=పాదమందు, స్ఫాతయః=మనోహరమయిన, స్ఫగ్హవల్గవః=పెద్దధ్వనులుంగల ఖాతయః=మువ్వలు, సాక్షాద్భవంతి=కానవచ్చుచున్నవి, అత్రి=వీనియందు, మమ వాయవః=నాప్రాణములు. ధారిణః=నిలువబడియున్నవి. ఇచటఁబదముల కర్థమ మిగుల దుర్బోధముగా నున్నది. కావున దీనికిఁ బ్రముషితయని పేరు.

5. సమానరూప:—లాక్షణికార్థముచే నారోపింపబడిన పదములచే రచింపబడి దానికి సమానరూపయని పేరు. ఉదా॥ అతోద్యానే మయావృష్టా వల్లరీ పంచపల్లవా పల్లవే పల్లవే తామ్రా యస్యాంకుసుమమంజరీ॥ టీ॥ అతోద్యానే=ఈయుద్యాన వ మందు. పంచపల్లవా=అయిదుచిగుళ్ళుగల, వల్లరీ=తీగ, దృష్టా=చూడబడినది, యస్యాం ఏతీగయందు, కుసుమమంజరీ=పువ్వులగుత్తి, పల్లవేపల్లవే=ప్రతిపల్లవమందు, తామ్రా ఎఱ్ఱనయినది. ఈశ్లోకమందుండు పదములన్నియు నారోపింపబడిన లాక్షణికార్థముగ లవి, ఎట్లనగా: ఒకానొకవాయిక ఉద్యానముగా నారోపింపబడినది. ఆమెబాహువు తీగగాను. వ్రేళ్లు చిగుళ్లుగాను, గోళ్లు పువుగుత్తులుగాను ఆరోపింపబడినది.

6. పరుష:—పరుషాలక్షణాస్తిత్వ మాత్రవ్యుత్పాదితశ్రుతిః॥ టీ॥ లక్షణాను సారముగా వ్యుత్పాదితమగు శబ్దముగలదానికిఁ బరుషయని పేరు. ఉదా॥ సురాస్స రాలయే స్వైరంభ్రమంతిదశనార్చిషః। మజ్జంత ఇవమత్తాస్తే సౌరే సరసిసంప్రతి॥ టీ॥ దశనార్చిషః=దంతకాంతిచే నుపలక్షితులగు, సురాః=మంచిగాయకులు। సౌరే=సుర సంబంధమగు, సరసి=సరస్సులో, మజ్జంతః=మునుగుచున్నవారయి, మత్తాఃప

మదించినవారివలె, సునాలయే=కల్లు పాకలో, స్వైరం=స్వేచ్ఛగా. భ్రమంతి=తిరుగు చున్నారు. ఇచట ననుశాసనబలముచే సురశబ్దము దేవతా వాచకమయినను కవిచె సుస్వరగా యనునను నర్థమందు బ్రయోగింపబడినది. కావున నిదిపరుషయనంబడును.

7. సంఖ్యాగః:—సంఖ్యాతానామ సంఖ్యానం యత్రవ్యామోహకారణమ్॥ టీ॥ దేనిలో వర్ణగణనచేగాని సంఖ్యావాచకముచేగాని యర్థము తెలియకుండఁజేయఁబడునో అది సంఖ్యాతయనంబడును. ఉ॥ నాసిక్యమధ్యాపఃతశ్చతుర్వర్ణవిభూషితా। అస్తికాచిత్పురీయస్యా మష్టవర్ణాహ్వా యానృపాః॥ టీ॥ నాసిక్యమధ్యా=ఞ అను నాసికాక్షరము మధ్యగలది, పఃతః=(చుట్టు) రెండు వైపుల చతుర్వర్ణ విభూషితా=నాలుగక్షరములచే నలంకరింపబడినది, (అనగా మొదట రెండు, కొసరెండు) అగు, కాచిత్పురి=ఒకానొకపట్టణము. అస్తి=కలదు, అనగా కాఞ్చీ అనుపట్టణముకలదనుట. యస్యాం = ఏపట్టణమందు, అష్టవర్ణాహ్వాయాః = ఎనిమిదక్షరముల పేరుగల, నృపాః=రాజులు. సంతి=కలరు, అనగా పల్లవులుపల్లవశబ్దములో పకారాకారలకారద్వయాకార వకారాగాకార విసర్జనీయములతోగలిసి యెనిమిదిఅక్షరములు వీనిచేచెప్పఁబడువారు. కాంచీనగరమందు పల్లవులనురాజులుకలరు. అనువివక్షితార్థమునకు సంఖ్యావాచకములగు చతురష్టవర్ణశబ్దములు వ్యామోహకారణము లగుచున్నవి.

8. పరికల్పిత:—అన్యథాభాసతేయత్ర వాక్యార్థస్సా పరికల్పితా॥ టీ॥ ఎచ్చట వాక్యార్థమన్యథా భాసించునో అదిపరికల్పితయనంబడును. ఉ॥ గిరాస్థలంత్యాన్రమేణ శిరసాదీనయాదృశా, తిష్టంతమపి సోత్కంపం వృద్ధేమాంనానుకమ్పసే॥ టీ॥ వృద్ధే=ఓమహాలక్ష్మీ! (మహాలక్ష్మినిగూర్చి యొకదరిద్రుడు చెప్పుమాట) స్ఖలంత్యాగిరా=స్ఖలితమగు వాక్కుచేతను, నమ్రేణశిరసా=నమ్రమగు శిరస్సుచేతను, దీనయాదృశా దీనమగు దృష్టిచేతనుతిష్టంతం=ఉన్న, సోత్కంపం=కంపముతోగూడిన, మాం=నన్ను, నానుకంపసే=కనికరింపవు. ఒకానొక ముసలిదానినిగూర్చి తనయను రాగమును దెలుపుచున్నాడను నర్థమిచటఁ బరికల్పితము.

9. నామాన్తరిత:—సానామాన్తరితా యస్యాం నామ్నినానార్థకల్పనా। టీ॥ దేనిలో నామమందనేకార్థకల్పనచేయబడునో దానికి నామాంతరితయని పేరు. ఉ॥ ఆదౌరాజేత్యధీరాక్షి పార్థివః కోపిగీయతే। సనాతనశ్చనైవాసౌ రాజానాపి సనాతనః॥ టీ॥ అధీరాక్షి=భీతనేత్రి, ఆదౌ=మొదట. కోపిపార్థివః=ఒకనొక పార్థివుడు, రాజేతి=రాజని, సనాతనశ్చేతి=సనాతనుడని, గీయతే=చెప్పబడుచున్నాడుకాని,

అసౌ=ఇతఁడు. నైవరాజా=రాజుకాఁడు, నాపిసనాతనః=సనాతనుఁడుకాఁడు, ఒకానొక వృక్షమునకు "రాజాతన" మనిపేరు, అదిమొదట రాజనియు, అంతమందు "తన" అనియు చెప్పఁబడుచున్నది. ఈచెట్టు రాజు, నిత్యుఁడు కానేఁడు. ఇచట "రాజాతన" అనునామమందు నానార్థకల్పనము చేయఁబడినదిగావున నిదినామాంతరిత యనఁబడు.

10. నిభృత:-నిభృతానిభృతాన్యార్థా తుల్యధర్మ స్పృశాగిరా॥ టీ॥ ఎచ్చట దుల్య ధర్మ విశేషణములచే నితరార్థము సంవృతమగునో దానికి నిభృతయనిపేరు. ఉ॥ హతదరిద్ర్యం నరంహిత్వా ధనవంతం వ్రజన్తికా॥ నానాభంగి సమాకృష్టలోకా వేశ్యాన దుర్ధరాః॥ టీ॥ నిర్ధనుఁడగు నరునివిడిచి ధనవంతుని ఆశ్రయించువారు. అనేక విధములుగా లోకులనాకర్షించువారు నగు వేశ్యలు. ఇచట వేశ్యాసాధారణములగు విశేషణములచే సంపదలిట్టివియను నర్థము దాచఁబడినది.

11. సమానశబ్ద:-సమానశబ్దోపన్యస్త శబ్దపర్యాయ సాధితా॥ టీ॥ శ్లోకోక్త ములగు శబ్దముల పర్యాయశబ్దములచే సాధింపబడు దానికి సమానశబ్దయనిపేరు. ఉదా॥ జితప్రికృష్ట కేశాఖ్యో యస్తేఽభూమి సమాహ్వయః। సమామద్య సుభూతోత్కం కరోతి కలభాషిణీ॥ టీ॥ కలభాషిణి=మధురముగా మాట్లాడుదానా। జితప్రికృష్టకేశాఖ్యః=జయింపబడిన ప్రికృష్టకేశాఖ్యః=ప్రికృష్టకేశము పేరుగలది, అనగా కేశవాల శబ్దములు పర్యాయపదములు ప్రి అనుదానిగలపగా "ప్రివాల" అనియగును. అనగా జయింపబడిన ప్రివాలముకలది. (చిగురును బోలినదనుట) అట్టి యస్తే=ఏనీయొక్క అభూమిసమాహ్వయః (భూమి, ధర, పర్యాయపదములు. భూమికానిది అభూమి అనగా అధరము)=అధరముకలదో, సః=అది, అద్య=ఇపుడు, మాం=నన్ను, సుభూతోత్కం = (భూరసాశబ్దములుపర్యాయము- సుభూతా=సురసుతా- సురసలచే ఉత్కం=అభిలాషకలవానినిగా, కరోతి=చేయుచున్నది, "జితప్రికృష్ట కేశాఖ్యః అభూమిసమాహ్వయః, యస్తేఅవయవః, సఃఅద్యమాంసుభూతోత్కం కరోతి" అను వివక్షితార్థము వాచక పర్యాయపదములచేఁ జెప్పఁబడినది గావున దీనికి సమానశబ్దయని పేరు.

12. మూఢ:-సమ్మూఢానామ యాసాక్షాన్నిరిష్టార్థాపిమూఢయే. ఏదిసాక్షాన్నిరిష్టమగు నర్థముగలది యయినను దుర్బోధముగానుండునో దానికి మూఢయనిపేరు. ఉ॥ శయనీయే పరావృత్యశయితౌ కామినౌరుషా, తథైవ శయితౌరాగాత్ స్వైరం ముఖ ముచుంబతామ్॥ టీ॥ రుషా=ప్రణయకలహముచే, శయనీయే=శయ్యయందు,

పరావృత్త్య=పరాఙ్ముఖులయి, శయితౌ = నిద్రించిన, కామినౌ=కామినీకాముకులు, రాగాత్=అనురాగమువలన, తథైవ=అట్లనే, పరావృత్త్య అభిముఖ్యము గలవారై, శయితౌ=పడుకున్నవారై, స్వైరం=స్వేచ్ఛగా, ముఖమచుంబతాం=ఒకరిముఖము మరియొకరు ముద్దుపెట్టుకొనిరి, ఇచటవివక్షితార్థము తెలియకుండఁజేయుటకు "తథైవ" అని నిర్దేశింపఁబడుటవలన మూఢ.

13. పారిహారికీ:-యోగమాలాత్మికానామ యస్యాస్సాపారిహారికీ॥ టీ॥ శ్లోకములోనున్న శబ్దములన్నియు యౌగికార్థముతోఁ గూడిన యెడల దానికి పారిహారికియని పేరు ఉ॥ విజితాన్న భవద్వేషి గురుపాదా హతో జనః। హిమాపహో మిత్రధరైర్వ్యాప్తం వ్యోమాభినందతి॥ టీ॥ వి=గరుడునిచే, జిత=జయింపబడిన, అన్న=అన్నముగలవాఁడింద్రుఁడు, అతనివలన, భవ=పుట్టినవాఁడర్జునుఁడు, వానిని, ద్వేషి=ద్వేషించువాఁడు కర్ణుఁడు, వానియొక్క, గురు=తండ్రి (సూర్యుఁడు) యొక్క పాద=కిరణములచేత, హత=కొట్టబడిన, జనః=మనుష్యుఁడు. హిమాపహ=అగ్నికి అమిత్ర=(శత్రువయిన) జలమును, ధరైః=ధరించిన. (మేఘములచేత) వ్యాప్తం=వ్యాప్తమును, వ్యోమ=అంతరిక్షమును, (చూచి) అభినందతి=సంతసిల్లుచున్నాఁడు.

14. ఏకచ్ఛన్నః-ఏకచ్ఛన్నాశ్రితం వ్యక్తం యస్యాస్సాఽఽశ్రియ గోపనమ్॥ దేనియందాశ్రయించిన వస్తువు వెల్లడిగానున్నను ఆశ్రయముదాచఁబడునో దానికేకచ్ఛన్నయని పేరు. ఉ॥ నస్పృశత్యాయుధం జాతునస్త్రీణాం స్తనమండలం। అమనుష్యస్య కస్యాపి హస్తోఽయం నకిలాఫలః॥ టీ॥ అమనుష్యస్య=మనుష్యుఁడుకాని కస్యాపి=ఎవనియొక్క, అయంహస్తః=ఈహస్తము, జాతు=ఎప్పుడు, ఆయుధం=ఆయుధమును, నస్పృశతి=ముట్టదు, స్త్రీణాం=స్త్రీలయొక్క, స్తనమండలం=కుచమండలము, నస్పృశతి=ముట్టదు ఆయినను, అఫలః=నిష్ఫలమయినది, నకిల=కాదు, దీని తాత్పర్యము గంధర్వహస్తమనఁగా ఆముదపుచెట్టు ఆముదపాకుగోసినయెడల, గత్తి నల్లబడును. దురదనుబుట్టించునుగావున నది స్త్రీలకుచములయందుంచఁబడదు. కాబట్టి యొకానొకని హస్తము స్త్రీల స్తనమండలము నాయుధమును స్పృశింపకపోవుటచే శృంగార వీరరస శూన్యమయినదగుటచే నిష్ఫలమయినను ఆముదపుచెట్టు కాయలు కాయును గావున సఫలమయినది. ఇచట నాశ్రయించిన హస్తము వ్యక్తమయియున్నను ఆశ్రయమగుదానికి "గంధర్వస్య కస్యాప్యమనుష్యస్య" అని కప్పివేయుట వలనచ్ఛన్నఅని పిలువబడును.

15. ఉభయచ్ఛన్న:—సాభ వేదుభయచ్ఛన్నా యస్యాముభయగోపనం॥ దేనియందాశ్రియము ఆశ్రియి, రెండును గుప్తములగునో దానికిఉభయచ్ఛన్నమ పేరు. ఉ॥ కేఃకస్సహసం భూయసర్వకార్యేషుసన్నిధిః। లబ్ధ్వాభోజనకాలేతు యదృష్టోనిరస్యతే॥ టీ॥ కః=ఒకడు, కేనసహ=ఒకనితో, సంభూయ=కలుసుకొని, స్సకార్యేషుసన్నిధింలబ్ధ్వా=అన్నిపనులయందు దగ్గిరనుండి, భోజనకాలేదృష్టోయః భోజనసమయమందుఁ గనఁబడినయెడల, నిరస్యతే=నిరసింపఁబడుచున్నది తా॥ శిరస్సు-అచటఁబుట్టినదిగావున కేశము అది శిరస్సుతో సకలకార్యములయందుఁ గలి యున్నను భోజనకాలమందుఁ గనంబడినచోఁ దొలఁగింపఁబడును. ఇచటనాశ్రి ఆశ్రియము కప్పఁబడినవిగావున నుభయచ్ఛన్నయనంబడును. ఇట్లు ప్రహేళికలనే విధములుగా నున్నవి. వానిలో ముఖ్యమయినవి యిచటఁగనఁబఱుపఁబడినవి.

హర్ష చరిత్రములో "ఉచ్ఛ్వాసాంతేప్య ఖిన్నాయే వక్త్రియే సాం సః స్వకథమాఖ్యాయికాకారా నతేవంద్యాః కవీశ్వరాః" అనుట చే బాణునికిఁగథాఖ్యాయి లక్షణ భేదము, ఆఖ్యాయికలలోఁ బ్రత్యుచ్ఛ్వాసమునకు మొదటవక్త్రాపరవక్త్ర శ్లోకములుండుననియుఁ దెలియునని నిశ్చయింపఁబడుచున్నది. కాదఁబరిలో బాణు డుపమ, శ్లేష, దీపకము, పరిసంఖ్య, విరోధాభాస, స్వభావోక్తి మొదలగు నలంకార ములఁబ్రశంసించెను. "హారంతికం నోజ్జ్వలదీపకోపమైనర్వైః పదార్థైరుపపాదితాఃకథాః। నిరంతరశ్లేష ఘనాస్సుజాతయో మహాస్రజశ్చంపకకుడ్మలైరివ॥ ఈమహా కవి సప్తమశతక ప్రథమార్థమందుండెను.

భట్టికావ్యములో దశమైకాదశ ద్వాదశత్రయోదశసర్గలు ప్రత్యేకముగా నలంకారశాస్త్రమునకుదాహరణముగా వ్రాయఁబడినవి. వానిలోఁ బదియవసర్గలో మొదటి యిరువదియొక్క శ్లోకముచేఁగ్రమముగా ననుప్రాసము, యుగ్పాదయమక ము, పాదాంతయమకము, పాదాదియమకము, పాదమధ్యయమకము, చక్రవాళయమ కము, సముద్గకయమకము, కాంచీయమకము, యమకావళి, అయుగ్మపాదయమకము, పాదాద్యంతయమకము, మిథునయమకము, వృంతయమకము, పుష్పయమకము, పాదాదిమధ్యయమకము, విషమయమకము, మధ్యాంతయమకము, గర్భయమకము, సర్వయమకము, మహాయమకము, ఆద్యంతయమకము, మొదలగు శబ్దాలంకారము లుదాహరింపఁబడినవి. మిగిలిన యేఁబది రెండుశ్లోకములచే యథాక్రమముగా నాదిదీపకము, అంతదీపకము, మధ్యదీపకము, రూపకము, దీనిలో నవాంతరభేదములగు

ఉపమాయుక్తరూపకము, ఖండరూపకము, అర్ధరూపకము, ఉపమాయుక్తలలామకము, ఇవోపమ, యథోపమ, సహోపమ, తద్ధితోపమ, లుప్తోపమ, అర్థాంతరన్యాసము, ఆక్షేపము, వ్యతిరేకము, విభావన, సమాసోక్తి, అతిశయోక్తి, యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష, వార్త (ఇదివిశిష్ట. నిర్విశిష్టయని రెండువిధములు). వార్తయనఁగా స్వభావోక్తి- స్వభావోక్తిరలంకారఇతి వార్తాంప్రచక్షతే॥ ప్రేయము, రసవత్, ఊర్జస్వి, పర్యాయోక్తము, సమాహితము, ఉదారము, శ్లిష్టము, అపహ్నుతి, విశేషోక్తి, వ్యాజస్తుతి, ఉపమారూపకము, తుల్యయోగిత, నిదర్శనము, విరోధము, ఉపమేయోపమ, సహోక్తి, పరివృత్తి, సందేహము అనన్వయము, ఉత్ప్రేక్షావయవము. సంసృష్టి, ఆశీస్సు, హేతువు, నిపుణము (కనిష్ఠుడు జ్యేష్ఠునిపదేశించుట యనుచితమయినను నిపుణముగా జెప్పబడినదిగావున నిదినిపుణాలంకారమని ప్రాచీనులు వ్యవహరించిరి. ఇదిప్రియతరాఖ్యానరూపమగు ప్రేయసిలో నంతర్భూతమని దేవనాథుడు- ఉదాత్తాలంకారాంతర్భూతమని మఱికొందరు చెప్పుదురు). మొదలగు నర్థాలంకారము లుదాహరింపబడినవి. ప్రభాతకాలవర్ణనాపరమగు నేకాదశసర్గమంతయుఁ గావ్యమునకుఁ బ్రధానగుణమగు మాధుర్యము నుదాహరించుటకు రచింపబడినవి. ద్వాదశసర్గలోఁ బ్రబంధవిషయగుణమగు భావికత్వ ముదాహరింపబడినది. భావికత్వమనగా "భావికత్వమితిప్రాహుః ప్రబంధవిషయంగుణం। ప్రత్యక్షాఇవదృశ్యంతే యత్రార్థా భూతభావినః। చిత్రోదాత్తాద్భుతార్థత్వం కథాయాస్స్వభినీతతా। శబ్దానాకులతాచేతి తస్యహేతుం ప్రచక్షతే॥ (భావికత్వము ప్రబంధమునకు ముఖ్యముగా నుండదగిన గుణము. ఇందులో భూతభవిష్య దర్థములు కంటియెదుట జరుగుచున్నట్లు వర్ణింపబడును. శబ్దములనాకులము గానుండును. కథ చక్కగా నభివ్యక్తము చేయబడును. చిత్రము, ఉదారము,అద్భుతమునగు నర్థము కలిగియుండును). త్రయోదశసర్గలోఁ బ్రాకృతభాషా సమావేశ ముదాహరింపబడినది. అనగా నీసర్గలో సమసంస్కృత ప్రాకృతభాషతో సేతునిర్మాణము వర్ణింపబడినది. ఈభట్టివలభిరాజయిన శ్రీధరసేనుని యాస్థానమందుంటినని తానే కావ్యాంతశ్లోకమునందుఁ జెప్పుకొనుచున్నాడు. "కావ్యమిదంవిహితం మయావలభ్యాం శ్రీధరసేన నరేంద్ర పాలితాయాం। కీర్తిరతో భవతాన్నృపస్యతస్య క్షేమకరః క్షితిపోయతః ప్రజానామ్॥ (భ-కా-౨౨ స-3౫ శ్లో) శ్రీధరసేనుడను పేరుగల వలభిరాజులు నలుగురున్నట్టు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కావున భట్టికవి ప్రథమచతుర్థ శ్రీధరసేనుల కాలమైన ౫౦౦-౬౫౦ మధ్యను జీవించినవాడై యుండఁబోలును.

ఇట్లుపమారూపకాలంకారములు, వానిసాదృశ్యముగల మఱికొన్ని యలంకారములు వాని లక్షణములు చాలకాలముక్రిందటనే యేర్పడెననియుఁ గ్రీస్తుశకముకు దరువాత శతాబ్దములయందుఁ దక్కిన మఱికొన్ని యలంకారములు పుట్టి పెరిగెననియు రుజువుచేయుటకుఁ బ్రయత్నించితిమి. ఏడవశతాబ్దమునకుఁ బైగా నలంకారశాస్త్ర ప్రణేతలనేకులు బయలుదేరిరి. వారివారివృత్తాంతములా యలంకారచరిత్రములో వ్రాయఁబడిగలవు.

అలంకార శబ్దార్థమును బరిష్కరించుటకిది యుచితస్థలము. ఈశబ్దమునకు సాధారణముగా నందరిచే నొప్పుకొనఁబడిన రెండర్థములు గలవు. వానిలోనొకటి విస్తృతము. మఱియొకటి సంకుచితము. ఈ రెండర్థములును వ్యవహారములోనున్నవి. విస్తృతార్థమంద ప్రయోగింపఁబడి నపుడీశబ్దమునకు "సొగసు" అని యర్థము. అపుడు కావ్యశోభావహమగునదియంతయు నీయర్థమందంతర్భవించును. అలంకారశాస్త్రమను సమస్తపదమందున్న అలంకార శబ్దమునకిదియే అర్థము. రుద్రటకావ్యాలంకారము, వామన కావ్యాలంకార సూత్రవృత్తిలోనగు గ్రంథముల నామములందున్న అలంకారశబ్దమునకిదియే అర్థము. వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తిలో నలంకారమనగా "సౌందర్య మలంకారః" అని నిర్వచించెను. సంకుచితార్థమందుపమాద్యలంకారమని యర్థము. ఈయర్థమందే యీశబ్దమెక్కువగా వాడుకచేయఁబడుచున్నది. ఈయుపన్యాసమందీశబ్దముయొక్క సంకోచార్థము స్వీకరించి అలంకారములనుగురించి వ్రాసిన గ్రంథకర్తలవృత్తాంతమును బూర్ణముగాఁ దెలియజేయ నిశ్చయించినాము. అలంకారములను గురించియే కాక తక్కిన గుణములు, దోషములు, రీతులు, వృత్తులు, పాకము, శయ్య, రసము, ఉత్తమ మధ్యమాధమాది కావ్యముల లక్షణములు మొదలగు విషయములను గురించికూడ వ్రాసిన గ్రంథకర్తలనేకులున్నారు. వారివృత్తాంతములుకూడ నిచట సవిస్తరముగాఁ దెలుపబడును.

సర్వసాహిత్య శాస్త్రమందు నలంకారముల కియ్యఁదగిన స్థానము నిక విచారించెదము. ప్రాచీనాలంకారశాస్త్ర ప్రణేతలు వానికిఁదగిన విలువకంటె హెచ్చు విలువ నిచ్చియున్నారు. ఆచార్యదండి తానువ్రాసిన అలంకారశాస్త్రమునకు "కావ్యాదర్శము" అను పెద్దపేరు పెట్టినను దనకర్వాచీనులగు మమ్మటభట్టు (కావ్యప్రకాశిక,) విద్యాధరుఁడు (ఏకావళి), విశ్వనాథ కవిరాజు (సాహిత్యదర్పణము), జయ

దేవుఁడు (బృహచ్ఛందాలోకము), విద్యానాథుఁడు (ప్రతాపరుద్రీయము), ధర్మసూరి (సాహిత్యరత్నాకరము), మొదలగువారు తమ అలంకారగ్రంథములలోఁ జర్చించిన ధ్వని తద్భేదములు, అభిధాలక్షణాది వృత్తులు, రసము, మొదలగు విషయములను విడిచి ప్రథమపరిచ్ఛేదమందు మాధుర్యాదిగుణములను, కావ్యలక్షణమును, కథాఖ్యాయికలభేదమును, గౌడీవైదర్భ్యాదిరీతులను, ద్వితీయపరిచ్ఛేదమందు ఉపమాభేదములను, రూపకభేదములను, ఆక్షేపాలంకారభేదములను, ఆధునికులు చెప్పిన మఱికొన్ని యలంకారములను, మూడవ పరిచ్ఛేదమందు శబ్దచిత్రములగు ప్రహేళికాభేదములను, యమకభేదములను, అపార్థత్వము మొదలగు దోషములను వక్కా-ణించెను.

ఇట్టీవలఁ బుట్టిన గ్రంథకర్తలు చెప్పిన కావ్యజీవితమగు వ్యంగ్యమును, దన్మూలకమగు కావ్యత్రైవిధ్యమును దండి తన గ్రంథమందు వ్రాయకపోవుటవలన నతని కాలమునాటికీయంశములు పరినిష్పన్నములయి వాడుకలోనికివచ్చినట్లుతోఁచదు. దండి "కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ప్రచక్షతే" (కా. ద. II-I) అని అలంకారములను కావ్యశోభాకరములగు ధర్మములుగాఁ జెప్పెను. మఱియొకచోట "తదేతత్కావ్య సర్వస్వం సమాధిర్నామయో గుణః" అనిసమాధియనుగుణము కావ్యమునకంతకుఁ బ్రధానమని పలికెను. ఆనందవర్ధనుడు నతనికిఁ దరువాతఁ బుట్టిన ఆలంకారికులు కావ్యమున కాత్మయనిచెప్పిన రసము నీదండి బొత్తుగా నెఱుంగనివాఁడుగాఁ గానరాఁడు. "కామంసర్వోప్యలంకారోరస మర్థే నిషించతి" అని అలంకారములన్నియు నర్థమందు రసపుష్టినిఁ గలుగజేయునని వ్రాసెను. దండిరసవత్ప్రేయోలంకారములను నిరూపించుటలో రసమునకుఁగొంత ప్రాధాన్యముఁ గనపఱచెను. ఇతనివలెనే భామహుఁడుకూడఁ దానువ్రాసిన కావ్యాలంకారమందెచ్చటను రసము కావ్యమున కాత్మయని చెప్పలేదు. అలంకారములకే ప్రాధాన్యమును సమర్థించెను. రసభావముల నెఱిఁగినవాడైనను భామహుఁడు వానినిఁ బ్రధానముగాఁ జెప్పెను. ఉద్భటుఁడుకూడ నిట్లేవ్రాసెను. పైనఁ జెప్పబడిన ముగ్గురు గ్రంథకర్తలు వ్యంగ్యమును గురించి లేశము నెఱుంగనివారని మనము నిశ్చయముగాఁ జెప్పలేము. ఏలయన వ్యంగ్యార్థముతోఁగూడిన సమాసోక్తికి వ్యాజస్తుతికి, అప్రస్తుత ప్రశంసకు వారులక్షణముఁ జెప్పియున్నారు. ఇట్టీవలవారు ధ్వనియని వ్యవహరించిన దానిని వారు పర్యాయోక్తిలో నంతర్భవింపఁజేసిరి. కాని వారిమతానుసారముగా వ్యంగ్యము వాచ్యార్థమునకు సహకారిగానున్నట్లు కానవచ్చుచున్నది. ఆనందవర్ధనుడు తన్మతావలం

లను వ్యంగ్యము ప్రధానమని తలంచినట్లు దండిభామహులు తలంపలేదు. "రుద్ర
టుఁడుకూడ" నీతరగతిలోనివాఁడేయని చెప్పవచ్చును. వామనుడు, "రీతిరాత్మా కావ్యస్య
విశిష్టపదరచనారీతిః," అని కావ్యమునకు రీతి ఆత్మయని చెప్పెను. అలంకారము
దండిచెప్పిన లక్షణముకంటె వామనుడుచెప్పిన లక్షణము వేరుగానున్నది. వామను
"గుణములే కావ్యశోభాకరములనియు, నలంకారములాశోభను వృద్ధినొందించున
యనియుఁ జెప్పెను. (కావ్యశోభాయాః కర్తారోధర్మాఃగుణాః తదతిశయహేతవ
లంకారాః) 3-1-1-2 దండి అలంకారములేకావ్యశోభాకరములని చెప్పెను (కావ్య
శోభాకరాన్ ధర్మానలంకారాన్ప్రచక్షతే) వామనుడీధర్మమును గుణముల కారో
పించెను. దండిగుణములను రీతులను అలంకారములనుఁ జెప్పెనుగాని దేనితరువాత నే
యుండవలెనో ఆక్రమము ననుసరింపలేదు. వామనుడు తన గ్రంథమందీ విషయము
నన్నింటినిఁ జక్కఁగా నుచితస్థాన విన్యాసముతోఁ జెప్పెను. ధైర్యశౌర్యాది గుణము
లెట్లు మనుష్యుని కాత్మగుణములో అట్లనే కావ్యమునకుగూడ మాధుర్యాదిగుణము
లాత్మయనియు నట్టి గుణములలోఁ బజప్రధానములనియు దాదృశగుణాహితశోభనతి
యింపఁజేయుటయే అలంకారముల పనియనియుఁ జెప్పెను. ఆనందవర్ధనునిచే
బూర్ణముగా వృద్ధినొందింపఁబడిన కావ్యాలంకారసిద్ధాంతమును వామనుడు కొంచె
నూచనజేసెను. వామనుడుకూడఁ గావ్యమందుండు వ్యంగ్యార్థము నెఱుంగని వాడు
కాడు. "సాదృశ్యాల్లక్షణావక్రోక్తిః అని వక్రోక్తిలక్షణముఁ జెప్పుటలో వామను
డు వ్యంగ్యమును వక్రోక్తిలో నంతర్భవింపజేయుటచే దాని నప్రధానముగాఁ జేసెను.
మొదట నలంకారములకు చితస్థాన పరికల్పనముజేసి పూర్ణమగు కావ్యలక్షణ సిద్ధాంత
మును నిష్కృష్టముగా వ్రాసినవాడానందవర్ధనుడు. కావ్యమునకు వ్యంగ్యమాత్మయనియు
ధైర్యశౌర్యాదులు మనుష్యునికి మనోధర్మములయినట్లు, ప్రసాదము, మాధుర్యము,
ఓజస్సు మొదలగు గుణములు కావ్యాత్మయగు వ్యంగ్యమునకు ధర్మములనియుఁ గటక
మకుటాద్యలంకారములు మనుష్యుని శరీరశోభనతిశయింపఁ జేసినట్లలంకారములు
కావ్యశోభావృద్ధి హేతువులనియు నానందవర్ధనుఁడు ధ్వన్యాలోకమను గ్రంథ
మందుఁ బ్రతిపాదించెను. (తమర్థమవలంబంతే యేంగినం తేగుణాస్స్మృతాః అంగా
శ్రితాస్త్వలంకారామంతవ్యాః కటకాదివత్) (ధ్వన్యాలో II-7-పే. 78) ధ్వని
కారుడు కావ్యమునుఁ ద్రివిధముగా విభజించెను. 1 ధ్వని. ఉత్తమకావ్యము. దీనిలో
వాచ్యముకంటె వ్యంగ్యము ప్రధానమయియుండును, 2 గుణీభూతవ్యంగ్యము, లేక
మధ్యమకావ్యము. ఇందులో వ్యంగ్యము ముఖ్యమైయుండును, 3 చిత్రము. ఇందులో
వ్యంగ్యము మృగ్యమైయుండును. (III. 35, 42, 43) వ్యంగ్యము కావ్యమున

కాత్మయని స్థిరపర్చినతరువాత నీవ్యంగ్యమనునది యెట్లు వచ్చినదను ప్రశ్నయొకటి సహజముగాఁబుట్టును. ఆనందవర్ధనుఁడు అభిధాలక్షణావృత్తులకంటె వేరయిన వ్యంజన యను వృత్తివలన నీవ్యంగ్యముద్భవించినదని సమర్థించుటకు విపులముగా నుపపాదించెను. మమ్మటుఁడు విశ్వనాథ కవిరాజు జగన్నాథపండితుఁడు మొదలగు నాలంకారికులు ఆనందవర్ధనుని మతము ననుసరించి అభిధా, లక్షణావ్యంజనా వృత్తులనుఁ జెప్పిరి. తార్కికు లభిధాలక్షణావృత్తులను మాత్రమంగీకరించి వ్యంజన కభిధయందునను మాన మందు నంతర్భావముఁ జెప్పిరి. (తర్కదీపిక-వ్యంజనాపిశక్తి లక్షణాంతర్భూతా। అశక్తిమూలాచాను మానాదినాన్యథాసిద్ధా) అభిధాలక్షణావృత్తులచేతనే శబ్దార్థ వ్యవహారము నడచుచుండగా నాలంకారికులు వ్యంజనావృత్తినేల కల్పించినారని ఆధునికులు తలంపవచ్చును. కాని యానందవర్ధనునిమతప్రకారము వ్యంగ్యమే కావ్యమున కాత్మయని సమర్థింపఁబడినది. అభిధవ్యంగ్యార్థమును దెలియఁజేయలేదు. అది యట్లు తెలియఁజేసినయెడల నది వ్యంగ్యమయి యుండుటమాని వాచ్యమే అగును.

ఆనందవర్ధనుని సిద్ధాంతమునుగురించి యొకటి రెండంశముల నిచట విచారింపవలసియున్నది. ఆనందవర్ధనుఁడు కావ్యమునకు రసమాత్మయని చెప్పుటలో భరతుని నాట్యశాస్త్రము ననుసరించెనని తోఁచుచున్నది. భరతుడు నాట్యశాస్త్రమందు "ఏక ఎవభవేదంగీశృంగారో వీరఎవవా। అంగమన్యేరసాస్సర్వే కార్యంనిర్వహణేద్భుతమ్" నాటక కథయందు శృంగార వీరరసములలో నేదోయొకటి ప్రధానముగా నుండవలెననియు. దక్కినరసము లంగముగానను ప్రవిష్టములయి యుండవలయుననియు నిర్వహణసంధియందద్భుత రసముండవలెననియుఁ జెప్పెను. వాఙ్మయములో నొక భాగమయిన నాటకవిషయమయి చెప్పబడినఁ యీవిధి నానావిధకావ్యములకు వ్యాపింపఁ జేయఁబడెను. కావ్యములలో విశేషమగు నాటకమునకు విధింపబడిన యీవిధి కావ్యజాతమంతకును వ్యాపింపఁజేయబడెను. ఆనందవర్ధనుఁడీ విషయమునే ధ్వన్యాలోకమందిట్లు వ్రాయుచున్నాడు. "ఎతచ్చరసాదితాత్పర్యేణ కావ్యనిబంధనంభరతాదావపిసుప్రసిద్ధమే వేతిప్రతిపాదయితుమాహ, రసాద్యనుగుణత్వేన వ్యవహారోర్థశబ్దయోః। ఔచిత్యవాన్యస్తా ఏతావృత్తయో ద్వివిధాస్స్మృతాః" వ్యవహారోహి వృత్తిరిత్యుచ్యతే, తత్రరసానుగుణ ఔచిత్యవాన్వాచ్యాశ్రయోయోవ్యవహారస్తా ఎతాః కైశిక్యాదయోవృత్తయః, వాచకాశ్రయాశ్చోపనాగరికాద్యాః। వృత్తయోహి రసాది తాత్పర్యేణసన్నివేశితాః కామపినాట్యస్య కావ్యస్యచఛాయామావహంతి। రసాదయోహిద్వయో రపితయోర్జీవభూతాః। ఇతివృత్తాదితు శరీర భూతమేవ।

(3 ఉద్యోత-33 కారిక) కావ్యస్యాత్మా స ఏవార్థః (1 ఉద్యో. 5 కా) అని లోగడఁ
జెప్పినట్లు కావ్యరచన రసపరముగా నుండవలయునని భరతముని ప్రణీత నాట్యశాస్త్రా
దుల యందుఁగూడఁ బ్రసిద్ధమయియున్నదని ప్రతిపాదించుటకుఁ జెప్పుచున్నాఁడు.
ఔచిత్యముతోఁగూడినది రసాద్యనుగుణమయినదియగు శబ్దార్థవ్యవహారమే కైశిక్యా
వృత్తులని చెప్పఁబడినవి వ్యవహారమనఁగా వృత్తికిఁ బేరు. రసానుగుణమయినది ఔ
చిత్యముతోఁగూడినది వాచ్యాశ్రయమయినదియునగు యేవ్యవహారముకలదో అదియే
కైశిక్యాదివృత్తులగుచున్నది. ఉపనాగరికాదులు (వృత్త్యనుప్రాసవిశేషము) వాచక
శ్రయములు వృత్తులు రసవత్తరములుగాఁ గూర్పఁబడినవియయి నాటకమునకుఁ గావ్య
మునకు శోభనుగలుగఁజేయును. వాచ్యాశ్రయవ్యవహారమునకు వాచకాశ్రయమునకు
రసాదులు జీవభూతములు. శరీరమితివృత్తము, ఆనందవర్ధనుని యీసిద్ధాంతమును
మొట్టమొదట నెవ్వరు సమ్మతింపలేదు. ముగ్గురు నలుగురు గ్రంథకర్తలు ధ్వన్యా
లోకమందుఁ జెప్పఁబడిన యంశములను నిరసింపఁదొడఁగిరి. క్రీస్తువెనుక దశమశతా
ప్రథమార్థమందు జీవించిన ప్రతీహారేందురాజు ఉద్భటుని అలంకారసార సంగ్రహ
మునకుఁ దాను వ్రాసిన వ్యాఖ్యానములోఁ గొందరున్నదని యొప్పుకొని ధ్వనిని ఉద్భ
టుఁడలంకారములలో నంతర్భవింపఁజేసెనని మిక్కిలి కష్టపడి సమర్థించెను. "నను
యత్ర కావ్యే సహృదయహృదయాహ్లాదినః ప్రధానభూతస్యాస్య శబ్దవ్యాపారాస్పృష్ట
త్వేన ప్రతీయమానస్యైకరూపస్యార్థస్య సద్భావేనాత్ర తథావిధార్థాభివ్యక్తిహేతుః కావ్య
జీవితభూతః కశ్చిత్ సహృదయైర్ధ్వనిర్నామ వ్యంజకత్వభేదాత్మా కావ్యధర్మోభిమతః
స కస్మాదిహ నోపాదిష్టః||

ఉచ్యతే(ఏష్వేవాలంకారేష్వంతర్భావాత్। కావ్యమందు సహృదయుల నా
నందింపజేయునది, ప్రధానమయినది, స్వశబ్దవ్యాపారముచేస్పృశింపఁబడకుండఁబ్రతీయ
మానమగునదియగు నర్థమెచటనుండునో అచట నట్టి యథార్థాభివ్యక్తికి హేతువయి
నది, కావ్యమునకు జీవితమయినదియగు నొక కావ్యధర్మము ధ్వనియని సహృదయులచే
జెప్పఁబడుచున్నది. అదియిచట నేల చెప్పఁబడలేదనఁగాఁ జెప్పఁబడుచున్నది. ఈ
యలంకారములందే ఆధ్వని యంతర్భూతమయియున్నది. వక్రోక్తి జీవితకారుఁడు
వక్రోక్తియే కావ్యమున కాత్మయనియు, ధ్వనిసాదృశ్యమూలకమగు వక్రోక్తియందు
ధ్వని యంతర్భూతమనియు వ్రాసెను. "వక్రోక్తిజీవితకారః పునర్వైదగ్ధ్యభంగీ
భణితిస్వభావాం బహువిధాం వక్రోక్తిమేవ ప్రాధాన్యాత్కావ్యజీవితముక్త
వాన్; వ్యాపారస్య ప్రాధాన్యంచ కావ్యస్య ప్రతిపేదే," అభిధానప్రకారవిశేష

ఏవచాలంకారాః సత్యపి త్రిభేదప్రతీయమానే వ్యాపారరూపా భణితిరేవ కవిసంరంభగోచరః| ఉపచారవక్రతాదిభిః సమస్తో ధ్వని ప్రపంచః స్వీకృతః| కేవలము క్తివైచిత్ర్య జీవితం కావ్యం| నవ్యంగార్థ జీవితమితి తదీయదర్శనం వ్యవస్థితమ్'' వైదగ్ధ్యోక్తిమయము యనేకవిధములగు వక్రోక్తియే ప్రధానముగాఁ గావ్యజీవితమని వక్రోక్తి జీవితకారుడు చెప్పెను. కవిప్రతిభానిర్వర్తితమగు రచనావిశేషమే ప్రధానము. త్రివిధమయిన ప్రతీయమానమున్నను రచనావిశేషరూపమగు భణితియంచే కవులకుఁబూనిక.

ఉపచారవక్రతాదులయందు ధ్వని అంతర్భూతము. ఉపచారవక్రతయనఁగా "యత్రమూరాంతరేఽస్యసామాన్యముపచర్యతే లేశేనాపి భవేత్కర్తుంకించిదుద్రిక్తవృత్తితా| యన్మూలా సరసోల్లేఖా రూపకాదిరలంకృతిః| ఉపచారప్రధానాసౌ వక్రతా కాచిదిష్యతే'' ఉదాహరణం|| గగనంచ మత్తమేఘం ధారాలులితార్జునానిచవనాని| నిరహంకారమృగాంకా హరంతి నీలాశ్చనిశాః'' ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమును ఖండించుటకు భట్టనాయకుడు హృదయదర్పణమను నొక గ్రంథమును వ్రాసెనని మహిమభట్టుని వ్యక్తివివేకమును వ్యాఖ్యానము రచించిన యొకగ్రంథకర్తచెప్పెను. ఏకాదశశతక ప్రథమార్ధమందున్న మహిమభట్టుడు తక్కినవారికంటె నధికతరాగ్రహముఁబూని ధ్వన్యాలోకమును ఖండించుటకుఁ బ్రత్యేకముగా వ్యక్తివివేకమను నొకగ్రంథమును వ్రాసెను. దానిలో ధ్వనియను మానాంతర్భూతమని సమర్థించెను. "అనుమానాంతర్భావం సర్వస్యైవధ్వనేః ప్రకాశయితుం| వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమాపరాం వాచమ్'' ఇది వ్యక్తివివేకమునకుఁ బ్రథమశ్లోకము. ఇతని యభిప్రాయములన్నియు నలంకారసర్వస్వకారుడగు రాజానకరుయ్యకుని చేతను మమ్మటభట్టుని చేతను ఖండితములయ్యెను. "యత్తువ్యక్తివివేకకారో వాచ్యస్య ప్రతీయమానం ప్రతిలింగితయా వ్యంజనస్యానుమానాంతర్భావమాఖ్యత్| తద్వాచ్యస్య ప్రతీయమానేన సహతాదాత్మ్య తదుత్పత్త్యభావాదవిచారితాభిధానమ్| తదేతత్కుశాగ్రధిషణైః క్షోదనీయమతిగహనమితి నేహ ప్రతన్యతే|| అలంకార స 12 పేజీ)

ధ్వన్యాలోకము పుట్టినతోడనే ప్రతివాదుల ఖండనకుఁ బాత్రమై కొంత కాలమున్ననుఁ గాలక్రమమున విమర్శకుల మెప్పువడసి యలంకారశాస్త్రమంతకుఁ బ్రమాణతమమయిన గ్రంథమయ్యెను. మమ్మటుడు మొదలుకొని జగన్నాథపండితుని వరకున్న యాలంకారశాస్త్ర ప్రణేతలందరు నానందవర్ధనుని యందతిగౌరవముఁ జూపుచు నతనిసిద్ధాంతమును నిర్వివాదముగానొప్పుకొనిరి. "యేరసస్యాంగినో ధర్మా

శ్చాశ్యాదయఇవాత్మనః। ఉత్కర్షహేతవస్తే స్యుఃచలస్థితయోగుణాః। ఉపమా
త్తే సంబంధేంగద్వారేణజాతుచిత్। హారాదివదలంకారా స్తేను ప్రాసోపమాదయః
(కా-ప్రి-8 ఉ-1.2).

అలంకారవిభాగము.

శబ్దాలంకారములనియు నర్థాలంకారములనియు నలంకారములు రెండు
విధములు. అలంకారగ్రంథములను వ్రాసిన పూర్వులందఱు నీవిభాగమునే అవ
లంబించిరి. భరతముని నాట్యశాస్త్రమందీ యలంకారవిభాగమునుగూర్చి యేమియు
జెప్పలేదు. ఆచార్యదండి తానువ్రాసిన కావ్యాదర్శమందర్థాలంకారము
ద్వితీయపరిచ్ఛేదములోను శబ్దాలంకారములను దృతీయ పరిచ్ఛేదములోనుఁ జెప్పె
ఉద్భటవామనులీ యలంకారవిభాగమును స్పష్టముగాఁ జెప్పకపోయినను ద్వివిధ
నీవిభాగమునే వారు మనస్సునందుంచుకొన్నట్లు వారిగ్రంథములవలననే తెలియవ
చున్నది. ఎట్లనగా వామనుడు తొలి ననుప్రాసయమకముల గూర్చి చెప్పి తరువా
నర్థాలంకారములఁ బ్రతిపాదించెను. ఉద్భటుడుకూడ నట్లనే మొదటఁబునరు
క్తవదాభాసమును ప్రాసముఁజెప్పి పిమ్మట నర్థాలంకారములకుఁబోయెను.

వామనుడు తనయలంకారసూత్రవృత్తిలోఁ బ్రథమాధ్యాయ చతుర్థాధి
యందు శబ్దాలంకారములను ఆయధికరణములోనే ద్వితీయ తృతీయాధ్యాయము
నర్థాలంకారములను వ్యాఖ్యానించెను. రుద్రటుఁడు, మమ్మటుఁడు, అలంకా
సర్వస్వకారుడగు రాజానకరుయ్యకుడు మొదలగు నర్వాచీనగ్రంథకర్తలఁదరు నా
కారములను ద్వివిధముగా విభజించిరి. మఱికొందరు శబ్దాలంకారములనియు నర్థా
లంకారములనియు నుభయాలంకారములనియుఁ ద్రివిధముగా వర్గీకరణ మొనరించి
సరస్వతీకంఠాభరణమందు భోజరాజిరువదినాలుగు శబ్దాలంకారములను ఇరువదినా
అర్థాలంకారములను జెప్పెను. "చతుర్వింశతిశ్చైతాః శబ్దాలంకారజాతయః।
సందర్భమాత్రేణ హృదయం హర్తుమీశతే। అర్థాలంకృతయోప్యేతాశ్చతు
శతిసంఖ్యయా। తథితాః కావ్యవిజ్ఞానాచ్చిత్తప్రహ్లాదహేతవః" తక్కినగ్రంథకర్తలంద
చెప్పినట్లుపమా రూపకాద్యలంకారము లర్థాలంకారములని చెప్పుటయే కా
భోజుడు వానిని శబ్దాలంకారములని కూడ సమర్థించియుదాహరించె
"శబ్దేభ్యోయః పదార్థేభ్యఉపమాదిః ప్రతీయతే। విశిష్టార్థకవీనాంతా ఉపమా
త్రయాఃప్రియాః॥ వ్యా॥ శబ్దేభ్యంఇతి। శబ్దేభ్యః(శ్రూయమాణపదప్రకృతిభ్యః)పదా

భ్యశ్చేత్తత్సంబద్ధనిష్పన్నపదప్రతీయమానేభ్యః అర్థేభ్యోయః ఉపమాదిః ప్రతీయతే,'' అని యిట్లు భోజుఁడు, శబ్దాలంకారములు అర్థాలంకారములు ఉభయాలంకారములునని మూఁడుతెఱఁగులుగా విభజించెను. అగ్నిపురాణకర్తకూడ నాక్షేపసమాసోక్తి, శబ్దార్థోభయాలంకారములని చెప్పెను. ఆగ్నేయపురాణము 345 అధ్యాయము, శబ్దార్థలంకార నిరూపణము.

శబ్దార్థయోరలంకారో ద్వావలంకురుతే సమం। ఏకత్ర నిహితో హార స్తనం గ్రీవామివ స్త్రియాః। శ్రుతేరలభ్యమానోఽర్థో యస్మాద్భాతి సచేతనః। స ఆక్షేపో ధ్వనిః స్యాచ్చ ధ్వనినా వ్యజ్యతే యతః। శబ్దేనార్థేన యత్రార్థః కృత్వా స్వయముపార్జనం: ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషోఽభిధిత్సయా। తమాక్షేపం బ్రువంత్యత్ర స్తుతం స్తోత్రమిదం పునః। అధికారాదపేతస్య వస్తునోఽన్యస్య యా స్తుతిః। యత్రోక్తం గమ్యతేఽన్యార్థ స్తత్సమానవిశేషణం। సా సమాసోక్తిరుదితా సంక్షేపార్థతయా బుధైః। అపహ్నుతిరపహ్నుత్య కించిదన్యార్థసూచనం। పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే। ఏషామేకత్ర సంజ్ఞా చ గమ్యాఖ్యా ధ్వనిరిత్యతః''

శబ్దార్థోభయమూలములగు మూఁడవతరగతి యలంకారములను మనము చెప్పఁబూనుకొన్నయెడలఁ బునరుక్తవదాభాసము, పరంపరితరూపకముకూడ నిజముగా శబ్దార్థోభయమూలకమగు నలంకారములని చెప్పవచ్చును.

కాని యలంకారములు శబ్దార్థభేదముచే రెండువిధములని విభజించినఁ జాలును. ప్రాచీన నవీనాలంకారికులందరు నట్లనే చేసిరి.

## శబ్దాలంకారసంఖ్య.

శబ్దాలంకారసంఖ్య యెక్కువగాలేదు. దండి భామహుఁడు, ఉద్భటుడు మొదలగు నాలంకారికులు తమతమ గ్రంథములందు రెండుమూఁడు శబ్దాలంకారముల కంటె నెక్కువచెప్పలేదు. దండి తనకావ్యాదర్శమందు బహువిధములయిన యమక భేదములనుఁ గనపర్చెను. అనుప్రాసమును యథోచితముగాఁ జెప్పెను. అలంకార సర్వస్వకారుడు యమకమును అనుప్రాసమును పునరుక్తవదాభాసమును వివరించెను. వామనుఁడు శృంఖల, చూర్ణకము, పరివర్తకము, యమకము, అనుప్రాసమనెడు వానినిఁ బ్రతిపాదించెను. రుద్రటుఁడు ''వక్రోక్తిరనుప్రాసో యమకం శ్లేష స్తథా పరం చిత్రం। శబ్దస్యాలంకారాః శ్లేషోఽర్థస్యాపిసోఽన్యస్తు'' 'అను నీకారికయందు

సంగ్రహముగాఁ జెప్పఁబడిన శబ్దాలంకార భేదములనుఁ దనయలంకారశాస్త్రము
రెండుమూడునాల్గయిదధ్యాయములచే విపులీకరించెను. కావ్యప్రకాశకారు
వక్రోక్తి,యమకము అనుప్రాసము,మఱికొన్ని బంధవిశేషములు చెప్పెను ఏకావళీకా
డగు విద్యాధరుఁడు పునరుక్తవదాభాసమును, అనుప్రాసమును, యమకమునుఁ జెప్పె
భోజుడు సరస్వతీకంఠాభరణమందు "జాతిర్గతీరీతి వృత్తిచ్ఛాయాముద్రోక్తియుక్త
భణితిర్గుంఫనాశయ్యా పఠితిర్యమకానిచ। శ్లేషానుప్రాసచిత్రాణి వాకోవాక్యం
హేలికా। గూఢప్రశ్నోత్తరాధ్యేయశ్రవ్యప్రేక్ష్యాభినీతయః। చతుర్వింశతిరిత్యు
శ్శబ్దాలంకారజాతయః॥" అనుశ్లోకములచే ,నిరువదినాలుగు శబ్దాలంకారము
నిరూపించెను. సాహిత్యదర్పణమందు విశ్వనాథకవిరాజు పునరుక్తవదాభాస
అనుప్రాస సామాన్యము, ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, శ్రుత్యనుప్రా
ము, అంత్యానుప్రాసము, లాటానుప్రాసము, యమకము, వక్రోక్తిభాషాసమ
శ్లేషము, సభంగశ్లేషము, అభంగశ్లేషము, సభంగాభంగశ్లేషము, చిత్రము, చ్యుతా
రాదికమును చెప్పెను. ప్రతాపరుద్రీయములో విద్యానాథుడు యమకము, ఛేకా
ప్రాసము, వృత్త్యనుప్రాసము, లాటానుప్రాసము, పునరుక్తవదాభాసము, చిత్ర
లంకారమును, సాహిత్యరత్నాకరకారుడు యమకము, ఛేకానుప్రాసము, లాటా
ప్రాసము, వృత్త్యనుప్రాసము, పునరుక్తవదాభాసమునుఁ జెప్పెను.

దండి, భామహుడు, వామనుడు మొదలగు ప్రాచీనాలంకారికుల కాల
నాటికీ యర్థాలంకారముల సంఖ్య మిక్కిలి తక్కువగానుండెను. రానురాను క
క్రమమున జయదేవునికాలమున కవి శతసంఖ్యాకములయ్యెను. దండి కావ్యాదర్శ
మందిట్లు వ్రాసియున్నాడు.

"కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ప్రచక్షతే। తేచాద్యాపివికల్ప్య
న్తే కస్తాన్ కార్త్స్న్యేనవక్ష్యతి॥"

కావ్యశోభనుఁ గలిగించు ధర్మముల కలంకారములని పేరు. అవి ఉక్తివైచి
త్ర్యములు. కవుల ఉక్తివైచిత్ర్యమునకు విరామము లేదుగావున నలంకారసంఖ్య
గూడఁ బరిమితిలేదు. దండికిఁ బూర్వులైన యాలంకారికుల వృత్తాంతమును మన
నిశ్చయింపజాలము గాని యతనికిఁ దరువాత వారు తమగ్రంథములయందు వ్రాసి
యలంకారముల సంఖ్య అవ్యవస్థితముగానున్నది. వామనుడు కావ్యాలంకార సూ
మందు ముప్పదియారలంకారములనుమాత్రమే చెప్పెను. మమ్మటుడు కావ్యప్రకాశిక

నరువదింటి నుదాహరించెను. భోజరాజు సరస్వతీకంఠాభరణమందిరువది నాల్గింటిని వాక్రుచ్చెను. ఆచార్య హేమచంద్రుని కావ్యానుశాసనమందిరువదితొమ్మిది చూపఁబడెను. రుద్రటుఁడు తన యలంకారశాస్త్రమందు ముప్పదియయిదలంకారములనుఁ జెప్పి యర్థాలంకార ప్రకరణమును ముగించెను. కావ్యదర్పణకారుడరువదింటినిఁ బ్రతిపాదించెను. సాహిత్యదర్పణకారుఁడు డెబ్బదింటిని నిరూపించెను. అలంకార సర్వస్వకారుడగు రాజానకరుయ్యకుడు డెబ్బదిమూడింటినిఁ గనపరచెను. జయదేవుడేకోనవింశత్యుత్తరశతమును సమర్థించెను. విద్యానాథుఁడరువదియెనిమిది, ధర్మసూరి డెబ్బదియిదు, జగన్నాథపండితుడు (పండితరాయలు) రసగంగాధరమందుఁ గ్రంథపాతముకాగా మిగిలినదానియందరువదియేడలంకారములనుఁ బ్రకటించెను. అలంకారకౌస్తుభకర్తయగు విశ్వేశ్వరపండితుడు డెబ్బదియారింటిని గ్రహించెను. కావున దండి చెప్పినట్లువ్యవస్థితముగానున్న యీయర్థాలంకారముల సెప్పఁడు పూర్ణముగాఁ బ్రతిపాదింప సమర్థుడగును.

“క్రింతుబీజంవికల్పానాం పూర్వాచార్యైః ప్రదర్శితమ్ తదేవపరిసంస్కర్తుమయ మస్మత్పరిశ్రమః” కాని యీయలంకార వికల్పములకు బీజమెద్దియో దానినిఁ బూర్వాచార్యులం కనపర్చియున్నారు. దానిని సంస్కరించుటకుఁ బ్రయత్నించుచున్నాము.

దండి—కావ్యాదర్శమందు “1 స్వభావోక్తి 2 ఉపమ 3 దీపకము 4 ఆవృత్తి 5 రూపకము 6 ఆక్షేపము 7 అర్థాంతరన్యాసము 8 వ్యతిరేకము 9 విభావన 10 సమాసోక్తి 11 అతిశయోక్తి 12 ఉత్ప్రేక్ష 13 హేతువు 14 సూక్ష్మము 15 లవము 16 క్రమము 17 ప్రేయోలంకారము 18 రసవత్తు 19 ఊర్జస్వి 20 పర్యాయోక్తి 21 సమాహితము 22 ఉదాత్తము 23 అపహ్నుతి 24 శ్లేష 25 విశేషము 26 తుల్యయోగిత 27 విరోధము 28 అప్రస్తుతప్రశంస 29 వ్యాజస్తుతి 30 నిదర్శన 31 సహోక్తి 32 పరివృత్తి 33 ఆశీస్సు 34 సంకీర్ణము 35 భావికము” అనుని ముప్పదియయిదలంకారములను మాత్రమే చెప్పియుండుటచే నతనికాలమున కివియే వాడుకలో నుండెనని మనమూహించుకొనవలయును.

ఈదండిచేసిన యుపమారూపకాద్యలంకారవర్గీకరణము (classification) మిగుల విలక్షణముగానున్నది. ఇట్టివిలక్షణవర్గీకరణమితని తరువాతవారైన వామనుడు కావ్యప్రకాశకారుడు భోజరాజు మొదలగు వారెవ్వరును తమగ్రంథములయందు చూపియుండ లేదు.

ఇతఁడుపమాలంకారమునకు "యథాకథంచిత్సాదృశ్యం యత్రోద్భూ ప్రతీయతే ఉపమానామసా" అని సామాన్యముగా నుపమాలక్షణము జెప్పి తరువా "1 ధర్మోపమ 2 వస్తూపమ 3 విపర్యాసోపమ 4 అన్యోన్యోపమ 5 నియమోప 6 అనియమోపమ 7 సముచ్చయోపమ 8 అతిశయోపమ 9 ఉత్ప్రేక్షితోప 10 అద్భుతోపమ 11 మోహోపమ 12 సంశయోపమ 13 నిర్ణయోపమ 14 శ్లేషోప 15 సమానోపమ 16 నిందోపమ 17 ప్రశంసోపమ 18 ఆచిఖ్యాసోపమ 19 వి ధోపమ 20 ప్రతిషేధోపమ 21 చటూపమ 22 తత్త్వాఖ్యానోపమ 23 అసాధా ణోపమ 24 అభూతోపమ 25 అసంభావితోపమ 26 బహూపమ 27 విక్రియోప 28 మాలోపమ 29 వాక్యార్థోపమ 30 ప్రతివస్తూపమ 31 తుల్యయోగితోప 32 హేతూపమ" అనిగుపమాలంకారములో ముప్పదిరెండు భేదములను వక్కా ణించెను. కాని యితఁడు చెప్పిన యీయుపమానాంతర భేదములన్నియు నవీను చెప్పిన స్వతంత్రాలంకారములు గాని వేరు కావు. ఎట్లనగా; పైనవ్రాసినవాని ధర్మోపమయనునది నవీనుల పూర్ణోపమ వస్తూపమ "ఇందుతుల్యాస్యా" అను నవీన ఉపమాప్రకరణ మందు చెప్పఁబడిన ధర్మలుప్త. విపర్యాసోపమప్రతీపాలంకారమే కవిసమయసిద్ధమయిన ప్రసిద్ధోపమానోపమే యభావపర్యాసముచే విపర్యాసోప యని పేరొందెను. అన్యోన్యోపమ యనునది ఉపమేయోపమకు నామాంతరము నియతోపమలో సంపదించునది నవీనాలంకారములలో నెద్దియు గానరాదు. సముచ్చ యోపమకుఁ దుల్యమయినదానిని నవీనులుపమా భేదములలో జెప్పలేదు. ఉత్ప్రే తోపమ ప్రతిపాలంకార భేదము అద్భుతోపమ "అసంబందే సంబంధాతిశయోక్తి అని కావ్యప్రకాశకారుడు విశ్వనాథకవిరాజు నభిప్రాయపడి యిట్టియర్థముగ శ్లోకములనే ఉదాహరించిరి. "యదిస్యాన్మండలేసక్తమిందోరిందీవరద్వయమ్ తదోపమీయ తేతస్యావదనం చారులోచనమ్", ఉభౌయదివ్యోమ్ని పృథక్పతేతా మాకాశగంగాపయసః ప్రవాహా। తేనోపమీయేత తమాలనీలమాముక్తముక్తాల మస్యవక్షః (శిశుపా 3 సర్గ 8 శ్లో) భోజరాజు దీనినుత్పాద్యోపమ యని పేర్కొనె మఱికొందరు నవీనులు దీని నద్భుతోపమయని వాడిరి. దాని లక్షణమిట్లుచెప్పి "యత్రోపమే యధర్మాస్స్యురుపమానేధిరోపితాః। చమత్కార విధానార్థం తా మాహురద్భుతోపమామ్"

మోహోపమ యిప్పటివారిభ్రాంతి మదలంకారము. కాని కొందరు నవీనుల కూడ "ప్రతియోగినమారోప్యతదభేదేనకీర్తనమ్। ఉపమేయస్యయన్మోహోపమా సాభ్రాంతిమద్వచః" అని మోహోపమకు లక్షణముఁ జెప్పిరి. దర్పణకారుఁడు దీని

భ్రాంతిమదలంకారమని వ్యవహరించెను. సంశయోపమ సందేహాలంకారము. నిర్ణయోపమ — ఇది సందేహాలంకారములో భేదమయిన నిశ్చయాంత సందేహము. శ్లేషోపమ — దీనిలో నర్థశ్లేషమహిమచే నుపమానోపమేయగతసాధర్మ్యము తెలియఁజేయబడుచున్నది. సమానోపమ — ఇది కేవలశబ్దశ్లేషవిషయము.

నిందోపమ — ఇది నవీనుల వ్యతిరేకాలంకారమునకు దగ్గరగానుండును. కాని దానికంటెఁ గొంచెము భేదముగలది. ఇది సామ్యమాత్రపర్యవసాయి. వ్యతిరేకము భేదపర్యవసాయియని యెఱుంగునది ప్రశంసోపమ. ఇదికూడఁ బ్రతీపమే.

ఆచిఖ్యాసోపమ — ఇది నవీనోపమాభేదములలో లేదు. విరోధోపమ — దీనికిఁ గూడఁ బ్రతీపాలంకారమే మూలమని చెప్పవచ్చును. ప్రతిషేధోపమ — దీనిలో ముఖాంబికమునకుఁ జంద్రాదులతో సాదృశ్యమే లేదని ప్రతిషేధించుటవలన నధిక వైచిత్ర్యము ప్రకటింపబడుచున్నది. నిందోపమలో నిందచే సాదృశ్యము నివారింపబడుచున్నది. చటూపమ — ఇది ప్రియోక్తిఘటితమగుటవలన చటూపమయని చెప్పఁబడుచున్నది. దీనిలోఁ జంద్రుని కధికసామగ్రియున్నను ముఖమునకంటె నతిశయింపలేక సముఁడాయెనని చెప్పుటచే నుత్కర్షకారణమున్ననుత్కర్షము కలుగలేదని ప్రతిపాదించుటవలన విశేషోక్త్యలంకారమగుచున్నది. ఈయలంకారమునకు విశేషోక్తిమూలము. తత్త్వాఖ్యానోపమ — "ఇవి నేత్రములుగాని తుమ్మెదలుకావు. ఇది ముఖముగాని పద్మముకాదు అని సాదృశ్యమును స్పష్టముగా వ్యక్తపర్చుటవలన భ్రమను నిరసించి తత్త్వము చెప్పబడుచున్నది. నిర్ణయోపమలోఁ దత్త్వాఖ్యానము సంశయపూర్వకముగా నుండును. దీనిలో భ్రాంతిపూర్వకముగానుండును. అసాధారణోపమ — నవీన మతప్రకారమిది అనన్వయము. అభూతోపమ — ఒకచోటఁ గూర్చిన సర్వపద్మప్రభాసారమువలె నీముఖము ప్రకాశించుచున్నది యనగా నభూతోపమ. సర్వపద్మప్రభాసార మొకచోటఁ గూర్చుట యెప్పుడు జరగనిపని గావున దీనికి నభూతోపమయని పేరుకలిగినది దర్పణకారుడీ యలంకారమునుత్ప్రేక్షయని చెప్పెను. అసంభావితోపమ — చంద్రచందనములనుండి విషపావకనిస్సరణ మెట్లసంభావితమో అట్లనే నీముఖమునుండి పరుషోక్తి వెల్వడుట యసంభావితమని చెప్పగా నసంభావితోపమ. బహూపమ దీనిని దర్పణకారుడు మాలోపమయని చెప్పెను. "మాలోపమా యదేకస్యోపమానం బహుదృశ్యతే" అని దానిలక్షణము. విక్రియోపమ — నీముఖము చంద్రబింబమునుండి సముత్కీర్ణమయినదానివలె నున్నది. పద్మగర్భమునుండి తీయబడిన

"దానిసలె నున్నది" అని పలుకగా, విక్రియోపమ-చంద్రబింబపద్మగర్భములు ప్రకృతులగు ముఖమునకుఁ బ్రకృతులు. ముఖము వికృతి. కావున నిది విక్రియోపమ. "ఉపమేయస్య యత్రస్యాదుపమానవికారతా। ప్రకృతేర్వికృతే స్సామ్యాత్తామాహుర్విక్రియోపమామ్ (ఉపమేయమున కుపమానవికారము కలుగుటచేఁ బ్రకృతి వికృతుల సామ్యము ప్రతీయమానమయినచో విక్రియోపమ) ఇచట ధర్మములగు నుత్కీర్ణత్వ ధృతత్వములు రెండునుత్ప్రేక్షింపబడుటచే ముఖచంద్రులకు సామ్యము ప్రతీయమానమగుటవలన నుపమ గాని యిదియుత్ప్రేక్ష గాదని యెఱుంగునది. మాలోపమ—ఇది నవీనాలంకారిక మతమందుఁగూడ నున్నది. పూర్వోక్తమగు బహూపమలో నుపమా బాహుళ్యము. ఇందులో నుపమానములకుఁ బరస్పరసంబంధము. ఇదియే యీ రెండింటికిఁ గల భేదము. వాక్యార్థోపమ ఇందులో నొక వాక్యార్థము మఱియొక వాక్యార్థము నుపమేయింపబడును. ఇదియొక ఇవశబ్దముగలది అనేకేవశబ్దములు గలదియని రెండు విధములు. వానిలో నొక్క ఇవశబ్దముతోఁగూడినదాని కుదాహరణము.

"త్వబాన సమధీరాత్మమావిర్భశదీధితి, భ్రమద్భృంగమివాలక్ష్య కేసరశాలిపంకజమ్" "దీనిలో భ్రమద్భృంగమివ" అనుచోట నొక్కటియే ఇవశబ్దము. హెచ్చుఇవశబ్దములుగలదాని కుదాహరణము. "నలిన్యా ఇవతన్వంగ్యాస్తస్యాః పద్మమివాననమ్, మయామధువ్రతేనేవ పాయంపాయమరమ్యత" ఇందులో మూడు ఇవశబ్దములున్నవి. ప్రతివస్తూపమ——నవీనులు వ్యవహరించు ప్రతివస్తూపమయేయిది. సామాన్యధర్మముపర్యాయ పదములచే వేరుగా నిర్దేశింపబడును. తుల్యయోగోపమ—ప్రస్తుతాప్రస్తుతముల కేకజాతీయ క్రియచే సాదృశ్యముచెప్పుట తుల్యయోగోపమ అనగా నొక హీనుని యధికునితో నేకజాతీయ క్రియచే సమముగాఁజేసి వర్ణించుట. ఇది తుల్యయోగితాలంకారములో "గుణోత్కృష్టైస్సమీకృత్యవచోఽన్యా తుల్యయోగితా" అను నవీనతుల్యయోగితలో భేదము.

## ఉపమాదోషములు.

"నలింగవచనే భిన్నే నహీనాధికతాపివా। ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో నధీమతామ్" వినువారికిఁ జదువువారికి మనస్సులో నుద్వేగముఁ బుట్టింపనియెడల భిన్నమగు లింగవచనములు గాని హీనోపమయు నధికోపమయు గాని యుపమను దూషింపజాలవని దండియభిప్రాయము. హీనత్వము, అధికత్వము, వచనభేదము, లింగభేదము విపర్యయము, అసాదృశ్యము, అసంభవమునను నీయేడు నుపమాదోషములు.

భామహుడుకూడఁ గావ్యాలంకార సూత్రిమందీదోషముల నిట్లు వాక్రిచ్చెను.

హీనత్వాధికత్వలింగవచన భేదాసాదృశ్యాసంభవా స్తద్దోషాః హీనత్వము. అధికత్వము, లింగవచనభేదము, అసాదృశ్యము, అసంభవమునను నివి ఉపమాదోషములు.

జాతి ప్రిమాణధర్మన్యూనతోపమానస్య హీనత్వమ్.

జాతి ప్రిమాణధర్మములచే నుపమానమునకు న్యూనతను Inferiority గలిగించుట హీనత్వము.

జాతి న్యూనత—"చండాలైరివయుష్మాభిస్సాహసం పరమంకృతమ్".

ప్రిమాణ న్యూనత—"వహ్నిస్స్ఫులింగ ఇవభానురయంచకాస్తి".

ధర్మ న్యూనత—"సమునిర్లాంఛితో మౌంజ్యాకృష్ణాజినపటంవహన్, వ్యరాజన్నీలజీమూతభాగాశ్లిష్ట ఇవాంశుమాన్" ఇచట మౌంజికిఁ బ్రితిగా విద్యుత్తు చెప్పఁబడలేదు. గావున ధర్మన్యూనత.

జాత్యాధిక్యము—"సశంసు వృష్ణయశ్శీఘ్రిం రుద్రాఇవమహౌజసః" ఇచట వృష్ణులకంటె రుద్రులు జాతిచే నధికులు.

ప్రిమాణాధిక్యము—"పాతాళమివనాభిస్తే స్తనౌక్షితిధరోపమౌ। వేణీదండఃపునరయం కాళిందీపాతసన్నిభః" ఇచట నాభికంటెఁ బాతాళము స్తనములకంటె క్షితిధరములు, వేణికంటెఁ గాళిందీప్రివాహమును పెద్దవి.

ధర్మాధిక్యము—సరశ్మిచంచలంచక్రం దధద్దేవో వ్యరాజత, సబాడబాగ్నిస్స్యాద దగ్ధస్స్రోతసామివనాయకః" ఇచట బడబాగ్నికి మారుగా నుపమేయపక్షమున నింకొకటి చెప్పబడవలెను. అదిలేదు.

ఉపమానోపమేయయోర్లింగ వ్యత్యాసో లింగభేదః॥

ఉపమానోపమేయములు భిన్నలింగములలోనుండుట లింగభేదము.

ఉ॥ "సైన్యానినద్య ఇవజగ్ముర వర్గళాని ఇందులో నుపమేయమగు సైన్యశబ్దము నపుంసకము. ఉపమానమయిన నదీశబ్దము స్త్రీలింగము.

ఇష్టఃపుంనపుంసకయోః ప్రాయేణ॥

ఉపమానోపమేయములకు పుంనపుంసకలింగ భేదము ప్రాయికముగా నొప్పుకొనబడినది. ఉ॥ చంద్రిఇవముఖం॥

లోకేక్యాంసమాసాభిహితాయాముపమా ప్రిపంచేచ॥

1. లౌకికోపమ—సరస్యథాయేవ

2. సమాసాభిహితోపమ—నీలోత్పల సదృశీ భుజలతా

3. ఉపమాప్రపంచము.

"శుద్ధాంతదుర్లభమిదంవ పురాశ్రమవాసినో యదిజనస్య। దూరీకృ
ఖలుగుణైరుద్యానలతావనలతాభిః॥"

వచనభేదముకూడ నిటులనే చూచుకొనవలయును.

ఉ॥ పశ్యాషిలోచనేతస్యాః పుష్పం పుష్పలిహోయథా" ఇచట నుపమే
మగు "లోచన" శబ్దము ద్వివచనమందున్నది. ఉపమానమగు "పుష్పలిహః" అ
బహువచనములో నున్నది.

## అప్రతీతగుణ సాదృశ్యమసాదృశ్యమ్.

కవి ప్రపంచమందుఁ బ్రసిద్ధముగాని గుణములచే సాదృశ్యముఁ గల్పిం
యసాదృశ్యమనఁబడును. ఉ॥ "గ్రథ్నామి కావ్యశశినం వితతార్థరశ్మిమ్" ఇ
గావ్యమునకు జంద్రునితో సాదృశ్యమప్రసిద్ధగుణములచేఁ గల్పింపఁబడినది. అ
లకు రశ్మి సాదృశ్యము సంభవింపఁగాఁ గావ్యమునకుఁ జంద్రసాదృశ్యము సిద్ధిం
పలుకుదురేమో అది సరికాదు. కావ్యమునకుఁ జంద్రసాదృశ్యము సిద్ధింపగా న
లకు రశ్మితుల్యత్వము సిద్ధించును. అర్థములకు రశ్మలకుఁ బ్రసిద్ధమైన సా
హేతువు లేదు. ఈరీతిగా నిచట నితరేతరాశ్రయ దోషము దుర్వారము.

అసాదృశ్య హతాహ్యుపమా॥

ఉపమ-అసాదృశ్యముచే దూషింపఁబడునది. కవులందరుపమానిష్టులు.

ఉపమానాధిక్యాత్తదపోహ ఇత్యేకే॥

ఉపమానములను హెచ్చుగా వాడుక చేయుటచే నాయసాదృశ్యము తొ
గింపఁబడునని కొందరు తలంచుచున్నారు. ఎట్లనగా: కర్పూరహార హరహా
మశస్తే; ఇచట ధావళ్యము గల కర్పూరాద్యనేకోపమానములతోఁ గీర్తికి సా
ము స్థాపింపఁబడినది.

## నాపుష్టార్థత్వాత్.

ఉపమాన బాహుళ్యముఁ జెప్పిన యెడల నసాదృశ్యదోషము వారింపఁబడ
పరికైతినిగాని యను పరిషత్తు. ఏలయన నుపమాన బాహుళ్యతేనుదంమంథ లే

ఒక ఉపమానము ప్రయోగింపఁబడగా నుపమానాంతర మర్థవిశేషమును బోధింపదు. ఎట్లనగా, "బలసింధుస్సింధు రివక్షుభితః," ఇత్యాదిప్రయోగములున్నవి గాని యిచట సింధుశబ్దము పునరుక్తమైనది. కావున నర్థవిశేషమేమియు లేదు. అని అందువేమో అది సరికాదు. చెప్పెదను వినుము. "బలసింధుః" అనుచోట సైన్యము సముద్రమువలె నున్నదని వైపుల్యము స్ఫురించుచున్నది. "సింధురివక్షుభితః" అను చోట సముద్రమువలె క్షోభనొందెనని చెప్పుటలో క్షోభసారూప్యమందుఁ దాత్పర్యము. కావున నర్థభేదముండుటవలనఁ బౌనరుక్త్యము లేదు.

## అనుపపత్తిరసంభవః.

ఉపమాన ముపపన్నము కాకపోవుట యసంభవము ఎట్లనగా; చకాస్తివపనే తస్యాస్స్మితచ్ఛాయావికాసినీ। ఉన్నిద్రస్యారవిందస్య మధ్యేముగ్ధేవచంద్రికా; ఇచట వెన్నెలగాయుచుండగా నరవిందము వికసించియున్నదని చెప్పుట యనుపపత్తి. ఇది యర్థవిరోధము కాకూడదా? ఉపమాన దోషమని యేలకల్పింపవలెను. అన్నచో నట్లు కాదు. ఉపమయందతిశయమిష్టము.

ఇట్లు ప్రాచీనులలో మొదట దండి, తరువాత వామనుఁడు నవీనులలోఁ గావ్య ప్రకాశకారుఁడు రసగంగాధరమును రచించిన జగన్నాథపండితుఁడు నుపమా దోషములను సాకల్యముగాఁ జెప్పియున్నారు. తక్కిన యలంకారశాస్త్రకర్తలెవ్వరు నుపమాదోషములనుఁ జెప్పలేదు.

మఱికొందరు గ్రంథకర్తలు కాలపురుష విద్యాదిభేదములనుగూడ నుపమా దోషములుగాఁ బరిగణించి యిట్లుదాహరించిరి.

కాలము—"కాప్యభిఖ్యాతయోరాసీ ద్వ్రజతోశ్శుద్ధవేషయోః। హిమనిర్ముక్తయోర్యోగే చిత్రాచంద్రమసోరివ" ఇచట నుపమానభూతులయిన చిత్రాచంద్రుల శోభయొకప్పుడు పోవునదికాదు. సార్వకాలికము.

పురుష—లతేవరాజసేతన్వీ। లతాయథారాజతే తథాత్వంరాజసే.

విధి—చిరంజీవతు తేనూను ర్మార్కండేయమునిర్యథా॥ ఇచట "మార్కండేయ మునిర్యథాజీవతి" అని యోజించుకొనవలెయును. ప్రాయికముగా నిట్టిదోషములను కవులు పరిగణింపరు.

## ఉపమాద్యోతక శబ్దములు.

ఇవ, వత్, వా, యథా, సమాన, నిభ, సన్నిభ, తుల్య, సంకాశ, నీక
ప్రతీకాశ, ప్రతిరూపక, ప్రతిపక్ష, ప్రతిద్వంద్వ, ప్రత్యనీక, విరోధి, సదృక్,
శ, సంవాది, సదృక్ష, సజాతీయ, అనువాది, ప్రతిబింబ, ప్రతిచ్ఛంద, సరూప,
సమ్మిత, సలక్షణ. ఆభ, సపక్ష, ఉపమిత, ఉపమ, కల్ప, దేశీయ, దేశ్య, ప్ర
ప్రతినిధి, సవర్ణ, తులిత మొదలగునవి. అన్యానార్థమును జెప్పుశబ్దములు,
కవదనేత్యాది బహువ్రీహిసమాసము, స్పర్ధతే, జయతి, ద్వేష్టి, ద్రుహ్యతి,
గర్జతి, ఆక్రోశతి, అవజానాతి, కదర్థయతి, నిందతి, విడంబయతి, సంధ
హసతి, ఈర్ష్యతి, అసూయతి, తస్యముష్ణాతిసౌభాగ్యం, తస్యకాంతిం విలు
తేనసార్ధం విగృహ్ణాతి, తేనతులామధిరోహతి, తత్పదవ్యాంపదంధత్తే, తస్యక
విగాహతే, తమన్వేతి, తమనుబధ్నాతి, తన్నిషేధతి, తచ్ఛీలం, తేస్యాయుక్త
ఇత్యాది శబ్దములు సాదృశ్య సూచకములు.

వామనుఁడు. మమ్మటభట్టు, కావ్యప్రదీపకారుఁడు, కావ్యదర్పణకారు
సాహిత్యదర్పణకారుఁడు, జగన్నాథపండితుడు. విద్యానాథుఁడు, సాహి
రత్నాకరకారుఁడు, విద్యాధరుడు, ఆచార్య హేమచంద్రుఁడు, భోజరాజు, చం
లోకకర్తయగు జయదేవుఁడు, చిత్రమీమాంసాకారుఁడు నుపమాలంకారమ
బూర్ణయనియు, లుప్తయనియు, ద్వివిధముగా విభజించి వానిలో ననేకావా
భేదములను సోదాహరణముగఁ గనపర్చిరి. రుద్రటుఁడు, వాగ్భటుఁడు, అలంక
సర్వస్వకారుడగు రాజానకరుయ్యుఁడు, తిమతమ గ్రంథములయందీ విభాగము
దెలుపలేదు.

## కావ్య ప్రకాశకారుని యుపమా విభాగము.

సాధర్మ్య ముపమా భేదే పూర్ణాలుప్తా చ సాగ్రిమా। శ్రౌత్యార్థీ చ
ద్వాక్యే సమాసే తద్ధితే తథా॥

ఉపమ-పూర్ణయనియు లుప్తయనియు రెండువిధములు. వీనిలోఁ బూ
శ్రౌతియనియు నార్థియనియు నిరుతెఱగులు. ఇవ, వత్, వా, యథాదిశబ్ద
ప్రయోగముతోఁగూడినది శ్రౌతి. ఇట్టి శబ్దప్రయోగము లేకుండఁ గేవలార్థవశ
నౌపమ్య మెచ్చటఁ బ్రతీయమానమగునో దానికార్థియని పేరు. ఈ రెండునుఁ బ్ర

కముగా వాక్యగతము, సమాసగతము, తద్ధితగతమునని మూడువిధములుగా విభజింపఁబడియున్నవి. ఇందువలనఁ బూర్ణోపమ ఆరువిధములని యెఱుఁగవలయును.

పూర్ణ.

| శ్రౌతి. | ఆర్థీ. |
| --- | --- |
| 1. వాక్యగ. | 1. వాక్యగ. |
| 2. సమాసగ. | 2. సమాసగ. |
| 3. తద్ధితగ. | 3. తద్ధితగ. |

క్రమముగా నుదాహరణములనుఁ జూడుడు.

(1) స్వప్నేపి సమరేషు త్వాం విజయశ్రీర్న ముంచతి। ప్రభావప్రభవం కాంతం స్వాధీనపతికా యథా॥

ఇందులో విజయశ్రీ ఉపమేయము స్వాధీనపతిక - ఉపమానము నముంచతి అనునది సాధారణధర్మము - యథా అనునది ఉపమాప్రతిపాదకశబ్దము - ఇది వాక్యగతమైన శ్రౌతి.

(2) చకితహరిణలోలలోచనాయాః క్రుధితరుణారుణతారహారికాన్తి। సరసిజమిదమాననం చ తస్యాః సమమితి చేతసి సమ్మదం విధత్తే॥

ఇందులో సమశబ్దప్రయోగమువలన నార్థీ అది వాక్యగతము.

(3) అత్యాయతైర్నియమకారిభిరుద్ధతానాం దివ్యైః ప్రభాభిరనపాయమయైరుపాయైః। శౌరిర్భుజైరివ చతుర్భిరదస్సదా యో లక్ష్మీవిలాసభవనైర్భువనం బభార॥

ఇచట "ఇవేన నిత్యసమాసో విభక్త్యలోపః పూర్వపదప్రకృతిస్వరత్వం చ" అను వానిప్రకారము భుజశబ్దమునకు ఇవశబ్దముతో నిత్యసమాసమగుటచే సమాసమందు శ్రౌతి.

(4) అవితథమనోరథపథప్రథనేషు ప్రగుణగరిమగీతశ్రీః। సురతరుసదృశస్స భవానభిలషణీయః క్షితీశ్వరన కస్య॥

ఇచట "సురతరుసదృశః" అని ఉపమానమునకు ద్యోతకశబ్దమునకు సమాసము కలుగుటచే సమాసమందార్థీ.

(5) గాంభీర్యగరిమాతస్య సత్యంగంగాభుజంగవత్। దురాలోకస్సస
దాఘాంబరరత్నవత్॥

"తత్రతస్యేవ (పా-సూ 5-1-116) అను పాణిన్యనుశాసనాను సార
ఇవార్థమందొకవత్ ప్రయోగింపబడును-ఈశ్లోకమందు "గంగాభుజంగవత్
అను దానిలోనున్న "వత్" ఇవార్థమందు వాడుక చేయబడినది. కావున
శ్రోతి-"తేనతుల్యం క్రియా చేద్వతిః" (5-1-115) అను సూత్ర ప్రకారము "
తుల్యమ్" అను నర్ధమందు వాడుక చేయబడు మఱియొకవత్ కలదు-"నిదాఘా
రత్నవత్" అనుదానిలో నున్నవత్ తేనతుల్యమను నర్థమును జెప్పునదిగావున
ఆర్థీ-పూర్ణోపమ యిట్లారు విధములుగా విభజింపబడినది.

## లుప్తోపమా విభాగము.

పూర్ణోపమా సామగ్ర్యసంపాదకములగు నుపమానోపమేయ సామాన్య ధ
పమా వాచకములలో నొకటిగాని రెండుగాని మూడుగాని లోపించినయెడల
లుప్తోపమయనంబడును. ఉపమేయము మొదలుగాగల వాల్గింటిలో వాచకముగా
సాధారణ ధర్మముగాని, ధర్మవాచకములుగాని వాచకోపమేయములు గాని,
మానముగాని, వాచకోపమానములుగాని, ధర్మోపమలుగాని ప్రయోగింపఁబడక
చో నదిక్రమముగా (1) వాచకలుప్త, (2) ధర్మలుప్త, (3) ధర్మవాచకలు
(4) వాచకోపమేయలుప్త, (5) ఉపమానలుప్త, (6) వాచకోపమానలుప్త, (
వాచకోపమానలుప్త (8) ధర్మోపమానలుప్త అని యాలంకారికులందరు లుప్తో
నెనిమిది విధములు విభజించిరి. కావ్యప్రకాశకారుఁడు వాచకోపమానలుప్తను
తక్కిన యేడు విధములనే చెప్పెను.

కావ్యదర్పణకారుఁడగు రాజచూడామణి దీక్షితుడు జయదేవుడు మొద
వారలులుప్తోపమ అష్టవిధమని చెప్పిరి.

"స్యాదేకలుప్తా త్రివిధాద్విలుప్తాతు చతుర్విధా। త్రిలుప్తాత్వేక రూపేతి
సామాన్యతోఽష్టధా" లుప్తధర్మాతథా లుప్తోపమానాలుప్తవాచకా। ఇత్యేకలు
త్రివిధావిపశ్చిద్భిరుదీరితా ధర్మవాచకయోర్లోపె తథాధర్మోపమానయోః। వర్ణ్య
వాచకయో స్తద్వద్వాచ కావర్ణ్యయోరపి। చతుర్విధాద్విలుప్తేయం కథితాకా
వేదిభిః। త్రిలుప్తైకవిధాధర్మ వాచకావర్ణ్యలోపతః॥

కావ్యప్రకాశకారుడిట్లు వ్రాయుచున్నాడు.

అథలుప్తా విభజనీయా। సా చ సప్తధా। తత్ర త్రికస్య లోపే త్రిధా। ఉపమానస్య సాధారణ ధర్మస్య ద్యోతకస్య చ లోపాత్। ఉపమేయమాత్రస్య లోపాదర్శనాత్ ద్విలోపేపి త్రిధా। ధర్మవాద్యోర్ధర్మోపమానయోర్వా ద్యుపమేయయోశ్చ లోపాత్। అన్యస్య ద్వికస్య లోపాసంభవాత్। త్రిలోపేత్వియమేకా। ఉపమేయం వినాఽన్యేషాముక్తైః మాత్రసత్త్వే ఉపమాయా అసంభవాదితి దర్శయన్నేవ యథా సంభవం తాసాం సప్తవిధానామపి విభాగమాహ॥

“తద్వద్ధర్మస్య లోపే స్యాన్న శ్రౌతీ తద్ధితే పునః”.

వాక్యమందు శ్రౌతి కుదాహరణము—“ధన్యస్యానన్యసామాన్య సౌజన్యోత్కర్షశాలినః। కరణీయం వచశ్చేతః సత్యం తస్యామృతం యథా॥

దీనిలో నమృతమునకు వాక్కునకు సాధారణధర్మమగు పరిణామసరసత్వాదికము ప్రాప్తము కాలేదు. ఆక్షేపమువలనఁ బ్రాప్తమగు సంబంధము యథాశబ్దముచే బోధింపఁబడుచున్నది. కావున నిది ధర్మలోపమందు శ్రౌతి వాక్యే అర్థి ఎట్లనగా.

ఆకృష్టకరవాలోసౌ సంపరాయే పరిభ్రమన్। ప్రత్యర్థిసేనయా దృష్టః కృతాంతేన సమః ప్రభుః॥

కరవాల ఇవాచారస్తస్య వాగమృతోపమా। విషకల్పం మనో వేత్సి యది జీవసి తత్సఖే॥

ఇచట “కరవాల ఇవ” అనునది నిత్యసమాసము-కావున నిది సమాసమందు శ్రౌతి-“అమృతోపమా” అనుటచే సమాసమందార్థి విషకల్పమనునది తద్ధితగతమైన ఆర్థి.

ఉపమానానుపాదానే వాక్యగాథ సమాసగా॥

ఉపమాప్రతిపాదకములయిన వత్, కల్పప్ మొదలగు తద్ధిత ప్రత్యయములుపమానముచేతనే విధింపబడుచున్నవి. కావున నుపమానమను ప్రాప్తమైనపుడు తద్ధితగతమగునార్థి సంభవింపదు. ఇవాదులుపమానమాత్రముతో నన్వయించునది గావున నుపమానమను ప్రాప్తమైనపుడవికూడ నను ప్రాప్తములగుటచే శ్రౌతికూడ సంభవింపదు అందుచే వాక్యసమాసములయందే గాని తద్ధితయందు లేదు. కావున లుప్తోపమానోపమ రెండు విధములు.

## వానిలో వాక్యగతార్థ కుదాహరణము.

స అలకరణ పవిసామసిరివి అరణంణ సరసకప్పస్స। దీస ఇ అహావణిప
ఇసరిసం అంసం మేత్తేణ॥

ఛా "సకలకరణ పరవిశ్రామశ్రీ వితరణంన సరసకావ్యస్య ద్రృశ్యతేధ
శక్యతే సదృశమంశాంశ మాత్రేణ".

దీనిలో "కావ్యస్య" అనుదానికి "కావ్యసమమ్" అనియు, "సదృశ
అనిదానికి "నూనమ్" అనియుం శాశమున్నయడల నదియే సమాసగతమున కుదాహ
మగును.

వాదేలోాప్ సమాసే సాకర్మాధారక్య చిక్యజీ। కర్మకర్తోర్ణముల్॥

ఉపమాద్యోతకములయిన వా, ఇవ, యథా మొదలగు శబ్దములు లోపించి
పుడు లుప్తోపమాభేదములారు కలుగును 1. సమాసగతము, 2. కర్మక్యచ్‌గత
3. ఆధారక్యచ్‌గతము, 4. క్యఙ్‌గతము, 5. కర్మణముల్గతము, 6. కర్తృణముల్గత

## వీనికుదాహరణములు.

(1) తతఃకుముదనాథేన కామినీగండపాండునా। నేత్రానందేన చంద్రే
మాహేంద్రీదిగలంకృతా॥

ఇచట గండపాండుశబ్దములు రెండిటికి సమాసము గావున నిది సమాసగత

(౨) అసితభుజగభీషణాసి పత్రో రుహా రుహికాహితచిత్ర తూర్ణచారః
కితతను గత్రిపాలకాంతి ప్రతిభట విక్రమదర్శనేయ మసీత్॥

ఇచట నుపమాన ధర్మోపమేయములగు అసితభుజగ భీషణాసి పత్ర
సమాసము.

(3) పౌరంసుతీయతి జనంసమరాంతరే సావంతః పురీయతి విచిత్రచరి
చంచుః। నారీయతే సమర సీమ్ని కృపాణపాణే రాలోక్యతస్య చరితాని సపత్నసే

ఇచ్చట "పౌరంసుతీయతి" అనుచోట "ఉపమానాదాచారే" అను సూ
ప్రకారము కర్మార్థమందుక్యచ్.

"సమరాంతర అంతః పురీయతి", అనుచోట అధికరణాచ్చ అను సూ
ప్రకారము అధికరణార్థమందుక్యచ్ "నారీయతే" అనుచోట "కర్తుఃక్యఙ్
సలోపశ్చ" అనుదానిచే కర్తరిక్యఙ్.

(4) మృధేంద్రాఘుష స్సోమం శువశతాం పశ్యంతి తంపరే। సపునః పార్థ
చారం సంచరత్యవనీపతి॥

ఇచట "నిదాఘఘర్మాం శుదర్శనం" అనునది కర్మార్థణమందుణముల్ పోర్ణసంచారం సంచరతి అనునది కర్త్రర్థణమందుణముల్.

ఏ తద్ద్విలోపేక్వీప్సమాసగా ధర్మవాచకములును రెండు లోపించినపుడు క్విప్ గతము, సమాసగతము, వానిలో క్విప్ గతమెట్లనగా — "సవితా విధవతి విధురపిస వితరతి తదాదివంతి యామిన్యః। యామినయంతి దినానిచ సుఖదుఃఖ వశీకృతేమనసి"॥

సమాసగతమెట్లనగా; పరిపంథిమనోరాజ్య శతైరపిదురాకరిమః। సంపరాయ ప్రివృత్తో సౌరాజతే రాజకుంజరః" ఇచట "రాజాయంకుంజర ఇవ" అని ఉపమిత సమాసము.

ధర్మోపమానయోర్లోపే వృత్తౌవాక్యేచ దృశ్యతే.

ధర్మోపమానములు లోపించినపుడు వాక్యసమాసగతమై యుండును.

ఉదా॥ ఢుండుణ్ణంతం మరీహసికంట ఆకలి అ ఇకే అ ఇవణాఇం। మాల ఇవ సమసరిచ్ఛం, భమరభమం ణపావహిసి॥ ఛా॥ ఢుండులాయమానో మరివ్యసి కంటకకలితానికేత కీవనాని। మాలతీ కుసుమసదృశం భ్రిమర భ్రమన్నపినప్రాప్స్యసి॥

ఈ శ్లోకమందు "కుసుమసరిచ్ఛమ్" అనుదానికి బదులుగా "కుసుమేన సమమ్" అని చెప్పినచో నిది వాక్యగతమగును.

క్వచిదాద్యుపమేయాసే.

క్వచ్చులో నుపమావాచకము, ఉపమేయము విడువబడును. ఉదా॥ అరాతి విక్రిమాలోక వికస్వరవిలోచనః। కృపాణోదగ్రదోర్దండస్స సహస్రాయుధీయతి॥

ఇచట ఆత్మఉపమేయము.

త్రిలోపేచ సమాసగా.

ఉపమావాచక ధర్మోపమానములు మూడును లోపించినపుడు సమాసగతము. ఉదా॥ తరుణిమనికృతావలోక నాలలితవిలాస విలబ్ధవిగ్రిహాస్మర శరవిసరాచితాంత రామృగనయనాహరతే మునేర్మనః.

ఇచట "సప్తమ్యుప మానపూర్వపదస్యబహు వ్రీహిరుత్తర పదలోపశ్చ" అను దానిచే సమాసలోపములు కలిగినపుడీ యుదాహరణ ముపయోగించును ఈరీతిగా లుప్తోపమ పందొమ్మిది విధములు, పూర్ణోపమ ఆరు విధములు.

ఉపమవలెనే రూపకముకూడ మిగుల ప్రాచీనమగు నలంకారమని నా యీ వ్యాసముయొక్క ఆరంభమందే వ్రాసియున్నాను. ఈయలంకారము వేదములయందు, ఉపనిషత్తులయందును గానవచ్చుచున్నది. దీనిని ప్రాచీనాలంకారికులొకరీతినిగాను నవీనాలంకారికులు మఱియొక రీతిగాను నిరూపించియున్నారు. ప్రాచీనులలొ నొకడైన దండి ఉపమకువలెనే దీనికి ననేకావాంతర భేదములను జెప్పియున్నాడు. ఎట్లనగా; 1. సమస్తరూపకము, 2. వ్యస్తరూపకము, 3. సమస్తవ్యస్తరూపకము, 4. సకలరూపకము, 5. అవయవరూపకము, 6. అవయవిరూపకము, 7. ఏకాంగరూపకము, 8. యుక్తరూపకము, 9. అయుక్తరూపకము, 10. విషమరూపకము, 11. సవిశేషణరూపకము, 12. విరుద్ధరూపకము, 13. హేతురూపకము, 14. శ్లిష్టరూపకము, 15. ఉపమారూపకము, 16. వ్యతిరేకరూపకము, 17. ఆక్షేపరూపకము, 18. సమాధానరూపకము, 19. రూపకరూపకము, 20. తత్త్వాపహ్నవరూపకమును యిరువది విధములు. ఈరూపకమునకు దండి యిట్లు లక్షణమును జెప్పియున్నాడు.

> ఉపమైవ తిరోభూత భేదా రూపక మిష్యతే,
> యథా బాహులతా పాణి పద్మం చరణ పల్లవః॥ (1)

ఉపమానోపమేయములకభేద ప్రతీతి పూర్వకమగు సామ్యము రూపకము. ఉపమాలంకారమందుపమానోపమేయములకభేద ప్రతీతిలేదు. ఇదియే యీరెండంటికి భేదము. రూపకములో నభేద ప్రతీతి, సాధ్యము. అతిశయోక్తిలోనది సిద్ధము. ఇదియేరూపకమునకు నతిశయోక్తికిఁగల భేదము "బాహులత, పాణిపద్మము, చరణపల్లవము" ఇత్యాద్యుదాహరణములయందు బాహువేలత. హస్తమే పద్మము, చరణమే పల్లవము అని వ్యవహారము. "బాహురేవలతా" అని విగ్రహము చెప్పినపుడది రూపక కర్మధారయము. ఇచట బాహువునందులతాత్వ మారోపింపఁబడినది. "బాహుర్లతేవ" అను ఉపమకంటె నిది యధికతరమగు వైచిత్రిని గలిగించును. "ముఖచంద్రింపశ్యామి" ఇత్యాదులయందు "ముఖంచంద్రఇ ఇవ" అను ఉపమితసమాసమునకు, "ముఖమేవచంద్రః" అను రూపకసమాసమునకు సంకరము. ఎచ్చట నయితే సాధర్మ్య ముపమేయమందు ముఖ్యముగాను ఉపమానమందారోపితముగా నుండునో అచ్చట నుపమకు ప్రాధాన్యము ఎచ్చట సాధర్మ్య ముపమానమందు ముఖ్యముగాను ఉపమేయమందారోపితముగా నుండునో అచట రూపకమునకుఁ ప్రాధాన్యము ఎట్లనఁగా; "ముఖచంద్రించుంబతి" ఇత్యాదులయందుపమయేయగును.

'ముఖచంద్రః ప్రకాశతే'' ఇత్యాదులయందు రూపకమే. కావున నీరెండింటికి సంకరము లేదు.

“ఉపమైవతిరోభూతభేదా రూపకమిష్యతే'' అను పూర్వోక్తకారికకుఁ బ్రాచీనులు కొందరిట్లు వ్యాఖ్యానముఁ జేసిరి.

ఉపమేయమున నుపమానముతో నతిశయిత సాదృశ్యమునుఁ జెప్పుటకు భేద ద్యోతకములగు ఇవాదిశబ్దములఁ బరిత్యజించి సామానాధికరణ్యముచే ముఖచంద్రుఁడని తాదాత్మ్య మారోపించుట రూపకమనంబడును.

ఉపమాన వాచకమగు శబ్దము స్వార్థమును విడిచి యుపచారమువలన నుపమేయగతమగు విశేషముఁ జెప్పుచున్నదియై యుపమానోపమేయములకభేదరూపణము వలన రూపక శబ్దవాచ్యమగుచున్నది. కావున దీనికి రూపకమని పేరొచ్చెను. “సామ్యము, ప్రతీయమానమగుచుండగా నుపమాలంకారము కావలెనుగాని రూపకమెట్లగును'' అని యాశంక కలుగగా సమాధానము చెప్పబడుచున్నది. రూపకాలంకారము కేవల సామ్య ప్రతీతి కలదియే కాదు. ఉపమానోపమేయములకు భేదముండగాఁ గలుగు సామ్య ప్రతీతి ఉపమ. ఉపమానోపమేయములకు భేదము లేకుండఁ గలుగు సామ్య ప్రతీతి రూపకము; ఎట్లనగా; “బాహులత'' అను దానిలో “లతేవ బాహుః'' అను ఉపమాస్థితి తిరోభూతమయ్యెను. ఈరీతిగా “పాణిపద్మము,'' “చరణ పల్లవము'' మొదలగు వాని నూహించుకొనవలయును.

మఱికొందరు ప్రాచీను లీరూపకము నిట్లు విభజించిరి.

> సాకల్యేనైకదేశేన కించిత్సాధర్మ్యతోపివా।
> రూపకం త్రివిధం కావ్యేక వయస్తత్త్రచక్షతే॥ (2)

సాకల్య రూపకమనియు, ఏకదేశ రూపకమనియు, సాధర్మ్య రూపకమనియు, రూపకము మూడు విధములు.

> ఉదా॥ హాసః కాన్తిస్మితజ్యోత్స్నా దన్తాంశుః పక్ష్మలక్ష్మణః।
> తస్యాహి ముఖచన్ద్రోయమితి సాకల్యరూపకమ్॥

ఆమె ముఖచంద్రుఁడు హాసమనెడు కాన్తి, చిఱునగవనెడు వెన్నెల, దన్తములనెడు కిరణములు, కంటిరెప్పలనెడు కళంకమునుఁగలవాఁడై ప్రకాశించు

చున్నాడని చెప్పగా సాకల్య రూపకము. ఇచటఁ జంద్రునికుండఁదగిన కా
వెన్నెల, కిరణములు, కళంకము మొదలగునవి యన్నియుఁ బూర్ణముగా వర్ణిం
బడినవి గావున దీనికి సాకల్యరూపకమని పేరు.

తేజసార్కశ్శశీకాన్త్యా భవాన్బుద్ధ్యాబృహస్పతిః।
బుద్ధ్యా వైశ్రవణశ్చేతి కథయన్త్యేకదేశికమ్॥

ఓయి-రాజా! నీవు తేజస్సుచే సూర్యుడవు, కాన్తిచేఁ జన్ద్రుడవుఁ, బు
బృహస్పతివి, ఐశ్వర్యముచేఁ గుబేరుడవని చెప్పినచో నేకదేశరూపకము. ఇ
నుపమానభూతులగు సూర్యచంద్ర బృహస్పతి కుబేరుల యొక్కొక ధర్మము గ్రహిం
బడినది గావున నిది యేకదేశి రూపకము.

వ్యూఢంపురుషసింహస్య విలోచనయుగంజగత్।
దదాహభూయఃకాలాగ్ని రితిసాధర్మ్యరూపకమ్॥

ఇందుఁ గుపితుడైన యొకరాజుయొక్క కనుదోయి వర్ణింపబడుచున్నది.

పురుష శ్రేష్ఠుఁడను నీ ప్రభువుయొక్క విశాలమగు లోచన యుగము
మును మొదట దహించినది. పిదప కాలాగ్ని దహించినది. ఇందువలన రాజ
కాలానలములకు సాధర్మ్యము ప్రతీయమానమగుచున్నదని తాత్పర్యము.

2 వ్యస్తరూపకమున కుదాహరణము అంగుళ్యః పల్లవాన్యాసన్కుసు మా
ఖార్చిషః। బాహూలతే వసన్తశ్రీ స్త్వంనః ప్రత్యక్షచారిణీ॥

వ్రేళ్లు అను చిగుళ్లు, నఖకాన్తులు అను పువ్వులు, బాహువులు అను లతల
గల నీవు మాకెదుటియెదుట సంచరించు వసన్త లక్ష్మివలె నున్నావు.

ఇచట వ్రేళ్లు చిగుళ్లని నఖకాన్తులు పూవులని సమాసము లేకుండ వ్యస్తముగ
జెప్పుటచే నిది వ్యస్తరూపకము. దీనిలో "బాహూలతే" త్యాద్యుదాహరణము
యందు లింగభేదము దోషావహముకాదు. (బాహుశబ్దము పులింగము, లతాశబ్ద
స్త్రీలిఙ్గము) అయినను రూపకమందు లిఙ్గభేదము దోషముకాదు. "శాస్త్రాణిచక్షు
వమ్" ఇత్యాది ప్రయోగములచే వచనభేదముకూడ దోషావహముకాదు.
యనగా; "శాస్త్రాణి" అనుటచే స్వశాస్త్ర సమధిగతమగు జ్ఞానమంతయు

జాతీయమగుటవలన బహువచనాన్తమైనను యేకవచనాన్తమువలె భాసించుచున్నది. ఇంతకంటె భిన్నస్థలమగు "ముఖంపద్మౌ" నీత్యాదులయందున్న వచనభేదము దోషము.

ఇత్యేతద సమస్తాఖ్యం సమస్తం పూర్వరూపకం।
స్మితం ముఖేందోర్జ్యోత్స్నేతి సమస్తవ్యస్తరూపకమ్॥ (3)

పూర్వోక్తమగు "అంగుళ్యః" అనునది అసమస్తరూపకము "బాహులతా" అనునది సమస్తరూపకము. "స్మితంముఖేందోర్జ్యోత్స్న" అనునది సమస్తవ్యస్తరూపకము. ఎట్లనగా; "స్మితముజ్యోత్స్న" అను నీరెండును వ్యస్తపదములు "ముఖేందుః" అనునది సమస్తరూపకము కావున నిది సమస్తవ్యస్తరూపకమున కుదాహరణము.

సకల రూపకమును నిరూపించుచున్నాడు.

తామ్రాంగుళిదళశ్రేణి నఖదీధితికేసరమ్।
ధ్రియతే మూర్ధ్ని భూపాలైర్భవచ్చరణ పఙ్కజమ్।
అంగుళ్యాదౌ దళాదిత్వం పాదేచారోప్య పద్మతామ్।
తద్యోగ్యస్థాన విన్యాసా దేతత్సకల రూపకమ్॥ (4).

ఇచట నెఱ్ఱని వ్రేళ్లను రేకులు, నఖకాంతులనెడు కింజల్కములు, గల నీ పాదపద్మము, రాజులచే శిరస్సులయందు ధరింపబడుచున్నది. దీనిలో నంగుళుల యందు దళత్వము, నఖకాంతులయందు కేసరత్వము, పాదమందుఁ బంకజత్వము నారోపించి యాపఙ్కజము యోగ్యస్థానమగు శిరస్సునందుంచఁబడినదని చెప్పుటచే నిది సకలరూపకము. ఇందుఁ బద్మమునకుఁ డవలసిన యవయవము లన్నియుఁ బూర్ణముగా వర్ణింపఁబడినవి గావున దీనికి సకల రూపకమని పేరు. శిరస్సునందు ధరించుట యనెడు సాధారణ ధర్మముపమానమగు పంకజమునకే తగియున్నది. కావున చరణపంకజమనునది రూపక సమాసముగాని ఉపమిత సమాసముకాదు.

అవయవ రూపమును నిరూపించుచున్నాడు.

అకస్మాదేవ తేచణ్డి స్ఫురితాధరపల్లవమ్।
ముఖంముక్తారుచో ధత్తేఘర్మామ్భఃకణమంజరీః।
మంజరీకృత్యఘర్మామ్భః పల్లవీకృత్య చాధరమ్।
నాన్యథాకృత మత్రాస్యమ తోవయవ రూపకమ్॥ (5)

కోపస్వభావముగలదానా నీముఖమకస్మాత్తుగాఁ గదలుచుండెడి ఆ
వము గలదియై ముత్తెపు కాంతిగల స్వేదబిన్దుగుచ్ఛములను ధరించుచున్నది.

ఇచ్చట నధరమందు పల్లవత్వమును స్వేదబిందువులయందు మంజ
నారోపింపఁబడినది. కాని ముఖమందేమియు నారోపితముకాలేదు. అవయవ
రూపణమువలన నిది యవయవరూపకము. ముఖమందుఁ బద్మత్వారోపమ
ముగా నూహింపఁదగినది. దర్పణకారుఁడు దీనికేకదేశవివర్తి రూపకమని
"యత్రైకస్యచి దార్థతా త్వమేక దేశవివర్తితత్" అని దానిలక్షణము.

అవయవి రూపకమును నిరూపించుచున్నాడు.

వల్గితభ్రూగళద్ఘర్మ జలమాలోహితేక్షణమ్,
వివృణోతిమదావస్థా మిదంవదన పఙ్కజమ్,
అవిశృత్యముఖాంగాని ముఖమే వారవిన్దతామ్,
అసీద్గమిత మత్రేదమతోపయవిరూపకమ్॥

దీనిలో నవయవియగు ముఖమందు పఙ్కజత్వమారోపించుటవలన నిది
యవిరూపకము. ఇచట నుపమయే బాగుగానున్నదిగాని రూపకము సమంజస
ముండలేదు. ఏలయన నిచట సాధారణ ధర్మమగు భ్రూవల్గనాదికముపమేయ
వదనమందు ముఖ్యముగా నున్నది. పఙ్కజమందారోపితమైయున్నది. కావున "
మంబుజమ్" అను పాఠము సాధువని బుద్ధిమంతులూహింపవలెను. దర్పణకారు
దీనిని రజ్జురూపకమని వ్యవహరించెను. చలించుచున్న కనుబొమలుగలది, జారుచుం
స్వేదజలముగలది, ఎఱ్ఱనగు కన్నులుగలదియగు నీముఖపద్మము మదావస్థనుఁ దె
జేయుచున్నది.

అవయవరూపక విశేషములను గనబఱ్చుచున్నాడు.

మదపాటలగండేన రక్తనేత్రోత్పలేన తే,
ముఖేనముగ్ధస్సోప్యేష జనోరాగమయః కృతః,
ఏకాజ్గరూపకంచైత దేవంద్విప్రభృతీన్యపి,
అంగానిరూప యన్త్యత్రియోగాయోగాభిదాకరా॥

మదముచే నెఱ్ఱనైన చెక్కులు గలదియు నెఱ్ఱనగు కలువరేకులవంటి కన్ను
గలదియు నగు నీముఖముచే ముగ్ధుఁడగు నీమనుజుఁడుకూడ రాగమయుఁడుగాఁ జే
బడెను.

ఇచట "రక్తనేత్రోత్పలేఽ" అని ఏకాంగమాత్ర రూపమువలన నిది యేకాఙ్గరూపకము. ఈరీతిగా నెచట రెండవయవములు రూపింపఁబడునో అది ద్వ్యఙ్గరూపకము. మూడవయవములు రూపింపఁబడినచో నది త్ర్యఙ్గరూపకము. ఈఅవయవరూపక మందంగములే రూపింపఁబడును గాని అంగి రూపింపబడదు. కావున నియందొక అంగముగాని రెండంగములుగాని మూడంగములుగాని యుండుట లేకపోవుటయే భేదనిమిత్తము.

యుక్తరూపకమును నిరూపించుచున్నాడు.

స్మితపుష్పోజ్జ్వలం లోలనేత్రభృఙ్గమిదం ముఖం।
ఇతిపుష్పద్విరేఫాణాంసంగత్యా యుక్తరూపకమ్॥ (8)

చిరునగవనెడు పుష్పముచేఁ బ్రకాశించునది, చలించుచుండెడి నేత్రములనెడు తుమ్మెదలు గలదియగు నీముఖము ప్రకాశించుచున్నది. ఇచట స్మితమనెడు పుష్పమునకు నేత్రములనెడు తుమ్మెదలకు నొకచోట యోగము చెప్పబడినది గావున నిది యుక్తరూపకము.

అయుక్తరూపకమునుఁ జెప్పుచున్నాడు.

ఇదమార్ద్రస్మితజ్యోత్స్నం స్నిగ్ధనేత్రోత్పలం ముఖం।
ఇతిజ్యోత్స్నోత్పలాయోగాదయుక్తంనామ రూపకమ్॥ (9)

ఈముఖము చిరునగవనెడు వెన్నెలకలది. నేత్రములనెడు పద్మములుకలది. భిన్నకాలీనములగు వెన్నెలకు బద్మములకు నొకచోట యోగము సంభవింపదు. గావున నిచట నారెండింటికి యోగము చెప్పుట అయుక్తరూపకమనఁబడును.

విషమ రూపకమును నిరూపించుచున్నాడు.

రూపణాదఙ్గినోఽఙ్గానాం రూపణారూపణాశ్రయాత్।
రూపకం విషమంనామ లలితంజాయతే యథా।
మదరక్తకపోలేన మన్మథస్త్వన్ముఖేన్దునా।
నర్తితభ్రూలతేనాలం మర్దితుం భువనత్రయమ్॥ (10)

ఇందులో నంగి రూపింపబడును. అంగములొకప్పుడు రూపింపబడును. మఱియొకప్పుడు రూపింపఁబడకపోవును, అందువలన దీనికి విషమ రూపకమని పేరు కలిగినది.

మదముచే నెఱ్ఱనగు కపోలములు గలదియు, నాడుచుండెడు భ్రూ
గలదియు నగు నీముఖచంద్రునిచే మన్మథుడు మూడులోకములను గొట్టుచున్నా
అనగా నీముఖమును బెట్టి లోకమును మోహింపజేసి దానిని వశపర్చుకొనుచున్నా
తాత్పర్యము, ఇచట నంగియైన ముఖమందు జంద్రత్వమారోపించి, అంగమగు
యుగమందు లతాత్వ మారోపించి, అంగాంతరమగు కపోలములయం దేమియు
చింపక విడుచుటచే నిది విషమరూపక మనంబడును.

విశేషణ రూపకమును నిర్దేశించుచున్నాడు.

హరిపాదశ్శిరోలగ్న జహ్నుకన్యాజలాంశుకః।
జయత్యసుర నిశ్శంక సురానన్దోత్సవధ్వజః।
విశేషణసమగ్రస్య రూపంకేతోర్య దీదృశమ్।
పాదేతదర్పణాదేతత్స విశేషణరూపకమ్॥

అగ్రభాగమందుఁ జిక్కుకొన్న గంగానదీ జలమనెడు శ్వేతవస్త్రము
గలదియు, రాక్షసులవలన భయములేకుండ దేవతలానందించు మహోత్సవమందెత్తి
యధ్వజమగు వామనుని పాదము సర్వోత్కృష్టమైయున్నది.

ఇచట నవసరమైన విశేషణములతో గూడిన ధ్వజరూపము వామనుని
మందారోపింపఁబడినదిగావున నిది సవిశేషణ రూపకమనంబడును.

విరుద్ధ రూపకమును నిరూపించుచున్నాడు.

నమీలయతి పద్మానినభోప్యవగాహతేత్వన్ముఖేన్దుస్మ
మానూనాం హరణాయైవ కల్పతే॥

నీ ముఖచంద్రుఁడు పద్మములను ముకుళింపజేయడు. అంతరిక్షమందుఁ
శింపడు, నాప్రాణములను హరించుటకే సమర్థుఁడు.

ఇది నాయికను గురించి నాయకుఁడు చెప్పుమాట. ఇచట ముఖమందారో
మాణుఁడగు చంద్రుడు చేయవలసిన పద్మనిమీలనగగనావగాహనాది క్రియ
చేయుటలేదు సరేకదా మీదుమిక్కిలి యమునిపనియైన ప్రాణహరణ మొనర్
చున్నాడని చెప్పుటచే నిదివిరుద్ధరూపకము. ఉపమేయమగుముఖము నుపమాన
ముగాఁ జెప్పుటచే నుపమాన కార్యకారిత్వముచితము. అదిలేక యన్యకార్యకరణ
వలన విరోధమే భాసించుచున్నది.

హేతురూపకమును నిరూపించుచున్నాడు.

గాంభీర్యేణ సముద్రోసి గౌరవేణాసి పర్వతః।
కామదత్వాచ్చ లోకానామసి త్వం కల్పపాదపః॥ (13)

గాంభీర్యముచే సముద్రుఁడవు. గౌరవముచే పర్వతమవు. లోకుల కిష్టప్రదుఁడ వగుటచేఁ గల్పవృక్షమవు. ఇచట గాంభీర్యము మొదలగు హేతువులచే నుమేయమగును. రాజునందు సాగరత్వము, గిరిత్వము, కల్పద్రుమత్వము నారోపింపబడినవి. ఇట్టి యారోపము హేతుమూలము గావున దీనికి హేతురూపకమని పేరు.

శ్లిష్టరూపకమును నిరూపించుచున్నాడు.

రాజహంసోపభోగార్హం భ్రమఃప్రార్థ్యసౌరభమ్।
సఖివక్త్రాంబుజ మిదంతవేతిశ్లిష్ట రూపకమ్॥ (14)

ఓ చెలియా! ఈ నీ ముఖపద్మము రాజహంసలు (రాజశ్రేష్ఠులు, హంస విశేషములు) పభోగించుట కర్హమైనది. (భ్రమరములచేఁ భ్రమరః కాముకే భృంగే అను మేదినీ నిఘంటు ప్రకారము. భ్రమరమనఁగా కాముకుఁడు, తుమ్మెద) గోరఁబడఁదగిన పరిమళము గలది. ఇచట రాజహంసోపభోగార్హత్వాది సాధారణ ధర్మము శ్లేషమూలముగావున నిది శ్లిష్ట రూపకము.

ఉపమా రూపకము నుదాహరించుచున్నాడు.

అయమాలోహితచ్ఛాయో మదేనముఖచన్ద్రమాః।
సన్నద్ధోదయరాగస్య చన్ద్రస్యప్రతిగర్జతి॥ (15)

మదముచే నెఱ్ఱని కాన్తిగల యీ ముఖచన్ద్రుఁడుదయించునపు డెఱ్ఱని కాన్తిగల చన్ద్రునితో స్పర్ధఁ జేయుచున్నాడు. ఇచట చంద్రత్వ మారోపింపఁబడిన ముఖము నకు ఔపమ్యసూచకమగు ప్రతిగర్జనయనెడి సాధర్మ్య సంబంధమువలన నిది యుపమా రూపకము.

వ్యతిరేక రూపకమును నిరూపించుచున్నాడు.

చంద్రమాః పీయతే దేవైర్మయా త్వన్ముఖచంద్రమాః।
అసమగ్రోఽప్యసౌశశ్వదయమా పూర్ణమండలః॥ (16)

అసంపూర్ణుఁడైనను యీలోకప్రసిద్ధచంద్రుఁడు దేవతచే నెల్లపుడు భా
చేయఁబడుచున్నాడు. సంపూర్ణ ప్రకాశముగల నీముఖచంద్రుఁడు నాచేఁ భా
చేయఁబడుచున్నాడు. ఇచటఁ బ్రిభాసా ప్రిభావములగు, ముఖచంద్రులకు సంపూ
త్వా సంపూర్ణత్వములచే వైధర్మ్యము గలుగుచున్నది గావున నిది వ్యతిరేక
కము. ఈవ్యతిరేక ముపమానముకంటె నుపమేయమున కుత్కర్షమునుఁ దెలి
జేయును.

ఆక్షేప రూపకమును నిర్దేశించుచున్నాడు.

ముఖచంద్రస్య చంద్రత్వమిత్థమన్యోపతాపినః।
న తే సుందరి సంవాదీ త్యేత దాక్షేప రూపకమ్॥ (

ఓ సుందరీ! విరహులఁ బీడించు చంద్రుని చంద్రత్వము నీముఖచం
చంద్రత్వము అను నీరెండును సరిగావు. ఏలయన; జంద్రుఁడు పరోపతాపకరుఁ
నీముఖము సర్వజనాహ్లాదకరము. ఉపమానభూతుఁడగు లోకప్రసిద్ధచంద్రుడు
పీడాకరుడని యిందువలన నింద ప్రకటింపబడుచున్నది. గావున నిది యా
రూపకము.

సమాధాన రూపకమును నిరూపించుచున్నాడు.

ముఖేందురపి తేచండి మాంనిర్దహతినిర్దయమ్।
భాగ్యదోషాన్మమైవేతి తత్సమాధాన రూపకమ్॥ (

కోపస్వభావురాలా! నాభాగ్యదోషమువలననే నీముఖచంద్రుఁడు
మిగుల దహించుచున్నాడని చెప్పఁచో నది సమాధాన రూపకము.

ఇచట నాభాగ్యదోషమువలననే నీముఖచంద్రుఁడు నాకు తాపహేతువౌ
ఁని హేతువును జెప్పి సమాధాన పడుటవలన నిది సమాధాన రూపకము.

రూపక రూపకమును జెప్పుచున్నాడు.

ముఖపంకజరంగేఽస్మిన్ భ్రూలతానర్తకీతవ।
లీలానృత్యంకరోతీతి రమ్యం రూపక రూపకమ్॥ (

నీ ముఖపద్మమను రంగస్థలమందు నీభ్రూలతయను నర్తకినృత్యము సలుపుచున్నది. ఇచట "ముఖమేవ పంకజం, తదేవరంగః" అని మొదట ముఖమందు పంకజత్వమారోపించి మరల నాముఖపంకజమందు రంగత్వ మారోపింపపడినది. అటులనే "భ్రూరేవలతా సైవ నర్తకీ" అని మొదటఁ గనుబొమలయందు లతాత్వము-దానిపై మరల నర్తకీత్వము నారోపింపబడినది. ఇట్లు మొదట రూపింపబడిన దానిపై మరల రూపించుటవలన నిది రూపక రూపకమని చెప్పఁబడుచున్నది. ‡ఇది సమాస స్థలమందే సంభవించును. బాణుడు హర్షచరితలోను కాదంబరిలోను తరుచుగా నీయలంకారమును వాడుక చేసెను.

తత్త్వాపహ్నవ రూపకమునుఁ జెప్పుచున్నాడు.

నైతన్ముఖమిదం పద్మం న నేత్రే భ్రమరావిమౌ।
ఏతాని కేసరాణ్యేవ నైతా దంతార్చిషస్తవ॥
ముఖాదిత్వం నివర్త్యైవ పద్మాదిత్వేన రూపణాత్।
ఉద్భావితగుణోత్కర్షం తత్త్వాపహ్నవ రూపకం॥ (20)

ఇది పద్మముగాని ముఖముకాదు. ఇవి తుమ్మెదలుగాని నేత్రములుగావు. ఇవి కింజల్కములుగాని దంతకాంతులుగావు.

ఇందులో ముఖత్వాదికమును నిషేధించి పద్మాదికముగా రూపించుటవలన నుపమేయగతమగు నుత్కర్షము తెలియఁ జేయఁబడినది. దీనిలో వాస్తవమగు ముఖత్వాదికమును దాచి దానియందుఁ బద్మత్వాదిక మధ్యస్తమైనది. దర్పణకారుఁడు దీనిని అపహ్నుతియని చెప్పెను. "ప్రకృతం ప్రతిషిధ్యాన్యస్థాపనం స్యాదపహ్నుతిః" అని దాని లక్షణము.

రూపకచక్రము నుపసంహరించుచున్నాడు.

నపర్యంతో వికల్పానాం రూపకోపమయోరతః।
దిఙ్మాత్రం దర్శితం ధీరై రనుక్తమను మీయతామ్॥

రూపకోపమాలంకార విశేషముల కవధి లేదు. దిఙ్మాత్రమిచటఁ గనఁబఱుపఁబడినది. ఇచటఁ జెప్పఁబడని దానిని బుద్ధిమంతులూహించుకొందురు గాక.

## అగ్నిపురాణము.

అలంకార వాఙ్మయమును రెండు భాగములుగా విభజింపవచ్చును. వ్రా
మొదటి భాగమందు ముఖ్యమైన అలంకార గ్రంథముల వృత్తాంతము, అలం
శాస్త్ర ప్రతిపాద్యములగు విషయముల విభాగము, ఆయాగ్రంథములను రచి
గ్రంథకర్తల కాలనిర్ణయము మొదలగునవి యుపపాదింపబడును. రెండవ భాగ
దలంకార శాస్త్ర ప్రతిపాద్య విషయములగు కావ్యలక్షణము, వృత్తులు, రీ
రసము, గుణములు, దోషములు, అలంకారములు మొదలగు నంశముల విమర్శ
మొదట నతిసూక్ష్మముగానున్న విషయములు కాలక్రమమున ననేక విధము
బరిణమించిన ప్రకారము తెలుపఁబడును. సంస్కృత వాఙ్మయముయొక్క ఇ
శాస్త్రములయందువలె నీయలంకార శాస్త్రమందుకూడ నసంఖ్యాకులైన గ్రంథక
సంఖ్యాతములైన గ్రంథములను వ్రాసిరి కాని యాగ్రంథకర్తల పేర్లు తప్ప
రచించిన గ్రంథము లెచ్చటనుఁ గానరావు. రాజశేఖరుఁడు తన కావ్య మీమాంస
నీయలంకార శాస్త్రమును శివుడు బ్రహ్మకుపదేశించెననియు, నతఁడు మఱికొ
ఋషులనుఁ జెప్పెననియు, వారి లోకమందా శాస్త్రమును వ్యాపింపఁజేసిరనియు,
అష్టాదశాధికరణములుగా విభజింపబడెననియు వ్రాసియున్నాడు.

"తత్ర కవిః రహస్యం సహస్రాక్షస్సమామ్నాసీత్, ఔక్తికముక్తిగర్భః,
నిర్ణయం సువర్ణనాభః, ఆనుప్రాసికం ప్రచేతాయనః, యమకాని చిత్రం చిత్రాం
గదః, శబ్దశ్లేషం శేషః, వాస్తవం పులస్త్యః, ఔపమ్యమౌపకాయనః, అతిశయం
పారాశరః, అర్థశ్లేషముతథ్యః, ఉభయాలంకారికం కుబేరః, వైనోదికం కామదే
రూపక నిరూపణీయం భరతః, రసాధికారికం నందికేశ్వరః, దోషాధికారికం
ణః, గుణౌపాదానిక ముపమన్యుః, ఔపనిషదికం కుచుమారః, ఇతి" ఈవచన
మట్టునఁ బ్రమాణమో మనకు నిర్ణయింప శక్యముగాదు. ఇందులోఁ జెప్పఁ
వారిందరు పురాణోక్తపురుషులు (Mythical persons) గాని వాస్తవచ
తో సంబంధించినవారు కారు. అయినను కామసూత్రములోని సాంప్రయోగి
నిషదికాధికరణములకు యథాక్రమముగా సువర్ణనాభ కుచుమారులుపదేశ
యున్నట్లితరగ్రంథ ప్రామాణ్యమువలనఁ దెలియవచ్చుచున్నది. నాటక లక్షణ
బోధించు భరత నాట్యశాస్త్రము మాత్రము మనకు లభించినది. దండికంటె మ
కాశ్యపుఁడు, వరరుచి అను వారిరువురలంకార గ్రంథములను రచించి యున్నా

కావ్యాదర్శవ్యాఖ్యానమగు హృదయంగమము తెలుపుచున్నది. (పూర్వేషాం కాశ్యపవరరుచి ప్రభృతీనామాచార్యాణాం లక్షణశాస్త్రాణి సంహృత్యపర్యాలోచ్య" 1-2) "పూర్వసూరిభిః కాశ్యపవరరుచి ప్రభృతిభిః" (II-7) కావ్యాదర్శమునకు శాఖ్యానాంతరమైన "శ్రుతానుపాలిని" కాశ్యప, బ్రహ్మదత్త, నందిస్వాములు ముగ్గురు దండికంటెఁ బ్రాచీనులని చెప్పుచున్నది. సింహళభాషలో వ్రాయబడిన "సియబస్లకర" (Siya-bas-lakara) అను అలంకారశాస్త్రమునందు మంగళాచరణ ప్రస్తావములో బ్రహ్మ శుక్ర బృహస్పతులకు నమస్కరించిన తరువాతఁ గాశ్యపుఁడు పేర్కొనఁబడెను. ఈకాశ్యపుఁడు పూర్వోక్తకాశ్యపుఁడేనా అని సందేహము. పూర్వోక్త గ్రంథములలో నొకటియు నిపుడెచ్చటనుఁ గానరాదు.

ఈ యలంకార గ్రంథములలోఁ బ్రాచీనతమమైన దెద్దియని యొకి ప్రశ్న పుట్టకమానదు. ఈశాస్త్రమున కగ్నిపురాణము మూలగ్రంథమని కొందరు నవీనులు సమర్థించియున్నారు. కావున నగ్నిపురాణ ప్రాచీనతనుగురించి మనమిపుడు చర్చింపవలసి యున్నది.

కావ్యప్రకాశాదర్శములో మహేశ్వరుడిట్లు వ్రాయుచున్నాడు. "సుకుమారాణాం, రాజకుమారాణాం స్వాదుకావ్య ప్రవృత్తిద్వారాగహనే శాస్త్రాన్తరే ప్రవర్తయితు మగ్నిపురాణా దుద్ధృత్య కావ్యారసాస్వాద కారణమలంకారశాస్త్రం కారికాభిస్సంక్షిప్య భరతమునిః ప్రణీతవాన్" అట్లనే విద్యాభూషణకృత సాహిత్యకౌముదీ వ్యాఖ్యానమైన కృష్ణానందినికూడ "కావ్యరసాస్వాద నాయ వహ్నిపురాణాది దృష్టాం సాహిత్య ప్రక్రియాంభరతః సంక్షిప్తాభిః కారికాభి నిర్బబన్ధ" అని చెప్పుచున్నది.

మన హిందూదేశమందగ్ని 'పురాణము పలుమారు పలుచోట్ల ముద్రితమై ప్రకటింపబడినది. దానిలో 336 అధ్యాయము మొదలుకొని 346 అధ్యాయమువరకుఁ గావ్యలక్షణము, అలంకారములు, రసము, వృత్తులు మొదలగునవి ప్రతిపాదింపబడినవి. 336 అధ్యాయములోఁ గావ్యములు, సంస్కృత కావ్యములనియుఁ, బ్రాకృత కావ్యములనియు రెండు తెగలనియు, నవి మరల గద్యపద్యోభయాత్మకములై మూఁడు విధములనియు, కథ, ఆఖ్యాయిక, మహాకావ్యము మొదలగువాని లక్షణములును చెప్పబడినవి. 337 అధ్యాయములో నాటకలక్షణము, 338 అధ్యాయములో రసము, స్థాయి భావములు, అను భావములు, వ్యభిచారి భావములు, ఆలంబన విభావము,

ఉద్దీపన విభావము, నాయికానాయక విశేషములు, 339-లో రీతులు, వృత్తు
340-లో నృత్యము. 341-లోఁ జతుర్విధాభినయము, 342-లో ననుప్రాసాది శ
లంకారములు, 343-లో నుపమా రూపకాద్యర్థాలంకారములు, 344-లో వి
శేషసమాసోక్తి పర్యాయోక్తులతోఁ గూడిన శబ్దార్థాలంకారములు, 345-లోఁ కా
గుణములు, 346-లో గావ్య దోషములును బ్రతిపాదింపబడినవి. ఈ 11 అధ్యా
ములలోనున్న శ్లోకసంఖ్య 363.

అగ్నిపురాణముయొక్కయు ముఖ్యముగా దానిలోనున్న సాహిత్య శా
ముయొక్కయు కాలమును నిర్ణయించుటకు అది అలంకార శాస్త్రమునకు మూల
మగునా కాదాయని విమర్శించుటకు దగిన సాక్ష్య మీదిగువను వ్రాయబడుచు

1. అగ్నిపురాణము కాండసప్తకముతోఁ గూడిన రామాయణమును,
వంశమును, పింగళనాగుని పాలకాప్యము, ధన్వంతరిని, శాలిహోత్రుని వక్కాణి
చున్నది. 360 అధ్యాయములో భగవద్గీతార్థమంతయు సంక్షేపముగాఁ జెప్పబడి
360 అధ్యాయము మొదలుకొని 366 అధ్యాయమువరకు నిఘంటుభాగము. ఇందు
నమరసింహుని నామలింగానుశాసన శ్లోకములే బహుళముగానున్నవి. (తటి
దామినీ విద్యుచ్చంచలాచపలా అపిఁ ధారాసంపాత ఆసారః శీకరోంబుకణస్స్మృ
వర్షోపలస్తు కరకా మేఘచ్ఛన్నేహ్ని దుర్దినమ్). గీతా శ్లోకములు. దైవీహ్యే
గుణమయీ మమ మాయా దురత్యయా మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తర
అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపప
ఇట్లుదాహరింపబడిన అమరశ్లోకములు గీతాశ్లోకములు అగ్నిపురాణమునుండి యె
తెచ్చుకొనబడినవని యూహించుట సాహసము. సంస్కృత వాఙ్మయముయొ
సకల శాఖలను సంగ్రహముగాఁ బ్రతిపాదింపదలంచిన యీపురాణము రచింప
కాలమునకే యీ అమరనిఘంటువు దేశమందంతటఁ బ్రచురముగా వ్యాపించియు
దని మనమూహించుకొనవలయును. అమరసింహుని కాలనిర్ణయమున నేను
విధములుగాఁ జేసియున్నారు. క్రీస్తు వెనుక పంచమశతాబ్దమని మెగ్డానలు పం
డును, ఆరవశతాబ్దములో నమరకోశము చైనాభాషలోనికిఁ బరివర్తింపబ
మోక్షమూలర్మహాశయుడును, క్రీస్తుశకము 625—940 సంవత్సరముల మధ్య
మున నా నిఘంటువు రచింపబడెనని హార్నల్విద్వాంసుడు, అది నాల్గవ శతా
రచింపబడెనని ఓక్పండితుడు నభిప్రాయపడుచున్నారు. అమరకోశ వివరణకా

నాల్గవ శతాబ్దమని మన మొప్పుకొన్నను అగ్నిపురాణము అమరకోశమునుండి శ్లోకములను తానెరవు తెచ్చుకొన్నయెడల నది క్రీస్తుశకము 6, 7 శతాబ్దములకంటె ముందుదై యుండదు. ఏలయన నమరకోశము నిఘంటువుగాఁ బ్రసిద్ధినిఁ గాంచుటకుఁ జాలకాలముపట్టును.

2. "భరతేన ప్రణీతత్వాద్భారతీ రీతిరుచ్యతే" అని భరతునిచేఁ గల్పింపబడినది గావున నారీతికి భారతీ రీతియని పేరు కలిగెనని అగ్నిపురాణము చెప్పుచున్నది. చతుర్ముఖుని యాజ్ఞచే నాలుగు వృత్తులనుఁ దాను ప్రకటించితిననియు, భరతులను పట్టి యావృత్తికి భారతీవృత్తియని పేరబ్బెననియు భరతుడు తన నాట్యశాస్త్రమందు వ్రాసియున్నాడు. "మయాకావ్యక్రియాహేతోః ప్రక్షిప్తాద్రుహిణాజ్ఞయా స్వనామధేయైర్భరతైః ప్రయుక్తా సా భారతీ నామభవేత్తువృత్తిః" (నాట్య శా. 20 అ. 23-25) భరతుని నాట్యశాస్త్ర మగ్నిపురాణముకంటెఁ బ్రాచీనమైనదని యిందువలన స్పష్టమగుచున్నది. "అన్యేపి దేశాఏభ్యో యేపురాణే సంప్రకీర్తితాః (నాట్య శా. 13-35) అని యుండుటచే నాట్యశాస్త్ర 'మగ్నిపురాణము పేరెత్తుకొనకపోయినను సామాన్యముగా నది పురాణముల నెరిఁగియుండును, నాట్యశాస్త్రములోని శ్లోకములనేకము లగ్నిపురాణములో నుదాహరింపబడియున్నవి. ఎట్లనగా;

(1) చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభిర్మిథః।
ఆముఖంతత్తు విజ్ఞేయంబుధైః ప్రస్తావనాపిసా॥
(338 అ. 12 శ్లో.)

(2) విశేషోఽవసరేవాచ్య స్సామాన్యంపూర్వముచ్యతే।
త్రివర్గసాధనంకావ్య మిత్యాహుఃకరణంచయత్॥
(338 అ. 7 శ్లో.)

(3) ఇతికర్తవ్యతాతస్య పూర్వరంగో యథావిధి।
నాందీముఖానిత్రింశ దంగానిపూర్వరంగకే॥
(339 అ. 8 శ్లో.)

(4) భవేన్మధ్యమసందర్భో నాతికుత్సితవిగ్రహః।
వృత్తహార్యంవృత్తగంధి నైతత్కిలోత్కటం।

ఆఖ్యాయికాకథాఖండ కథాపరికథాతథా।
కథానికేతిమన్యన్తే గద్యకావ్యంచపంచధా॥
(337 అ. 11-12)

(5) ఆరంభేషుభవేద్యత్ర వీరమేవానువర్తతే,
భయానకోనామరసస్తస్య నిర్వర్తకంభవమ్।
ఉద్వేజనఃక్షోభణశ్చ బీభత్సోస్యద్విధస్స్మృతః।
ఉద్వేజనస్స్యాత్పూత్యాద్యైః క్షోభణోరుధిరాదిభిః॥
(342 అ. 15-16.)

ఇట్లీ రెండు గ్రంథముల నొకచోటనుంచి వీని తారతమ్యమును విమర్శి... యెడల నగ్నిపురాణమే భరతుని నాట్యశాస్త్రమునుండి కొన్నిశ్లోకముల పె... తెచ్చుకొన్నదని స్పష్టముగాఁ జెప్పవచ్చును.

3. రూపకము, ఉత్ప్రేక్ష, విశేషోక్తి, విభావన, అపహ్నుతి, సహ... యా యలంకారముల లక్షణములనుఁ జెప్పు శ్లోకములు కావ్యాదర్శమందు ... పురాణమందు నొకటియే. ఎట్లనగా;

## రూపకము.

ఉపమైవతిరోభూత భేదారూపకమిష్యతే। (కావ్యా. II-66.)
ఉపమైవతిరోభూత భేదారూపకమిష్యతే॥ (అగ్ని. 344-2.)

## ఉత్ప్రేక్ష.

అన్యథైవస్థితావృత్తి శ్చేతనస్యేతరస్యవా।
అన్యథోత్ప్రేక్ష్యతేయత్ర తాముత్ప్రేక్షాం విదుర్యథా॥ (కావ్యా. II-...)
అన్యథోపస్థితావృత్తి శ్చేతనస్యేతరస్యచ,
అన్యథామన్యతేయత్ర తాముత్ప్రేక్షాం ప్రచక్షతే॥ (అగ్ని. 344-24.)

## విశేషోక్తి.

గుణజాతిక్రియాదీనాం యత్తువైకల్యదర్శనమ్,
విశేషదర్శనాయైవ సావిశేషోక్తిరిష్యతే॥ (కావ్యా. II-323.)

గుణజాతిక్రియాదీనాం యత్తువైకల్యదర్శనమ్।
విశేషదర్శనాయైవ సావిశేషోక్తిరిష్యతే॥ (అగ్ని. 344-26)

విభావన.

ప్రసిద్ధహేతువ్యావృత్త్యా యత్కించిత్కారణాంతరమ్।
యత్రస్వాభావికత్వంవా విభావ్యంసావిభావనా॥ (కావ్యా. II-199.)
ప్రసిద్ధహేతువ్యావృత్త్యా యత్కించిత్కారణాంతరమ్।
యత్రస్వాభావికత్వంవా విభావ్యంసావిభావనా (4 అగ్ని. 344-27)

అపహ్నుతి.

అపహ్నుతిరపహ్నుత్య కించిదన్యార్థదర్శనమ్॥ (కావ్యా. II-304.)
అపహ్నుతిరపహ్నుత్య కించిదన్యార్థదర్శనమ్॥ (అగ్ని. 345-18.)

ఇవియేగాక మఱికొన్ని యర్థశ్లోకములుకూడ నీరెండు గ్రంథములలో నొక్కటియే ఎట్లనగా:

పద్యంచతుష్పదీతచ్చవృత్తం జాతిరితిద్విధా॥ (అగ్ని. 337-21; కావ్యాద
సావిద్యానౌస్తితీర్షూణాం గంభీరంకావ్యసాగరమ్॥ [I-16.)
(అగ్ని. 337-22; కావ్యా. I-12.)
ఇతిహాసకథోద్భూత మితరద్వాసదాశ్రయమ్॥ (అగ్ని. 337-25;
కావ్యా. I-16.)
"లింపతీవతమోఽంగాని వర్షతీవాంజనంనభః॥ కావ్యా. II-226.)

"అద్యయామమగోవింద జాతాత్వయిగృహాగతే, కాలేనైషాభవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః" ఈ రెండు శ్లోకములుతప్ప తక్కిన ఉదాహరణ శ్లోకములను దండి యెచ్చటనుండి సంగ్రహించెనో కనుగొనుట దుర్లభము. దండి ఆరవ శతాబ్దములోనో లేక ఏడవశతాబ్దములోనో జీవించియుండును. ఆయంశమికముందు నిశ్చయింపఁబడును. కావున నగ్నిపురాణము కావ్యాదర్శమునుండి శ్లోకముల నెరువు తెచ్చుకొనుటయే సత్యమైనయెడల దాని కాలముకంటెఁ దరువాతిదిగాయె యుండవలెను.

4. రూపకము, ఆక్షేపము, అప్రస్తుతప్రశంస, పర్యాయోక్తి, సమాసోక్తి, యీయలంకారముల లక్షణ శ్లోకములు అగ్నిపురాణ భామహాలంకారములలో

నొక్కటియే. భామహుడు తన అలంకార గ్రంథమునందలి లక్షణ శ్లోక ఉదాహరణ శ్లోకములు తాను రచించినవియే యని స్పష్టముగాఁ జెప్పియున్నా ("స్వయంకృతైరేవ నిదర్శనైరియంమయా ప్రక్లృప్తా ఖలువాగలంకృతిః" II- "గిరామలంకారవిధి స్సవిస్తరస్స్వయం వినిశ్చిత్యధియా మయోదితః III-57) క్రిఁద కనపరచినట్లు భామహుని కాలము 6వ శతాబ్దమో 7-వ శతాబ్దమో యుండును. అగ్నిపురాణము ధ్వన్యాలోకమందు సవిస్తరముగాఁ బ్రతిపాదిం ధ్వనితోకూడఁ దనకుగల పరిచయమును వెల్లడిచేయుచున్నది. పర్యాయోక్తి హ్నుతి, సమాసోక్తి, అప్రస్తుతప్రశంస, ఆక్షేపము అను నీ యలంకారము నొకదానియందీధ్వని నిలీనమైయున్నదని చెప్పుచున్నది. (ఏషామేక తమస్యైవ ఖ్యాధ్వనిరిత్యతః। స ఆక్షేపోధ్వనిస్స్యాచ్చ ధ్వనినావ్యజ్యతేయతః (అగ్ని. 34 16), అగ్నిపురాణము ధ్వనినిగురించి ప్రసంగించినను ఆధ్వని సిద్ధాంతము నొప్పుకొ యని యిందువలనఁ దెలుచున్నది. అగ్నిపురాణమువలె నుద్భటుడు భామహుడు ధ్వనిసిద్ధాంతము నొప్పుకొనలేదని అలంకార సర్వస్వకారుడిట్లు చెప్పుచున్నా "ఇదంహితావద్భామహోద్భట ప్రభృతయశ్చిరంతనాలంకారకారాః ప్ర మానమర్థం వాచ్యోపస్కారకతయాలంకార పక్షనిక్షిప్తం మన్యన్తే తథ పర్యాయోక్తా ప్రస్తుతప్రశంసా సమాసోక్త్యాక్షేపవ్యాజస్తుత్యుపమేయోపమ యాదౌవస్తు మాత్రంగమ్యమానం వాచ్యోపస్కారకతయా "స్వసిద్ధయే పరా పరార్థే స్వసమర్పణం" ఇతి యథాయోగం ద్వివిధ యాభంగ్యా ప్రతిపా తైః" ధ్వనికారుడుకూడా నిట్లు చెప్పుచున్నాడు. "పర్యాయోక్తేపి యదిప న్యేన వ్యంగ్యత్వం తద్భవతునామ తస్యధ్వనావంతర్భావః" అగ్నిపురాణము ధ్వ లోకముకంటె నెంతో నవీనము కాదని యిందువలన మనమూహించుకొనవ ధ్వన్యాలోకము నవమశతాబ్ద ద్వితీయార్ధమందు రచింపబడినది. "అపారే క సంసారే కవిరేవ ప్రజాపతిః యథాస్మైరోచతేవిశ్వం తథేదంపరివర్తతే ( 339-10) "శృంగారీచేత్కవిః కావ్యే జాతంరసమయంజగత్ సచేత్కవిర్వీత నీరసంవ్యక్తమేవతత్ [అగ్ని. 339-11] అను నీరెండు శ్లోకములు ధ్వన్యా మందుఁగూడ నున్నవి. ఈశ్లోకములకు మొదట "తథాచేదముచ్యతే" అని అవతారిక యుండుటచే ధ్వన్యాలోకముకూడ గ్రంథాన్తరమునుండి యీ శ్లోక గ్రహించినదని మనమూహించుకొనవలయును. ఈశ్లోకముతరువాతఁ గొంత ముస్నది. ఈశాస్త్రార్థము "ధ్వనిరేవ ప్రాధాన్యేన కావ్యమితిస్థితమ్" అను ముచే సుగింపబడినది.

అగ్నిపురాణమేడవ శతాబ్దముకంటె నవీనమనియు, దానిలోనున్న సాహిత్య భాగము ప్రాయికముగా నవమశతాబ్దమందు రచింపబడెననియుఁ బైవాదమువలన స్థాపింపబడుచున్నది.

ప్రాచీనాలంకారికుడెవ్వడు నగ్నిపురాణములోనున్న సాహిత్యభాగములో నుండి శ్లోకములఁదీసి తన గ్రంథమందుదాహరించుటకాని దానిని మఱియేసందర్భ మందైనఁ బేర్కొనుటకాని చేయు లేదని స్పష్టమగుచున్నది. మమ్మటుడు విష్ణుపురాణపు శ్లోకములనుదాహరించెనుగాని అగ్నిపురాణము నెచ్చటను చెప్పలేదు. అగ్నిపురాణ మలంకార శాస్త్రమునకు మూలగ్రంథమని యొప్పుకొన్న మొదటి గ్రంథకర్త విశ్వ నాథుడు. ఇతడు పదునాల్గవ శతాబ్దమువాఁడు ఇతడు తాను రచించిన సాహిత్య దర్పణములో నగ్నిపురాణశ్లోకముల [337 అ. 3, 4, 7] నుదాహరించెను. ధర్మ శాస్త్ర గ్రంథములైన అపరార్కటీక, వల్లాలసేనుని అద్భుతసాగరము నగ్నిపురాణము ప్రమాణగ్రంథమని చెప్పుచున్నవి. ధ్వన్యాలోక కారుఁడు మొదలగు ప్రాచీన గ్రంథ కర్తలు భరతుని నాట్యశాస్త్రమును తమగ్రంథములయందగౌరవముతో నుదాహ రించియున్నారు. ఈదిగువను చెప్పబడినట్లు దండి భామహులు సైతము నాట్య శాస్త్రమును ప్రమాణముగా నొప్పుకొనియున్నారు. కావున, దండి భామహ ధ్వన్యాలోక కారులకంటె మిక్కిలి నవీనమైన యీఅగ్నిపురాణమలంకారశాస్త్రము నకు మూలగ్రంథము కానేరదు. నవీన గ్రంథకర్తలు అష్టాదశ పురాణ ప్రణేత యని ప్రసిద్ధిగాంచిన వ్యాస మహర్షియందుండు భక్త్యతిశయముచే నగ్నిపురాణ మలంకార శాస్త్రమున కాదిగ్రంథమని తలఁచుచున్నారు.

5. భరతుని నాట్యశాస్త్రము. అనేకోపపత్తులనుబట్టి భరతుని నాట్యశాస్త్ర మలంకార శాస్త్రములన్నిటికంటెఁ బ్రాచీనతరమని తలంపబడినది. మొదట నా గ్రంథములోనే రసచర్చ చేయబడినది. ఇంతియకాక, అలంకారశాస్త్రముతో సంబంధించిన యనేక విషయములందులోఁ బ్రతిపాదింపబడినవి.

ఈనాట్యశాస్త్రము కావ్యమాలలోఁ బ్రచురింపబడిన ప్రాచీనగ్రంథములలో నొకటి. కాని, యదిశుద్ధమైన ప్రతి కాదు. అందులోఁదప్పులు మెండుగానున్నవి. గ్రంథమంతయు ముప్పదియేడధ్యాయములు. శ్లోకసంఖ్య సుమారైదువేలు, ఇంచు మించుగా శ్లోకములన్నియు ననుష్టుభులే. 6, 7, 27 అధ్యాయములలో గొంత వచన భాగమున్నది. అచ్చటచ్చట నార్యావృత్తములు నితరవృత్తములుకూడనున్నవి. కొన్ని

స్థలములలో నీయార్యావృత్తములకు ముందు "అత్రి సూత్రానుబద్ధే ఆర్యే: (అధ్యా. VI. 61 పే.) అనిగాని, "అత్రానువంశ్యే ఆర్యేభవత:" అనిగాని మాటలున్నవి. (VI అ. పే, 65. 68-VII-పే. 75) సూత్రార్థానుసా రచింపబడిన యీ యార్యావృత్తశ్లోకములిచట జెప్పబడినవని మొదటివాక్య కర్థము. ఆసూత్రములను భరతముని రచించెనో లేక మఱెవ్వడు రచి మనము నిశ్చయింపజాలము. సూత్రశబ్దము నాట్యశాస్త్ర ప్రణేతయొక్క మా దెలుపుననియు నాయార్యలు గ్రంథకర్తృ ప్రణీతములనియు జెప్పుట కొంత వ్యము. సూత్రములవలె సంగ్రహముగా రచింపబడినవని యీవాక్యమున కర్థ మఱికొన్నిచోట్ల "అత్రానువంశ్యాశ్లోకా" (అ. VI-62) అనిగాని లేక " శ్లోక:" "అత్ర ఆర్యా" అను శబ్దములున్నవి. "అనువంశ్య" అనుదాని మేమో తెలియదు. వంశక్రమాగతమని శబ్దార్థము. గురువునుండి శిష్యునికి మూలముగా బ్రాప్తించినది. ఈశ్లోకములుపదేశ పరంపరా ప్రాప్తములని మాటల కర్థము.

భరత నాట్యశాస్త్ర విషయ సంగ్రహము.

1 అధ్యాయము. పంచమ వేదమైన యీనాట్యశాస్త్రము బ్రహ్మచే మునికుపదేశింపబడినది.

2 నాట్యమంటప నిర్మాణము.

3 నాట్యమంటపాధి దేవతలపూజ.

4 తాండవము.

5 పూర్వరంగము, నాందీ, ప్రస్తావన.

6 రసములు, వాని విభావములు, స్థాయి భావములు.

7 స్థాయి సాత్విక వ్యభిచారి భావములు.

8 చతుర్విధాభినయము.

9 హస్తవక్షస్స్థలాది చలనములు.

10-11 వివిధగమన స్థిత్యాదులు.

12 నీచపాత్రలు, వానిస్థానములు.

13 ప్రవృత్తి చతుష్టయము.

14-15 ఛందశ్శాస్త్రము.

16 కావ్యలక్షణము, గుణములు, దోషములు.

17 ప్రాకృత భాషలు.
18 దశరూపకములు.
19 పంచసంధులు.
20 భారత్యాది వృత్తులు.
21 నటులవేష భూషణాదులు.
22 స్త్రీపురుషుల హావభావములు, దశమన్మథావస్థలు, అష్టవిధ శృంగార నాయికలు.
23 నాయికా సంపాదనోపాయములు దూతీలక్షణము.
24 రాజాన్తఃపురపరిచారికలు, సూత్రధారుడు, విదూషకుడు.
25 అభినయ విషయమైన ఉపదేశములు.
26 జాతివయస్స్వాస్త్తులనుబట్టి నటులకభినేయ భాగవిభాగము.
27 నాటక ప్రయోగసామంజస్య సంపాదనోపాయములు.
28 సప్తస్వరములు.
29-34 గాత్రగానము, తంత్రిగానము.
35 నట లక్షణము.
36-37 నాటక లక్షణము భూమిపైకెట్లువచ్చినది.

పైనఁ జూపించిన నాట్యశాస్త్ర విషయ సంగ్రహమువలన నలంకారశాస్త్రమును గురించి ప్రతిపాదించు 6, 7, 16, 18, 20, 22 అధ్యాయములు ప్రధానములని తెలుసుకొనవలెను. నాట్యశాస్త్రప్రణేతయగు భరతముని పురాణస్థ పురుషుడు (Mythical person) అతడు స్వర్గమునకుఁగూడఁబోఁగల శక్తిఁగలవాఁడని యూహింపఁబడుచున్నాడు. భరతముని రచించిన గ్రంథమునుఁ జదువుటచేత నటులకు భరతులని పేరు కలిగెనా అదియొక జాతిమనుష్యులకు పేరా ? ఈయంశమును నిశ్చయించుటదుర్లభము. తత్త్వమేదియైనను యిప్పుడున్న నాట్యశాస్త్రము భరతుని చే రచింపబడినదికాదని నిశ్చయము. ఉపదేశపరంపరాప్రాప్తమైన యీనాట్య సిద్ధాంతమును మఱెవ్వడో నేర్చుకొని వ్రాసెను. "అనువంశ్యాశ్లోకాః" అను పదములాయంశమునే దృఢపర్చుచున్నవి. కోహలుడను వాడీనాట్యశాస్త్రసిద్ధాంతము నీలోకమందు వ్యాపింపఁజేసెనని నాట్యశాస్త్రము చెప్పుచున్నది. (37-18) కోహలుడు, వత్సుడు, శాండిల్యుడు, ధూర్తిలుడు, నాట్యశాస్త్రగ్రంథములను వ్రాసిరనియుఁ జెప్పుచున్నది. (37-24) ఎనిమిదవ శతాబ్దముయొక్క ఉత్తరభాగమందు.

జీవించిన దామోదరగుప్తుడు వ్రాసిన నీలమతమను గ్రంథమందు కోహళుడను:హర్షా కడు నాట్యశాస్త్రమును వ్రాసెనని చెప్పుచున్నది. ఈకోహళుడు తాళములను గురించి యొకగ్రంథమును వ్రాసెనని గ్రంథాంతరమువలనఁ దెలియవచ్చినది. ఆచార్య హేమచంద్రుడు కోళాహలుడనువాడు నాటకలక్షణమును వ్రాసెనని తనకావ్యాను శాసనమందు వ్రాసియున్నాడు. (325 పే. ఆది శబ్దాత్కోలాహలాది లక్షితా స్తోటకాదయోగ్రాహ్యాః) రాజశేఖరుని బాల రామాయణములో కోహళుడను నాట్యాచార్యుడొకడు రావణునితో నిట్లు చెప్పుచున్నాడు. "పరమేష్ఠినోమాన సభువః ప్రథమపుత్రస్య నాట్యయోనేర్భరతాచార్యస్య కృతిరభినవం సీతాస్వయం వరమితి నాటకం ప్రయోక్తవ్యమ్" (III అంకమునకుముందు) భరతుడు, శాండిల్యుడు, కోహళుడు, దత్తిలుడు నాట్యశాస్త్ర గ్రంథములను వ్రాసినవారని శింగ భూపాలుని రసార్ణవసుధాకరము, ప్రథమవిలాసము 50_52 శ్లోకములు చెప్పుచున్నవి. కుట్టనీమతము 122_123 శ్లోకములు కామశాస్త్రమును వ్రాసిన వాత్స్యాయనాదులతో దత్తకుని భరతవిశాఖిలులతో దంతిలునిఁ జెప్పుచున్నది. దంతిలధూర్తిలు లొకడేమోయని సంశయము. కోహళశాండిల్యవత్సధూర్తిలాదులకంటె మఱికొందరు గ్రంథకర్తలను "అన్యైస్త్వైస్తు" నాట్యశాస్త్రము సూచించుచున్నది.

## భరత నాట్యశాస్త్ర కాలనిర్ణయము.

నాట్యశాస్త్రకాలము ననేక లనేకవిధములుగా నిర్ణయించిరి. మెగ్డనల్పండితుడు క్రీస్తువెనుక నారవశతాబ్దమని నిశ్చయించెను. హరప్రసాదశాస్త్రి క్రీస్తుశమందు రెండవశతాబ్దమని సమర్థించెను. లెవీపండితుఁడు ప్రభుసంబోధనమందు వాడుకచేయబడు స్వామిత్యాది శబ్దముల ప్రామాణ్యమునుబట్టి హిందూసిథియన్ క్షత్రపుల కాలమందీగ్రంథము రచింపబడినదని రుజువుచేయుటకుఁ బ్రయత్నించెను. పాశుపతులు, శాక్యులు, నిగ్రంథులు, శబరులు, ఆభీరులు మొదలగు జాతులవారు, శౌరసేనీ, మాగధీ, అర్ధమాగధీ, ఆవంతీ, దాక్షిణాత్య మొదలగు ప్రాకృతభాషలు, అనేక దేశములపేర్లు, ఈనాట్యశాస్త్రమందు జెప్పబడినను యివియెవ్వియు దానికాలమును నిర్ణయించుట కుపయోగించునవికావు. వీనినన్నింటినిబట్టి విమర్శింపగా నీగ్రంథము క్రీస్తుశక ప్రారంభమునకంటెఁ బ్రాచీనతరము కాదని యూహింపవచ్చును.

నాట్యశాస్త్ర కాలనిర్ణయము విషయమై కొన్ని యుపపత్తు లీదిగువను బ్రతిపాదింపబడుచున్నవి.

1. దామోదరగుప్తుడు నాట్యశాస్త్రమును బ్రహ్మ చెప్పినాడని తాను వ్రాసిన కుట్టనీమతమను గ్రంథమందుపపాదించియున్నాడు. పదియవ శతాబ్దమునాటి దశరూపకమునందు "ఉద్ధృత్యోద్ధృత్యసారంయ మఖిలనిగమాన్నాట్యవేదం విరించిశ్చక్రే యస్య ప్రయోగం మునిరపి భరతస్తాండవం నీలకంఠః" (I-4) అని చెప్పుచున్నది. ఈభరతశాస్త్రము బ్రహ్మచే భరతుని కుపదేశింపబడినదని భరతశాస్త్రమే తెలుపుచున్నదను సంశయము యెనిమిదవ వత్సర శతికమునకే ప్రచురముగానున్నట్లు పూర్వోక్త వచనమువలనఁ దెలియవచ్చుచున్నది.

2. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమందిట్లు పలుచోట్ల వ్రాసెను. "యదివా వృత్తీనాం భరతప్రసిద్ధానాం కైశిక్యాదీనాం (కా-మా-ల-163 పే). యథా వేణీసంహారే విలాఖ్యస్యప్రతిముఖ సంధ్యంగస్య ప్రకృతరసనిబంధనా ననుగుణమపి భరతమతానుసరణమాత్రేచ్ఛయా ఘటనమ్ (పే. 150). అత ఏవచభరతేన ప్రఖ్యాతవస్తువిషయత్వం ప్రఖ్యాతోదాత్త నాయకత్వంచ నాటకస్యావశ్యకర్తవ్యతయోపన్యస్తమ్. (పే. 146). ఏతచ్చరసాదితాత్పర్యేణ కావ్యనిబంధనం భరతాదావపి సుప్రసిద్ధమేవ (పే. 181)" 20 అధ్యాయమందు కైశిక్యాదివృత్తులు. 19 అధ్యాయమందు ముఖసంధ్యంగమగు విలాసము. నాట్యశాస్త్రములోఁ బ్రతిపాదింపబడినవి. ఆనందవర్ధనుడు నవమశతకోత్తర భాగమందున్నవాడు వేణీసంహారమానందవర్ధనునికంటె ముందు రచింపబడినది. ఆనాటకకర్త భరతుని మూలప్రమాణముగా నెన్నుకొనెను. ఆనందవర్ధనునికంటె గొన్నిశతాబ్దములకుముందే నాట్యశాస్త్రము రసము, నాయకులు, వృత్తులు, నాటక సంధ్యంగములు మొదలగువాని లక్షణములనుఁ బ్రతిపాదించుచున్నది.

3. కావ్యప్రకాశకారుడు "విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" అను భరతసూత్రమును తనగ్రంథమందుదాహరించి దానికి భట్టలోల్లటుడు, శంకుకుడు, భట్టనాయకుఁడు అభినవగుప్తుఁడు చేసిన వ్యాఖ్యానములనుఁ గనుపరచెను. అభినవగుప్తుడు క్రీస్తువెనుక 990-1020 మధ్యను తన గ్రంథములను వ్రాసెను. రాజతరంగిణీ చతుర్థతరంగమందున్న 705 శ్లోకములోఁ జెప్పబడిన భువనాభ్యుదయమను కావ్యము రచించిన శంకుకవి యీశంకుకుడు నొక్కడే యని చెప్పవచ్చును. "కవిర్బుధమనస్సింధు శశాంకశ్శంకుకాభిధః। యముద్దిశ్యాకరోత్కావ్యం భువనాభ్యుదయాభిధమ్" ఈశంకుకుడు 840 సంవత్సరమునాడు. పూర్వోక్త

భరతసూత్రముసుగురించి శంకుకుడు వ్రాసిన కొన్ని శ్లోకములను, అందుపైని భట్టతౌత అనువాఁడు వ్రాసిన విమర్శను సోమేశ్వరుఁడు తనకావ్యప్రకాశికా వ్యాఖ్యానమందుదాహరించెను. లొల్లటుని సరియైన కాలము నిర్ణయింప శక్యముకాదు, శంకుకుఁడు, నాయకుఁడు, అభినవగుప్తుఁడు, కాలక్రమమున నొకరితరువాత నింకొకరు చెప్పఁబడియున్నారు గావున లొల్లటుఁడీ ముగ్గురికి ముందువాఁడని చెప్పుట అసంభావ్యముగా నుండదు. ఇతఁడు మీమాంసకుఁడైనను శబ్దములకొక అభిధావృత్తియే గాని లక్షణావ్యంజనావృత్తులు లేవని వాదించుపక్షమువారగు సాలంకారికులతో నతిసమీపము కలిసియున్నది. "సోయమిషోరివదీర్ఘదీర్ఘతరో వ్యాపారః" ఈమతము ప్రాభాకరులదని లోచనమందుఁ దెలుపఁబడినది. వ్యక్తివివేక కారుఁడీమతమును ఖండించెను. లొల్లటుఁడు "రసవివరణము"ను గ్రంథమును వ్రాసెననియు, "యమకానులోమతదితరచక్రాదిభిదాహిరసవిరోధిన్యః అభిధానామాత్రమేతద్భటికాదిప్రవాహోవా" అను లొల్లటుని శ్లోకము నొకదానినిఁ గావ్యప్రకాశ వ్యాఖ్యాతయగు సోమేశ్వరుఁడు తనగ్రంథమందు వ్రాసెననియు మాణిక్యచంద్రుని కావ్యప్రకాశ సంకేతమందు చెప్పబడినది. (క్రీ॥శ॥ 1159) ఈశ్లోకమున మిసాధుకృతరుద్రటాలంకార వ్యాఖ్యానములోఁగూడ నున్నది. కావున లొల్లటుఁడు శంకుకునికి ముందు ప్రభాకరునికిఁ దరువాతననగా 800-900 మధ్యనున్నవాడు. రసములను బ్రతిపాదించు నాట్యశాస్త్రముయొక్క షష్టాధ్యాయము యెనిమిదవ శతాబ్దమునకు ముందే వ్యాఖ్యాన విషయమైనదని పర్యవసానము.

4. యమకము శబ్దాలంకారమనియు నుపమ అర్థాలంకారమనియుఁ బ్రాచీనులైన భరతాది ఋషులు పరిగణించిరని అభినవగుప్తుఁడు చెప్పుచున్నాడు. "చిరన్తనైహిః భరతముని ప్రభృతి భిర్యమకోపమే శబ్దార్థాలంకారత్వేనేష్టే (లోచనము పే. 5) నాట్యశాస్త్రముయొక్క షోడశాధ్యాయమందుఁ జెప్పబడిన నాలుగలంకారములలో నీయమకోపమలు రెండు దండిభామహోద్భటులు ప్రాచీనులని లోచనము చెప్పలేదు. కావున లోచనోక్తి ప్రకారముగా నాట్యశాస్త్రము భామహాదులకంటెఁ జాల పురాతనము.

5. 700-740 నడుమనున్న భవభూతి-భరతముని తౌర్యత్రిక సూత్రకర్తయనియు, వాల్మీకి మహర్షికి సమకాలికుడనియు నుత్తర రామచరిత్రయొక్క చతుర్థాంకమందుఁ జెప్పియున్నాడు. తఁచస్వహ స్తలిఖితం మునిర్భగవాన్వ్యాస్థత్భగవతో భరతస్యమునే స్తౌర్యత్రికసూత్రకారస్య".

6. బాణుఁడు కాదంబరిలో భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమందు గూడ చంద్రాపీడుఁడు శిక్షింపఁబడెనని చెప్పియున్నాడు "భరతాదిప్రణీతేషు నృత్తశాస్త్రేషు" (కాదంబరి — పే. 75).

హర్షచరిత్రములో నొకని సంగీతమును వర్ణించుచు "భరతమార్గభజన గురు" అని విశేషించియున్నాడు. ఆ గ్రంథమందే నటులనుగురించి మాట్లాడుచు "శైలూషావర్తమండలీరేచకరాసరసరభసారబ్ధనర్తనారంభారభటీనటాః" నాట్యశాస్త్రములో రేచకము (24 అ. 10 శ్లో) ఆరభటి (20 అ. 54 శ్లో.) వివరింపబడినవి.

7. భరతముని దేవతల నాట్యాచార్యుడనియు, నాటకముయొక్క ప్రయోజనను అప్సరసులనుఁ బ్రకాశింపఁజేయుటయనియు. ఆ ఋషి రచించిన నాటకము నప్సరసలభినయించిరనియుఁ గాళిదాసకృత విక్రమోర్వశీయ నాటక ప్రథమాంకములో నొక శ్లోకమందుఁ జెప్పబడినది. "మునినా భరతేన యః ప్రయోగో భవతీష్వష్టరసాశ్రయః ప్రయుక్తః లలితాభినయం తమద్య భర్తా మరుతాం ద్రష్టుమనాస్సలోకపాలః" నిరూపకుడైన పండితుడెవ్వడును కాళిదాసు క్రీస్తుశకము 450 సంవత్సరమునకు దరిమిలావాడని చెప్పడు. నాట్యశాస్త్రమునుబట్టి కాళిదాసు భరతముని నెఱుగును. అతడొక దివ్య ఋషియని యాతడు భావించెను. కావున భరతుని గ్రంథము కాళిదాసునికంటె ననేక శతాబ్దములు ముందుపుట్టినదియై యుండవలెను.

8. భట్టి, భామహుడు దండి, ఉద్భటుడు మొదలగు ప్రాచీనాలంకారికు లందరు ముప్పది యలంకారములకంటె నెక్కుడుగాఁ జెప్పియున్నారు. భరతుడుపమ రూపకము, దీపకము, యమకమునను నీనాలుగలంకారములనే చెప్పెను ఛందోవిషయమై ప్రాకృతభాషలవిషయమై విపులముగాఁ బ్రతిపాదించిన భరతుడు తన కాలమునాటికి హెచ్చు అలంకారములున్నయెడ వానినిఁ జెప్పకమానునా? కావున భరతాచార్యుఁడీగ్రంథకర్తలందరికంటెఁ గొన్ని శతాబ్దములు ముందువాడని యిందువలన నిశ్చయముగాఁ జెప్పవచ్చును. నాట్యశాస్త్రము క్రీస్తువెనుక మూడవశతాబ్దముకంటె నిటీవలది కాదని పైనఁ జేయబడిన చర్చచే స్పష్టమగుచున్నది. కాని యిపుడున్న నాట్యశాస్త్రము దీని యుత్పత్తికాలము మొదలుకొని నేటివరకు నేమియుఁ జెడకుండ మనకు వచ్చినదని చెప్పలేము. ఇందచ్చటచ్చట కొన్ని ప్రక్షిప్తములుండవచ్చునని మన మొప్పుకొనవలెను, మూడవశతాబ్దముకంటె ప్రాచీనకాలమందుఁ గావ్యాలంకారములనుఁ

బ్రతిపాదించు మఱియొక గ్రంథము లేదు గావున నిప్పుడు మనకుఁ దెలిసినంతమట్టుకు నాట్యశాస్త్రమే సర్వాలంకార గ్రంథములకంటెఁ బ్రాచీనతమమైనదని తెలియవలెను.

ధనికుఁడు దశరూపక వ్యాఖ్యానములో భరతుని నాట్యశాస్త్రమునుండి యీ దిగువవ్రాసిన శ్లోకము నుదాహరించెను, "ఏతచ్చ ఇదం త్రిపురదాహే తు లక్షణం బ్రహ్మణోదితం। తత స్త్రిపురదాహశ్చ డిమసంజ్ఞః ప్రయోజితః" ఇతి భరతముని 'వాస్యయమేవ త్రిపురదాహేతివృత్తస్య తుల్యత్వం దర్శితమ్'. నాట్యశాస్త్రములో నీశ్లోకముయొక్క ఉత్తరార్ధమే కానవచ్చుచున్నది. (4-9) సరస్వతీ కంఠాభరణ వ్యాఖ్యాతము రజబంధమును గురించి చెప్పుచు దానిలో నుండవలసిన యక్షరము లివి యని భరతుడు చెప్పినాడని యొకశ్లోకమును జెప్పెను. "పాలాక్షరాణి మురజేలహ కారా తథదధాశ్చమో రేఫః। నణకఖగఘజాశ్చైత్థంభరశాదిక ధీతాని". కాని యీ విషయమై భరత నాట్యశాస్త్రమందేమియుఁ జెప్పబడియుండలేదు. అభినవగుప్తుఁడు నాట్యశాస్త్రమున కొక వ్యాఖ్యానమును వ్రాసెను. రాఘవభట్టుఁడు శాకుంతలముపై వ్రాసిన అర్థద్యోతనికయను వ్యాఖ్యానములో భరత నాట్యశాస్త్ర శ్లోకములు వానిపై నభినవగుప్తుడు వ్రాసిన వ్యాఖ్యానమును తరుచుగా నుదాహరించియున్నాడు. అభినవగుప్తుని నాట్యశాస్త్ర వ్యాఖ్యానమునకు అభినవ భారతియని పేరు. ఎట్లనగా; ఇదంపద్యమ్ — సూత్రధారః పఠేన్నాందీం (నాట్య. శా. 5_98) అభినవగుప్తాచార్యైర్భరతటీకాయాం అభినవభారత్యాం వ్యాఖ్యాతమ్. రాఘవభట్టు నాట్యశాస్త్రము—పదియారవ అధ్యాయమునుండి యొక వాక్యము నెత్తి "అభినవభారత్యాం భరతటీకాయామభినవగుప్తాచార్యైర్మహతా ప్రబంధేన భిన్నతయా స్థాపితాని". అభినవగుప్తుని నాట్యశాస్త్ర వ్యాఖ్యానము కొంతమట్టుకు దొరికినది. నాట్యశాస్త్ర వివృతి యని యందులో వ్రాయబడియున్నది. సోమేశ్వరుడు తాను వ్రాసిన కావ్యప్రకాశ వ్యాఖ్యానములో భరతుని నాట్యశాస్త్రములోనిదని చెప్పి ఓజో లక్షణమును దెల్పు నొక శ్లోకము నుదాహరించెను. దానికి మంగళుడనువాడు వ్రాసిన వ్యాఖ్యానము గూడ జూపించెను. "తత్రావగీతస్య హీనస్య వావస్తు నశ్శబ్దార్థసంపదా యదుదాత్తత్వం నిషించంతి కవయ స్తదోజ ఇతి భరతః। అవగీతస్య హీనస్య వావస్తునః శబ్దార్థయోరర్థ సమ్పదా పరముదాత్తత్వం నిషించంతి కవయ స్తహీతదనోజసాస్యదితి మంగళః। మాణిక్యచంద్రుని కావ్యప్రకాశ సంకేతముకూడ మంగళుని యభిప్రాయమునుఁ దెలుపుచున్నది. "దండ్యుక్తం సమాసదైర్ఘ్య మోజ ఇత్యపి।

రీతిత్రయే ప్రయోజన స్సాధారణత్వాద్గౌడీయానిర్దేశ శ్చోక్తిమానితి వామన మంగళా'' హేమచంద్రుఁడు మంగళకృత గ్రంథమునుండి ఆ వాక్యములనే తీసి తన గ్రంథమందుదాహరించెను. మంగళుఁడలంకారశాస్త్ర కర్తయని రాజశేఖరుడు కావ్యమీమాంసలో వ్రాసియున్నాడు. కాబట్టి మంగళుఁడు నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము వ్రాసెననుట అసంభావ్యముగాఁ గానరాదు. నాట్యశాస్త్రములో నెనిమిదవ అధ్యాయమందు 112 శ్లోకము. ‘‘బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు, సమూర్తవ్యోరసస్స్థాయీ శేషాస్సంచారిణోమతాః'' అను శ్లోకమున కనేకులనేకవిధములుగా వ్యాఖ్యానము చేసిరనియు, వారిలో భాగురియనువాడీ విషయమై ‘‘తథాచభాగురిరపికిం రసానామపిస్థాయి సంచారితాస్తీత్యాక్షిప్యాభ్యుపగమే నైవోత్తర మవోచద్బాఢమ స్తీతి'' అని చెప్పెననియు' లోచనము ప్రతిపాదించుచున్నది. భరతసూత్రములను భాగురివివరించెనని యిందువల్ల స్పష్టమగుచున్నది. భాగురి నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానమును వ్రాసెనో లేదో నిశ్చయింప శక్యము కాదు. అనేకులు గ్రంథకర్తలు కావ్యాలంకార లక్షణములను నిరూపించుచు భరతుని శ్లోకముల నుదాహరించి వానిని జర్చించెదరుగాని యెవ్వడు నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము చేసినవారుకారు. లొల్లట, శంకుక, భట్టనాయకాదులు నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము వ్రాసినవారుకారుగాని వారురచించిన గ్రంథములలో రస చర్చఁ జేయుచుఁ బూర్వోక్తకారికను వివరించిరి. 17-వ శతాబ్దముయొక్క ఆరంభమందున్న సుందరమిశ్రుఁడు తాను వ్రాసిన నాట్యప్రదీపములో భరతుని నాట్యశాస్త్రమునుండి తీసి నాందీలక్షణము నుదాహరించెను. ‘‘అస్యవ్యాఖ్యానే మాతృగుప్తాచార్యై షోడశాంఘ్రిపదాపీయముదాహృతా'' ఇందువలన మాతృగుప్తాచార్యునికిగూడ నాట్యశాస్త్రముతోఁ గొంత సంబంధమున్నదని యూహింపవచ్చును. రాఘవభట్టుడు అర్థద్యోతనికలో నారంభ బీజలక్షణములను నాట్యశాస్త్రమునుండి యుదాహరించుచు ‘‘అత్రవిశేషో మాతృగుప్తాచార్యైరుక్త। క్వచిత్కారణమాత్రంతుక్వచిచ్చ ఫలదర్శనమ్'' అని చెప్పియున్నాడు. సూత్రధారుడు, నాందీ, నాటక లక్షణము, భూషణము యవనిక మొదలైనవాని లక్షణములనుఁ జెప్పు ననేక శ్లోకములను మాతృగుప్తుని గ్రంథమునుండి రాఘవ భట్టుదాహరించియున్నాడు. మాతృగుప్తుని శ్లోకముల నితర వ్యాఖ్యాతలు గూడ తమ గ్రంథములయందు వ్రాసుకొని యున్నారు. కావున దీనినిఁబట్టి చూడగా నాట్యశాస్త్రమునకు మాతృగుప్తాచార్యుడొకరీతి వార్తికకారుడని మనమనుకొనవచ్చును. ‘‘ఉక్తానుక్తదురుక్తచింతా

కరంవార్తికమ్'' అని వార్తిక లక్షణము. ఈమాతృగుప్తుని వృత్తాంతము కల్హణ్య రాజతరంగిణీ తృతీయ తరంగమందు 129 శ్లోకము మొదలుకొని 139 శ్లోకముల నిట్లు చెప్పబడినది.

"శకవిర్మాతృగుప్తాఖ్య స్సర్వాస్థానసమాసదత్। నానాదిగంతరాఖ్యాత గుణవత్సులభంన్నృపమ్''॥

దిగంతవ్యాప్తకీర్తి, గుణవంతుడు, గుణవత్పక్షపాతి, సులభుడునగు హర్ష విక్రమాదిత్యుడుజ్జయినియందు రాజ్యపరిపాలనము జేయుచుండగా నొకనాడాస్థానమందు సభాసదులతోఁ గొలువున్న యాభూపాలుని యీమాతృగుప్తడను కవి చూడ బోయెను. రాజీతని గంభీరాకారమును ముఖవర్చస్సునుబట్టి యీతడు గొప్పవాడని యూహించెను. మాతృగుప్తుడు తన రాజసేవా కౌశలముచే రాజచిత్తానువర్తియై కష్టములోర్చి రాజు నాశ్రయించియుండెను.

"ఏవంస సేవమాన స్తముద్యోగేనబలీయసా। అనిర్విణ్ణోమాతృగుప్తః షడ్ఋతూ నత్యవాహయత్ - అథతంకృశసర్వాంగం ధూసరంజీర్ణవాససమ్॥ బహిర్జాన వినిర్యాతో రాజావీక్ష్యవ్యచింతయత్। వైదేశికో నిశ్శరణోగుణవానబాంధవో దార్ఢ్యంజిజ్ఞాసునాకష్టం సోయమాయాసితోమయా। కోऽస్యాశ్రయఃకిమశ్నన్ కాని ప్రావరణానివా। ఇత్యైశ్వర్యవిమూఢేన మయాహ న్తనచింతితమ్''

ఇట్లు మాతృగుప్తుడు హర్షవిక్రమాదిత్యుని పట్టుదలతో సేవించుచు విసుగునొందక యొక సంవత్సరము గడపెను. అంతట నొకనాడు రాజు వెలికి జను దెంచి జీర్ణవస్త్రుడు, మలినాంగుడు, కృశుడునైయున్న మాతృగుప్తునిజూచి, కడు చింతనొంది "అయ్యయో వీడు వైదేశికుడు, అశరణుడు, బంధుహీనుడు, గుణవంతుడు, వీనికేమి ఆశ్రయము, వీడేమి తిని కాలమును గడుపుచున్నాడు. ఐశ్వర్య మదమత్తుడనై, మూఢుడనైన నేనిట్టివాని దార్ఢ్యమునుఁ బరీక్షింపగోరి ఆయాసము నొందించుచున్నానని పశ్చాత్తప్తుడై వీనికిఁ జేయ నుచితమైన ఉపకారమెద్దియని ఆలోచించుచుండెను. ఇంతలో లోకభయంకరమైన హేమన్తఋతువు వచ్చెను. అట్టి చలికాలములో వాసంతికాదీపోజ్జ్వలమగు తన శయనగృహమందు నిద్రించిన రాజొకనాటి రాత్రినిశీథమందు మేల్కాంచి శీతానిలముచేఁ గంపించుచు నా పోవుటకు సిద్ధముగానున్న దీపములను బ్రజ్వలింపజేయుటకు తనభృత్యుల నన్వేషించుచు ద్వారప్రదేశమందు యామికులలో నెవడున్నాడని గట్టిగా నడిగెను.

"సుఖసుప్తేషు సర్వేషు బాహ్యకక్ష్యాన్తరాత్తతః।
రాజన్నయమహం మాతృగుప్త ఇత్యుత్థితోఽవ్యచః।
ప్రవిశేతిస్వయంరాజ్ఞా దత్తానుజ్ఞస్తతో గృహమ్।
లక్ష్మీసాన్నిధ్యరమ్యాంత దదృష్టోన్యైర్వివేశసః।
దీపానుజ్జ్వలయేత్యుక్తో నిష్పాద్యచతురైఃపదైః।
బహిర్యియాసురూచేఽథ క్షణంతిష్ఠేతి భూభుజా।
సభయద్విగుణీభూత శీతకంపః ప్రభోఃపురః।
కింస్విద్వక్తీతివిమృశన్నాతి దూరేఽభ్యుపావిశత్॥"

రాజు నిద్రించినగదికీవల భృత్యులందరు నిద్రించియుండగా నపుడు మాతృగుప్తుడు నేనున్నానని పలికెను. అదివిని రాజు "లోనికివచ్చి నీవు దీపములను బ్రజ్వలింప జేయుమని ఆజ్ఞాపింపగా మాతృగుప్తుడు దీపములను బాగుచేసి పైకిబోవుచుండెను" ఇంతలో రాజు "క్షణమాత్రమిచట నిలువుమనెను". మాతృగుప్తుడపుడు చలిచేతను మిక్కిలి వడకుచు రాజు యేమి చెప్పునోయని సంశయించుచు నిలువబడెను.

"అథపప్రచ్ఛభూపాలః కియత్యస్తినిశేతితమ్।
సోఽభ్యధాద్దేవయామిన్యాయామస్సార్ధోఽవశిష్యతే।
తతో భూభృదువాచైవం కథంసమ్యఙ్నిశాక్షణః।
త్వయావధారితో నిద్రా కథంనాభూచ్చ తేనిశి॥"

ఇంక నెంతరాత్రియున్నదని రాజడిగెను. దేవా సార్ధయామ మవశిష్టముగా నున్నదని మాతృగుప్తుడు బదులు చెప్పగా నీవింత సరిగా కాలము నెట్లు నిశ్చయించి చెప్పగలిగితివి. నీవేల నిద్రింపలేదని రాజు పలికెను. అందుపైని మాతృగుప్తుడు క్షణములో నొకశ్లోకమును రచించి చదివెను.

"శీతేనోద్ధూషితస్య మాషశిమివచ్చింతార్ణవే మజ్జతః శాంతాగ్నింస్ఫుటితాధరస్య ధమతః క్షుత్క్షామకంఠస్య మే। నిద్రాక్వాప్యవమానితేవదయితా సంత్యజ్య దూరంగతా సత్పాత్రప్రతిపాదితేవ వసుధా నక్షీయతేశర్వరీ॥" శీతబాధచే మినప కాయవలె పులకితమైన శరీరముగలవాడనై చింతా సముద్రమందు మునిగి ఆరిపోవుచున్న అగ్నిని పగిలిన పెదవులతో నూదుచు నాకలిచే నెండిన కంఠముతోనున్న నా నిద్ర అవమానింపబడిన ప్రియురాలివలె నన్ను విడిచి యెచటికో దూరముగా

బోయెను. పత్పాత్రమందు దానముచేయబడిన భూమివలె రాత్రి అక్షయమగు చున్నది. ఈశ్లోకము విని విక్రమాదిత్యుడత్యానందమునొంది యాక్షణమందే కాశ్మీర దేశమునకు దూతలనంపి యీ మాతృగుప్తుని యాదేశమున కధిపతి గావించెను. ఈ మాతృగుప్తుఁడే ఆమాతృగుప్తుఁడని చెప్పలేము. ఇది మిక్కిలి సంశయాస్పదమైన విషయము.

## 4. మేధావి.

ఇతఁడొక యలంకారశాస్త్రమును వ్రాసినవాఁడని భామహుఁడితని పేరు తన గ్రంథమందు రెండుమార్లు చెప్పియున్నాఁడు. ఇతఁడుపమాదోషము లేడని చెప్పెనని భామహుఁడు వ్రాసియున్నాఁడు. "తఏతఉపమాదోషా స్సప్తమేధావి నోదితాః" (II : 40) మఱియొకచోట "యథాసంఖ్యమథోత్ప్రేక్షా మలంకార ద్వయంవిదుః। సంఖ్యానమితి మేధావి నోత్ప్రేక్షాభిహితాక్వచిత్" మేధావి కొన్ని చోట్ల నుత్ప్రేక్షకు సంఖ్యానమని పేరు పెట్టెను. ఉత్ప్రేక్షకు సంఖ్యానమను పేరలంకార శాస్త్రమందు మృగ్యము. సంఖ్యానమనగా యథాసంఖ్యమని యితర గ్రంథ కర్తలు వ్యవహరించినట్లు దండి చెప్పుచున్నాఁడు. "యథాసంఖ్యమితిప్రోక్తం సంఖ్యానం క్రమఇత్యపి" (కావ్యా. II : 273) కావున భామహుని పాఠము తప్పు. "మేధావీ—నోత్ప్రేక్షా" అని పాఠమున్నయెడల దండివాక్యములో నిది సంపదించును. మేధావి యథాసంఖ్యమును సంఖ్యానమని చెప్పెను. ఉత్ప్రేక్ష నొక యలంకారమునుగాఁ జెప్పలేదని యర్థముఁజెప్పుట బాగుగానుండును. రుద్రటాలంకార వ్యాఖ్యాతయగు నమిసాధు "నను దండిమేధావి రుద్రభామహాదికృతాని సంత్యేవాలంకారశాస్త్రాణి" అని వ్రాసియున్నాఁడు. ఇప్పుడు మీమాంస్యమైన యంశము మఱియొకటి. మేధావిరుద్ర అనునది యొకపేరా? లేక మేధావి, రుద్ర అని రెండుపేర్లా? రుద్రుఁడనువాఁడు వ్రాసిన అలంకారశాస్త్రము నే గ్రంథ కర్తయు నెచ్చటను చెప్పియుండలేదు. రుద్రభట్టుఁడు వ్రాసిన శృంగారతిలకము దాని విషయమునుబట్టి చూడగా నలంకారశాస్త్రమని చెప్పఁబడదు. కావున మేధావి రుద్రుఁడనునది యొకపేరే అయియుండనోపు. ధర్మకీర్తి, భర్తృహరి అనువారు తఱచుగా కీర్తి, హరియని వ్యవహరింపఁబడుచున్నారు. కనుక మేధావిరుద్రు మేధావియని చెప్పినయెడల నొక యాశ్చర్యముగాదు. శార్ఙ్గధరపద్ధతిలో కవిరుద్రుఁడు, మాలవరుద్రుఁడు రచించిన శ్లోకము లుదాహరింపఁబడినవి అనేకమంది

రుద్రులు కలరని యిందువలన మనము తెలిసికొనవలెను. రుద్రటాలంకారవ్యాఖ్యానములో నమిసాధువు ఉపమాదోషముల నేడింటినిగురించి చెప్పుచు వానినిగురించి వ్రాసిన వాక్యము నిట్లు తనగ్రంథమందుదాహరించెను. "అత్రిచస్వరూపోప పాద నేనత్యపిచత్వార ఇతిగ్రహణాద్యన్మేధావి ప్రభృతిభిః క్తం—యథాలింగవచనభేదా— హీనతాధిక్యమసంభవో విపర్యయోఽసాదృశ్యమితి సప్తోపమాదోషాః, తదేతన్నిరస్తమ్" (రుద్రట. II : 2, మేధావిరుద్ర ప్రభృతులు శబ్దము నాలుగువిధములని చెప్పినారని నమిసాధువు చెప్పుచున్నాఁడు. "ఏతఏవచత్వార శ్శబ్దవిధా ఇతియేషాం సమ్యజ్ఞతంత్రేషు నామాదిషుమధ్యే మేధావిరుద్ర ప్రభృతిభిః కర్మప్రవచనీయా నోక్తాథ నేగుః" మేధావిరుద్ర కాళిదాసశబ్దములు పర్యాయపదములని త్రికాండ శేషమువలనఁ దెలియుచున్నది. మేధావిరుద్రుఁడు జాత్యంధుఁడైన కవియనియుఁ, గాళిదాసలంకారశాస్త్రకర్తయని చెప్పినాడనియు కావ్యమీమాంస చెప్పుచున్నది. మేధావివ్రాసిన గ్రంథమింతవరకు లభింపలేదు.

## 5. ధర్మకీర్తి.

సుబంధుని వాసవదత్తలో "బౌద్ధసంగతి మివాలంకారభూషితామ్" అను వాక్యము నాధారముగాఁ జేసికొని కొందరు పాశ్చాత్యపండితులు ధర్మకీర్తి యను నొక బౌద్ధవిద్వాంసు డలంకారశాస్త్రమును వ్రాసిన ప్రాచీనులలో నొకఁడని నిశ్చయించిరి. కాని శ్రీరంగములో వాణీవిలాస ముద్రాక్షరశాలలో ముద్రితమైన వాసవదత్తయందున్న "సత్కవికావ్యరచనామివాలంకార ప్రసాధితామ్" అను పాఠము పూర్వోక్త పండితుల వాదమునకు భంగ మాపాదించుచున్నది. ధర్మకీర్తి అలంకారశాస్త్రమును వ్రాసెనని సమర్థించుట కీవాక్యము తప్ప వారికి మఱియే యాధారమును లేదు. అశ్వఘోషుడొక యలంకారసూత్రమును వ్రాసినట్లు చీనా భాషానువాదమునుబట్టి తెలియవచ్చినది. శార్ఙ్గధరపద్ధతి, సుభాషితావళి మొదలగు వానిలో నుదాహరింపఁబడిన శ్లోకములవలన నీధర్మకీర్తి యొక కవియనియు, నతని పేరు భదంతధర్మకీర్తి యనియు స్పష్టమైనది. ధ్వన్యాలోకమందుదాహృతమైన "లావణ్యద్రవిణవ్యయోనగణితః క్లేశోమహాన్వార్జితః స్వచ్ఛందంచరతో జనస్య హృదయే చింతాజ్వరోనిర్మితః, ఏషాపిస్వయమేవతుల్య రమణాభావాద్వరాకీహతా కోఽర్థ శ్చేతసి వేధసావినిహిత స్తన్వ్యాస్తనుంతన్వతా" అను శ్లోకమునుఁ గొందరు వ్యాజస్తుతియని పలికిరి గాని నిజముగా నిది అప్రస్తుతప్రశంస కుదాహరణమనియు "తథా-

చాయ-ధర్మకీర్తే శ్లోక ఇతిప్రసిద్ధిః" అనియు ధ్వన్యాలోక కారుడు చెప్పుచున్నాఁడు. (217-వ పుట ధ్వని) ఔచిత్యవిచారచర్చ, సుభాషితావళి — యీశ్లోకము ధర్మకీర్తి కృతమని చెప్పుటలో ధ్వన్యాలోకముతో నేకీభవించుచున్నవి. దిఙ్నాగాచార్యు ప్రమాణసముచ్చయమునకు వ్యాఖ్యానము వ్రాసిన యీ ధర్మకీర్తి కవియై యుండ వచ్చునుగాని అలంకారశాస్త్రమును వ్రాసెనని రుజువుచేయుటకుఁ దగిన ప్రమాణ మెద్దియు లేదు.

## 6. భట్టి.

ఇతఁడు సంస్కృతవ్యాకరణసూత్రముల కుదాహరణముగా రామాయణకథా బోధకమగు నొక కావ్యమును రచించెను. ఇది యిరువదిరెండుసర్గల కావ్యము. ఇ ప్రథమసర్గ మొదలుకొని పంచమసర్గవరకుఁ బ్రకీర్ణకాండమనియు, నారవసర్గ మొదలు కొని తొమ్మిదవసర్గవరకు నధికారకాండమనియు, దశమసర్గ మొదలుకొని త్రయోదశ సర్గవరకుఁ బ్రసన్నకాండమనియుఁ, బదునాల్గవసర్గ మొదలుకొని యిరువదిరెండవ స వరకు తిఙన్తకాండమనియు నాలుగు భాగములుగా విభజింపఁబడియున్నది. వీనిలో బ్రసన్నకాండమందుఁ గావ్యాలంకారములను జెప్పియున్నాఁడు. పదియవసర్గలో ముప్పదితొమ్మిది అర్థాలంకారములకు శబ్దాలంకారములైన యమకానుప్రాసముల నుదాహరణ శ్లోకములను రచించెను. పదునొకఁడవసర్గలో నలువదియేడు శ్లోకములచే మాధుర్యగుణమునుఁ బ్రతిపాదించెను. దండిభామహులు ప్రబంధవిషయమని పే పెట్టిన భావికాలంకారమునుఁ బండ్రెండవసర్గలో నెనుబదేడు శ్లోకములచేతను, పద మూఁడవసర్గలో సేతునిర్మాణమును సమసంస్కృత ప్రాకృతములగు నేబది శ్లోకము చేతను వర్ణించెను. భట్టి యీనాలుగుసర్గలను రచించుటచేత నలంకార వాఙ్మయ చరిత్రమందలి శ్లాఘాపాత్రుఁడాయెను. దండిభామహులు తమగ్రంథములయందు నిరూపించిన అలంకారములకే భట్టి యుదాహరణ శ్లోకములను వ్రాసెను. కొన్ని విషయములయందు భామహునికంటె భట్టి భేదించినను భామహుఁడు చెప్పిన అలంకా క్రమమునే తరుచుగా ననుసరించును. ఎట్లనగా; భామహుఁడు మొదట రూపకము జెప్పి పిదప నర్థాంతరన్యాసముకంటె ముందు దీపకాక్షేపములనుఁ జెప్పెను. భట్టి రూపకముకంటె ముందు అర్థాంతరన్యాసమును నిరూపించి యుదాహరించెను. భామ హుఁడు విరోధాలంకారము తరువాత తుల్యయోగితనుఁ జెప్పెను. భట్టి రూపకమునకుఁ దరువాత విరోధాలంకారమునకుఁ ముందు తుల్యయో

నుపపాదించెను. భామహుఁడు చెప్పిన అప్రస్తుతప్రశంసను భట్టి చెప్పలేదు. భట్టి హేతువార్తలకుదాహరణములను జూపించెనుగాని భామహుఁడు వానికలంకారత్వమే లేదని నిషేధించెను. భామహుఁడు, దండి చెప్పని నిపుణాలంకారమున కుదాహరణ మిచ్చెను. అలంకారశ్రేష్ఠములని దండి చెప్పిన లేశసూక్ష్మహేత్వలంకారములను భామహుఁడు పేర్కొనలేదు సరేకదా. యీమూడింటికి నలంకారత్వమే లేదనెను. దండి కావ్యాదర్శమందు యమకమును విపులముగాఁ బ్రతిపాదించినట్లు భట్టికూడ నిరువది శ్లోకములచే యమకమునుఁ బ్రతిపాదించెను. భామహుఁడీవిషయము నతి సంగ్రహముగాఁ జెప్పెను. భట్టి, భామహునిగాని, దండినిగాని యనుసరింపక వీరుభయులకంటెఁ బ్రాచీనమైన మఱియొక గ్రంథము ననుసరించి యీ యలంకార ముల నుదాహరించెనని యిందువలన స్పష్టమగుచున్నది.

భట్టి కాలనిర్ణయమునుగురించి త్రివేదీపండితుఁడు వ్రాసిన భట్టి కావ్యము యొక్క యుపోద్ఘాతమును జూడుఁడు. ధరసేనునిచేఁ బరిపాలింపఁబడు వలభీనగర మందీకావ్యమును రచించితినని కావ్యాంతిమశ్లోకమందు భట్టియే చెప్పుచున్నాఁడు. "కావ్యమిదంవిహితం మయావలభ్యాం శ్రీధరసేన నరేంద్రపాలితాయాం" వలభినిఁ బాలించిన ధరసేనులు నలుగురు. మొదటిధరసేనుడెప్పుడు రాజ్యపాలన మారంభించెనో తెలియదు. రెండవధరసేనుని ప్రాచీనశాసనము వలభీశకము 252-వ సంవత్ అనగా క్రీస్తుశకము 571. నాల్గవధరసేనుని కడపటిశాసనము 651 క్రీస్తుశకము, మొదటి ధరసేనుడు క్రీ. శ. 502-వ సంవత్సరమునకు కొన్ని సంవత్సరములకుముందు రాజ్యము నకు వచ్చియుండవలెను. మొదటిధరసేనుని తరువాత రాజ్యమునకువచ్చిన ద్రోణ సింహుని కాలమిది. కావున భట్టి క్రీ. శ. 500—650 సంవత్సరముల మధ్యవాఁడై యుండవలెను.

వ్రాతప్రతులయందు భట్టి పేరు భర్తృస్వామియనియు, భట్టిస్వామియనియు, నతని తండ్రి పేరు శ్రీస్వామియనియు గనవచ్చుచున్నది. నాల్గవధరసేనుని పుత్రుడైన మూడవధ్రువసేనునిశాసనమునుబట్టి కొందరుపండితులు భట్టి కావ్యప్రణేతఁబప్పడను వాని కుమారుడగు భట్టిభటుడని చెప్పుచున్నారు. హుల్ట్జ పండితుడు (Hultzsch) ఇది యొప్పుకొనలేదు. బి. సి. మజ్ముందార్ (B. C. Mazumdar) పండితుఁడు శాసనములోనున్న శ్లోకములకు భట్టికావ్యములోని శరదృతువర్ణన శ్లోకములకుగల సాదృశ్యమునుబట్టి క్రీ. శ. 473-వ సంవత్సరములోఁ బుట్టిన మందసూరపుర

(Mandasur) నార్యదేవతాలయ కుడ్యస్థశాసనమును విమర్శించి భట్టికావ్యము రచించిన గ్రంథకర్త వత్సభట్టియని చెప్పెను. దీనినిబట్టి చూడగా భట్టి మెుద ధరసేనుని కాలమందున్నవాడని తేలుచున్నది. ఎ. బి. కీత్ (A. B. Keith) మజుందార్ పండితుఁడు చెప్పినమాట నొప్పుకొనలేదు. కాని వీరుభయులు భట్టి దండిభామహులకంటె ముందువాడనియు, భట్టి కావ్యము వాక్పదీయకర్తయగు భర్తృ హరి వ్రాసినది కాదనియుఁ జెప్పుటలో నేకీభవించిరి. ఈ భట్టి కావ్యమునకనే వ్యాఖ్యానములు కలవు.

## 7. భామహుని కావ్యాలంకారము.

అలంకారగ్రంథములలో నచ్చటచ్చట నుదాహరింపఁబడిన కొన్ని శ్లోకములను బట్టి భామహుఁడు కావ్యాలంకారమును వ్రాసియున్నాఁడని మనకుఁ దెలియవచ్చె గాని పూర్ణముగా నీగ్రంథము చాలకాలమువరకు మనకు దృగ్గోచరము కాలేదు. ఇట్లుండగాఁ ద్రివేదీపండితుఁడీగ్రంథమెటులనో సంపాదించి కొంతకాలముక్రిందట బ్రతాపరుద్రీయమున కనుబంధముగా ముద్రింపించి ప్రకటించెను. ఇది యా పరిచ్ఛేదముల గ్రంథము. ఇందలి శ్లోకసంఖ్య సుమారు నాలుగువందలు అనుష్టుప్ శ్లోకములు. పరిచ్ఛేదాంతములయందు భిన్నవృత్తములు గలవు. "షష్ట్యాశరీరం ని తం శతషష్ట్యాత్వలంకృతిః। పంచాశతా దోష దృష్టిస్సప్తత్యా న్యాయ నిర్ణయః షష్ట్యాశబ్దస్య శుద్ధిస్స్యాదిత్యేవం వస్తుపంచకం। ఉక్తం షడ్భిః పరిచ్ఛేదైర్భామహే మేణవః॥" ప్రథమపరిచ్ఛేదమందిష్టదేవతకు నమస్కరించిన పిమ్మట కావ్యప్రయో నములు, కవిలక్షణము, కావ్యస్వరూపము, గద్యపద్యరూపముగాఁ గావ్యవిభాగము, సంస్కృత ప్రాకృతాపభ్రంశ కావ్యవిభాగము, ప్రతిపాదింపఁబడినది. వృత్తదేవా చరితశంసి, ఉత్పాద్యవస్తు, కలాశ్రయ, శాస్త్రాశ్రయములనియు, సర్గబంధము, అభి నేయార్థము, ఆఖ్యాయిక, కథ అని బద్ధమునని కావ్యమైదువిధములుగా విభజించెను. తరువాత సర్గబంధమనగా నేమో వివరించెను. ఇతరులు దానినిగురించి సవిస్తరముగ వ్రాసియున్నందున నభినేయార్థమును (నాటకమును) వివరింపలేదు. కథాఖ్యాయి లకు గల భేదమునుఁ జూపెను. పిమ్మట గౌడీవైదర్భీరీతులకుఁగల భేదమర్థవ్యా వక్కాణించెను. తరువాత నేయార్థము క్లిష్టము మొదలగు కొన్నిదోషములను నిరూ పించెను. ద్వితీయపరిచ్ఛేదమందు ఓజోమాధుర్య ప్రసాదగుణములనుఁ జెప్పి యలంకా నిరూపణ మారంభించెను. మూఁడవపరిచ్ఛేదముతో నలంకారములను ముగించెను.

అతఁడు చెప్పిన శబ్దాలంకారములు—గ్రామ్యానుప్రాసము, లాటీయానుప్రాసము నని ద్వివిధమైన అనుప్రాసము-అయిదు విధములైన యమకము-అర్థాలంకారములు రూపకము, దీపకము, ఉపమాదోషసప్తకము, ప్రతివస్తూపమ, ఆక్షేపము, అర్థాంతరన్యాసము, వ్యతిరేకము, విభావన, సమాసోక్తి, అతిశయోక్తి, యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, ప్రేయస్, రసవత్, ఊర్జస్వి, పర్యాయోక్తి, సమాహిత, ఉదాత్తము, శ్లిష్టము, అపహ్నుతి, విశేషోక్తి, విరోధము, తుల్యయోగిత, అప్రస్తుతప్రశంస, వ్యాజస్తుతి, నిదర్శనము, ఉపమారూపకము, ఉపమేయోపమ, సహోక్తి, పరివృత్తి, సందేహము, అనన్వయము, ఉత్ప్రేక్షావయవము, సంసృష్టి, భావికము, ఆశీః అనునవి, హేతుసూక్ష్మలేశ వార్తాలంకారముల కలంకారత్వము లేదని భామహుఁడు ఖండించెను. ఇతనికంటె పూర్వపు గ్రంథకర్త యొకఁడు దీని కలంకారత్వమునుఁ జెప్పియుండెను. చతుర్థపరిచ్ఛేదమందు పదునొకండు కావ్యదోషములను జెప్పివానిలోఁ బదింటికి లక్షణమును జెప్పి యుదాహరించెను. అయిదవ పరిచ్ఛేదమందు దుష్టప్రతిజ్ఞాహేతు దృష్టాంతములవలనఁ గలిగిన పదునొకండవ దోషమును నిరూపించుటలో న్యాయవైశేషికశాస్త్రోక్తప్రమాణసంఖ్యను, ప్రతిజ్ఞాతద్విశేషములను, హేతువును దాని విశేషములను, దృష్టాంతమును దాని విశేషములను సవిస్తరముగాఁ బ్రతిపాదించెను. ఆరవ పరిచ్ఛేదమందుఁ గవులకుపయోగించునట్లు వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తిలోఁ బంచమాధికరణమందుఁ జెప్పినట్లారవ పరిచ్ఛేదమందుఁ వ్యాకరణాంశములఁ గొన్నిటిఁ జెప్పెను.

కావ్యాలంకార నిరూపకులలో భామహుఁడు మిగులఁ బ్రాచీనుఁడు. మనకతని వృత్తాంతమేమియుఁ దెలియదు. గ్రంథాంతశ్లోకమందుఁ దాను రక్రిలగోమిక అనువాని పుత్త్రుఁడనని చెప్పియున్నాఁడు. "అవలోక్యమతాని సత్కవీనామవగమ్య స్వధియాచకావ్యలక్ష్మ। సుజనావగమాయభామహేన గ్రథితం రక్రిలగోమిసూనునేదం॥" దీనిలోనున్న రక్రిలగోమిన్ అను శబ్దమునుబట్టి భామహుఁడు బౌద్ధుడని కొందరు వాదింపఁదొడఁగిరి. ఈరక్రిలశబ్దము రాహులపోతలాది శబ్దములను పోలియుండుటచేతను, గోమిక అనునది బుద్ధశిష్యులలో నొకని పేరగుటచేతను భామహుఁడు బౌద్ధుడని M. T. Narasimha Ayyangar 1905-వ సంవత్సరము *Royal Asiatic Journal* లో సమర్థించి వ్రాసెను. కాని Prof, Pathak పండితుడు గోమికశబ్దము గోస్వామి శబ్దవికృతి కాదనియు, నది పూజ్యవాచకమనియు చాంద్రవ్యాకరణమందున్న "గోమిక పూజ్యే గోమాసన్యః" (IV: ?.144)

అను సూత్రమునుబట్టి రక్రిలుడు బౌద్ధుడనియు వ్రాసెను. వేయి సంవత్సరము కాలము బౌద్ధులు, బ్రాహ్మణులు కలిసియుండినవారగుటచే బ్రాహ్మణనామము బౌద్ధులు, బౌద్ధనామములను బ్రాహ్మణులు పెట్టుకొనిరనుట కాశ్చర్యము లే బుద్ధుడు విష్ణువుయొక్క అవతారమని బ్రాహ్మణులుకూడ నొప్పుకొనియున్నా అట్లనే మహమ్మదీయుల పేర్లను, హిందువులు హిందువుల పేర్లను, మహమ్మదీయు పెట్టుకొనిరి. గ్రంథకర్తయొక్క మతము వాని గ్రంథలవలనఁ దెలిసికొనవలెనుగా వాని నామధేయమునుబట్టి కాదు. ఈభామహుని గ్రంథమందెచ్చటను బౌద్ధ గాథలుగాని, బుద్ధుని ప్రసంగముగాని, బౌద్ధమత సంప్రదాయముగాని వక్కాణిం బడలేదు. గ్రంథాదియందున్న మంగళశ్లోకము "సార్వసర్వజ్ఞ" అని ఆరంభమైన సర్వజ్ఞశబ్దము శివునియందు బుద్ధునియందుగూడ ఘటించును. సార్వశబ్దము "సర్వ స్మైహితః" (అందరికొరకు హితమైనవాఁడు) అను నర్థముగలది. అమరుఁడు బుద్ధ పర్యాయములలో సార్వశబ్దమును బఠింపలేదు. ఆరవపరిచ్ఛేదమందు 53-వ శ్లోక లో నీసార్వసర్వీయశబ్దములను భామహుఁడిట్లు నిర్వచించెను. "హితప్రకరణేన స్వాఛబ్దాత్ప్రియుజ్యతే। తతశ్చమిష్ట్వాచయథా సార్వసర్వీయ ఇత్యపి॥" ఇందు "సర్వపురుషాభ్యాంణఢఞౌ" (పా. V: 1-10) అను పాణిని సూత్రము ఇందు ప్రమాణము. పదశక్తినిగురించి చర్చించుచు బౌద్ధుల అన్యాపోహవాదమును ఖండిం చెను. "అన్యాపోహేనశబ్దోర్థమాహేత్యన్యే ప్రచక్షతే। యది గౌరిత్యయం శబ్ద కృతార్థోన్యనిరాకృతౌ। జనకో గవిగోబుద్ధే మృగ్యతామపరో ధ్వనిః॥" (VI: 16,17) చతుర్థపరిచ్ఛేదము 49-వ శ్లోకములో సోమపానముచేసిన రాజులు మిక్కిలి శ్లాఘింప బడిరి. గ్రంథములోఁ జెప్పఁబడిన యుదాహరణములన్నియు బ్రాహ్మణదేవతలతో సంబంధించినవియే. రామాయణ మహాభారత కథాపురుషులను తత్కథలను పల చోట్లఁ బేర్కొనియున్నాఁడు. "ఊర్జస్వికర్ణేన యథాపార్థాయపునరాగతః। ద్విస్సం ధాతికిం కర్ణశ్చైత్యహిరపాకృతః॥" (III: 7) అను శ్లోకములు పార్థకర్ణశల్యు లను జెప్పుచున్నవి. "ఉదాత్తం శక్తిమాన్ రామో గురువాక్యానురోధకః। విహా యోపనతంరాజ్యం యథావనముపాగమత్॥" (III: 4). "అద్యయామమగోవిం జాతాత్వయిగృహాగతే కాలేనైషాభవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః॥" (III: 5) "సమారుతాకంపిత పీతవాసాబిభ్రత్సలీలం శశిభాసమబ్జం। యదుప్రవీరః ప్రగృహీ తశార్ఙ్గస్సేంద్రాయుధో మేఘ ఇవావభాసే॥" (II: 41).

"అయంపద్మాసనాసీనః చక్రవాకో విరాజతే। యుగాదౌ భగవాన్ బ్రహ్మా వినిర్మిత్సురివప్రజాః॥" (II: 55).

"ఏకస్త్రీణిజయతి జగన్తికుసుమాయుధః। హరతాపిశనస్తాయస్య శంభునాన బలంహృతం॥"

"రామస్సప్తాభినత్సాలాన్గిరిం క్రౌంచంభృగూత్తమః। శతాంశేనాపిభవతా కింతయోస్సదృశంకృతమ్॥" (III : 31).

"విదధానాకిరీటేందూశ్యామాభ్రహిమసచ్ఛవీ। రథాంగశూలిబిభ్రాణౌ పాతాంవశ్శంభుశార్ఙ్గిణౌ॥" (IV : 21).

"భ్రాతుర్భ్రాతృవ్యమున్మథ్య పాస్యామ్యస్యాసృగాహవే। ప్రతిజ్ఞాయ యథాభీమ స్తచ్చకారావశోరుషా॥" (V : 39).

"ప్రాయోపవేశాయ యథాప్రతిజ్ఞా యసుయోధనః। రాజ్యాయపునరుత్థాయితిధర్మవిరోధినీ॥" (V : 41).

"అథారభ్యనివర్త్యామి మునివద్వచనాదితి। పితుఃప్రియాయయ్యాం భీష్మశ్చక్రే ప్రసాకామబాధినీ॥" (V : 43).

"అత్యాజయద్యథారామస్సర్వక్షత్రవధాశ్రియామ్। జామదగ్న్యంయథాజిత్వా సాక్షేయాకోపబాధినీ॥" (V : 44).

"ఉపలప్స్యేస్వయంసీతామితిభర్తృనిదేశతః। హనూమతాప్రతిజ్ఞాయసాజ్ఞాతేత్యర్థసంశ్రయా॥" (V : 37).

భామహుఁడు వినయమునగలవాఁడు విడువదగిన కావ్యదోషములను బ్రతిపాదించి చతుర్థపరిచ్ఛేదాంతమందిట్లు వ్రాయుచున్నాఁడు. "సదూషణాపాయముదాహృతోవిధిర్న చాభిమానేసకిముప్రతీయతే। కృతాత్మనాంత త్వదృశాంచ మాదృశో జనోఽభిసంధింక ఇవావభోత్స్యతే (IV: 57). తనకంటెఁ బూర్వులైన కొందరు గ్రంథకర్తలవలన నీతఁడు కొంత సహాయమున్పొందెను. వారిలో మేధావియనువాఁడొకఁడని యితఁడే చెప్పుచున్నాఁడు. తనకంటెఁ బ్రాచీనులైనవారి విమర్శమును జూచి దానిని సంగ్రహించి తన గ్రంథమందు వ్రాసెను. అందువలననే అలంకార నిరూపణమందు నేను ప్రాచీనాలంకారికుల గ్రంథములఁ బరిశీలించి వానిని స్వబుద్ధిచే నాలోచించి వ్రాసితినని చెప్పుచున్నాఁడు. "సమానేన్నోదితఖిందంధీ ఖేదాద్యైన విస్తరః ఆసంగృహీతమప్యన్యద భ్యూహ్యామనయాదిశా (II : 95) ఇతినిగదితాస్తాస్తావాచా మలంకృతయో మయాబహువిధకృతీర్దృష్ట్వాన్యేషాం స్వయంపరితర్క్యచ" (V : 69½) ద్వితీయపరిచ్ఛేదాంతమందున్న "స్వీయకృతైరేవనిదగ్నైరియం మయా

ప్రిక్లప్తాఖిలా వాగలంకృతిః॥" (II : 96) అను శ్లోకమునుగూర్చి విమర్శకులనేక రీతులుగాఁ దర్కించియున్నారు. "ఇయంవాగలంకృతిః" అనఁగా నర్థమేమి? ఈ పదము లితఁడు రచించిన కావ్యాలంకారమును పరామర్శించినచో ఏవకారమునే దృఢపఱుపఁబడుచున్నది ఇతఁడితర గ్రంథకర్తల గ్రంథములవలన దీసికొన్న శ్లోకములనేకములుగలవు. "దాడిమానిదళాపుష్పాః వడిత్యాదియర్థోऽజనిః" (IV : 8) "హిమాపహామిత్రధరైర్వ్యాప్తం వ్యోమేత్యవాచకం" (I : 41) కావున గ్రంథస్థమైన యుదాహరణశ్లోకములన్నియు భామహవిరచితములేయని నిశ్చయింప శక్యము గాదు. "స్వయంకృతైరేవ" అను పదము అలంకారములకిచ్చిన యుదాహరణములనే చెప్పినయెడల "స్వయంకృతైరేవనిదర్శనైర్యం" అను శ్లోకము తృతీయ పరిచ్ఛేదాంతమందుండవలెను. ద్వితీయపరిచ్ఛేదాంతమందుఁగూడ నితరగ్రంథములనుండి యితఁడెరువు తెచ్చుకొన్న శ్లోకములనేకములుదాహరింపఁ బడియున్నవి. భామహుఁడు తానే గ్రంథములనుండి యీయుదాహరణములను దీసికొనెనో యాగ్రంథములగూడఁ జెప్పియున్నాఁడు. కాలక్రమమున నాగ్రంథకర్తల నామము లంతరించియుండును. కాని భామహుఁడు రచించిన కావ్యాలంకారగ్రంథము, గ్రంథపాతము లేకుండఁ బూర్తిగానున్నదని పాఠకునకు విశ్వాసమును గలుగఁజేయుటకుఁ దగినన్ని ప్రతులు లేవు. ఇందుకుదాహరణముగా "భామహేనహి గురుదేవనృపతిపుత్రవిషయప్రీతివర్ణనం ప్రేయోలంకార ఇత్యుక్తమ్" అని లోచనము చెప్పుచున్నదిగాని భామహుఁడెచటను ప్రేయోలంకారమును జెప్పలేదు. దేవవిషయక ప్రీతిని వర్ణించు నొక శ్లోకమును మాత్రమే యుదాహరించెను. "ప్రేయోగృహాగతం కృష్ణమవాదీద్విదురోయథా అద్యయామమగోవింద జాతాత్వయి గృహాగతే। కాలేనైషాభవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః॥ ఈగ్రంథమున కెచ్చటను వ్యాఖ్యానము కానరాదు. ఉద్భటుఁడు రచించిన భామహవివరణమను నొక గ్రంథముపేరు వింటిమిగాని, యది యెచ్చటను దొరకలేదు. కావున స్వయంకృతైరేవనిదర్శనైః" అనుదానియందధిక విశ్వాసముంచుట న్యాయముకాదు.

ఈదిగువ వ్రాసిన గ్రంథములను, గ్రంథకర్తలను భామహుఁడు తన గ్రంథమందుఁ జెప్పియున్నాఁడు.

రామశర్మకృతాచ్యుతోత్తర. (2-10) "నానాధాత్వర్థగంభీరా యమకవ్యపదేశినీ। ప్రహేళికాసాహ్యుదితా రామశర్మాచ్యుతోత్తరే॥" (2-58) "స

హాసాః ప్రగృహీతశార్ఙ్గో మనోజ్ఞ భీమం వపురాపకృష్ణః। శక్రాహదేంద్రాయుధవాన్నిశాయాం సంసృజ్యమానశ్శశినేవ మేఘః॥" (రామశర్మణః.)

## అశ్మకవంశము.

"సతుచాశ్మకవంశాది వైదర్భమితికథ్యతే। కామంతథాస్తుప్రాయేణ సంజ్ఞేచ్ఛాతోఽభిధీయతే॥" (I : 33).

## కణభక్షుఁడు.

"స్వసిద్ధాంతవిరోధిత్వా ద్విష్టేషు తద్విరోధినీ। కణభక్షో యథాశబ్ద మాచక్షీతా వినశ్వరమ్॥" (I : 17).

## న్యాసము.

"శిష్టప్రయోగమాత్రేణ న్యాసకారమతేన వా। తృచాసమస్తషష్ఠీకం నకథంచి దుదాహరేత్॥" (VI : 36).

## పాణిని, శాలాతురీయుఁడు.

"శాలాతురీయమతమేత దనుక్రమేణ కో వక్ష్యతీతి విరతోఽహమతో విచారాత్। శబ్దార్ణవస్య యది కశ్చిదుపైతి పారం భీమాంభసశ్చ జలధేరతివిస్మయోఽసౌ॥"

"విద్యానాంసతతమపాశ్రయో పరాసాంతాసూక్తాం నచవిరుణద్ధి కాంశ్చిదర్థాన్। శ్రీద్ధేయంజగతి మతంహిపాణినీయం మాధ్యస్థ్యాద్భవతి నకస్యచిత్ప్రమాణమ్॥".

## మేధావి—రత్నాహరణ.

"పర్యాయోక్తంయదన్యేన ప్రకారేణాభిధీయతే। ఉవాచరత్నాహరణే చైద్యంశార్ఙ్గధనుర్యథా॥" (III : 8).

## రాజమిత్ర (గ్రంథనామ).

"సమాహితంరాజమిత్రే యథాక్షత్రియయోషితామ్। రామప్రసక్త్యైయాంతీనాంపురోఽదృశ్యతనారదః॥" (III : 10).

"కించకావ్యాని నేయానిలక్షణేన మహాత్మనాం। దృష్టంవాసర్వసారూప్య రాజమిత్రేయథోదితమ్॥" (II : 45).

శాఖవర్ధనః

"నిష్పేతురాస్యాది వతస్యదీప్తాశ్శరా ధనుర్మండలమధ్యభాజః। జాజ్వల్య మానా ఇవవారిధారా దినార్ధభాజః పరివేషిణోఽర్కాత్॥" (II : 47).

వీనిలో అచ్యుతోత్తర, అశ్మకవంశ, రత్నాహరణ, రాజమిత్ర, శాఖవర్ధన అను నీ యయిదు పేర్లమాత్రమే యితరాధారములవలనఁ దెలియఁబడ లేదు. అశ్మక వంశమునుండి భామహుఁడొక్క శ్లోకమునైన నుదాహరింపలేదు. రత్నాహరణ మను నది నిజముగా గ్రంథనామమగునో కాదో సంశయము. రామశర్మశాఖవర్ధనుల గ్రంథములనుండి యుదాహరింపఁబడిన శ్లోకములు దోషముల నుదాహరణముగాఁ జెప్పఁబడినవి. రుద్రటాలంకారములో నమిసాధువుకూడ వానినే యుదాహరించెను. (రుద్రట XI : 24) ఈశ్లోకములే కావ్యప్రకాశలోఁగూడ నుదాహరింపఁబడినవి. పైనఁ జెప్పఁబడిన గ్రంథకర్తలను గ్రంథములను యితరులెవ్వరు నెచ్చటను జెప్ప యుండలేదు. గావున భామహుఁడు మిక్కిలి ప్రాచీనుడని కొందరు తలంచు చున్నారు. భామహుఁడు తన గ్రంథమందు చెప్పకున్న గ్రంథకర్తలలో భరతుఁ డొకఁడు—"ఉక్తంతదభినేయార్థముక్తోఽన్యైస్తస్యవిస్తరః (II : 4) పతంజలి మహాభాష్య మొకటి. (VI : 21) ద్రవ్యక్రియాజాతిగుణభేతాత్తేచ చతుర్విధా॥ యదృచ్ఛాశబ్దమప్యన్యేడిత్థాదిం ప్రతిచక్షతే॥" భామహుఁడు బృహత్కథాప్రధాన నాయకులైన వత్సేశ్వరనరవాహనదత్తుల చరిత్రమును తన గ్రంథమందు సూచించెను. "విజిగీషుముపన్యస్యవత్సేశం వృద్ధదర్శనమ్। తస్యైవకృతిభిః పశ్చాదభ్యధాచ్చారచేష్టితామ్॥" IV : 40) అభార్యోఽయ్థోన సంస్కార మంతరేణద్విజన్మనా। నరవాహనదత్తేన వేశ్యావాన్నిశపీడితః॥" (IV : 50) తరుచుగా భామహుఁడు, అపరే, అన్యే, కేషాంచిత్ అను శబ్దములచే నితరాలంకారికుల మతములను జెప్పెను. ఎట్లనగా;—"గ్రామ్యానుప్రాస మన్యత్తుమన్యంతే సుధియోఽపరే। సలోలమాలానీలాలి కులాకులగళోబలః॥" (II : 6).

"లాటీయమప్యనుప్రాసమిహేచ్ఛంత్యపరేయథా। దృష్టింద్రష్టిసుఖాంధేహి చంద్రశ్చంద్రముఖోదితః॥" (II : 8).

వ్యాకరణము నితరశాస్త్రములనుగూడఁ బేర్కొనెను. "శక్తిర్దేయం జగతి పతంపిపాణినీయమ్" అని వ్యాకరణమును మిక్కిలి శ్లాఘించెను. షష్ఠపరిచ్ఛేద ప్రారంభమందు వ్యాకరణమునుగుఱించి యొక మంచి రూపకాలంకారమును వ్రాసెను. "సూత్రాంభసం పదావర్తం పారాయణరసాతలం। ధాతూణాదిగణగ్రాహం సంధ్యాగ్రహబృహత్ప్లవమ్। నాపారయిత్వాదుర్గాధమముం వ్యాకరణార్ణవం। శబ్దరత్నం స్వయంగమ మలంకర్తుమయం జనః॥" (IV : 39) న్యాయశాస్త్రం త్రివర్గోక్తిర్దండనీతిం చ శాంవిదుః। అతో న్యాయవిదోఽధీష్టమపేతం యత్తథా యథా॥" అను శ్లోకములలో దండనీతిని. "శపథైరపిచాదేయావచోన స్ఫోటవాదినాం" అను దానియందు స్ఫోటవాదమును పరామర్శించెను. భామహుని శ్లోకములు మిక్కిలి మృదువుగానుండును. లోచనకారుఁడు మొదలగువారాతని శ్లోకములను తమ గ్రంథములయందుదాహరించియున్నారు.

వామనాలంకారసూత్రములకు వ్యాఖ్యానమైన కామధేనువులో భామహుని శ్లోకములు హెచ్చుగా నుదాహరింపఁబడినవి. నారాయణపండితుఁడు తానువ్రాసిన వృత్తరత్నాకరవ్యాఖ్యానములో భామహుని వాక్యముల నుదాహరించియున్నాఁడు. ఇందువలన భామహుఁడుకూడ ఛందశ్శాస్త్రమును వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది.

భామహుని కాలమును నిర్ణయించుటకుముందు కావ్యాదర్శమునుగుఱించి కొంత యుపపాదించుట న్యాయము.

అలంకారశాస్త్రకర్తలలో భామహుడు మిక్కిలి ప్రాచీనుడు. అతడు వ్రాసిన గ్రంథము కావ్యాలంకార సంగ్రహము. ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, మమ్మటుడు, హేమచంద్రుడు, జయమంగళాకారుడు, ప్రతీహారేందురాజు మొదలగు నాలంకారగ్రంథకర్తలు తమగ్రంథములయందీతని శ్లోకముల నతిగౌరవముతో నుదాహరించియున్నారు. అలంకారసర్వస్వకారుడైన రాజానకరుయ్యకుడు (ఇహహి తావద్భామహోద్భట ప్రభృతయశ్చిరంతనాలంకారకారాః ప్రతీయమాన మర్థం వాచ్యోపస్కారకతయా అలంకారపక్షనిక్షిప్తం మన్యంతే (అలం॥ సర్వ-p 3). విద్యాధరుఁడు (ఏకావలి_యత్పువరలంకారకోటిని విష్టత్వం. వస్తుధ్వనేరుదభావయన్ భామహాదయస్తదపి విచారవిధురం) విద్యానాథుఁడుఁ పూర్వేభ్యోభామహాదిభ్యస్సాదరం విహితాంజలిః, (ప్రతాపరుద్రీయమ్). మొదలగువారిచే ప్రాచీనాలంకారికు లందఱికి పట్టభద్రుఁడుగాఁ జేయబడెను. ఇంతగౌరవమీతనియందు తరువాతబుట్టిన

మహాపండితులైన వారికి కలుగుటకు కారణమేమో విచారించుటకీతని కావ్యాలంకారమును విమర్శించుటకు నాప్రయత్నము.

ప్రాచీన నవీనాలంకారికులకు గల పెద్దభేదమేమనగా మొదటివారు సదాలంకారములు ప్రధానములందురు; వ్యంగ్యము వాచ్యశోభావహమని వారి యభిప్రాయము. తగిన ప్రాధాన్యమును వారలంకారముల కిచ్చుటవలననే భామహోద్భటుల గ్రంథములకు గ్రమముగా కావ్యాలంకారమనియు కావ్యాలంకార సారసంగ్రహమనియు పేర్లు కలిగినవి.

భామహుడు తనగ్రంథము నారుపరిచ్ఛేదములుగా విభజించెను. గ్రంథాంతమందు తాను ప్రతిపాదించిన అంశముల నన్నిటిని క్రమముగా జెప్పియున్నాడు అయిదువిషయము లారుపరిచ్ఛేదములయందు జెప్పబడియున్నవి.

1. కావ్యశరీరము 60 శ్లోకములు.
2. అలంకారములు 160 శ్లోకములు.
3. దోషములు 50 శ్లోకములు.
4. న్యాయనిర్ణయము 70 శ్లోకములు.
5. శబ్దశుద్ధి 60 శ్లోకములు.

సత్కావ్య పరిజ్ఞానముయొక్క ఆవశ్యకత నీదిగువశ్లోకమందిట్లు వ్రాయుచున్నాడు. "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ। ప్రీతింకరోతి కీర్తించ సాధుకావ్యనిషేవణమ్॥ "కావ్యంయశసేర్థకృతే" అను మమ్మటుని శ్లోకముతో నిది సరిగానున్నది. ఆశ్లోకములోనున్న మెచ్చుసంగతి యేమనగా కావ్యము కాంతాసమ్మితముగా నుపదేశించునదియని. గ్రంథారంభమందు విద్యాధరుడు తన ఏకావళిలో నిట్లు వ్రాయుచున్నాడు.

"పాణినిప్రముఖుస్సైస్తైస్సర్వశాస్త్ర విశారదైః। ఇహతావ త్త్రిధా శాస్త్రమభ్యధీయత తత్రచ। శబ్దప్రధానం వేదాఖ్యం ప్రభుసమ్మితమిష్యతే। ఈపదప్యస్యశబ్దస్య పాతే పాతస్యదురితంయతః। ఇతిహాసపురాణాది సుహృత్సమ్మితమిష్యతే। అర్థవాదరూపత్వాత్కథ్యతేఽర్థ ప్రధానతా। ధ్వనిప్రధానం కావ్యంతు కాంతాసమ్మితమీరితం। యద్వేదాత్ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రధానాచ్చిరం యచ్చార్థప్రవణాత్పు

రాణవచనాత్ప్రసుహృత్సమ్మితాత్। కాంతాసమ్మితయాయయాసరసతామాపాద్య కావ్యశ్రియాకర్తవ్యేకుతుకీబుధోవిరచితస్తస్మైస్పృహాంకుర్మహే॥ కావ్యం యశసేర్థకృతేవ్యవహారవిదేశివేతరక్షతయే। సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే॥

“ధర్మార్థకామమోక్షేషు” అను శ్లోకముపై నభినవగుప్తుడు చెప్పిన మాటలు చదువదగియున్నవి. “శ్రోత్రియాణాం వ్యుత్పత్తిర్యద్యప్యస్తీయథోక్తం। ధర్మార్థకామ ఇతి। తథాపిప్రీతిరేవప్రధానం। అన్యథాప్రభుసమ్మితేభ్యోవేదాదిభ్యోమిత్రసమ్మి సమ్మితేభ్యశ్చేతిహాసాదిభ్యోకోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తిహేతోర్జాయా సమ్మితత్వలక్షణోవిశేషఇతి ప్రాధాన్యేనానంద ఏవఉక్తః। చతుర్వర్గవ్యుత్పత్తేరపి ఆనందఏవపార్యంతికం ముఖ్యం ఫలం। (ధ్వన్యాలో-p 12) కావ్యము వ్యుత్పత్తి ప్రదమైనను ఆనందమే ముఖ్యఫలము. వాఙ్మయములోని యితర గ్రంథములనుకూడ గృషిచేయుటచే వ్యుత్పత్తి కలుగును గాని ఆనందమనునది యొక్క సత్కావ్యనిషేవణము వలననే కలుగును. ఆంగ్లేయకవిపుంగవుడైన కౌపర్మహాశయుడిట్లు వ్రాయుచున్నాడు.

There is a pleasure in poetic pains which only poet's know.
The shifts and turns
The expedients and inventions multiform,
To which the mind resorts in chase of terms
Though apt, yet coy and difficult to win,
Are occupations of the poet's mind,
So pleasing and that steal away the thought, with such address from themes of sad import,
That lost in his own musings, happy man
He feels the anxieties of life, denied,
Their wonted entertainment all retire.

కవికర్మను మాలాకారుని. కర్మతో సరిచూచుచు భామహుడుకూడ నట్టి అభిప్రాయములతో ప్రథమపరిచ్ఛేదమును ముగించుచున్నాడు. వీరుభయులు (మాలాకారుడు, కవి) మంచిదానిని స్వీకరించి చెడ్డదానిని నిరసింతురు. యుక్తమైన పదార్థములకు యుక్తమైన స్థానములనుంచుకొందురు.

ఎతద్గ్రాహ్యంసురభికుసుమం గ్రామ్య మేతన్ని ధేయం ధత్తేశోభాం విరచ
మిదం స్థానమస్యైతదస్య। మాలాకారోరచయతి యథాసాధు విజ్ఞాయమాలాం
యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వదేవాభిధానమ్॥

Lord Macaulay, Milton కవినిగురించి వ్రాసిన వ్యాసములో క
వనముయొక్క ఇంద్రజాలశక్తినిగురించి ప్రశంసించుచు నాయభిప్రాయమునే యిట్లు
తెలియజేయుచున్నాడు.

"We often hear of the magical influence of poetry (కవనముయొక్క శక్తి యింద్రజాలమువంటిదని తరుచుగా వినుచున్నాము. The expression in general means nothing. సామాన్యముగా నీమాట యందర్థ మేమియు లేదు but applied to the writings of Milton, it is most appropriate. Milton కవిగ్రంథములవిషయమై ప్రయోగించ నపుడది మిక్కిలి యనురూపముగానున్నది. అతనికవనము ప్రయోగమువంటిది (His poetry sets like an incantation) Change the structure of the sentences, substitute one synonym for another and the whole effect is destroyed. (వాక్యబంధమును మార్చి యొక పదమునకు బదులుగానింకొక పదమునుంచినయెడల దానిశక్తియంతయు నశించును. పదముల పరివృత్త్యసహత్వము) అలంకారశాస్త్రకర్తలు మైత్రిశయ్యాపాకము లని దేనిని వ్యవహరింతురో అదియే పదపరివృత్త్యసహత్వము. అదియే ఆనందదాయకము.

"యాపదానాం పరాన్యోన్యమైత్రీశయ్యేతికథ్యతే (ప్రతా••) "శాణోత్తేజిత పద్మరాగశకల ప్రాగ్భారశోభాధరాః పుల్లత్కింశుకకోరక ప్రసృమరచ్ఛాయాదిక సోదరాః। ప్రత్యూషస్మితదబ్జినీ పరిభృఢప్రాఢప్రభాడంబరాః ప్రత్యగ్రాః ప్రస రత్తినంజ్ఞపతేర్జేతుః ప్రతాపార్మయః। శయ్యయందు శరీరమునకు గలిగించు విశ్రాంతివలె పరస్పరమైత్రియందు పదములకుగల విశ్రాంతి. పర్యాయపదప్రక్షే పముచే మొదటి పదములను తొలగింప నెడమియ్యని పదముల నీరంధ్రమైన పరస్పర మైత్రికి శయ్యయనిపేరు.

మల్లినాథుడు యేకావళికి తానువ్రాసిన తరళవ్యాఖ్యానములో తనరఘువీర చరిత్రములోని యీశ్లోకమును దాహరించెను.

"పదానాం పరివృత్తివైముఖ్యం వినిమయాసహిష్ణుత్వమ్। ఏతదేవ మైత్రీం శయ్యేతిచాఖ్యాయతే। యథాస్మదీయశ్లోకే చంద్రోదయే॥

నిశాకరకరస్పర్శాన్నిశయానిర్వృతాత్మనా। అమీ స్తంభాదయోభావావ్యజ్యన్తే రజ్యమానయా॥ ఇచ్చట నిశయా అనుదానికి బదులుగా క్షపయా అని ప్రయోగింప వీలులేదు. ఈశ్లోకమందు నిశాదిపదస్థానమందు క్షపాదిపదాంతరమును ప్రయోగించిన యడల పదముల పరస్పరమైత్రికి భంగముకలుగును.

ఇదియొకవిధమైన పాకము. అనగా శబ్దపాకము. ప్రాచీనసత్కావ్యములను చిరకాలము బాగుగాఁ గృషిచేయుటచే గలిగిన ఉక్తిపరిపాకము భామహుఁడన్నట్లు వాగ్వైదగ్ధత యెచ్చటనో అరుదుగా నొకానొకనికి గలుగు ప్రతిభా విశేషమువలనఁ బుట్టు గొప్ప కవనశక్తిలేనియెడల నీవాగ్వైదగ్ధత నిరుపయోగము. అది వినయములేని ఐశ్వర్యమువంటిది. చంద్రుడులేని రాత్రివంటిది.

"వినయేన వినా కా శ్రీః కా నిశా శశినా వినా। రహితా సత్కవిత్వేన కీదృశీ వాగ్విదగ్ధతా। గురూపదేశాదధ్యేతుం శాస్త్రం జడధియోఽప్యలం। కావ్యంతుజాయతే జాతుకస్యచిత్ప్రతిభావతః। (1-4-5).

కవనమునకు గావలసినది కేవలము శబ్దపాకమే కాదు. అర్థపాకముండవలెను. అర్థపాకమనగా నర్థగంభీరిమ, అది అనేకవిధములు. ద్రాక్షాపాకము దానిలో కొన్ని విశేషములు.

అర్థగంభీరిమాపాకః సద్విధాహృదయంగమః। ద్రాక్షాపాకో నారికేళపాకశ్చ ప్రస్ఫుటాంతరా॥

రుచిభేదమునుబట్టి ఆహారభేదమేర్పాటైనట్లు కవులరుచులనుబట్టి యీపాకభేదములు పుట్టినవి. ప్రతిభావిశేషములేనియడల శబ్దచమత్కారము అర్థచమత్కారము కవితలేదు కావున భామహుడుచెప్పినది మిక్కిలి యుక్తముగానున్నది.

కావ్యంతుజాయతే జాతుకస్యచిత్ప్రతిభావతః, కవనమునకు ప్రతిభప్రతిభానము అవసరము. అది ఎవ్వనికో లభించును, లభించినను అది సర్వకాలము స్ఫురించదు. ఎప్పుడో ఎవ్వనికో ప్రతిభావిశేషముద్దీపితమైయున్నపుడు కవి ఆనందముతో నిండియున్న సమయములయందే కావ్యమని వ్యవహరింపదగినదానిని రచింపగలడు.

మమ్మటుడుకూడ ప్రతిభను శక్తియని వ్యవహరించెను. అదియే కవిత్వ ముఖ్యాపేక్షితము. (శక్తిర్నిపుణతాలోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్। కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుద్భవే।) నవనవోన్మేషశాలినియగు ప్రజ్ఞకు ప్రతిభ యని పేరు. దానిలక్షణమును హేమచంద్రుడు కావ్యానుశాసనములో నిట్లు చెప్పుచున్నాడు. "ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ ప్రతిభామతా। తదనుప్రాణనాజ్జీవ ద్వర్ణనానిపుణోకవిః। తస్యకర్మస్మృతం కావ్యమ్॥

ప్రతిభానుప్రాణితమైన వర్ణనమందు నిపుణుడైనవాడే కవియని హేమ చంద్రుని యభిప్రాయము. అట్టివాని రచనకే కావ్యమనిపేరని హేమచంద్రుని యభిప్రాయము.

భామహుడు ప్రతిభసర్వాధికమనియొప్పుకొన్నను కావ్యరచనకు అవశ్యకము అపేక్షితములైనవానిని విడచిపెట్టడు. వానినీదిగువ శ్లోకములలో నిట్లుచెప్పెను.

శబ్దశ్ఛందోఽభిధానార్థా ఇతిహాసాశ్రయాః కథాః। లోకోయుక్తిః కలాశ్చేతి మంతవ్యాః కావ్యవేదిభిః (భా-కావ్యాలంకార 9) శబ్దాభిధేయే విజ్ఞాయకృత్వా తద్విదుపాసనాం। విలోక్యాన్యనిబంధాంశ్చకార్యః కావ్యక్రియాదరః। (10) కవిగా మండ నభిలషించినవాడు శబ్దములను, ఛందస్సును, శబ్దార్థములను, పురాణకథలను లోకమును, యుక్తిని, కళలను యెరిగియుండవలెను. కవులనుపాసింపవలెను. వారి గ్రంధమును గృషిచేయవలెను.

మమ్మటుడు తనకావ్యప్రకాశికా షష్ఠోల్లాసమందు శబ్దార్థచిత్ర కావ్యముల లక్షణమును విమర్శించుచున్నాడు. శబ్దచిత్రకావ్యమందర్థ మనోజ్ఞత కలదా లేదా? అర్థచిత్రమందు శబ్దమనోహరత్వము కలదా లేదా యని విచా రించుచున్నాడు. ఉభయవిధ కావ్యములయందు మనోజ్ఞతకలదని నిశ్చయముగా జెప్పుచున్నాడు. కాని శబ్దచిత్రకావ్యమందర్థ మనోజ్ఞత శబ్దములకంగమైపోయి అర్థచిత్రమందు శబ్దములమనోజ్ఞత అర్థములకంగమైనది. ఈయర్థము సమర్థించుటకు మమ్మటుడు భామహుని శ్లోకములు మూడుదాహరించెను.

రూపకాదిరలంకార స్తస్యాన్యైర్బహుధోదితః। నకాంతిమపినిర్భూషం విభాతి వనితాముఖం। రూపకాదిమలంకారం బాహ్యమాచక్షతేపరే। సుపాంతిఙాంచ వ్యుత్పత్తింవాచాం వాంఛంత్యలంకృతిం। తదేతదాహుస్సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తి

రీదృశీ, శబ్దాభిధేయాలంకార భేదాదిష్టం ద్వయంతునః। ఈశ్లోకములను రచించినవారి పేరు చెప్పక మమ్మటుడు తనగ్రంథమందుదాహరించెను. ఇవి భామహునివని సరస్వతీతీర్థుడు చెప్పెను. ఇదియేనిజము. వివరణకారుడు ధ్వనికారునివని చెప్పెను. ఇది యసత్యము. ఈశ్లోకములయందు భామహుడు ప్రాచీనాలంకారికుల అభిప్రాయములను వెల్లడించెను. అలంకారశాస్త్రగ్రంథములను వ్రాసిన కొందరు రూపకాద్యలంకారములు కావ్యమునకలంకారములని చెప్పిరని భామహుడు చెప్పుచున్నాడు. మేలయినగాస్త్రీముఖము సుందరముగానున్నను అలంకారములు లేనిచోఁ బ్రకాశించదు. మరికొందరు రూపకాదులు బాహ్యములని తలంచుచున్నారు. సుబంతశబ్దసౌష్టవము, తిఙంతశబ్దసౌష్టవము కావ్యమునకలంకారమని కొందరియభిప్రాయము. దీనిని వారు సౌశబ్ద్యమందురు. వీరియభిప్రాయములో నర్థచారుత్వమంతమనోహరముకాదు. ఈయుభయము మాకిష్టమే. ఏలయనగా నలంకారములు రెండువిధములు. శబ్దాలంకారములని అర్థాలంకారములని శబ్దార్థౌ సహితౌ కావ్యం అన్నట్లు శబ్దార్థములు రెండు కావ్యశరీరమని కేవలశబ్దములు కావ్యముకాదని భామహుని అభిప్రాయము. దండి, జగన్నాథపండితుడు శబ్దమునకు అనర్ఘాధిక్యము నొసఁగుదురు. "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నాపదావలీ" అని దండి యు "రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్యం" అని జగన్నాథపండితుడును కావ్యమునకు లక్షణము జెప్పిరి. భామహుని మతము నవలంబించి మమ్మటుడు "తదదోషౌ శబ్దార్థౌ" కావ్యం అని చెప్పెను.

"సైషా సర్వత్ర వక్రోక్తిరనయార్థో విభావ్యతే। యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా। అను భామహుని శ్లోకమును ఆనందవర్ధనుడు, మమ్మటుడు హేమచంద్రుడు మొదలగువారు తమగ్రంథములయందుదాహరించిరి. ఇచ్చట వక్రోక్తి యనగా మనోహరము వ్యంగ్యమునుమాట. అతిశయోక్తి లక్షణమును చెప్పుటలో భామహుడు యీవక్రోక్తికి లోకాతిక్రాంతగోచరం వచః అనుపర్యాయపదమును జెప్పెను.

"నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాంతగోచరం। మన్యంతేఽతిశయోక్తిం తామలంకారతయా యథా" ఎన్నడు కవితాగ్రంథమెరుగని మనుష్యులు మామూలుగా మాటలాడు మాటలలో నేమియు వైచిత్రి లేదు. అందువలననే యెద్దియు నలంకారముండదు. లోకోత్తరమైనరీతితో నాపదములు మనోహరముగాఁ బ్రయోగింపబడినపుడలంకారముండును. శబ్దమందు అర్థమందు వైచిత్రియుండుటయే వక్రోక్తియని

భామహుని యభిప్రాయము. ఇదియే అలంకారమునకు ముఖ్యము. ఇందుక వ్రాయుచున్నాడు. వక్రాభిధేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతి। (2-36) వా వక్రార్థశబ్దోక్తిరలంకారాయకల్పతే। (6-66) అభినవగుప్తుడు దీనిని వివరి చున్నాడు. "శబ్దస్యహి వక్రతా అభిధేయస్య చవక్రతా లోకోత్తీర్ణేన రూపేణా స్థానమిత్యయమేవాసావలంకారాన్తరభావః॥

ఇటీవలవారైన అలంకారగ్రంథకర్తలు అతిశయోక్తిని అయిదువిధము విభజించిరి.

1. భేదమున్నను భేదము లేదని చెప్పుట.
2. భేదము లేకున్నను భేదమున్నట్లు చెప్పుట.
3. సంబంధము లేకున్నను సంబంధమున్నదని చెప్పుట.
4. సంబంధమున్నను సంబంధము లేదని చెప్పుట.
5. కార్యకారణభావ విపర్యయము.

అవాంతరసూక్ష్మభేదములను చెప్పుట భామహునికిష్టము లేదు. ఈయలం మునకతడిచ్చిన రెండుదాహరణములలో మొదటిదియిది. "ఖపుష్పచ్ఛవిహారి చంద్రభాసా తిరోహితాః। అన్వమీయన్త భృంగాళివాచా సప్తచ్ఛదద్రుమాః (2- ఇది మమ్మటుని సామాన్యాలంకారముతో సదృశముగానున్నది. ద్వితీయోదాహ మెట్లనగా: అపాంయదిత్వక్శిథిలాచ్యుతా స్యాత్ఫణినామివ। తదా శుక్లాంశుకాని రంగేష్వంభసి యోషితామ్ (2-83) ఇది మమ్మటుని యథార్థాతిశయోక్తికిగాని అ కార సర్వస్వకారుని అసంబంధేపి సంబంధాతిశయోక్తికిగాని సరిగానున్నది. ఇందు "అసంబంధేపి సంబంధాతిశయోక్తి పెద్దవిభాగము గలది.

మల్లినాథుడు తరళలో జెప్పినట్లు దీనిలో యథార్థాతిశయోక్తి కూడ సం వించియున్నది. (కావ్యప్రకాశకారస్తు భేదేఽభేదః, అభేదే భేదః, యద్యర్థ ప్రయోగాదసంభావితార్థాంతర కల్పనం। కార్యకారణపౌర్వాపర్యభంగ శ్చే చాతుర్విధ్యం సిద్ధాంతయాంచకార। తదపిచింత్యమ్। తత్రాద్యే "పుష్పం ప్రవాళో తం యది స్యాత్" ఇత్యాదౌ) అసంభావితోఽర్థః పుష్పప్రవాళయోః ముక్తాఫలవి మయోశ్చసంబన్ధ ఏవయది శబ్దేన సంభావ్యతే ఇత్యసంబంధే సంబంధభేద ఏవాయ ద్వితీయే (రాకాయామకలంకం చేదిత్యాదౌ) తు అకలంకం చేదితికలంకా సం

ఛందోభేదే చేచ్ఛబ్దభేద సంభావ్యేత ఇతిసంబంధభేదేప్య సంబంధభేద ఏవాయం। ఏవంస్థితే సామాన్యేవిశేషస్యాంతర్భావఉచితః। విశేషే వా సామాన్యస్యతదత్రభవంత ఏవవిద్వాంసః ర్వ్యస్తు। తస్మాదస్మదుక్తః పంచధావిభాగ ఏవన్యాయ్య ఇత్యలమ్ (p 237—Bombay Sanskrit series) సుమారుగా నన్ని అలంకారములలోను అతిశయోక్తియున్నది గావున మిళితాలంకారమును ఏకావళిని, నిదర్శన మొదలగు వానిని పృథగలంకారములుగాఁ బరిగ్రహింపనవసరము లేదని హేమచంద్రునియభిప్రాయము, "తాంవినా ప్రాయేణాలంకారత్వా యోగాదితినసామాన్య మీవిత్తైకావళీ నిదర్శనా విశేషాద్య లంకారోపన్యాసః శ్రేయాన్। (హేమచకావ్యాను p 267) కాని యీ యభిప్రాయము యుక్తముకాదు. ఏలయనగా, నీమతమునుమనమంగీకరించినయెడల సమాసోక్తి, ఆక్షేపము, పర్యాయోక్తి మొదలగు నలంకారముల యితరానేక విభాగముతో నావశ్యకత (లేకపోవలసివచ్చును. ఇంతియకాక అట్టి అతిశయోక్తి ఉపమయంద, ఉత్ప్రేక్షయందుగూడఁ గానవచ్చుచున్నదని భామహుడే చెప్పుచున్నాడు.

"ఇష్టంచాతిశయార్థత్వ ముపమోత్ప్రేక్షయోర్యథా। పుంజీభూతమివధ్వాన్తమేషభాతిమతంగజః। సరశ్శరత్ప్రసన్నామ్భోనభః ఖండమివోజ్ఝితం (2-50-51) అలంకారత్వము నాపాదించుటకు వాగ్వైచిత్రి అవశ్యకమనిభామహుని తాత్పర్యము. ఈవాగ్వైచిత్రి లోకోత్తరముగానున్నపుడతిశయోక్త్యలంకారమగును. అతిశయోక్తిలో వ్యంగ్యమున్నది. ఇట్టివ్యంగ్యమనేకాలంకారములలోఁ గానవచ్చుచున్నను వానివిశేషములు ప్రతిఅలంకారమునకు అసాధారణమైన వైగాక్షేవ చారుత్వముపైని ఆధారపడియున్నవి. ప్రేమచంద్ర తర్కవాగీశుడను పండితుడు "సైషాసర్వత్రవక్రోక్తిః" అను భామహునిశ్లోకమును, "కస్యాప్యతిశయస్యోక్తిరిత్యన్వర్థ విచారణాత్। ప్రాయేణామీ అలంకారాభిన్నానాతిశయోక్తితః। అను మరియొక శ్లోకము నుదాహరించి తాను ప్రకటించిన కావ్యాదర్శ పీఠికలో నిట్లు వ్రాయుచున్నాడు.

"ఏవం సర్వత్రాతిశయోక్తి సద్భావేపి వైచిత్ర్యాన్తరేణాలంకారాన్తర వ్యపదేశః। వైచిత్ర్యాన్తరాభావేత్వతిశయోక్తి వ్యపదేశ ఇతిచోద్యమ్॥

ఈదిగువవ్రాసిన ఆనన్దవర్ధనుని మాటలనుబట్టి విచారింపగా భామహుడు ధ్వని లేదనువాడుకాడు. మల్లినాథుడతనిని ధ్వన్యభావవాదియని తలఁచుచున్నాడు. "భామహేనాప్యతిశయోక్తి లక్షణేయదుక్తం "సైషాసర్వత్రవక్రోక్తిరితి" తత్ర

తిశయోక్తిర్యమలంకారమధితిష్ఠతి కవిప్రతిభావశాత్తస్య చారుత్వాతిశయయోగోఽన్యస్యత్వలంకారమాత్రతైవేతి సర్వాలంకార స్వీకరణయోగ్యత్వేనాభేదోపచారాత్సైవసర్వాలంకారరూపేత్యయమేవార్థోఽవగంతవ్యః। తస్యాశ్చాలంకారాంతరసంకీర్ణత్వం కదాచిద్వాచ్యత్వేన కదాచిద్వ్యంగ్యత్వేన। (ధ్వన్యా-పు. 207, 208) 211 పేజీలో నిట్లు చెప్పబడినది.

“సర్వథానాస్త్యేవ సహృదయహృదయహారిణః కావ్యస్యసప్రకారోయత్ర సప్రతీయమనార్థసంస్పర్శేన సౌభాగ్యమ్। ఇతరాలంకారికులొప్పకొన్నను వానిలో వక్రోక్తి లేదు గావున హేతుసూక్ష్మలేశాలంకారము లలంకారములు కావని భామహుని మతము.

“హేతుశ్చసూక్ష్మలేశోఽథ నాలంకారతయామతః। సముదాయాభిధానస్య వక్రోక్త్యనభిధానతః॥ పైశ్లోకమందున్న “వక్రోక్త్యనభిధానతః” అనుపదముపట్టి మొదటపదములువాచ్యార్థమును తెలియచేసినతరువాత వక్రోక్తిని దెలియజేయునని భామహుని అభిప్రాయమైనట్లు స్పష్టముగా గనపర్చుచున్నది. అనగా ధ్వనియుండునుగాని అది వాచ్యార్థమున కంగమైయుండును.

“కావ్యస్యాత్మా ధ్వనిరితిబుధైర్యస్సమామ్నాత పూర్వస్తస్యాభావంజగదుః పరేభాక్తమాహుస్తమన్యే। కేచిద్వాచాంస్థితమవిషయే తత్త్వమూచుస్తదీయం తేనబ్రూమస్సహృదయమనఃప్రీతయేతత్స్వరూపం। (ధ్వన్యా) ఈశ్లోకమునకు వృత్తి “యద్యపిధ్వనిశబ్ద సంకీర్తనేన కావ్యలక్షణవిధాయిభిర్గుణ వృత్తిరన్యోవాశబ్దప్రకారః ప్రకాశితః తథాపిగుణ వృత్త్యాకావ్యేషు వ్యవహారం దర్శయతాధ్వనిమార్గోమనాక్స్పృష్టోలక్ష్యత ఇతిపరికల్ప్యైవముక్తం। భాక్తమాహుస్తమన్యేఇతి కావున భామహుడు “భాక్తమాహుస్తమన్యే” అను తరగతిలోవాడు.

ఈదిగువవ్రాసిన శ్లోకములు భామహుడు తనగ్రంథమందుదాహరణముగ నిచ్చెను.

అహంత్వాయదినేక్షేయ క్షణమప్యుత్సుకాతతః। ఇయదేవాస్త్వతోఽన్యేన కిముక్తేనాప్రియేణతు (2-69).

వహంతి గిరయో మేఘానభ్యుపేతాన్గురూనపి। గరీయానేవహి గురూన్ బిభర్తి ప్రణయాగతాన్। (2-74).

స్కంధవానృజురవ్యాళస్స్థిరోऽనేకమహాఫలః। జాతస్తరురయం చోచ్చైః పాతితశ్చనభస్వతా। (2-80)

ఛాయావంతో గతవ్యాళాః స్వారోహాః ఫలదాయినః। మార్గద్రుమామహాంతశ్చపరేషామేవభూతయే (3-17)

ఉన్నతాలోకదయితామహాంతః ప్రాచ్యవర్షిణః। శమయన్తిక్షితేస్తాపం సురాజానోఘనాఇవ (3-13)

అయంమన్దద్యుతిర్భాస్వానస్తం ప్రతియియాసతి। ఉదయః పతనాయేతి శ్రీమతోబోధయన్నరాన్।

అనలంకృతకాంతం తేవదనం వనజద్యుతి। నిశాకృతం ప్రకృత్యైవచారోః కావాస్త్యలంకృతిః పదికావ్య గుణములనొప్పిన దండి, వామనుడు భోజుడు మొదలగు నర్వాచీన గ్రంథకర్తలవలె గాక భామహుడు, ఓజస్సు, ప్రసాదము, మాధుర్యము నను మూడుగుణములే యొప్పుకొని గుణదోషవివేచకమైన తనబుద్ధిశక్తిని వెల్లడించెను. మమ్మటుడు భామహుని మతమునే అనుసరించుచు నామూడుగుణములనే చెప్పి తక్కిన గుణములు వానిలో నంతర్భూతములనెను. "కావ్యప్ర-మాధుర్యౌజః ప్రసాదాఖ్యాస్త్రయస్తేన పునర్దశ॥ కేచిదంతర్భవంత్యేషు దోషత్యాగాత్పరేశ్రితాః। భామహుడు మాధుర్యమునకిట్లు లక్షణము చెప్పెను. "శ్రవ్యంనాతిసమస్తార్థం కావ్యంమధురమిష్యతే। ఈలక్షణమునుమమ్మటహేమచంద్రులాక్షేపించిరి. ప్రసాదగుణముతో జేరిన కావ్యముకూడ శ్రవ్యముగానుండును గావున నీలక్షణమతివ్యాప్తిదుష్టమని మమ్మటహేమచంద్రులాక్షేపించిరి. (శ్రవ్యత్వంపునరోజః ప్రసాదయోరపి కా-ప్ర-8-68).

ద్రుతిహేతుత్వం మాధుర్యస్యలక్షణం। నతుశ్రవ్యత్వం। ఓజః ప్రసాదయోరపి శ్రవ్యత్వాత్। తేనశ్రవ్యంనాతిసమస్తార్థ శబ్దంమధుర మిష్యతే ఇతి మాధుర్యలక్షణత్వేన శ్రవ్యత్వం యద్భామహేనోక్తం తన్నయుక్తమిత్యర్థః। (హేమ- కావ్యా p. 201) ఈయాక్షేపము బలమైనదని తలంచను. శ్రవ్యమనగా వినుటకింపైనది. "నాతి సమస్తార్థమ్" అను విశేషణము సమాసభూయిష్ఠమైన ఓజస్సునకు లక్షణాతివ్యాప్తిని వారించుచున్నది. ప్రసాదమనగా సారళ్యము,

ప్రసిద్ధార్థపదత్వము. స్త్రీలకు బాలులకుగూడ నర్థమగునట్లుండుట. మమ్మట
ప్రసాదగుణమును మనోద్రుతికారణమనెను. నవరసములచేతను మనస్సుకు మూ
వస్థలు కలుగునని చెప్పబడెను.

1. శృంగారకరుణశాంత రసప్రధానమగు కావ్యములను వినగా మనస్సు
కరగిపోవుట.

2. వీర రౌద్ర బీభత్సములుగల కావ్యము మనోవిస్తారమును కలిగించును.

3. హాస్యాద్భుతభయరసములుగల కావ్యము మనోవికాసమును పుట్టించును.

భామహుడు చెప్పిన ప్రసాదగుణలక్షణము మమ్మటుడు మొదలగువా
చెప్పిన లక్షణముకంటె నతిశయము గలిగియున్నది.

మమ్మటుని లక్షణములకంటె భామహుని లక్షణముల అతిశయమును పాఠకు
గ్రహించునట్లు వారుభయులు చెప్పినలక్షణముల నీక్రింద వ్రాయుచున్నాను.

"అవిద్వదంగనాబాలప్రతీతార్థం ప్రసాదవత్ (కావ్యా 2-3).

విద్వాంసులు మొదలుకొని స్త్రీలు బాలులవరకు సులభముగా దెలియనర్థ
గల ప్రసాదగుణముతోగూడినది యని భామహుని శ్లోకము తెలుపుచున్నది.

"శ్రుతిమాత్రేణ శబ్దాత్తు యేనార్థ ప్రత్యయో భవేత్। సాధారణ
మగ్రాణాం సప్రసాదో గుణో మతః। (కావ్యప్ర) సారళ్యము, వైశద్యము మ
కవనమునకు ముఖ్యముగా నావశ్యకములని అన్ని జాతులవారు నొప్పుకొనిరి సందర్భం
పదములు చిక్కుగానున్న రచనపరిత్యజింపవలెను. భామహుడీవిషయమున మిక్కి
జాగరూకుడని యీదిగువ శ్లోకము తెలుపుచున్నది.

"కావ్యాన్యపి యదీమాని వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్। ఉత్సవస్సుధియామే
హన్త దుర్మేధసో హతాః॥ ప్రహేళిక మొదలగు చిత్రరచనయందు తనకున్న అనిష్ట
నీశ్లోకముచే భామహుడు తెలుపుచున్నాడు. పదియవశతాబ్దమందున్న శ్రీవత్సాం
కమిశ్రులు తాను రచించిన యమకరత్నాకరము యొక్క ఉపోద్ఘాతలో నీశ్లోకము
భామహునిదని వ్రాసెను. భట్టి రచించిన రావణవధలో నీపదములతో గూడినదియు
నిందుకు విపరీతమగు నర్థముగలదియు నగు నొక శ్లోకము కలదు. "వ్యాఖ్యాగమమిదం
కావ్యముత్సవస్సుధియామలం। హతా దుర్మేధసశ్చాస్మిన్ విద్వత్ప్రియతయా మయా॥

(భట్టి 22-34) కవిత్వము భట్టి కవిత్వపాకమువలె గాక పండితపామరసామాన్యముగా నందఱకీ దెలియునట్లు సులభముగా నుండవలయునని భామహుని అభిప్రాయము.

అలంకారముల కుదాహరణముగా నిచ్చిన శ్లోకములన్నియు భామహవిరచితములే. తనవికాని వానిని పైవారివని యొప్పుకొనెను. భామహుడు స్వతంత్రాభిప్రాయము కలవాడనియు నితరుల అభిప్రాయములను తనసమ్మతిచే బలపర్చుటకిష్టములేనివాడనియు మూడవ పరిచ్ఛేదము కొసనున్న శ్లోకమువలన స్పష్టమగుచున్నది. "గిరామలంకారవిధిస్సవిస్తరః। స్వయంవినిశ్చిత్యధియామయోదితః। అనేనవాగర్థవిదామలంకృతావిభాతి నారీవవిదగ్ధమండనా।" భామహుడనేక గ్రంథకర్తలనెఱిగినవాడనియు వారిగ్రంథములఁ బరిశీలించెననియు అతడు తన కావ్యాలంకారములో నుదాహరించిన ప్రాచీనగ్రంథకర్తల పేర్లవలననే 2-19 తెలియవచ్చుచున్నది. అతఁడుదాహరించిన గ్రంథకర్తలపేర్లలో నొక్క మేధావి పేరుతప్ప తక్కినవారిపేర్లెచ్చటను గానరావు. అపర, అన్య, కశ్చిత్ ఇత్యాదిశబ్దములచే నితరగ్రంథకర్తలనతడు పేర్కొనియున్నాడు. అతడు నిరుపమాన పాండిత్యము, స్వతంత్రవిమర్శనశక్తిగలవాడైయున్నను గర్వవిశిష్టుడు కాడు. ఈక్రిందిశ్లోకమువలన నీయంశము స్పష్టమగుచున్నది.

"సదూషణాయాయ ముదాహృతోవిధిర్నచాభిమానేన కిముప్రతీయతే। కృతాత్మనాం తత్త్వదృశాంచమాదృశో జనోఽభిసంధింక్వ ఇవావభోత్స్యతే।" ఇట్లు భామహుడేతాదృశయోగ్యతా విశిష్టుడగుటచేతనే తరువాతబుట్టిన అలంకారికులందఱతనియందతిగౌరవమును జూపిరి.

మన మెఱిగియున్నంతమట్టు కేదోయొక రీతిగా భామహుని, అతని కావ్యాలంకారమును పేర్కొనని అలంకారగ్రంథకర్త యొకడును లేడు. కావ్యాలంకారములను గురించి వ్రాసిన గొప్ప గ్రంధకర్తలందరును భామహుని గ్రన్థమునుండి శ్లోకముల నుదాహరించియున్నారు. కొందఱతని గ్రంథములోని విషయమును కొందఱతని భాషను యెరువుదెచ్చుకొనిరి. వివాదగ్రస్తమైన యంశములయందతని వచనములు ప్రమాణభూతములైనవి. అతనిమతము నంగీకరింపనివారుకూడ నతనియందమిత గౌరవమునుఁ జూపించుచున్నారు. కావ్యకర్తలు, అలంకారశాస్త్రప్రణేతలు నాడు నేడుగాక చిరకాలమునుండీతని యందు బహుమానబుద్ధిగలవారైయున్నారు. అలంకారశాస్త్రము దాని శైశవావస్థనుండి భామహునితో సంబంధించి

యున్నది. ఇతడు మిక్కిలిప్రాచీనాలంకారికుడు. ఇతని కావ్యాలంకారము మిక్కి
పరిమాణ గ్రంథము.

భరతఖండమందున్న ప్రాచీనగ్రంథకర్తలే గాక మహాపండితులని కీర్తిం బ
సిన ఆధునికులుకూడ భామహుని పాండిత్య విశేషముచే నాకర్షింపబడుచున్నారు. ప్రాచీనశోధకులలో నొకప్పుడతని కాలమునుగురించి, అతని వృత్తాంతమునుగురించి గొప్ప వివాదజరిగెను. అందులోఁ బ్రసిద్ధులైన పాశ్చాత్య పండితులుగూడ జేరుకొనిరి. కాని యీవివాదలో వ్యవసానమేమియుఁ దేలకపోయినను యిదివరకు చరిత్రలో మరుగుపడియున్న అంశములు కొన్ని వెల్లడిచేయబడినవి.

## భామహునిగురించి జరిగిన చర్చల సంగ్రహము.

భామహునిగురించి జరిగిన విచారణలోని యనేక వికల్పములను వాని పరిష్కా
రములను యిచ్చట సంగ్రహముగా నుడువుట అస్థానముకాదు. పైనిచెప్పినట్లు భామహునిపేరు పండిత ప్రపంచములో నంతట బ్రచురమైయున్నను. మొదట వాతని గ్రంథమెచ్చట నెవ్వరికి దొరకలేదు. బువాలర్ పండితుడు (Buhler's Kashmarian Report) భామహుని గ్రంధమునశించినదని నైరాశ్యము వహించెను. 1880 సం॥లో నొకతాళపత్రకోశము Gust avoppert యొక్క జూచెను. కాని యాగ్రంథమునుగురించి యతడిచ్చిన వర్ణనమునుబట్టి దానినిగురించి మనము విస్తారముగా, దెలుసుకొనజాలము. జాకోబిపండితుడు తయారు చేసిన అలంకా
గ్రంథపట్టికలో భామహుని కావ్యాలంకారమునుగూర్చ బేర్కొనెను గాని అ
మనకంత యుపయోగకరముగాఁ గానరాలేదు. 1898 సం॥లో కేబిపాఠక్పండితు
(K. B. Pathak) ప్రకటించినకవిరాజమార్గమను నొక కర్ణాటకాలంకారశాస్త్ర గ్రంధములో నీభామహుని గ్రంధము నుదాహరించెనుగాని యదియు మనకుపయో
గించదు. భామహుని గ్రంథమును లోకమందుఁ బ్రకాశింపజేసి గ్రంథకర్తనుగురించి కొంతనిశ్చితవృత్తాంతమును దెలియజేసినవాడు బెంగుళూరు కాపురస్తుడైన R. Narasimha Chary మొదటివాడు. నాగవర్మ రచించిన కావ్యావలోకనమను క
ర్ణాలంకార గ్రంథమునకీతడు వ్రాసిన ఉపోద్ఘాతములో ప్రాచీనతలో భామహు
డు దండి తరువాతవాడనియు నీభామహుడు కావ్యాదర్శముయొక్క ప్రథమాధ్యా
యమందు దండి వెల్లడించిన అభిప్రాయములను ఖండించుటచే నీతడు దండికి

ప్రాచీనుడు కాడనియు వ్రాసెను. భామహుడలంకారశాస్త్రమునకు బ్రమాణభూతులైన వారిలో నగ్రగణ్యుడు ఈశాస్త్రమందు ప్రసిద్ధినొందిన తరువాత గ్రంధకర్తలందరు నీతని యభిప్రాయములనే తరుచుగా తమగ్రంధములయందు నుదాహరించుచున్నారు. Presidency College లో నుపాధ్యాయులై కొంతకాలము పని చేసిన రంగాచార్యులగారదృష్టవశమున నీగ్రంధము నొకప్రతిని సంపాదించిరి. ఈ గ్రంధమెప్పుడు పుట్టినదో కాలము నిర్దేశింపబడలేదు. గ్రంధకర్త ప్రాయికముగా నారవశతాబ్దముయొక్క ఆరంభమందున్నవాడని తోచుచున్నది. ఈసంగతి కన్నడ గ్రంధముయొక్క పీఠికలో వ్రాయబడియున్నది గావున చాలమంది సంస్కృత పండితులకు తెలియదు. M. T. నరసింహ అయ్యంగారు యీభామహునిగురించి వ్రాసిన యొక పెద్దవ్యాసమును చూచిన తరువాతనే మనపండితులు తమ కన్నులం దెరచిరి. చిరకాలము విమర్శకులందరు చెప్పిన సారాంశములనన్నిటిని నరసింహ అయ్యంగారుకూడ సంచరించెను. భామహుడు బౌద్ధుడనియు, దండికి తరువాతవాడనియు నాతని యభిప్రాయము. Dr. Barnet ఆసంవత్సరమందే నరసింహ అయ్యంగారి అభిప్రాయములను బలపరుచుచు భామహుడు యెనిమిదవ శతాబ్దము యొక్క ఆరంభమందుండెనని యొక చిన్నవ్యాసమును వ్రాసెను. P. V. Kane పండితుడు భామహుడు బౌద్ధుడను నరసింహ అయ్యంగారి ఊహను ఖండించుటకు బ్రయత్నించెను. గాని యతనికాలనిర్ణయమందు నరసింహఅయ్యంగారితో నేకీభవించెను. 1909 సంIIలో K. P. Trivedi ప్రకటించిన విద్యానాధుని ప్రతాపరుద్రయశోభూషణముతో జేర్చి ముద్రింపబడిన భామహాలంకారమునకతడు వ్రాసిన యుపోద్ఘాతములో భామహునిగురించి యనేకవిషయముల జర్చించెను. అతని వాదమంతయును నరసింహ అయ్యంగారి అభిప్రాయములకు వ్యతిరిక్తముగానున్నది. 1901 సంIIలో జాకొబి పండితుడు, Prof. Rangachari, 1911 లో అనంతాచార్యుడు త్రివేదీ అభిప్రాయములతో నేకీభవించిరి. భామహుని అలంకారశాస్త్రమును మొట్టమొదట గనిపెట్టినవాడైన R. నరసింహాచారి దండికంటె భామహుడు ప్రాచీనుడన్నవిషయము నదివరకున్నవిగాక మరికొన్ని నూతన హేతువుల నుపపాదించెను. ఆసంవత్సరమందే K. B. పాఠక్పండితుడు తనవాదమునకు విరుద్ధములైన వాదముల నన్నింటిని ఖండించుట కొకపత్రికనుం బ్రకటించెను. ఆమరుసటి సంవత్సరము త్రివేదీ కనపర్చిన పాఠక్పండితుని ఖండనలు పాండిత్యమును ప్రకటించునవియై యున్న నొప్పించ నసమర్థములైయున్నవి. త్రివేదీ పండితుడు వ్రాసిన యీపత్రిక

యతని విపక్షులకు వాగ్బంధమేర్పడెను. మరికొన్ని సంవత్సరములకు నీగొప్పవాదము కొక్క నూతనమైనదెద్దియును జేర్పబడలేదు.

1923 సంవత్సరములో జాకోబీపండితుడు భామహుని కాలమును నిర్ణయించుటకొకనూతనమార్గము నాలోచించెను. కేతుపండితుడుకూడ నితరనిర్వ్యాపేక్షముగా నీదారినే కనిపెట్టెను. ధర్మకీర్తి గ్రంథమునుండి భామహుడు చాలభాగము నెరువుతెచ్చుకొన్నట్లు రుజువుచేయుటకుబ్రయత్నించెను. ఇందువలన భామహుడు ధర్మకీర్తి తరువాత వాడనవలసి యున్నది. భామహుని కాలనిర్ణయమును గురించిన చర్చలో నిది కొనమాటగా నసేకులకు గానవచ్చెను.

కొనసంవత్సరములలో నలంకారశాస్త్ర గ్రంథముల కృషి బాగుగా జరిగినట్లు కానవచ్చుచున్నది. P. V. కేను:సాహిత్యదర్పణమునకు వ్రాసిన ఉపోద్ఘాతములో గనపచ్చిన నూతనశోధనకు మిక్కిలి ప్రశంసార్హుడయ్యెను. Dr. S K. De కూడ నలంకార శాస్త్రచరిత్రను వ్రాసి విద్వత్ స్తుతి పాత్రుడయ్యెను. డాక్టరు నోబెల్ యామధ్యవ్రాసి ప్రకటించిన "Foundations of Indian Poetry calcutta 1925" అను గ్రంథము, B. M. భట్టాచార్యుని వ్రాత యూపప్రకరణమందు బ్రశంసించకుండ విడువతగినవి కావు.

ఇట్లిందరిన్ని గ్రంథముల వ్రాసినను భామహుని గ్రంథముగురించినవిషయము లన్నియు నొకచోట జేర్చుటకెవ్వరు బ్రయత్నించపరైరి, అదియిప్పటికి ప్రలాపరుద్ధయశోభూషణముమొక్క యొకమూలనంధకారము లోబడి యున్నది.

కావున భామహతద్గ్రంథముల గురించి యిప్పటికి సిద్ధముగా నన్నప్రయోజనకారియగు వృత్తాంతమునంతయు నీచిన్నపత్రికలో నిమిడ్చుటకు బ్రయత్నము సలుపబడుచున్నది. ఆగ్రంథకర్తనుగురించియిప్పటున్న సిద్ధాంతములను బరీక్షించి వానిలో నెద్దియైనను క్రొత్తగా బ్రకటింపబడిన కాలముతో నవిరుద్ధముగానున్నదో లేదో పరీక్షించుటకు బ్రయత్నించెదము.

## భామహుఁడెవఁడు? అతఁడెవఁడై యుండును.

అతని కావ్యాలంకారములోఁ జెప్పబడిన దానికంటె నధికముగా భామహుని గురించి మనకేమియుఁ దెలియదు. ఇతఁడు కాశ్మీరదేశ నివాసియని ఐతిహ్యమువలనఁ దెలియుచున్నది. బుహిలర్ మొదలగువారు దీనిని నమ్మిరి. నిస్సంశయముగా రుజువు చేయుటకు సరియైన బాహ్యాభ్యంతరసాక్ష్యము లేకున్నను దీనిని మనము నమ్మకపోవుటకు సబబు లేదు. "అవలోక్య మతాని సత్కవీనా మవగమ్య స్వధియా చ కావ్యలక్ష్మ। సుజనావగమాయ భామహేన గ్రథితం రక్రిలగోమి సూనునేదమ్" అను గ్రంథాంత శ్లోకమువలన నతని పేరు భామహుఁడనియు నతఁడు రక్రిలగోమియను వాని కుమారుఁడనియుఁ దెలియవచ్చుచున్నది. రాహుల, పోత్తల, సోమిలాది శబ్దములతోను, అట్టి యితర బౌద్ధశబ్దములతోను స్వరసాదృశ్యముగల రక్రిల శబ్దము బౌద్ధసంబంధము లను సూచన చేయునని గాఁ జెప్పబడుచున్నది.

బుద్ధునియొక్క శిష్యులలో నొకఁడైన వానిపేరునకు స్మారకమైన గోమిన్ శబ్దమునుబట్టి యాలోచింపగా నీసూచన దీనిని బలపర్చుచున్నది. పాఠకపండితుఁడు గోమిన్ శబ్దము పూజ్యవాచకమని చెప్పెను. (గోమిన్పూజ్యే) చాంద్ర వ్యాకరణములో గోమిన్పూజ్యే॥ అను సూత్రమునుఁ గనపర్చి యిది పూజ్యవాచకమని చెప్పెను. భామహుని గ్రంథాదియందున్న "ప్రణమ్య సార్వం సర్వజ్ఞం మనోవాక్కాయకర్మభిః। కావ్యాలంకార ఇత్యేష యథాబుద్ధి విధాస్యతే॥" అను శ్లోకములో నున్న సార్వసర్వజ్ఞ శబ్దము బుద్ధుని జెప్పుచున్నది. వ్యుత్పత్త్యర్థమునుబట్టి సార్వశబ్దము బుద్ధుఁ డుపదేశించిన సిద్ధాంతమగు సర్వభూతదయతో సంపదించుచున్నది. హేమచంద్రుఁ డభిధాన చింతామణిలో "స్యాద్వాద్యభయద స్సార్వ స్సర్వజ్ఞ స్సర్వదర్శి కేవలినా", అని సార్వశబ్దమును జినపర్యాయములలో బఠించెను. జినదేవమునీశ్వరుఁడు అభిధాన చిన్తామణిశిలోంఛమందు జినపర్యాయములలోనే పఠించెను. సర్వీయ అను పదమును కూడ నాపర్యాయములలోఁ జేర్చెను.

అనేకములైన బౌద్ధనామములను జైనులు ధరించుటచేత నీసార్వశబ్దము ప్రాచీనముగా బుద్ధనామమని మనమనుకొనవచ్చును. బుద్ధునికి సర్వజ్ఞుఁడను పేరు సర్వజ్ఞస్సుగతో బుద్ధః॥ అని అమరకోశమందుఁ బ్రసిద్ధము.

ఈయంశములను విచారింపగా భామహుఁడు బౌద్ధుఁడని సమర్థించుటకీ యుక్తులు దృఢమైనవి గావని మనమొప్పుకొనవచ్చును. Kane పండితుఁడు చెప్పినట్లు

పేరులో నేమియు లేదు. హిందువులు బౌద్ధులు కలిసి యనేకశతాబ్దములీ దేశమున నివసించియుండుటచే నొకరి పేరు మరియొకరు పెట్టికొనిరనుట శాస్త్రీయము. ఒకరిపేరు మరియొకరు పెట్టుకొనుట అన్యజాతివారగు మహమ్మదీయులకు హిందువులకు సాధ్యముగా గానవచ్చినపుడు హిందువులకు బౌద్ధులకు మరింత సంభావ్యముగా గానవచ్చుచున్నది. పదునొకండవ శతాబ్దమునకు ముందు బుద్ధుడు విష్ణ్వవతారముగా మనవారిచే నెన్నుకొనబడెను. గోమిన్ శబ్దము బౌద్ధులలోనే కాక మనలోగూడ పూజ్యవాచకమనుటకు త్రివేదీపండితునితో మనమేకీభవింపవచ్చును. ఇది గోస్వామి శబ్దముయొక్క సంగ్రహరూపము. ఈశబ్దము దక్షిణదేశమందాచార్య శబ్దమువలె గాశ్మీరదేశమందు ఉత్తరహిందూస్థానమందు బ్రాహ్మణుల పేరుకొనను కట్టి పలుకబడును. ఒకగ్రంథకర్తయొక్క మతమతడు వ్రాసిన గ్రంథమందలి పద్య పాద్యాంశములబట్టి తెలియును. వాని పేరుచేత గాదు. భామహుని కావ్యాలంకారములో వెచ్చటను బుద్ధుని చరిత్రాంశములుగాని బౌద్ధమత సంబంధమైన కథలుగాని వెదకినను గానరావు. గ్రంథాదియందున్న "సార్వసర్వజ్ఞ" అను మంగళశ్లోకము బుద్ధునికి నమస్కారమును బోధించుచున్నది. సార్వశబ్దమునకు (సర్వస్మైహితః) అందరికి హితమైనవాడని యర్థము. "హితప్రకరణేనాంచ సర్వశబ్దాత్ప్రియుజ్యతే తతశ్చమిష్ట్యాచయథా సార్వస్సర్వము ఇత్యపి (కా-6-53) పాణిని సర్వపురుషాభ్యా ణడఢౌ (V-1-10) ఇతియకాని యేనిఘంటుకారుడును కేవలము బుద్ధునిపర్యాయములలో బఠింపలేదు. సర్వజ్ఞశబ్దము బుద్ధునికి శివునిగూడ పొందుపైయున్నది. "కృశో శేతాస్సర్వజ్ఞో దూర్జటిర్నీలలోహితః, సర్వజ్ఞస్సుగతో బుద్ధః" అని అమరకోశము. కుమారిలభట్టుడు శ్లోకవార్తికములో సర్వజ్ఞశబ్దము పరమాత్మపరముగాని బుద్ధుని జెప్ప దనిసమర్థించెను. బౌద్ధమతస్థుడైన అమరసింహుడు తానువ్రాసిన అమరకోశములో బుద్ధునిసామములలో సార్వశబ్దమును జెప్పలేదు.

భామహుడు బౌద్ధుల అన్యాపోహవాదమును యేబౌద్ధగ్రంథకర్తకు గ్రాహ్యమగుటకు శక్యముగాని భావతో ఖండించెను. "అన్యాపోహేన శబ్దోర్థ మాహేత్యన్యేప్రచక్షతే, అన్యాపోహశ్చనామాన్య పదార్థః పాకృతిఃకిలయది గౌరిత్యయం శబ్దఃకృతార్థోఽన్య నిరాకృతౌ। 'జనకోగవిగోబుద్ధేర్మృగ్యతామపరోధ్వని'॥ (కావ్య. VI-16, 17) వేదములను వైదికకర్మలను స్తుతిగర్భితములైనశబ్దములతో బ్రశంసించెను. సోమపానముజేసిన రాజులను మిక్కిలి శ్లాఘించెను. (భూభృతాం పీతసోమానాం స్వాశయ్యేవ ర్త్మనితిష్ఠతాం। అలంకరిష్ణునావంశంగుణో పతిజిగీషతాం ---

(కా-4-48) కావ్యాలంకారములో నాతడిచ్చిన ఉదాహరణములలో బ్రాహ్మణుల పేరులనే పేర్కొనెను. (కా-2-55) యుగాదౌ భగవాన్ బ్రహ్మవినిర్మిత్సురివ ప్రజాః) సమగ్రగగనాయామమానదండో రథాంగినః। పాదో జయతి సిద్ధస్త్రీముఖేందు నవదర్పణః (III-36) విదధానా కిరీటేందూ శ్యామాభ్రహిమసచ్ఛవీ। రథాంగశూలే బిభ్రాణౌ పాతాం వశ్శంభుశార్ఙ్గిణౌ (4-21) కాంతే ఇందుశిరోరత్నే ఆదధానే ఉదంశుకే। పాతాం వశ్శంభుశార్ఙ్గిణౌ... ( 4-27 ) భామహుడు కామదహనమును చక్కగా వర్ణించెను (సపక్షస్త్రీణి జయతి జగతి కుసుమాయుధః। హతావితేనం యస్యశంభునాన హృతం బలం (III-25) రామాయణకధలనుతరుచుగా నను సంధించును. రామ పరశురామ సమావేశము, రాముడు దండకారణ్యమునకుం బోవుట. సప్తతాలప్రభేదనము, సీతాన్వేషణము, మొదలగు ప్రసిద్ధమయిన కధలను భామహుడు కావ్యాలంకారమందు జెప్పెను. (అత్యాజయద్యథా రామః స్వాత్మతో వథా శ్రియమ్। జామదగ్న్యం యథాజిత్వా సాక్షేయామోపబాధినీ (5-44) ఉదాత్తశక్తిమాన్ రామో గురువాక్యానురోధకః। విహాయోపనతం రాజ్యం యథావనముపాగమత్ (3-11) రామస్సప్తాభినత్తాలాన్ (3-32) ఉపలప్స్యేస్వయం సీతామితి భర్త్రాని దేశతః। హనూమతా ప్రతిజ్ఞాయ సాజ్ఞాతేత్యర్థ సంశ్రియా ( 4-37 ) కావ్యాలంకారమందు భామహునిచే జెప్పబడిన రామాయణములోని ముఖ్యకధలివి.

భారతకధలింతకంటె హెచ్చుగా నున్నవి. మహాభారతములోని ముఖ్యమైన కధాపురుషులిందులో జేర్చబడిరి. ఊర్జస్వికర్ణేన యథాపార్థాయ పునరాగతః। ద్విస్సందధాతి కిం కర్ణః శల్యేత్యహిరపాకృతః। (3-7) ప్రియోపవేశాయ యథా ప్రతిజ్ఞాయసుయోధనః। రాజ్యాయపునరుత్థాపితి ధర్మవిరోధనీ (V-41) పురువు తన తండ్రియైన యయాతికి తనయౌవనమిచ్చి వాని ముదుసలితనమును తీసికొనుట, భీష్ముడా మరణాంతము బ్రహ్మచారియై యుండునని ప్రతిజ్ఞజేయుట, యీ కావ్యాలంకారమందు జెప్పబడినవి. (జరామేష బిభర్మీతి ప్రతిజ్ఞాయ పురుర్యథా। కైవపురుణా భారిసాస్యాద్ధర్మనిబంధినీ। (V-36) అద్యారభ్య నివత్స్యామి మునివత్ పచనాదితి పితుః ప్రియాయ యయా భీష్మశ్చక్రే సా కామబాధినీ (V-43) అట్లనే శకుని యుధిష్ఠిరుల జూదము (ఆహూతో న నివర్తేయద్యూతాయేతి యుధిష్ఠిరః। కృత్వా సన్ధాం శకునినా దిదే వేత్యర్థబాధినీ। ( V-42 ) భీముని దుశ్శాసనోరస్థ్సలరక్తపానము. భ్రాతుర్భ్రాతృవ్యమున్మథ్య పాస్యామ్యస్యాసృగాహవే। ప్రతిజ్ఞాయ యథా భీమస్తచ్చకారావశోరుషా (V-39) ఇంక నితర కధలుకూడ చెప్పబడినవి.

శ్రీకృష్ణుడు తనయింటికివచ్చినపుడు విదురుడు పొందిన పరమానందమును భామహుడు చక్కగా వర్ణించెను. "తదా గృహాగతం కృష్ణమవాదీద్విదురో యథా। అద్యయా మమ గోవింద జాతాత్వయి గృహాగతే। కాలేనైషా భవేత్ప్రీతి స్తవైవాగమనాత్పునః॥ (III-5) సమారుతాకంపితపీతవాసా బిభ్రత్సలీలం శశిభాసమబ్జమ్। యదుప్రవీరః ప్రగృహీత శార్ఙ్గః। సేంద్రాయుధో మేఘ ఇవాబభాసే (3.41). మరియొక శ్లోకమందు ప్రద్యుమ్నుడు చంద్రవంశపురాజులకు కూటస్థుడైన ఐలపురూరవునితో గణి చెప్పబడెను. (భరత స్త్వం దిలీప స్త్వం త్వమేవైలః పురూరవాః। త్వమేవ వీర ప్రద్యుమ్న స్త్వమేవ నరవాహనః (V-59) ఈ రామాయణ మహాభారతాది కథలేగాక గుణాఢ్యుడు బృహత్కథలో వర్ణించినట్లు వత్సరాజు అతని కుమారుడగు నరవాహన దత్తుడు చంద్రగుప్తమౌర్యునికి సచివుడైన చాణక్యుడుకూడ నీకావ్యాలంకారమందుఁ బేర్కొనబడిరి.

కావున బూర్వోక్తమైన ప్రమాణములనుబట్టి యాలోచింపగా నిదివరకొక మతము నవలంబించి యున్నవాడు గొప్పగ్రంధమును వ్రాయుచున్నపుడు దానిమూలము కోరు స్వమతమును పూర్ణముగా మరచిపోవుననుట ఆశ్చర్యమైన విషయము. బౌద్ధులలో పురాణకథలకు కరువులేదు. వానిని వ్రాయుటకతనికిష్టమున్నయెడల వా కథలనుకూడ వ్రాసియుండవచ్చును. నమిసాధు మొదలగువారి బౌద్ధగ్రంథముల జూచినయెడల వారు వారిగ్రంథములయందిచ్చిన యుదాహరణములన్నియు వారిమతగ్రంధములనుండియే తీసిరని స్పష్టమగుచున్నది. అప్పుడప్పుడు భామహుడు బౌద్ధుల అపోహవాదమును ఖండించునపుడు వారి అభిప్రాయము విషయమై కొంచమాగ్రహమునుగూడ జూపించువాడు. శంకరాచార్యులరాకముందు బౌద్ధుల ప్రాబల్యమెట్లుండెనో మహారాజులనుకూడ పాదాక్రాంతుల నట్లెట్లుచేసెనో దానినంతయు ననుస్మరించినయెడల వైదికమతముకు బౌద్ధులకున్న ద్వేషము చెప్పుటకు శక్యముగాకుండ నుండును. ఈయంశములు మన గ్రంథకర్తయగు భామహుడు హిందువని నమ్ముటకు దృఢమైనవియని మనమొప్పుకొనవచ్చును. అతడు బౌద్ధుడని సమర్థించుటకుఁ జెప్పబడిన వాదముకూడ నసారమైనదని యొప్పుకొనవలెను. నిశ్చాయకము నిర్వివాదమునగు సాక్ష్యము మనకు దొరకునంతవరకు నిది యిట్లేయుండును. ఈమధ్యకాలమందు మనకుదెలిసిన యంశముల దార్ఢ్యమునుబట్టి భామహుడు బౌద్ధుడైయుండుటకంటె హిందువేయని మనము విశ్వసించుకొనవచ్చును.

## భామహుని కాలనిర్ణయము.

భామహుని గురించి ముఖ్యముగా నాలోచింపదగిన విషయమేమనగా నతని కాలమును నిర్ణయించుట. కొన్నిసంవత్సరములు పాశ్చాత్య పండితుల (Orientalists) తీవ్రవివాదకదికారణమైయుండెను. చిరకాలమతిశ్రద్ధతోఁ జేసిన యావిమర్శనకు భామహుని కాలమును సరిగా నిర్ణయించుటయే ఫలమయి యుండునని మనమనుకొనవలయును. కాని దైవయోగముచే ఫలము విపరీతమయ్యెను. ఇప్పటికిసంశయమించుకంతయు విడలేదు. ఈవిషయమును నిశ్చయపరచుటకప్పుడప్పుడు ప్రతిపాదింపబడిన హేతువుల నన్నింటినిచట విశదముగాఁ జెప్పదలఁచుకొంటిమి.

భామహుడు తక్కిన గ్రంథకర్తలవలె తనగ్రంథమందెచ్చటను తానేకాలపు వాడో తెలుసుకొనుటకు దగిన మర్మమును వ్రాయలేదు. సరిగా నతని కాలమును నిర్ణయించుటకు దెలిసిన యేదోయొక మూలమునుండి అంతసాక్ష్యమును గాని సంపాదించుటకు మార్గమెద్దియు లేదు. మన మెఱిఁగిన విషయమునుపట్టి యాతని కాలమున కీవలావలనుండు సరిహద్దులను కనుగొనుటకు ప్రయత్నించుటయే మనము చేయగలపని. ఇదికూడ మనకు గాఢ్యసాధకముగాఁ గానరాదు. అర్వాచీన గ్రంథకర్తలగ్రంథము లలో నుదాహృతములైన యతని శ్లోకములపట్టి యతనిపేరు ననుసంధించుటను పట్టి అతని కాలముయొక్క దిగువ పరిహద్దు నతికష్టముతో నిర్ణయింపగలము.

భామహుని శ్లోకముల నుదాహరించిన వారిలో నానందవర్ధనుడు మొదటి వాడు, ఎట్లనగా;

### 206 పేజీ ధ్వన్యాలోకము.

సైషాసర్వత్రవక్రోక్తిరనయార్థోవిభావ్యతే। యత్నోస్యాం కవినాకార్యః కోలంకారోఽనయావినా॥.

ఉద్భటుడు భామహుని కావ్యాలంకారమున కొకవివరణమును వ్రాసెనని తరువాత ఆలంకారికులవలన మనము తెలుసుకొనుచున్నాము. ఎట్లనగా; “విశేషోక్తి లక్షణేచ భామహవివరణే భట్టోద్భటేన ఏకదేశవత్ ఏవంవ్యాఖ్యాతో యధేహాస్మాభిర్నిరూపితః। (ప్రతిహారేందురాజు వ్రాసిన ఉద్భట కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యానము)

భామహోక్తం "శబ్దచ్ఛందోభిధానార్థః" ఇత్యభిధానస్య శబ్దాద్భేదం వ్యాఖ్యాతుం భట్టోద్భటో బభాషే (అభినవగుప్తాచార్యుని ధ్వన్యాలోకలోచనం పే 10)

భామహస్యఖాద్యుక్తిదీయం రూపమభిమతం తాదృగుదాహరణేన దర్శితం (39 పే.లోచనం)

తస్మాదడ్డలికా ప్రవాహేనగుణాలంకారభేద ఇతి భామహవివరణే యద్భట్టోద్భటోభ్యధాత్ తన్నిరస్తమ్ (హేమచంద్రుని కావ్యాలంకారచూడామణి 17 పే.110)

అవిచళద్భానామాకులతాచేలితస్య హేతూన్ప్రచక్షతే ఇతి భామహీయే। వాచామనాకులత్వేపి భావికం ఇతి చోద్భటలక్షణే (అలంకారసర్వస్వ పే 183)

ఉద్భటుడు వ్రాసిన కావ్యాలంకారసంగ్రహమును భామహుని కావ్యాలంకారములో తైపారు వేసినయెడల ఉద్భటుడు భామహుని గ్రంథముపై వ్యాఖ్యానము వ్రాయుటచే తృప్తినొందక దానిలోని విషయమునే స్వేచ్ఛగా తనగ్రంథమందు సంగ్రహించినట్లు కానవచ్చుచున్నది. ఇకముందు కనపర్చబడబోవునట్లు భామహలక్షణములనేగాక భామహుని గ్రంథమందుండు శ్లోకములనే సరిగా తనగ్రంథమందెక్కించెను. (See De's History of Sanskrit Poetics vol 1 p. 45).

అందు కుదాహరణముగా గొన్ని శ్లోకములను జూడుదుము.

| భామహుడు. | ఉద్భటుడు. |
|---|---|
| 1. రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసంయథా॥ | 1. రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసాదయం॥ |
| 2. నిమిత్తతోవచోయత్తు లోకాతిక్రాన్తగోచరం। మన్యన్తేతిశయోక్తిం తామలంకారతయాయథా॥ | 2. నిమిత్తతోవచోయత్తు లోకాతిక్రాన్తగోచరం। మన్యంతేతిశయోక్తిం తామలంకారతయాబుధాః॥ |
| 3. ససందేహం వచస్తుత్యైససందేహం విదుర్యథా॥ ఉపమానేనతత్త్వంచభేదంచవదతః పునః॥ | 3. ఉపమానేన తత్త్వంచభేదంచవదతః పునః। ససందేహంవచస్తుత్యైససందేహం విదుర్బుధాః॥ |

## భామహుడు.

4. తుల్యకాలే క్రియే యత్రవస్తుద్వయ సమాశ్రయే। పదేనైకేన కథ్యేతే సహోక్తిస్సా మతా యథా॥

5. అపహ్నుతిరభీష్టా చ కించిదన్తర్గతోపమా। భూతార్థాపహ్నవాదస్యాః క్రియతే చాభిధా యథా॥

6. అవివక్షితసామాన్యా కించ్చోపమయా సహ। అతద్గుణక్రియాయోగాదుత్ప్రేక్షాతిశయాన్వితా॥

7. భూయసాముపదిష్టానామర్థానామసధర్మణాం। క్రమశో యోఽనునిర్దేశో యథాసంఖ్యం తదుచ్యతే॥

8. అధికారాదపేతస్య వస్తునోఽన్యస్య యా స్తుతిః। అప్రస్తుతప్రశంసేతి సా చైవం కథ్యతే యథా॥

9. పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే॥

10. ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా। ఆక్షేప ఇతి తం సన్తః శంసన్తి ద్వివిధం యథా।

11. క్రియాయాః ప్రతిషేధే యా తత్ఫలస్య విభావనా। జ్ఞేయా విభావనైవాసౌ సమాధౌ సులభే సతి॥

12. గుణస్య వా క్రియాయా వా విరుద్ధాన్యక్రియాభిధా। యా విశేషాభిధానాయ విరోధం తం విదుర్బుధాః॥

13. భావికత్వమితి ప్రాహుః ప్రబన్ధవిషయం గుణం। ప్రత్యక్షా ఇవ దృశ్యన్తే యత్రార్థా భూతభావినః॥

## ఉద్భటుడు.

4 తుల్యకాలే క్రియే యత్ర వస్తుద్వయసమాశ్రయే। పదేనైకేన కథ్యేతే సా సహోక్తిర్మతా సతామ్॥

5. అపహ్నుతిరభీష్టా చ కించిదన్తర్గతోపమా। భూతార్థాపహ్నవేనాస్యా నిబంధః క్రియతే బుధైః॥

6. సామ్యరూపావివక్షాయాం వాచ్యే వాద్యాత్మభిః పదైః। అతద్గుణక్రియాయోగాదుత్ప్రేక్షాతిశయాన్వితా॥

7. భూయసాముపదిష్టానామర్థానామసధర్మణాం। క్రమశో యోఽనునిర్దేశో యథాసంఖ్యం తదుచ్యతే॥

8. అధికారాదపేతస్య వస్తునోఽన్యస్య యా స్తుతిః। అప్రస్తుతప్రశంసేయం ప్రస్తుతార్థానుబంధినీ॥

9. పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే। వాచ్యవాచకవృత్తిభ్యాం శూన్యేనావగమాత్మనా॥

10. ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా। ఆక్షేప ఇతి తం సన్తః శంసన్తి కవయస్సదా॥

11. క్రియాయాః ప్రతిషేధే యా తత్ఫలస్య విభావనా। జ్ఞేయా విభావనైవాసౌ సమాధౌ సులభే సతి॥

12. గుణస్య వా క్రియాయా వా విరుద్ధాన్యక్రియావచః। యద్విశేషాభిధానాయ విరోధం తం ప్రచక్షతే॥

13. భావికత్వమితి ప్రాహుః ప్రబన్ధవిషయం గుణం। ప్రత్యక్షా ఇవ దృశ్యన్తే యత్రార్థా భూతభావినః॥

వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తిలో భామహుని గ్రంథము నుదాహరించెను. (4-2-1).

వామనుడు కావ్యాలంకారసూత్రమును రచించుటలో భామహునికి మిక్కిలి ఋణపడెనన్న సంగతినిక ముందు కనపర్చగలము. వామనుడు తనగ్రంథమందు కొన్ని చోట్ల భామహుని శ్లోకములకు దండాన్వయమును గల్పించి సూత్రరూపము గాను మఱికొన్నిచోట్ల భామహుని అభిప్రాయములనే గ్రహించినట్లు కానవచ్చుచున్నది. ఎట్లనగా భామహుడుపమాప్రకరణమందు ప్రతిపాదించిన విషయములనే వామనుడు తనగ్రంథమందుచెప్పెను. ఈశ్వవర్ధనునిదని భామహుడుదాహరించిన శ్లోకము నొక దానిని వామనుడు తనఅలంకార సూత్రమందుదాహరించెను. ఎట్లనగా;—నను యది ధర్మన్యూనత్వముపమానస్య దోషః కథమయంప్రయోగః॥

"సూర్యాంశుసం మీలితలోచనేషు దీనేషుపద్మానిలనిర్మదేషు, సాధ్వ్యస్స్వగేహేష్వివభర్తృహీనాః కేకావినేశుశ్శిఖినాం ముఖేషు॥

అత్రబహుత్వముపమేయధర్మాణా ముపమానాత్, నవిశిష్టానామేవ ముఖానాముపమేయత్వాత్. తాదృశేష్వేవకేకావినాశస్య సంభవాత్॥

(V-2-38 సూత్రమందు వామనుడు భామహుని (II-27) "సానంగం మా భంగురం" అనుశ్లోకమును కొంచెముదాహరించెను. అట్టి భాషాసాదృశ్యము. అట్టి అభిప్రాయ సాదృశ్యము బాగుగా విమర్శింపగా నిది యాదృచ్ఛికముగా నేరదు. స్థిరప్రసిద్ధిగల యొకగ్రంథకర్త గ్రంథముతో సమానముగా జేయుటకట్లు వ్రాయబడినది.

పూర్వోక్తాంశములనుబట్టి విచారింపగా భామహుడుద్భట వామనులకంటె ముందువాడని స్పష్టమగుచున్నది. ఉద్భటుని కాలము సరిగా నిర్ణయింపబడవచ్చును. ఉద్భటుని కావ్యాలంకార సార సంగ్రహమునకు బానేహత్తి వ్రాసిన ఉపోద్ఘాతమును చూడుము.

## భట్టోద్భటుడు.

డె అలంకారచరిత్రము. ప్రథమసంపుటము. 75 పేజీ చూడుము. (భామహుని కావ్యాలంకారమునకు వివరణమును వ్రాసినవాడు తనకావ్యాలంకార సార సంగ్రహమందు పైన నేను చూపించునట్లు భామహుని శ్లోకములనే యెత్తివ్రాసినవాడు నైన ఉద్భటుడు ఆనందవర్ధనుకు ధ్వనిసిద్ధాంతమును ప్రకటనచేయుటకు ముమ్మొ

జీవించినవాడు. ఈయానందవర్ధనుడు 9వ శతాబ్దముయొక్క మధ్యమునున్నవాడు. ఇతడు భట్టోద్భటుని తన ధ్వన్యాలోకమందు రెండుచోట్లఁ బేర్కొనెను. పే-96 "స్వాలంకారాంతర ప్రతిభాయామపి శ్లేషవ్యపదేశో భవతీతి దర్శితం భట్టోద్భటేన, పే. 108 అన్యత్ర వాచ్యత్వేన ప్రసిద్ధో యోరూపకాదిరలంకారః సోఽన్యత్ర ప్రతీయమానతయా బాహుల్యేన ప్రదర్శితస్తత్ర భవద్భిర్భట్టోద్భటాదిభిః, భట్టోద్భటుడను పేరు కాశ్మీరదేశస్థుడై యుండవచ్చునని తెలియఁజేయుచున్నది.

ఒకభట్టోద్భటుడు. 779-813 A D లో కాశ్మీరదేశము నేలిన జయాపీడుని సభాపతిగా నుండెనని కల్హణుడు రాజతరంగిణి IV-495 శ్లోకములోఁ జెప్పెను. బుహిలర్ పండితుడు కాశ్మీరదేశపు వృత్తాంతనివేదికలో కావ్యాలంకారసంగ్రహమును వ్రాసిన యుద్భటుడే యీయుద్భటుడని చెప్పెను. ఈయుద్భటైక్యము నొప్పుకొని జాకోబీపండితుడు చూపించినట్లిది జయాపీడుని పరిపాలనలో మొదటి భాగమందుండెనని యూహింపవలెను. ఈజయాపీడుడు విశేషముగాఁ బీడించుటవలన బ్రాహ్మణులకు విరాగమును గలిగించెను. కావున ఉద్భటుడు యెనిమిదవ శతాబ్దము కొసను 9 వ శతాబ్దము మొదటను జీవించియుండవచ్చును.

ఇతని నానందవర్ధనాచార్యుడు తనధ్వన్యాలోకమందుఁ బేర్కొనెను. రాజతరంగిణీ కర్తయగు కల్హణుడీ జయాపీడుని సభాపతియని చెప్పెను. ఈ జయాపీడుడు 779 మొదలుకొని 813 వరకు కాశ్మీరదేశము నేలెను. కాని యీరాజు దుష్పరిపాలనముచేఁ బండితుల కనిష్టుడాయెను. కావున ఉద్భటుడు క్రీస్తుశకము 800 ముందు జీవించినవాడై యుండవచ్చును. కాబట్టి ఉద్భటుని వైదుష్యప్రసిద్ధి యెనిమిదవ శతాబ్దము కొసభాగమందని చెప్పవచ్చును. అతనికాలము దాదాపుగా యెనిమిదవ శతాబ్దమని చెప్పవచ్చును.

వామనునికాలముకూడ నట్లనే నిశ్చయింపవచ్చును. తొమ్మిదవ శతాబ్దమందు జీవించిన రాజశేఖరుడు వామనుసిద్ధాంతమును తన కావ్యమీమాంసలో నెత్తికొనెను. కవయోఽపి భవంతీతి వామనీయాః (కావ్య-మీ-14 పే) ఇది వామనుని కాలనిర్ణయమునకు క్రిందిసరిహద్దు. అతడు 900 లకు ముందువాడైయుండవచ్చును. వామనుడుత్తర రామచరిత్రమునుండి "ఇయంగేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః"

అను శ్లోకమును మాలతీమాధవమునుండి "పక్ష్మాలీపింగళిమ్నః" అను శ్లోకము (5-2-18) నుదాహరించెను. భవభూతి 700-750 మధ్యను జీవించెను. కాబట్టి వామనుడు 750 కు తరువాతవాడు.

కాశ్మీరదేశాధీశ్వరుడైన జయాపీడునికి మంత్రిగానున్న మరియొక వామనుని రాజతరంగిణీకారుడు చెప్పియున్నాడు. (మనోరథశ్శంఖదత్తశ్చటకస్సంధిమాంస్తథా, బభూవుః కవయస్తస్యవామనాద్యాశ్చమంత్రిణః రాజతరంగిణీ IV-497) కాశ్మీరదేశపు రాజైన జయాపీడునికి మంత్రియగు వామనుడు కావ్యాలంకారసూత్రములను వ్రాసిన వామనుడు నొకటేయని పండితులలో నొక ఐతిహ్యముగలదు. Buhler పండితుడీ ఐతిహ్యమును నమ్మెను. దీనిని మనము నమ్మకపోవుటకు సబబు లేదు. కావున పైనంబాపించినట్లుద్భటుడు వామనుడు సుమారు సమకాలికులు. వారుభయులుపరస్పరస్పర్ధాళువులనిచెప్పవచ్చును. ఒకరుమరియొకరిని తనగ్రంథమందు జెప్పలేదు. కాబట్టి వీరిరువురు దాదాపుగా 800 సంవత్సరములలో నున్నవారు.

శాంతరక్షితుడు భామహుని కావ్యాలంకారమునుండి మూడుశ్లోకములను తన తత్త్వసంగ్రహములో నుదాహరించెను. ఆగ్రంథమునకు వ్యాఖ్యానమువ్రాసిన కమలశీలుడీ శ్లోకములు నిశ్చయముగా భామహునివని చెప్పెను. శాంతరక్షితుడు 705 మొదలుకొని 762 వరకు జీవించెను. ఈవిధముగా 700 భామహుని కాలమునకు ఎగువ నుండు అవధిగా నిశ్చయముగా గ్రహింపవచ్చును. వానికాలముయొక్క దిగువఅవధి బాణునిబట్టి నిర్ణయింపబడునని యికముందు మేము కనపర్చబోదుము.

ఇపుడు భామహుని కాలమున కుత్తరావధినిగురించి చర్చించెదము. ఇదియే మిక్కిలి కష్టమైనవిషయము. ఈవిషయమందనేకులనేక విధములుగా నూహించిరి. ఆయూహల నొకదానితరువాత మరియొకదానిని తీసికొని విమర్శించెదము.

భామహుడు తనగ్రంథములో నొకచోట న్యాసకారుని జేర్కొనెను. భామహుని కాలమును నిర్ణయించుటకీ యంశము గొప్పసహాయము నొసర్చునని కొందరు పండితులాలోచించిరి. చిరకాలమీవిషయమై తీవ్రమైన వాదములు జరిగెను. మొదటనీవిమర్శనను లేవనెత్తి (తనప్రతిజ్ఞనునిర్వహించుటకు) తన వైదుష్య శక్తినంతయును వినియోగపర్చి వివరించినవాడు Prof. K. B. Pathak. భామహుడు చెప్పిన న్యాసకారుడు కాశికావివరణపంచికయను గ్రంథమును వ్రాసిన

జినేంద్రబుద్ధియను నొక బౌద్ధపండితుడని పాఠక్పండితుడు కనుగొనెను. చైనాదేశపు బాటసారియగు ఇత్సింగు (Itsing) వచన ప్రామాణ్యమువలన నేడవశతాబ్దము వాడని చెప్పెను. అతడీయూహను మూలముచేసుకొని భామహుడెనిమిదవ శతాబ్దము వాడని నిర్దేశించెను. కాని త్రివేదీపండితుడు తాను ప్రకటించిన ప్రతాపరుద్ర యశోభూషణోపోద్ఘాతలో పాఠక్పండితుని వాదము యినుకలో పువాదివలె నిలవని దని సమర్థించెను. ఈవిషయములో వాదించుచున్న పండితులందరు త్రివేది పండితుడు చెప్పిన హేతువులు మిక్కిలి బలముగా నున్నవని యతనిపక్షమును బల పర్చిరి. అతడు మొదట నీవాదమునకుత్పాదకుడైన పాఠక్పండితునే తనబలమైన యుక్తులచేకొనతొప్పించెను.

భామహుని కావ్యాలంకార సంగ్రహములో వ్యాసకారునిః చేర్కొన్న శ్లోకములివి.

శిష్టప్రయోగమాత్రేణ న్యాసకారమతేనవా। తృచాసమస్తషష్ఠీకంనకథంచి దుదాహరేత్। సూత్రజ్ఞాపకమాత్రేణ వృత్రహన్తాతదోదితః। అకేనచనకుర్వీతవృత్తిం తద్గమకోయథా। ఈశ్లోకముల తాత్పర్యమేమనగా తృజంతమైన శబ్దముతో సమాస మును చేయగూడదు. న్యాసకారమతానుసారముగాగాని మహాకవి ప్రయోగాను సారముగాగాని షష్టివిభక్తి ప్రత్యయముతో సమాసముచేయఁగూడదు. పాణిని సూత్రము జ్ఞాపకమనిచెప్పి "వృత్రహంతా" అను సమాసముసు చేయఁగూడదు. షష్టివిభక్త్యంత శబ్దములకు అకప్రత్యయాన్తశబ్దములతో సమాసముండగూడదు. అందుకుదాహరణముగా "తద్గమక" అనిసమాసముండగూడదు. భామహుని ఆశయ మేమనగా;—తృజకాభ్యాంకర్తరి. (II-2-15) అను పాణిని సూత్రమునను సరించ వలెను. తృజన్తములతోను అకప్రత్యయాంతములతోను షష్టిసమాసము చేయగూడదు. కావున అపాంస్రష్టా। వజ్రస్యభర్తా। ఓదనస్యపాచకః। ఇత్యాదితృజంతములకు షష్టి సమాసము కలగదు. జినేంద్రబుద్ధి కాశికావివరణపంచికలో నట్టి సమాసముల ప్రయోగమునుగురించి యిట్లు వ్రాయుచున్నాడు.

"అథకిమర్థంతృచః సానుబంధస్యోచ్చారణమ్। తృనోనివృత్త్యర్థం। నైత దస్తితద్యోగేన లోకావ్యయేత్యాదినాషష్ఠిప్రతిషేధాత్। ఎవంతర్హి ఏతదేవ జ్ఞాపకంభవతితద్యోగేపిక్వచిత్ షష్ఠీభవతీతి। తేన "భీష్మఃకురూణాం భయశోక హంతా" ఇత్యేమాదిసిద్ధంభవతి".

ఈ పైవాక్యము తృజకాభ్యాంకర్తరి అను సూత్రముతో (II-2-15) సంబంధించియున్నది. ఇచ్చట న్యాసకారుడు తృచ్ లోనుండు చకారానుబంధము యొక్క ఉపయోగమును చర్చించుచున్నాడు. పాణిని తృజకాభ్యామ్'' అనుటకంటె ''త్రికాభ్యామ్'' అని సుఖముగాఁ జెప్పవచ్చును. మధ్యచకారమెందుకుఁ బెట్టియున్నాడు? తృన్ ప్రత్యయమును వ్యావర్తించుటకు తృచ్ అన్నాడని జినేంద్రబుద్ధి యీప్రశ్నమునకు సమాధానము చెప్పియున్నాడు. ఇచ్చట మరియొక చిక్కున్నది. ''నలోకావ్యయనిష్ఠా ఖలర్థతృనామ్. (II-3-69) అను సూత్రమును పట్టి షష్ఠ్యంతశబ్దములతో తృన్ వాడుక చేయబడదు. ఇచ్చట షష్టిసమాసమున కవసరము లేదు. తృజంతశబ్దములతో షష్టివిభక్తి ప్రయోగింపవచ్చునని చెప్పుటకీ సూత్రము జ్ఞాపకమని చెప్పుటవలన నీపూర్వపక్షము సమాధేయము. ''నలోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్'' అను నిషేధమనిత్యము. కావున షష్టివిభక్త్యంతశబ్దమునకు ''తృ'' అంతమందుగల శబ్దముతో సమాసము కలుగుట మనము చూచినయెడల నది తృచ్ కాని తృన్ కాదని యెంచవలెను. పూర్వోక్తమైన రెండుశ్లోకములనుఁ బరీక్షించిన పైని తృజంత, అకప్రత్యయాంత శబ్దములతో షష్ఠీసమాసము చేయఁగూడదని పట్టుదలతోఁ జెప్పుచున్నాడు. ''శబ్దేయంజగతిమతఁహి పాణినీయమ్'' (VI-63 కావ్యాలంకార) అను శ్లోకములో భామహుడు పాణినియందమిత గౌరవమును జూపుచున్నాడు. ఇట్టివిషయమందుగూడ మనము పాణిని సూత్రమునను సరింపవలెనని అతనియిష్టము. పాణిని సూత్రము జ్ఞాపకముగా గ్రహింపబడవచ్చునుగాన ( వృత్రహంతా ) ఇత్యాది సమాసములు గ్రాహ్యములని న్యాసకారుని అభిప్రాయమని తెలుపు సందర్భమున భామహుడు న్యాసకారుని బేర్కొనెను. వృత్రహన్తా, తద్గమక అనుసమాసములను న్యాసకారుడుదాహరించెను. సామాన్యప్రమనుష్యులకు భామహుని పదజాలము వ్యాఖ్యానాపేక్షలేకుండ నర్థమగును.

Prof. Pathak ఒకచోట పైశ్లోకముల అర్థమును తనయిష్టమువచ్చినరీతి కల్పించుటకు మిక్కిలి కష్టపడెను. మరియొకచోట దనవాదమునంతయును సంగ్రహముగా వివరించెను. ఈవిషయమై యాపండితుని అభిప్రాయమును గనపర్చుటకుఁ గొన్నివాక్యముల నుదాహరించెదను. అతడిట్లు వ్రాయుచున్నాడు. ''పూర్వోక్తమైన శ్లోకద్వయములో భామహుడు వృత్రహంతా, తద్గమక మొదలగు షష్టీసమాసములు అవ్యాకరణానుసారములని నిషేధించెను. గొప్పవారు కాథలంచిన

శాలకవులట్టి సమాసములనుఁ బ్రయోగింపరాదనియుఁ జెప్పుచున్నాడు. ఆశాడు శిష్టప్రయోగమునకు న్యాసకారమతమునకు వ్యత్యాసమునుఁ జూపించినపుడు, "వృత్రహన్తా" అను సమాసము న్యాసకారుడొప్పుకొనెనిగాని శిష్టులుప్రయోగించిరని కాని చెప్పుట నాతాత్పర్యముకాదని" పలుకుచున్నాడు. వృత్రహంతా అను షష్ఠీసమాసము సాధువని న్యాసకారుడు చెప్పినాడని భామహుడు చెప్పుచున్నాడు. "భీష్మఃకురూణాం భయశోకహంతా" అను వాక్యమందు అది సమర్థింపబడినది. వృత్రహంతా మొదలగు షష్ఠీసమాసములతో సంబంధించిన తృన్ తృచ్, భేదమును తెలియజేయు జ్ఞాపకసూత్రమువలన నది సమర్థింపబడెను.

తృన్ తృచులకు భేదమున్నను దానిని నిరాకరించి భామహుడు జినేంద్రబుద్ధి మరియునే చెప్పినారని పాఠక్పండితుడు మనలను నమ్మించుచున్నాడు. పైనిఁ గనఁబర్చినట్లు భామహుడు న్యాసకారుడు పాణిని జ్ఞాపక సూత్రసహాయమువలన తృజంతసమాసములు సాధువని సమర్థించిరి. తృన్నునుగురించి యిచ్చటనతడేమియుఁ జెప్పలేదు. జినేంద్రబుద్ధి తృన్నునుగురించి చెప్పుచున్నాడు. ఎచ్చటనట్టి సమాసములు వచ్చినను అది తృన్ గాని తృచ్ కాదని వ్యవహరించును.

ఈప్రమేయము నంతయు నిచట విశదతరముగా వ్రాయుచున్నాను. షష్ఠ్యంతశబ్దములకు తృచ్, అకప్రత్యయము లంతమందుగల శబ్దములతో సమాసముచేయగూడదని పాణిని అనుశాసనము. ప్రాచీనమహాకవుల గ్రంథములయందట్టి ప్రయోగములు కాన్పించుటచేనొక చిక్కువచ్చినది. అందువలన వైయాకరణులతికష్టముతో నట్టి ప్రయోగములను సమర్థించిరి. పాణిని అష్టాధ్యాయి సూత్రములలో "జనికర్తుః ప్రకృతిః" మొదలగు సమాసములను చేసియుండుటచే వైయాకరణులు వానిని సమర్థించుటకు బాధ్యులైరి. ఈవిషయమై ముఖ్యమైన అభిప్రాయమిట్లు చెప్పఁ బడవచ్చును.

I. పాణిని "జనికర్తుః" ప్రకృతిః। "తత్ప్రయోజకో హేతుశ్చ". అని తన సూత్రములలో స్వేచ్ఛగా నిట్టి సమాసములనుఁ జేసియున్నాడు గనుక తృజకాభ్యాంకర్తరి అను సూత్రమువలన ప్రతీయమానమగుచున్న నిషేధమంత బాధకముకాదనియు కాదాచిత్కముగానట్టి సమాసములు చేయువచ్చుననియుఁ గొందఱు చెప్పుచున్నారు.

II. కాశికాన్యాసకారుడగు జినేంద్రబుద్ధి యచ్చట తృన్ప్రత్యయము గాని తృచ్ ప్రత్యయము గాదనియు "నలోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్" అను సూత్రము వలన గలుగు షష్ఠీసమాసప్రతిషేధమనిత్యమనియుఁ జెప్పుట కిష్టముగలవాడు.

III. అట్టిస్థలములయందు షష్ఠీవిభక్తి "శేషేషష్ఠీ" అనుదాని కుదాహరణముగా దీసికొనవలయునని కైయటుడు మొదలగువారు తలఁచుచున్నారు. సిద్ధాంతకౌముదిలో నీవిషయము నెత్తికొన్న భట్టోజీదీక్షితుడు తనప్రౌఢమనోరమలో నందరి అభిప్రాయములను మొత్తముజేసి కైయటుని మతము నవలంబించినట్లు కానవచ్చుచున్నది. (కథంతర్హి "ఘటానాంనిర్మాతుః త్రిభువనవిధాతుశ్చకలహః" ఇతిశేష షష్ఠ్యాసమాస ఇతికైయటః। "శేషషష్ఠ్యా ఇతి" కేచిత్తుజనికర్తుః ప్రకృతి స్తత్ప్రయోజకోహేతుశ్చేతి నిర్దేశాదనిత్యోయం నిషేధ ఇత్యాహుః। న్యాసకారస్త్వాహ। తృన్నంతమేతత్। నలోకేతి షష్ఠీనిషేధస్త్వనిత్యః। త్రికాభ్యామితివక్తవ్యేతృచస్సాను బంధస్యగ్రహణాత్ జ్ఞాపకాదితి.)

IV. పదసాధుత్వమందు హెచ్చుగౌరవముగలవారు కొందరట్టి ప్రయోగముల సమ్మతింపరు.

కావ్యాలంకార సంగ్రహమందు భామహుడుకూడ తృన్నంతశబ్దముతో శేషషష్ఠీసమాసమును చేయుటయందే యిష్టముగలవాడైయున్నాడు. వ్యాకరణ సాధుత్వము అలంకారసాధుత్వము నొక్కటికాదని యలంకార శాస్త్రమందించుకంత జ్ఞానముకలవారుసైత మెఱుంగుదురు. ఒకవాక్యమెంత వ్యాకరణసాధువులైన పదములతో గూడియున్నను అంతమాత్రముచేనది సత్కావ్యలక్షణములచే గూడినది కాకపోవచ్చును. కవిత్వమందర్థ మెంత ప్రధానమో పదజాతముకూడ నంతప్రధానము. ఒకవాక్యము రచనయందు సంద్గిగ్ధముగానున్నయెడల నాసందేహమే పాటిదైనను అది మహాకవికి అవద్యకరము. భామహునిమతమిది. న్యాసకారుని అభిప్రాయము పరము జూపించినరీతినిబట్టి విచారింపగా భామహుని కాలమందుగూడ నట్టి వ్యాకరణ వ్యూహాలు ప్రచురముగా నుండెననియు నవి గొప్పపండితులనుగూడ నాకర్షించుచున్నవనియు గానవచ్చుచున్నది. భామహుని కావ్యాలంకారమందీవిషయమును గురించిన ముఖ్యాభిప్రాయ మేమనగా పాణిని సూత్రములుజ్ఞాపకములనియు, తృజకాభ్యాంకర్తరి అను సూత్రముచేనైన నిషేధమనిత్యమనియు.

పూర్వోక్తములైన నాలుగు అభిప్రాయములతోను భామహుని అభిప్రాయమును తైపారువేసి అతనిఅభిప్రాయము నాల్గింటిలో దేనికి సమానముగానున్నదో కనుగొనుటకు ప్రయత్నించెదము. వానిలో మొదటి అభిప్రాయముతో భామహుని అభిప్రాయము సరిగానున్నదని వెంటనె కనుంగొనవచ్చును. మొదటిది జినేంద్రబుద్ధి అభిప్రాయమైనను రెండవదానితో విభిన్నముగానున్నట్లుకూడ కానవచ్చుచున్నది. ఉదాహరణములనిపుడు విచారింతము. భామహుడు "వృత్రహంతా" అని యుదాహరించెను. జినేంద్రబుద్ధి "భీష్మః కురూణాం భయశోకహన్తా అనియుదాహరించెను. ఈవిరెండు సమాసములు కావు. వృత్రహంతా అనునది న్యాసకారుడొప్పుకొన్న షష్ఠి సమాసవర్గమున కుదాహరణమని భామహుడు చెప్పెనని పాఠక్పండితుడు వ్రాయుచున్నాడు. జినేంద్రబుద్ధి వాడుకచేసిన యుదాహరణములను విడిచిపెట్టి భామహుడు క్రొత్తయుదాహరణముల నెందుకియ్యవలెనో మాకుదలంప శక్యముకాకుండనున్నది. గొప్పగ్రంథకర్త లేదైన నొకవిషయమును జర్చించునపుడుగాని యట్టి విషయములను జేర్కొన్నప్పుడుగాని పూర్వులిచ్చిన యుదాహరణముల నిచ్చుట అభ్యాసముగాగలవారు. అందుకుదాహరణముగా శరణదేవుడు పూర్వోక్తమైన వాక్యము యొక్క సారాంశమును జెప్పుచు జినేంద్రబుద్ధి యిచ్చిన యుదాహరణమునే పేర్కొనుచున్నాడు. (కథంభీష్మః కురూణాం భయశోకహంతేత్యుచ్యతే। కృన్తమేతత్। నలోకావ్యయనిష్ఠేతి (II-3-69) షష్ఠీప్రతిషేధః। యత స్తృజకాభ్యామితిత్రి తృచస్సానుబన్ధకస్యోపాదానత్వేనోనివృత్త్యర్థం జ్ఞాపయతీత్యేకే యోగేక్వచిత్ షష్ఠీతి న్యాసః. భట్టోజీదీక్షితుడు వేరైనమరియొక వాక్యముతో నీవాదము నారంభించుచున్నాడు. కాని వానిపక్షము శరణదేవుడు జినేంద్రబుద్ధి అవలంబించిన పక్షముకాదు. (కథంతర్హి ఘటానాం నిర్మాతుస్త్రిభువనవిధాతుశ్చ కలహఇతి) న్యాసకారుడు చెప్పిన దానిని ఖండించలేదు. సంగ్రహముగాం జెప్పనులేదు. ప్రతివాదితో వ్యాకరణవాదముచేయుచు భవభూతిరచించినదని ఐతిహ్యముగల యొక శ్లోకమునుండి యీవాక్యమును గ్రహించెను. ఈసందర్భము సిద్ధాంతకౌముదీగ్రంథకర్త పట్లను యీయుదాహరణ మొక వ్యాఖ్యానమగుచున్నది.

ఒకపండితుడు మరియొక పండితునితో వాదించునపుడు తాను మాటలాడు మాటలలో విశేషించి జాగరూకుడైయుండవలెను. మహాభారతమునుండి యీయుదాహరణమును గ్రహించిన జినేంద్రబుద్ధియు నట్టివాడే కాని భామహుని పక్షము వేరైనది. న్యాసకారమతమును ఖండించుటయందు ఆవశ్యకముగా నాయుదాహరణ

మునే యయ్యువలెను. అట్లనే చేసెను. ఈవిషయము "సూత్రజ్ఞాపకమాత్రేణ వృత్రహాస్త్రాయథోదితః" అను వాక్యములో ఉదితః అనుపదమువలన స్పష్టమగుచున్నది. ఆలోచింపకుండ నాయుదాహరణము నిచ్చినయెడల "ఉదితః" అని అనకపోవును.

పాఠక్పండితుడు జినేంద్రబుద్ధి యొక్కడే న్యాసకారుడని చెప్పుచున్నాడు. ఇదిసరికాదు. ఒకడే న్యాసకారుడని సమర్థించుటకు ప్రయత్నముచేసినను అనేకులు న్యాసకారులున్నారు. త్రివేదిచెప్పినట్లు మాధవీయధాతువృత్తిలో మాధవాచార్యులు క్షేమేంద్రన్యాసము, న్యాసోద్యోతము, బోధిన్యాసము, శాకటాయన న్యాసము మొదలగు న్యాసములను చెప్పియున్నాడు, పాఠక్పండితుడు యీ న్యాస శబ్దము తరచుగా "వ్యాకరణగ్రంథము" అను నర్థమందుగాని వ్యాఖ్యానమను నర్థమందుగాని వాడుకచేయబడుచున్నది యని చెప్పుటకుం బ్రయత్నించెనుగాని లాభములేకపోయెను. బాణుడు హర్షచరిత్రములో నొకన్యాసమును చెప్పెను. "కృతగురుపదన్యాసాః" అని ఆసమాసమును శంకరుడను వ్యాఖ్యాతయిట్లువివరించెను. "కృతోఽభ్యస్తో గురుపదేదుర్బోధశబ్దేన్యాసోవృత్తివివరణంయైః". జినేంద్రబుద్ధి హర్షవర్ధనుని పరిపాలనకు ముందు జీవించెనని రుజువుచేయుట కిదివరకెవ్వరు ప్రయత్నించియుండలేదు. M. R. Narasimhachari పూజ్యపాదుడను వాడొక న్యాసమును వ్రాసెనని చెప్పియున్నాడు. ఈపూజ్యపాదుడు క్రీస్తువెనుక అయిదవశతాబ్దమువాడని Rice పండితుడు వ్రాసెను.

కావ్యాలంకారములో జెప్పబడిన న్యాసకారుడు జినేంద్రబుద్ధి యని సమర్థించుటకు శక్యమైనను భామహుడు జినేంద్రబుద్ధికి దరువాతవాడని రుజువుచేయ శక్యముకాదు. చీనాదేశపుబాటసారియగు ఇత్సింగు ఆకాలపు వైయాకరణులనుగురించి చెప్పిన గందరగోళమైన వృత్తాంతములను నమ్మి పాఠక్పండితుడు. క్రీస్తువెనుక 700లో వాడని వ్రాసెను. ఇదియునమ్మశక్యముకాదు. పైనజెప్పిన యంశము లెవ్వియును సత్యమైనవని గ్రహింపలేము. పాఠక్పండితుడు నిర్దేశించిన జినేంద్రబుద్ధికాలమును జాకోబీపండితుడు శంకించుట యుక్తముగా నున్నది. Kiel horn పూనాలో జినేంద్రబుద్ధి వ్రాసిన గ్రంథైకభాగమును జూచి హరదత్తప్రణీతమైన పదమంజరినుండి అతడు యెత్తివ్రాసెనని నానమ్మకమని పలికెను. జాకోబీపండితుడు హరదత్తుడు A D 878 లో మృతినొందెనని భవిష్యోత్తరపురాణప్రామాణ్యమునుబట్టి సమర్థించెను. దీనినిబట్టి

జినేంద్రబుద్ధిని పదియవశతాబ్దమువాడని చెప్పవలసియుండును. భామహుడు A D 700 ల కంటె నిటీవలవాడు కాడని యిదివరకే చెప్పియున్నాము. జినేంద్రబుద్ధికి హరదత్తుని పదమంజరినుండి గ్రంథమును దొంగలించి తనగ్రంథములో వ్రాసికొనుట సాధ్యము కాదు. భామహునికి ముందువాడును కాడు.

ఇపుడు మావిమర్శయొక్క యీభాగమును సంగ్రహముగాఁ జెప్పుచున్నాము. పాఠక్పండితుడూహించినట్లు భామహుడుఁ పేర్కొన్న న్యాసకారుడు జినేంద్రబుద్ధి కాడు. అతడొక ప్రాచీనగ్రంథకర్త. అతనిగ్రంథమిపుడు నశించినది. అతడెప్పుడో మనకుదెలియదు, అతనిఅభిప్రాయము భామహుని గ్రంథమువలన మనము తెలుసుకొన్నట్లు, ప్రౌఢమనోరమలో భట్టోజీదీక్షితులు తెలిపినట్లు కానవచ్చుచున్నది. కావున భామహుడు తనగ్రంథమందు న్యాసకారునిఁ బేర్కొనుటవలనఁ గలుగు సహాయమునుబట్టి భామహునికాలముయొక్క ఉత్తరావధిని కనుగొనుటకు ప్రయత్నించుట చాలదూరము వ్యాపించదు గావున మరియొకదానిసహాయము మనము చూచుకొనవలసియున్నది.

## భామహుడు, మాఘుడు.

భామహుని కాలమును నిర్ణయించుటలో పాఠక్పండితుడు చెప్పిన ప్రధానోపపత్తులలో నొకదానిని విమర్శించుచు నామహావిద్వాంసుడు చెప్పిన మరియొక అంశమును విచారింతము. ఇదియేమనగా భామహునికి మాఘునికి గల కాలసంబంధమును కనుగొనుటకు చేసిన యొప్పించజాలని ప్రయత్నమిది. భామహుడు తన కావ్యాలంకారమందు కావ్యలక్షణమును జెప్పుచు "శబ్దార్థౌసహితౌ కావ్యమ్" (I-16) అని వ్రాసెను. తరువాత వచ్చిన ఆలంకారికులందరి యభిప్రాయమునే అవలంబించిరి. మాఘుడు శిశుపాలవధలో నొకసొగసైన శ్లోకమును రచించెను.

నాలంబతే దైష్టికతాం ననిషీదతి పౌరుషే। శబ్దార్థౌ సత్కవిరివ ద్వయం విద్వానపేక్షతే॥ (II-86)

ఈశ్లోకమునుపట్టి విచారింపగా మాఘుడు భామహుని కావ్యాలంకారముతోఁ బరిచయముకలవాడని వాదింపబడుచున్నది. ఈయంశము నిచ్చటఁ జెప్పుట దాని యాధిక్యమునుపట్టి కాదు. మరేమనగా, దానియందుత్సాహమునుపట్టి మఱిమీవిషయము నంత సూక్ష్మముగా విచారింపనవసరములేదు. ఉత్సాహముగలవారు కేన్

పండితుడు (J. R. A. S. Bombay, vol. 23-p-91) వ్రాసిన యీ వాదనిరా సమునుఁ జదువవచ్చును. (Dr. J. Nobel పండితుడు వ్రాసిన "The foundations of Indian Poetry p. 15-16) అను గ్రంథమునుండి కొన్ని పంక్తులను మాత్రమే యిచట వ్రాయుచున్నాను. శేషించిన సంగతులనన్నింటిని పాఠకులకే విడిచిపెట్టుచున్నాను. Dr J. Nobel తనగ్రంథమం దిట్లు వ్రాయు చున్నాడు. "మాఘుడు భామహుడు చెప్పిన కావ్యలక్షణమును తనశిశుపాలవధలో పేర్కొనెనని చెప్పబడినది దీనినొక యుక్తిగా నొప్పుకొన్నచుడల కాళిదాసు రఘు వంశ ప్రారంభమందు "వాగర్థావివసంపృక్తౌ" అని చెప్పుటవలన భామహుని కావ్యలక్షణమునే పేర్కొన్నాడు కావున భామహుడు కాళిదాసునికంటె ప్రాచీను డని చెప్పవలసివచ్చును. శబ్దార్థాపమ్యమును వాడుక చేయుటచే మాఘుడు కాళి దాసుని ఉపమానముసైన లేక మరియొకని అభిప్రాయముసైన గ్రహించి యుండ వచ్చును గాని భామహుని కావ్యలక్షణము కానేరదు. ఈయుక్తిలో విలువ యేమియు లేదు. ఎలయనగా "కావ్యము శబ్దార్థసంయోగము" అను లక్షణము భామహునికంటె కూడ ప్రాచీనతరాలంకారికులదై యుండవచ్చును.

## భామహుడు, కాళిదాసుడు.

కాళిదాసు భామహునికంటె ప్రాచీనుడని స్థాపించుటకుఁ జెప్పబడు నభి ప్రాయము వినోదకరమైనది అధికమైనది. భామహుని కావ్యాలంకారములో I-42-44 శ్లోకములు.

అయుక్తిమత్ యథాదూతాజలభృన్మారు తేందవః, తథాభ్రమరహారీతచక్ర వాకశుకాదయః। అవాచోఽవ్యక్తవాచశ్చ దూరదేశవిచారిణః। కథందూత్యం ప్రప ద్యేరన్నితి యుక్త్యా నయుజ్యతే। యదిచోత్కంఠయా యత్తదున్మత్తఇవభాషతే। తథా భవతు భూమ్నేదం సుమేధోభిః ప్రయుజ్యతే॥

భామహుడే తన గ్రంథములో, మేఘము వాయువు చంద్రుడు పక్షులు మొదలగువాని దూతలగా జేసిన కవుల నాక్షేపించుచున్నాడు. అయుక్తిమద్దోషమను దానికిది యుదాహరణమని పలుకుచున్నాడు. అట్టి జంతువులు దూతకృత్యములను నెరవేర్చుటకు సామర్థ్యము కలవియని చెప్పుట స్వభావమునకు విరుద్ధమని చెప్పుచున్నాడు. ఉన్మత్తులైన వారిచేఁ బ్రేషణములు చేయించు గొప్పబుద్ధిమంతులైన మహాకవుల విషయమై భావముఁ జొప్పుకొనుచున్నాడు.

కాళిదాసుని మేఘదూత భామహునికి బుద్ధిస్థమైయుండవచ్చునని కొందరు పండితులు వాదించుచున్నారు. (Bhamaha seems to refer in III 35 to Raghu XIV-7-8. and in I-42 to Meghaduta and hence is probably later than Kalidasa (who according to Professor K. B. Pathak, flourished in the latter half of the 5th century) (Sovani—Prethvani schools 393 p. Bhandarkar's Com-volum).

Susil Kumar De's History of Indian Poetics p. 48.

No fresh light is thrown on the question by the Conjecture that Bhamaha in I-42 refers to the Meghaduta by his condemnation of the poetical device of employing clouds, among other things as Messengers.

అథాభిషేకం రఘువంశకేతోః ప్రారబ్ధమానందజలైర్జనన్యోః। నిర్వర్తయామాసురమాత్యవృద్ధాః తీర్థాహృతైః కాంచనకుంభతోయైః సరిత్సముద్రాన్సరసీశ్చగత్వారక్షః కపీంద్రైరుపపాదితాని। తస్యాపతన్మూర్ధ్ని జలానిజిష్ణోర్వింధ్యస్య మేఘప్రభవా ఇవాపః Raghu 14-7-8 ఈశ్లోకములయొక్క శబ్దములను అభిప్రాయమును భామహుడు తన కావ్యాలంకారములో III-36) శ్లోకములో (అస్మిన్ జహీహిసు హృది ప్రణయాభ్యసూయామాశ్లిష్య గాఢమముమానతమాదరేణ। వింధ్యం మహానివ ఘనః సమరోసుభి వర్షన్నానందజైర్నయనవారిభిరుక్షతు త్వామ్) యెరువుతెచ్చుకొన్నట్లు కానవచ్చుచున్నదని కనపర్చబడినది.

ఇట్లుండగా దీనికి బదులుగా మరికొందరు విరుద్ధాభిప్రాయము కలవారై యున్నారు. ఎట్లన; భాసుని నాటకములను బ్రకటించినట్టి గణపతిశాస్త్రిగా స్వప్నవాసవదత్తాభూమికలో నిట్లు వ్రాయుచున్నారు.

భామహాచార్యుడు కాళిదాసుకంటె చాలకాలము ముందుజీవించినవాడని నాకు తోచుచున్నది. ఏల యనగా; భామహుడు తనగ్రంథమందు మేధావి, రామశర్మ, అశ్మకవంశుడు, రత్నాహరణుడు, అచ్యుతోత్తరుడు మొదలగు కవులపేరు చెప్పినవాడు జగత్ప్రసిద్ధుడైన కాళిదాసునిగాని వానియుత్తమమైన కావ్యములనుగాని తనగ్రంథమందెచ్చటను చెప్పియుండలేదు భామహుడు కాళిదాసుని కావ్యములం

జూచినయడలఁ దప్పకుండ వానినిఁ జెప్పియుండును లేక ప్రతిజ్ఞానాటికనువలె తనఁ విమర్శకుఁ శాత్రముగానైన జేసి యుండును" తరువాత నాపండితుడు పూర్వోక్తము లైన భామహుని మూడుశ్లోకముల నుదాహరించి వానినిగురించి యిట్లు వ్రాయు చున్నాడు. భామహుడు కాళిదాసకృత మేఘదూత నెఱింగినవాడని పైశ్లోకములను బట్టి నిశ్చయింపజాలము. అట్లైనచో నిన్న మొన్నటి కవిరచించిన శుక సందేశమునుగూడ నెరిగినవాడై యుండవచ్చునని మనమను మేయించగలము. కావున మనకావ్యములలో కాముక నాయకులైనవారనున్మత్తులైయున్న అచేతనములైన వాయువు, మేఘము, చంద్రుడు మొదలగువానిని గాని వ్యక్తవాక్కులు గాని తుమ్మెదలు, చక్రవాకములు, చిలుకలు మొదలగువానిని గాని దూతలనుగా బంపుట స్పృహణీయముగాదని యుపదేశింపుచున్నాడు.

భామహాచార్యుని ఉపదేశమును మనస్సులోనుంచుకొని కాళిదాసుడు కావ్యౌచిత్య మందున్న సూక్ష్మబుద్ధితో మేఘదూత ప్రారంభమందు మేఘునిదూతగాఁ బంపుట నిట్లు సమర్థించుచున్నాడు.

ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః స్సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః। ఇత్యౌత్సుక్యాదపరిగణయన్ గుహ్యకస్తంయయాచే కామార్తాహిప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు॥

ఇట్లు భామహుడు కాళిదాసుకంటె చాలకాలము ముందుండెనని తెలియఁ బడుచున్నది. ఈయభిప్రాయమును వివరించు గొప్ప వ్యాఖ్యాతే యుదాహరించిన యీశ్లోకమీస్థితిని స్పష్టపరుచున్నది. Nobel పండితుడుకూడ నొకప్పుడు కాళిదాసుకంటె భామహుడు ప్రాచీన తరుడని నమ్మకము గలవాడై యుండెనని తెలుసుకొనుట కుతూహలహేతువు. ఇప్పటికి నైన మతని నమ్మకము కొంచముచలించినను భామహునికంటె కాళిదాసు ముందువాడని చెప్పుటకు బదులుగా భామహుడే కాళిదాసుకంటె ముందున్నవాడని అంగీకరించుటకు యిష్టముతోనున్నాడు 3-7-31. ఉభయపక్షముల యుక్తులను బాగుగా విచారించినయడల రెండుపక్షములయందు చెప్పవలసినది విస్తారముగా నున్నదనియు, నిద్దియు నిజముగా నిశ్చయింపబడదనియు మన మొప్పుకొనవచ్చును. విమర్శించుటకు గ్రంథమెద్దియు లేకుండుటచే విమర్శ సాధ్యమనియు కాళిదాసుని ఉత్తమగ్రంథములు

భామహుఁడెఱింగి యున్నయెడల కాళిదాసుతో సంబంధించిన యితరవిషయములు భామహుని జ్ఞానగోచరము లెందుకు కాకూడదని యొకఁడూహించలేడు.

తత్త్వమేమైనను యీవాదము దీర్ఘముగా నడిపించుట అనవసరము. (యేదో యొకరీతిగా నిది నిశ్చయింపబడినను) భామహుని కాలమును నిశ్చయించుటకిది యేరీతిగానైనను మనకు సహాయము చేయనేరదు. కాళిదాసుకాలమే వివాదగ్రస్తమైయుండెను. ఇతరుల కాలమును నిశ్చయించుటకది మూలము కానేరదు.

## భామహుఁడు, భాసుడు.

భామహుఁడు తానుఖండించుచున్న గ్రంథమును రచించిన గ్రంథకర్తకంటె దరువాతవాడని యెవ్వరు చెప్పకపోయినను భామహభాసుల కాలసంబంధమును గురించి ఆయుక్తియే చెప్పవలసియున్నది. అతడేగ్రంథమును ఖండించుచున్నాడో దానిని మనము సరిగా నెఱుంగకపోవుట యనుకష్టమిచటమనకున్నది. భామహుని కావ్యాలంకారములో నావిమర్శను పేర్కొను శ్లోకములివి.

1. విజిగీషు ముపన్యస్య వత్సేశం వృద్ధదర్శనః। తస్యైవకృతినః పశ్చాదభ్యధా చ్చిగ శూన్యతామ్॥

2. అంతర్యోధశతాకీర్ణం సాలంకాయన నేతృకం। తథావిధంగజచ్ఛద్మ నాజ్ఞాసీత్సస్వభూగతిమ్॥

3. యదినోపేక్షితంతస్య సచివైః స్వార్థసిద్ధయే। అహోనుమంద మాతేషాం భక్తిర్వానాస్తి భర్తరి॥

4. శరాదృఢధనుర్ముక్తా మన్యమద్భిరరాతిభిః। మర్మాణిపరిహృత్యాస్య పతిష్యంతీతి కానుమా॥

5. హతోఽనేన మమభ్రాతా మమపుత్రః పితామమ। మాతులోభాగినేయశ్చ రుషాసంరబ్ధచేతసః॥

6. అశ్యంతోవివిధాన్యా జావాయుధాన్యపరాధినమ్। ఏకాకినమరణ్యానాం సహస్వ్యగ్భహవః కథం॥

7. నమోఽస్తు తేభ్యోవిద్వద్భ్యోయేభి ప్రాయంకవేరిమం। శాస్త్రలోకావపాస్యైపనయంతీయ వేదినః॥

8. సచేతసోవ నేభస్యచర్మణానిర్మితస్యచ। విశేషంవేదబాలోపికస్తంకీతు కథంనులత్॥

పూర్వకాలమందు ప్రాచీనహిందూదేశమందు వత్సరాజైన ఉదయనునికథలు మిక్కిలి జనప్రియములైయుండెను. భామహుని గ్రంథమందట్టి విమర్శనము చూచినపుడు భామహుడట్లుఖండించిన విషయమేమో మనము సరిగానిశ్చయింప జాలము. భామహుడు విమర్శించిన గ్రంథము ప్రతిజ్ఞాయౌగంధరాయణమని T. Ganapati శాస్త్రిగారూహించుచున్నారు. భామహుడు విమర్శించినది పూర్ణముగా ప్రతిజ్ఞాటీకయని శాస్త్రిగారుచెప్పుచున్నారు. ప్రతిజ్ఞాటీకలో ప్రథమాంకములో ఇంతియకాక "అణేణమమభాదాహదో, అణేణమమపిదా, అణేణమమసుధో" అను ప్రాకృతవాక్యమును భామహుడు న్యాయవిరోధదోషములో "హతోనేనమమభ్రాతామమపుత్రః పితామమ" అని శ్లోకరూపముగా వ్రాసెను.

గణపతిశాస్త్రిగారుచెప్పినదానినిద్రోసిపుచ్చియీవిషయము మిక్కిలిసందేహగ్రస్తమని మనము చెప్పవచ్చును భామహుడు భాసునిగాని అతడు రచించిన ప్రతిజ్ఞాయౌగంధరాయణమునుగాని చెప్పలేదు. అట్టికథలను ప్రాచీనసంగ్రహమైన గుణాఢ్యుని బృహత్కథ నతడు విమర్శించియుండవచ్చును. భామహుని శ్లోకమునకు సరిగానున్న ప్రాకృతవాక్యము బృహత్కథలోకూడ నుండవచ్చును. కేను పండితుడు చెప్పినట్లు శాస్త్రిగారి సిద్ధాంతము దృఢమూలకమైనదికాదు. భామహుని శ్లోకమును మనము సూక్ష్మబుద్ధితో పరీక్షించిన యెడల భామహుడు విమర్శించిన కథ సరిగా ప్రతిజ్ఞాయౌగంధరాయణములోని కథకాదు. బృహత్కథామంజరిలోను కథాసరిత్సాగరములోను చెప్పబడిన కథలకు సదృశముగానున్నది. ఆరెండుగ్రంథములు బృహత్కథయొక్క సంగ్రహములు. భాసుడే విమర్శించబడుచున్నాడని రుజువుచేయబడినను అది మనకేవిధముగాను సహాయముచేయనేరదు. గడచిన పదునాలుగు సంవత్సరములనుండి భాసుని కాలనిర్ణయమును గురించియేకాక అతని పేరున ప్రకటింపబడిన గ్రంథముల ప్రామాణికత్వమునుగురించికూడ తీవ్రమైన వివాదము జరుగుచున్నది. భాసుని కాలము నిశ్చయముగా నిర్ణయించబడలేదు గాన నది భామహుని కాలపు చివరయని నిర్దేశించుటకుపయోగించదు.

## భామహుడు, భట్టి.

భట్టి భామహులకుగల కాలసంబంధమును చర్చించుటకుఁ గొంతయవకాశ మిచ్చుటకిది యస్థానముకాదు. రావణవధ లేక భట్టికావ్యమునని ప్రసిద్ధికెక్కిన వ్యాకరణకావ్యమును రచించిన భట్టి ఇతర సర్గలలో పాణిని సూత్రముల కుదాహరణము లిచ్చినట్లు ప్రసన్నకాండమను పేరుగల 10, 11, 12, 13 నాలుగు సర్గలలో కావ్యాలంకారముల కుదాహరణము లిచ్చెను. వ్యాఖ్యాతల వాక్యములవలన నీయర్థము దృఢపఱచబడుచున్నది. ఎట్లనగా (శబ్దలక్షణము క్తమపేలక్ష్యన్యాయ్యలక్షణార్థం ప్రసన్నకాండముచ్యతే। కావ్యస్యాత్ర ప్రసన్నత్వాత్। ప్రథమంచేదం లక్షణం యత్ప్రసన్నతానామ అవిద్వజ్జడానా బాలప్రతీతార్థం ప్రసన్నవస్తి। తథాస్మిన్కాండే చత్వారఃపరిచ్ఛేదాః। అలంకారమాధుర్య ప్రదర్శన దోషః భాషాసమావేశశ్చేతి। (జయమంగళ దశమస్సర్గ వ్యాఖ్యానారంభమ దు) శబ్దలక్షణ ప్రధానేప్యస్మిన్కావ్యే కావ్యలక్షణ త్వాదధికార కాండానంతర మలంకార మాధుర్య భావికభాషా సమాఖ్యపరిచ్ఛేద చతుష్టయాత్మకమారభమాణోఽస్మిన్ సర్గేతావదలంకార పరిచ్ఛేదం వదన్నాదౌ శబ్దాలంకారాన్ లేశతోదర్శయతి। మల్లినాథః దశమసర్గ వ్యాఖ్యానారంభే॥

భట్టి శబ్దాలంకారములను అర్థాలంకారముల నుదాహరించుటకు పదియవ సర్గను, మాధుర్యగుణమును తెలుపుటకు పదునొకండవ సర్గను, భావికమును వివరించుటకు పండ్రెండవ సర్గను, సమసంస్కృతప్రాకృత కావ్యమునుఁ గనపఱచుటకు పదమూడవ సర్గను వ్రాసినట్లు వ్యాఖ్యానమువలనఁ గానవచ్చుచున్నది. ప్రసాద గుణమీనాలుగు సర్గలలో నుదాహరింపబడినది. పదియవ సర్గలో నలంకారముల కుదాహరణములైన శ్లోకములను మనము చూచినయెడల క్రమమునుపట్టియు నయ్యలంకారములు చెప్పబడినరీతిని పట్టియుఁ జూడగా భట్టిభామహుని కావ్యాలంకారమును ముందుంచుకొని వ్రాసినాడని మనము తెలుసుకొనవచ్చును. వ్యాఖ్యాతలగు జయమంగళుడు మల్లినాథుడు యీయలంకారముల లక్షణములను భామహుని గ్రంథమునుండియే తీసిరి. (ఇందుకు భామహుని కావ్యాలంకారముయొక్క పరిశిష్టమును చూడుడు. జయమంగళుడు ముప్పదిమూడు లక్షణశ్లోకములకు తక్కువ కాకుండ తనవ్యాఖ్యానములో నెత్తెను. భట్టి కావ్యవ్యాఖ్యాతలు పూర్ణముగా నున్న నవీనాలంకారిక గ్రంథములనుండి లక్షణశ్లోకములను గ్రహించి యుండవచ్చును

గాని యీయుదాహరణ శ్లోకములు నవీనుల లక్షణములకనుగుణముగా నుండక పోవుటచే వారు వానిని గ్రహింపలేదు. భామహుని కావ్యాలంకారములోని శ్లోక మొకటి కొంచెము మార్పులతో భట్టి కావ్యములోఁ గానుపించుచున్నది.

## భామహుని శ్లోకము.

కావ్యాన్యపియదీయాని వ్యాఖ్యాగమ్యానిశాస్త్రవత్। ఉత్సవస్సుధియామేవ హన్తదుర్మేధసోహతాః॥

## భట్టి శ్లోకము II-20.

వ్యాఖ్యాగమ్యమిదం కావ్యముత్సవస్సుధియామలం। హతాదుర్మేధసశ్చాస్మిన్ విద్వత్ప్రియతయామయా 22 స. 34 శ్లో. పూర్వోక్తమైన శ్లోకద్వయములో నొకటి మరియొకదానినుండి యెరువు తేబడినదని యూహించుట సులభము. శ్రీ వత్సాంక మిశ్రుడు మొదటిశ్లోకమును భామహునికారోపించుచున్నాడు. ఎతద్వచ ప్రామాణ్యమునుపట్టి భట్టి భామహుని అనుకరించి యీశ్లోకము వ్రాసెనని తలంపవచ్చును. పూర్వోక్తములైన విషయముల నన్నింటిని విచారించి చూడగా భట్టి కంటె భామహుడు ప్రాచీనుడని స్పష్టపర్చకమానదు.

భట్టి కాలనిర్ణయము విషయమై అతడు వ్రాసిన కావ్యముయొక్క కొన శ్లోకమే ముఖ్యమైన ఆధారముగా నేర్పడుచున్నది.

కావ్యమిదంవిహితం మయావలభ్యాం శ్రీధరసేన నరేంద్ర పాలితాయామ్। కీర్తిరతోభవతాన్నృపస్యతస్యప్రేమకరః క్షితిపోయతః ప్రజానామ్॥ భట్టి 22స.35శ్లో.

కటేవార్ దేశపు చరిత్రయిప్పుడు వాలయనిపేరుగల వలభినగరమునే విధర సేనులని పేరుగల నలుగురురాజులుండిరని చెప్పుచున్నది. ఇచ్చట భట్టి యేధరసేనునిఁ జేర్కొనెనో స్పష్టముగాఁ దెలియదు (Trivedis introduction to Prof. B. C Mazumdar) భట్టి కావ్యములోని శరదృతువర్ణన శ్లోకములకు శాస నములోనున్న శ్లోకములకుగల సాదృశ్యమునుపట్టి క్రీస్తువెనుక 473 సం॥ లోఁ బుట్టిన మందసూరు సూర్యాలయములో నున్న శాసనములో జెప్పబడిన వత్సభట్టియే భట్టి కావ్యమును రచించినవాడని తలంపవలెను. (J. R. A. S. 1904 p. 395-397)

కాని యీవిషయము కేవలమనంగీకార్యమని Prof. Keith ఆక్షేపించెను (J. R. A. S. 1909 p. 759) కాని మజుందారు, కెయిన్ ఉభయులు భట్టి, దండిభామహుల కంటె ముందువాడను నంశములో నేకీభవించుచున్నారు. భామహుడారవశతాబ్దము యొక్క కొసభాగమందు యేడవశతాబ్దముయొక్క ఆరంభమందు జీవించెనని త్రివేదితో నేకీభవించవచ్చును. కాని Kane పండితునిపక్షమవలంబించి "భట్టి 500-650 మధ్యను జీవించెనని చెప్పుటమిక్కిలి సురక్షితమైన మార్గము (See De's History of Sanskrit Poetics, p. vol. I-50 p.) Sovani, Commemoration volume p. 393 భట్టి కాలనిర్ణయమందేపాటి భేదమున్నను. భామహుని కంటె భట్టి పూర్వుడని 1922 సం॥ వరకు నెవ్వరునేమియు సూచింపలేదు. ఈసంవత్సరములో Dr. Jocobi పండితునికి భామహుని కాలమును నిశ్చయించుట యందొక క్రొత్తయుక్తిమార్గము తోచెను. భామహుడు తనకావ్యాలంకారములో ని పరిచ్ఛేదమునకు కావలసిన సామగ్రిని ధర్మకీర్తియొక్క న్యాయబిందువునుండి సంగ్రహించెనని రుజువుచేయుటకతడు బ్రయత్నించెను. ఇందువలన భామహుని 650 తరువాత నుంచవలసివచ్చెను. ఇప్పుడు పైనఁ జూపించినట్లు భట్టి 650 కంటె వెనుకవాడై యుండడు. ఇపుడు పండితులందరు భామహునికి భట్టికి నున్న సంబంధమును మరియొకమూలనుండి చూచుటకు నిర్బంధింపబడిరి. Dr. S. K. De, సంతతము Dr. Jocoli పక్షము ననుసరించుడని యిట్లు వ్రాయుచున్నాడు (vol. I-50) భట్టి తనకావ్యములోని పదియవసర్గను భామహుని అలంకారముల నుదాహరించుటకే వ్రాసియున్నాడని వ్యాఖ్యాతయగు జయమంగళుడు చెప్పినమాట యొకప్పుడు నమ్మబడినదిగాని యిప్పుడు భామహుడు ధర్మకీర్తికి దరువాతవాడని నిర్ణయింపబడుటచే భామహునికి భట్టికిగల కాలసంబంధము దిద్దబడినది. ఆమహాపండితులిద్దరు భామహునికి భట్టికిగల కాలసంబంధమును దిద్దుటకుమిక్కిలి కష్టపడిరి.

## దండి, భామహుడు.

ఇపుడు మనము దండి కాలనిర్ణయవిషయమైన విమర్శయొక్క ముఖ్యభాగమునకు వచ్చితిమి. కావ్యాదర్శకర్తయగు నాచార్యదండి మధ్యకాలపు హిందూదేశములో నున్న పండితులలో మహాప్రసిద్ధినొంది యుండెను. కొంతమట్టుకు భామహునికంటె గూడ గొప్పవాడని చెప్పవచ్చును. వీరిద్దరిగ్రంథముల నొకచోటనుంచి మాత్ర

బుద్ధితోఁ బరిశీలించినయడల నేదోయొక విధముగా వీరిరువురు పరస్పర సంబంధము గలవారై యున్నారనుటకేమియు సందియము లేదు. అర్థమందే గాక శబ్దమందుగూడ సాదృశ్యముగల శ్లోకములు కావ్యాలంకార కావ్యాదర్శములయందుగలవు (De. History of Sanskrit Poetics p. 64-65) (Kane's Sahitya Darpana XXV) పరస్పరవిమర్శ కాలవాలమైన మఱికొన్ని వాక్యములుకూడ గలవు. (History of Poetics p. 65-66) ఇంతియకాక విజాతీయములైనను సజాతీయములైనను కావ్యాలంకారకావ్యాదర్శములకుగల దగ్గరసంబంధమును కనపఱచు నభిప్రాయ విశేషముల ననేకములుగలవు. (Kane's book, 25).

ఈయిద్దరు గ్రంథకర్తల గ్రంథములను గురించిన అభిప్రాయములు వీరిలో నొకరితో మఱియొకరికున్న కాలసంబంధమును జర్చించుటకు కారణమైనవి. భామహునికంటె దండిప్రాచీనుడనియు దండికంటె భామహుడు ప్రాచీనుడనియు తీవ్రమైన యొకవివాదకలిగెను. M.T. Narasimha Iyyangar మొదటనీసారాంశమును దీసెను. భామహునికంటె దండిని ముందుపెట్టెను. J. K. A. S. 1905, p· 535) కాని త్రివేది Dr. Jocobi, Prof. Rangacharya, గణపతి శాస్త్రి, పాఠక్పండితుడు మొదలగువారా నరసింహాయ్యంగారుని యుక్తులని సామర్థ్యముతో ఖండించివేసిరి. కొంతకాలమునకు పాఠక్పండితుడు తన అభిప్రాయమును మార్చుకొనెను. అనేక పండితాభిప్రాయాను సారముగా దండికంటె భామహుడే ప్రాచీన తరుడని నిశ్చయింపబడినది గావున నాయభిప్రాయముల నన్నింటినిచట వ్రాసినచో గ్రంథవిస్తరమగునని భీతిచే విరమించితిమి. Kane పండితుడు జాగరూకతతో నీయుభయపక్షముల వారివాదములను గూడబెట్టి సాహిత్య దర్పణ పీఠికలో వ్రాసెను. (p. XXV, XXXV) కావలసినవారు వానిఁ జదువవచ్చును. కేను పండితుడు వారివారి యభిప్రాయముల నన్నింటిని నిష్పక్షపాతముతోఁ బరీక్షించి యీవిషయమై తీర్మానము చెప్పుట యుక్తులస్వభావమునుబట్టి విచారింపగా సాధ్యముకాదను పర్యవసానమునకు వచ్చెను. కాని యితడుకూడ దండియందే పక్షపాతము గలవాడయ్యెను. ఇతడు తన అభిప్రాయము నిట్లు తెలియజేయుచున్నాడు "భామహుండు దండి స్వతంత్రమైన సంప్రదాయముల నవలంబించినట్లు కానవచ్చుచున్నది. వీరిలో మొదటివాడలంకారసిద్ధాంతమును, రెండవవాడు భరతుని సిద్ధాంతము నవలంబించెను. వీరిలో నెవ్వరు ప్రాచీనులైనను

ఒకరికి మఱియొకరు దగ్గిరగానున్నారు. కావున A D 500-630 మధ్యవారని చెప్పవచ్చును.

మేము మాపత్రిక యొక్క యీభాగమును ముగించుచు భామహుడు దండి కంటె తరువాత కాలమందుంచ దగినవాడుకాడని కనపర్చుటకు రెండు మూడంశము లను జెప్పుచున్నాము. కొలదికాలముక్రిందట Madras Oriental Manuscript Library అధ్యక్షుడు అవంతిసుందరీకథయను నొకగ్రంథమునుఁ గనిపెట్టెను ఈవ్రాతప్రతినిఁ జూడగా నిది దండివ్రాసినట్లు స్పష్టమగుచున్నది. ఇతరకథలయందు న్నట్లు వలెనే దీనికిని పీఠికలో శ్లోకములున్నవి. ఈశ్లోకములయందు బాణుడు మయూరుడు తక్కక వీశ్వరులు స్తుతింపబడిరి. (భిన్నస్తీక్ష్ణముఖేనాపి చిత్రం బాణేనవిర్వ్యథః) ఈదండిభారవికి మునిమనుమడనియు నితడు దుర్వినీతుడు సింహవిష్ణువు అను రాజును సమకాలికుడనియు నీపీఠికవలనమనము తెలుసుకొనుచున్నాము. ఈరాజులు 580 ప్రాంతమున పరిపాలకులైయుండిరి. దండి, భారవికినాల్గవవాడై యుండుటచే దండి యేడవశతాబ్దముయొక్క కొసభాగమందో లేక యెనిమిదవశతాబ్దమారంభమందో యుండవలసినవాడని యూహించుట సవబుగానున్నట్లు కానవచ్చుచున్నది. దండి తానువ్రాసిన అవంతిసుందరీకథాపీఠికయందు బాణభట్టుని స్తుతించుటయేకాక అతడు వ్రాసిన కాదంబరీ పూర్వార్ధముయొక్క కథను యథాస్థితముగా తన గ్రంథమందు వ్రాసెననుసంగతి పైయంశమునుఁ బలపర్చుచున్నది. బాణుడు 606 మొదలుకొని 648 వరకు రాజ్యము చేసిన హర్షవర్ధనుని ఆస్థానమందుండెనన్నమాట జగత్ప్రసిద్ధము. సులభముగా రాకపోకలు లేని యాకాలమందు ఔత్తరాహుడైన యొక కవిపదియిరువది సంవత్సరములలో దాక్షిణాత్యుడైన విమర్శకునివలన స్తుతింపబడునంత కీర్తిని సంపాదించుట మిక్కిలి యాశ్చర్యము.

భామహుడు బాణునికంటె ముందుజీవించి యుండవలయునని నమ్మదగిన ప్రమాణముచేఁ జూపింపబడవచ్చును. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో (3 ఉద్యోతము 238 పే) "తథావివక్షితాన్యపరవాచ్యస్యైవ శబ్దశక్త్యుద్భవానురణన రూపవ్యంగ్యప్రకార సమాశ్రయేణనవత్వమ్. యథా "ధరణీధారణాయాధునాత్వం శేషః" (హర్షచరిత VI) ఇత్యాదౌ "శేషోహిమగిరిస్త్వంచ మహాంతోగురవ స్థిరాః" యదలంఘితమర్యాదాశ్చలంతీం బిభ్రతేభువమ్ (కావ్యాలంకార III-27)

ఇత్యాదావసత్యపి తత్స్వైవార్థశక్త్యుద్భవానురణన రూపవ్యంగ్య సమాశ్రయేణ నవత్వమ్") ఆనందవర్ధనుడు "ధ్వన్యాలోకమందొక కవి సామాన్యముగా జెప్పిన భావమును మఱియొక కవి దానినే వ్యంగ్యమర్యాదతోఁ జెప్పి జెప్పినయెడల మిక్కిలి స్వరసముగానుండును. ఈవిషయములో బాణుడు భామహుడు కావ్యాలంకారములో నొకశ్లోకమందు జెప్పిన భావమును హర్షచరిత్రములో "ధరణీధారణాయాధునాత్వం శేషః" అని చెప్పియున్నాడు. భామహుడు బాణునికంటె ప్రాచీనుడై యుండుటచేతనే కొసవాడు మొదటివాని అభిప్రాయములను సురక్షితముగాను మర్యాదగాను యెరువుతెచ్చుకొన్నాడని కాశ్మీరదేశపు పండితులలోనున్న సంప్రదాయమని" యానందవర్ధనుడు పూర్ణముగానమ్మియున్నాడని యిందువలన స్పష్టముగా గానవచ్చుచున్నది. భామహుని కాలనిర్ణయ విషయముతో సంబంధించిన సర్వసమ్మతకాలముయొక్క తీర్మానమునకు విరోధించినట్లు ఆనందవర్ధనుని వాక్యము కనపరుపబడువరకు భామహుడు దండికంటెఁ బ్రాచీనుడన్న సంగతి నిరాక్షేపము.

దండి భామహులు దగ్గిరకాలము వారనియు నొకరొకరు దవిష్ఠులుకారనియు నభిప్రాయముగలవారి యెడల వినయమును జూపుచు నాసంగతివాస్తవముకాదని చెప్పుచున్నాము. భామహుడు ప్రాయికముగాఁ గాశ్మీరదేపు నివాసి దండిదాక్షిణాత్యుడు. ఇంతదూరదేశములయందున్న యీగ్రంథకర్తలిద్దరాకాలమందు పరస్పరజిగీషకలవారై యుందురని తలంచలేము, గుణదోష విచారణదక్షుడైన దండితన ప్రతిభవలన భామహుని గ్రంథమును దిరస్కరించుటకు బ్రయత్నించుచున్నాడని నిషేధింపలేము. దండిభామసాహుల సంగతి భారవిమాఘులవలె నున్నది. వారిరువురు సమీపదేశములయందు నివసించియున్నవారైనను కాలమందు మిక్కిలి వ్యవహితులు. భాషాసాక్ష్యమువలన నీయంశము రుజువుచేయఁబడవచ్చును. దండికాలమందువలె భామహుని కాలమందు ప్రాకృతభాషలు వాడుకలో లేవు. "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతంవిదుః సాగరస్సూక్తిరత్నానాం సేతుబంధాదియన్మయమ్" అని దండిహెచ్చుగా స్తోత్రము చేసిన సేతు కావ్యము భామహునినాటికి రచింపబడలేదు. దండివలె భామహుడు కావ్యవిభాగమును చేయలేదు. వరరుచిప్రాకృతప్రకాశకను ప్రాచీనవ్యాఖ్యాతమైన ప్రాకృతమనోరమను కావ్యాలంకార ప్రణేతయగు భామహుడే వ్రాసెనని రుజువుచేయగలిగిన యెడల ప్రాకృతవ్యాకరణము పైనది ప్రాచీనతమమైన

గ్రంథమని తలంపబడవచ్చును. ఇతరభాషలను విడిచి పెట్టియొక మహారాష్ట్రి భాషనుఁ దీసికొన్న యెడల నిది భామహుడు వివరించినట్లు వరరుచి మూలసూత్రముల ననుసరించిలేదు. వసంతరాజు మొదలగు తరువాత వ్యాఖ్యాతలు విపులముగా నాసూత్రములను వివరించిరి. ఎట్లైనను భామహుని గ్రంథమందు వర్ణింపబడిన సంఘస్థితి దండి కావ్యాదర్శమందు వర్ణింపబడిన దానికంటె వేరుగానున్నది. భామహుని కాలమునాటికి ప్రకాశమానములై యున్నకవి గ్రహములు దండికాలమునకు దిఙ్మండలము నుండి అదృశ్యములైనవి. ప్రాచీనభాషయొక్క సుందరమైన సరళశైలిసాత్మకమగు కల్పనలుగాను, శబ్దాలంకారములుగాను కాఠిన్యమునుఁ బొందలేదు. భామహుని కాలమందు బౌద్ధులకు హిందువులకు వ్యాపించు తీవ్రమైన వివాదలు శాస్త్రచర్చలుగాను తర్కవాదములుగా మారెను. కావున అలంకారశాస్త్రమందుఁగూడ నాయంశములే చర్చింపబడెను. అదియంతయు దండినాటికి మారిపోయెను. జనప్రచారముగానున్న కథలయొక్క నాయకులు జనులస్మృతిపథమందుండిరి. అలంకారశాస్త్రమును విషయమై మాట్లాడినచో యీదండిభామహుల గ్రంథములయందు స్పృశమైన అంశములెచ్చటను గానరావు. ఈవిషయమును విస్తరించి వ్రాయుట వలనఁ బ్రయోజనములేదు. ఈరెండు గ్రంథములను యాదృచ్ఛికముగాఁ జదువు పాఠకులకుగూడ యీయంశములు స్పష్టమగును. కావున దండి భామహులు వత్సరదశకములచే గాక వత్సరశతములచే వేరుపడియున్నారని మేము తలంచెదము.

భామహుడు, ధర్మకీర్తి. భామహుడు ధ్వన్యాలోకమందు ఆనందవర్ధనుడిచ్చిన సాక్ష్యమువలన నేడవశతాబ్దముయొక్క ప్రథమార్ధమందు జీవించిన బాణునికి దరువాతవాడని చెప్పుటకు వాటముకాదు. కాని యీయభిప్రాయము భామహుడు ధర్మకీర్తి గ్రంథమునుండి కొన్ని తర్కవిషయముల నెరువుదెచ్చుకొన్నాడను. అనుమానముతో స్పర్థించుచున్నది. జాకోబీ పండితుడు యీవిషయమును విపులముగాఁ జర్చించి యీసందర్భమందు ధర్మకీర్తియొక్క కాలనిర్ణయమును గురించి యాలోచించెను. చైనాదేశస్థులగు Houen Tsang (హుయాన్ త్సాంగ్) Itsing (ఇత్సింగు) ఇండియాలో జేసిన ప్రయాణముల కాలములో నున్నవాడని నిశ్చయించెను. 630-643 సంవత్సరములలో హిందూదేశమందు తిరిగిన హుయాన్ త్సాంగు యీధర్మకీర్తిని గురించి యెచ్చటను చెప్పలేదు. 671 మొదలుకొని 695 వరకు హిందూదేశమందు సంచరించిన రెండవ చీనయాత్రికుడు ధర్మకీర్తినిగురించి విన్నట్లు కానవచ్చుచున్నది. తారానాథుడు

(Vidyabhushana's History of Indian Logic p. 305-6) 627-698 సంవత్సరములలో రాజ్యమేలిన టిబెట్ దేశపు రాజైన Sron-tsan-gam-po అనువానికి ధర్మకీర్తి సమకాలికుడని చెప్పెను. కావున నేడవశతాబ్దము యొక్క మధ్యభాగమందు (ధర్మకీర్తి) యున్న వాడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. Jacobi పండితుడు చెప్పుటకు బ్రయత్నించినట్లు భామహుడు ధర్మకీర్తి వ్రాసిన తర్కశాస్త్రగ్రంథము నుపయోగించెనని రుజువుచేయగలిగిన యెడల, నానంద వర్ధనుడు చెప్పిన మాటకు విలువపోవును. భామహుడెనిమిదవ శతాబ్దమునకుఁజెంది వేయబడుట కవకాశము కలుగుచున్నది. ఆవిషయమై చెప్పబడిన యుక్తులను మొదట మనమిచటఁ బరీక్షించెదము.

భామహుడు ధర్మకీర్తి గ్రంథమునుండి కొంతయెరువు తెచ్చుకున్నాడని స్థాపించుటకుఁ జెప్పబడిన యుక్తులు వారిద్దరిగ్రంథములకు గల సాదృశ్యమునుఁ జెప్పి కొన్ని ముఖ్యాంశముల నాధారముగాఁ జేసికొని యున్నవి. ఆయంశములు మూడు మాత్రమే వానినొకదాని తరువాత మరియొక దానిని జెప్పెదము. భామహుడు అనుమానమునకు రెండు లక్షణములనుఁ జెప్పియున్నాడు.

త్రిరూపాల్లింగతో జ్ఞాన మనుమానంచ కేచన। తద్విదో నాంతరీయార్థ దర్శనం చాపరేవిదుః॥ కావ్యా. V-II.

ఉత్తరార్థమందు జెప్పబడిన అనుమానలక్షణము దిఙ్నాగాచార్యులనుండి వచ్చినదని న్యాయవార్తికమునకు వాచస్పతిమిశ్రుడు వ్రాసిన తాత్పర్యటీక వలన మనకుఁ దెలియవచ్చుచున్నది. కాని మొదటి లక్షణమునుగురించి మనమేమిచెప్పవలసి యున్నది. "మొదటిలక్షణము మరియొక శాస్త్రతత్త్వజ్ఞునిదై యుండవలెను." అని జాకోబీపండితుడు వ్రాయుచున్నాడు. మరియొక తత్త్వశాస్త్రజ్ఞుడెవడు? అని యడుగగా నతడు ధర్మకీర్తియే. అని జాకోబీపండితుడు చెప్పుచున్నాడు. ఏల యనగా? ఆతని న్యాయబిందువులో నొకచోట, "అనుమానంద్విధా స్వార్థం పరార్థంచ, తత్ర స్వార్థం త్రిరూపాల్లింగాత్। యదనుమేయేజ్ఞానం తదనుమానమ్" అనియున్నది. ఈవిషయమందు నింక నితర విషయములయందు మనము మనల నడుగుకొనవలసిన ప్రశ్నయేమనగా? లింగస్య త్రైరూప్యమ్, అను నభిప్రాయము ఒకనిది యా లేక సర్వసాధారణమా? అని మనము మనకు వేసుకొనవలసిన ప్రశ్న. దానితో సంబంధించిన అభిప్రాయమపూర్వముగా నున్నయెడల నట్టియుక్తికి విలువయుండును.

దిఙ్నాగునిచేఁ బ్రకృతవిషయమం దట్టిది మనకేమియుఁ గానరాదు. లింగస్య త్రైరూప్యమ్॥ అనునంశము మనసైయాయికుల కందరికి సామాన్యమైన యంశమే. దిఙ్నాగుడుకూడ నెఱింగిన విషయమేయని చెప్పుట మనపనికి జాలును. దిఙ్నాగాచార్యుల గ్రంథములను గురించి మనకు కొంతజ్ఞానము గలిగించి గతించిన డాక్టరు విద్యాభూషణుని పరిశ్రమకు మనము కృతజ్ఞులమై యుండవలెను. దిఙ్నాగాచార్యుడు తనప్రమాణసముచ్చయమందు స్వార్థానుమానమును గురించి యిట్లు చెప్పెను. (See Vidya-bhushana's History of Ind Logic p. 280) స్వార్థానుమానమనగా మూడులక్షణములుం దానికుండుటవలన గలిగిన వస్తువిషయకజ్ఞానము. ఈ యర్థమును సంస్కృతభాషలో ననువదించినపుడు ధర్మకీర్తి న్యాయబిందువునుండి తీసిన వచనమువలెనుండదా? ఈసందర్భమున మనము మరొక్కవిషయము గుర్తించవలసియున్నది. దిఙ్నాగాచార్యుల లక్షణముతో భామహుఁడీలక్షణమును చెప్పినరీతి దానిని మరియొకఁడువ్రాసెనని తెలియజేయుటయేకాక యిది ప్రాచీనమైనదనియు సర్వసమ్మతమైనదనియు కూడ బోధించుచున్నది.

“లింగస్య త్రైరూప్యం” అను విషయములో ప్రమాణ సముచ్చయమందే గాక న్యాయప్రవేశమందుఁగూడ “లింగస్య త్రైరూప్యమ్” అనివిశదముగాఁ జెప్పబడినది. ఈగ్రంథమునకు కర్తయెవ్వరైననుఁ ధర్మకీర్తి తరువాత నీగ్రంథము వ్రాయబడినదని రుజువుచేయుట కెవ్వరును ప్రయత్నించలేదు. ఇట్లు భామహుడు ధర్మకీర్తికి బాకీపడియుండలేదని మనము చూచుచున్నాము. హిందూతర్కముయొక్క యీ భాగమునకు దిఙ్నాగాచార్యులకుసైతమతడు కృతజ్ఞుడైయుండనవసరము లేదని తలంచుచున్నాము. అతడీజ్ఞానమును మఱియొక ప్రాచీనతమతార్కికునివలన లభించియుండవచ్చును.

ధర్మకీర్తివచనముతో సదృశముగానున్న భామహునివచనము మరియొకటియేది యనగా “దూషణం న్యూనతాద్యుక్తిః” అనునది (కావ్యా. V-28) “దూషణాని న్యూనతాద్యుక్తిః (న్యాయబిందువు Peterson's Edition III-138) అని ధర్మకీర్తిపలికెను. ఈరెండువచనములకు సాదృశ్యము సరిగానున్నది. కాని మఱల నీవిమర్శ లెత్తుచున్నది. ఇది ధర్మకీర్తి కల్పించినదా? భామహుని మూడవవచనమునకు గూడ నదేవిమర్శ కలుగును. జాతయోదూషణాభాసాః। (కావ్యా. V-29) దూషణాభాసాస్తుజాతయః అని చెప్పిన ధర్మకీర్తియొక్క క్రొత్తసిద్ధాంతమును కని

పెట్టెనా? ఈరెండు పక్షములయందు ధర్మకీర్తి స్వంతమైన దేదియుఁ గానరాదు. దూషణలుజాతులు భామహునికంటెను ధర్మకీర్తికంటెను ప్రాచీనులైన గ్రంథకర్తలు కూడ నెఱుంగినవియె. ఈదూషణలు జాతులు సర్వలోకప్రసిద్ధములై యుండుటచే ధర్మకీర్తికంటె ముందున్నవని స్థాపించుటకు యుక్తిబాహుళ్యమవసరము లేదు. ఈ సందర్భమున గౌతముని న్యాయసూత్రము వాత్స్యాయనుడు వ్రాసిన దానిభాష్యము కనపర్చుట యవసరము. "సాధర్మ్యవైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానంజాతిః। అని గౌతమ సూత్రము విప్రయుక్తే హేతౌయః ప్రసంగోజాయతే సాజాతిః। సచప్రసంగః సాధర్మ్యవైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానముపాలంభః ప్రతిషేధఇతి। ప్రత్యనీకభావాజ్జాయమానోర్థోజాతిరితి జాతోబీఅపేక్ష లేకుండ స్వతంత్రముగా ధర్మకీర్తి గ్రంధమునకు భామహుని గ్రంధమునకు గల సాదృశ్యమును చూపించిన Kane పండితుడు భామహుని కావ్యాలంకారమునుండి ధర్మకీర్తి శ్లోకమువలెనే కానవచ్చునొకశ్లోకము నుదాహరించెను. ఎట్లనగా "సత్త్వాదయః ప్రమాణాభ్యాం ప్రత్యక్షమనుమాచతే। అసాధారణ సామాన్యవిషయత్వంతయోఃకిల (కావ్యా. V-5) ధర్మకీర్తి యిట్లు వ్రాయుచున్నాడు. "ద్వివిధంసమ్యగ్జ్ఞానం ప్రత్యక్షమనుమానంచ। తస్యవిషయస్స్వలక్షణం। అన్యత్సామాన్యలక్షణం। సోఽనుమానస్యవిషయః॥ ప్రమాణముల విభాగము వానిలక్షణములు ధర్మకీర్తివలననే పుట్టినవని చెప్పలేము. నాలుగుప్రమాణములేయని చెప్పిన అక్షపాదునికి ప్రతిపక్షులైన తార్కికులందరు నాయభిప్రాయమునే కలిగియున్నారు. అందుకుదాహరణముగా ప్రమాణసముచ్చయమందు దిఙ్నాగాచార్యులు ప్రత్యక్షమనియు ననుమానమనియు ప్రమాణములు రెండువిధములని చెప్పెను. సకలపదార్థజ్ఞానమీరెండింటి వలననే కలుగుచున్నది గావున నితర ప్రమాణములతోఁ బనిలేదనెను. విద్యాభూషణుడు తాను వ్రాసిన హిందూదేశపు తర్కశాస్త్రచరిత్రలో పైయర్థమునిచ్చు నొకశ్లోకము నుదాహరించెను. "ప్రత్యక్షమనుమానంచ ప్రమాణంహిద్విలక్షణమ్। ప్రమేయంతత్ప్రసిద్ధంహి నప్రమాణాంతరం భవేత్॥ భామహుడు తనకావ్యాలంకారములో వ్రాసిన శ్లోకములకు మూలమయినవని చెప్పబడిన ధర్మకీర్తి వాక్యములన్నియు నతడుకల్పించినవికావు. అని పైశ్లోకమువలన స్పష్టమగుచున్నది. ధర్మకీర్తిపుట్టక మునుపటినుండి సర్వలోకవిదితమైన అభిప్రాయముల నాశ్లోకములు ప్రకాశింపజేయుచున్నవి. ఇట్టిస్థితిలో భామహుడు ధర్మకీర్తినుండి యెరువుతెచ్చుకొన్నాడనియు మరియేగ్రంథకర్త నెఱుంగడని యెవ్వడును వాదించలేడు. అభిప్రాయముల యాదృచ్ఛిక సాదృశ్యమును మూలముగాఁజేసికొని భామహుడు ధర్మకీర్తినుండి కొన్ని అభిప్రాయములను యెరువుదెచ్చుకొన్నాడని యొప్పుకొనునట్లు వెలితి

పాండిత్యము గలవాడుకాడు కొంతమట్టుకు భాషకూడ సదృశముగా నుండుట వలన జాకోబి పండితుడట్టి యభిప్రాయముగలవాడయ్యెనని మేము తలంచెదము. ప్రకృతవిషయమందు భాషాసాదృశ్యముకూడ ప్రయోజనకారి కాదని మాయభిప్రాయము. దూషణలు జాతులు వీని లక్షణములలో సౌసాదృశ్యము గలదు. కాని అప్పటికూడ నాలక్షణములను వాడుకచేయుటకు ధర్మకీర్తియే మొదటివాడని చెప్పలేము. అందరికంటె మొట్టమొదట నాశ్లోకములను వ్రాసినవాడు భామహుడే యని సమానబలముతో మేము చెప్పవచ్చును. అందులో నసందర్భమేమియు లేదు. శాంతరక్షితుడు తత్త్వజ్ఞుడైయున్నను మనకవియొక్క భాషనే తానుకూడఁ జెప్పుట అనౌచిత్యమని తలంచనిచో నాపని ధర్మకీర్తి యెందుకుచేయకూడదో మాకు సబబు గానరాదు.

భామహధర్మకీర్తుల గ్రంథములకు భాషాసాదృశ్యమున్నదని నిస్సంశయముగా రుజువుచేయఁబడినను దానివలన మనకేమియుఁ బ్రయోజనము లేదు. నిశ్చయమైనసాక్ష్యము దొరికేవరకు భామహుడు ధర్మకీర్తి గ్రంథమునుండి పదప్రయోగములను అభిప్రాయములను యెరవుదెచ్చుకొన్నాడని నిశ్చయముగాఁ జెప్పలేము. భామహధర్మకీర్తులొకరు మరియొకరి గ్రంథమునుండి అభిప్రాయములను యెరవుదెచ్చుకొని యుందురు లేదా వీరుభయులు మఱియొకని గ్రంథమునుండి చౌర్యముచేసి యుండవచ్చుననుట సబబుగానున్నది.

తనయూహనునిలువఁబెట్టుటకుఁ దగినసాక్ష్యమును జాకోబీపండితుడు చూపించలేకపోయెను. భామహుడు దిఙ్నాగుని గ్రంథమునుండి గ్రహించినాడని Kane పండితుడు అభిప్రాయపడుచున్నాడు. భామహుడు ధర్మకీర్తి అభిప్రాయములను యెరవుతెచ్చుకొనెనో లేదో అని నిశ్చయించుటకు మంచిసాధనమేమనగా వారిరువురి గ్రంథములను బాగుగాఁజదివి వారి అభిప్రాయములను తైపారువేయుటయే. ధర్మకీర్తి దిఙ్నాగాచార్య మతానుసారియైనను పూర్తిగా నతని అభిప్రాయములను స్వీకరింపలేదని మధ్యకాలపు తర్కమెఱింగిన వారికందరికిఁ దెలియును. విద్యాభూషణుడు మధ్యకాలపు తర్కమును గురించి తాను వ్రాసిన గ్రంథమందు ధర్మకీర్తి చెప్పిన శాస్త్రవిశేషములన్నిటిని పూర్తిగాఁ జెప్పియున్నాడు. వానినిఁ జూచిన యెడల ధర్మకీర్తియొక్క ముఖ్యాభిప్రాయమేమియు భామహుని గ్రంథమందుఁ జెప్పబడియుండలేదని స్పష్టమగుచున్నది. మీఁదుమిక్కిలి విరుద్ధపక్షముకూఁ గనపడు సూచనలున్నవి. కొన్నింటినిప్పుడుఁ జేర్కొందము. "ప్రత్యక్షం కల్పనాపోఢమ్"..

అని దిఙ్నాగాచార్యులు ప్రత్యక్షమునకు లక్షణము చెప్పెను. వాచస్పతిమిశ్రుడు తాత్పర్యటీకలో నీలక్షణమునకు వ్యాఖ్యానము వ్రాయుచు "అపరేతు మన్యంతే ప్రత్యక్షం కల్పనాపోఢమితి" అని చెప్పి "సంప్రతి దిఙ్నాగస్య లక్షణముపన్యస్యతి" (See Vidyabhushana's History of Indian Logic) ధర్మకీర్తి ప్రత్యక్షంకల్పనాపోఢమ్ అనుదానికి అభ్రాన్తం అనుదానిని జేర్చెను. "అభ్రాంతమ్" అనుపదము ధర్మకీర్తికిఁ దరువాతఁ బుట్టినవాడెవ్వడు నుపేక్షింపదగినది కాదు. దిఙ్నాగుడు చెప్పిన ప్రత్యక్షలక్షణము సామాన్యముగా నుండుటచే ప్రతివస్తువున కన్వయించునట్లు అర్థముచెప్పవచ్చును. కావున ప్రతివస్తువుప్రత్యక్షమే. ఉద్యోతకారుడు దీనినిట్లు వ్యాఖ్యానము చేసెను. "స్వరూపతోఽనవ్యపదేశ్యం", అని ప్రత్యక్షశబ్దముచేఁ బ్రత్యక్షజ్ఞానమే చెప్పబడుచున్నది. తదితరము కాదు. అని స్పష్టముగా తెలుసుకొనుటకు ధర్మకీర్తి "అభ్రాంతం అను శబ్దమునుఁ జేర్చెను. భామహుండొక్కపంక్తిలో బ్రత్యక్షమునకు రెండులక్షణములనుఁ జెప్పెను. ఎట్లనగా; ప్రత్యక్షం కల్పనాపోఢం తతోఽర్థాదితి కేచన (కావ్యా. V-6) ఈ రెండులక్షణములలోను మొదటిది వాచస్పతి మిశ్రుని ప్రామాణ్యముపై దిఙ్నాగాచార్యులది. రెండవది. అతని ప్రామాణ్యముపైనే దిఙ్నాగాచార్యుని గురువగు వసుబంధుడిది వాచస్పతిమిశ్రుడు "అపరే పునర్వర్ణయంతి తతోఽర్థాద్విజ్ఞానం ప్రత్యక్షం, తదేవం ప్రత్యక్షలక్షణం సమర్థ్య వాసుబంధవంతా వత్ప్రత్యక్షలక్షణం వికల్పయితుముపన్యస్యతి (తాత్పర్యటీక) భామహుడెరిగియున్నయెడల ధర్మకీర్తి లక్షణమును విడిచి పెట్టునని యూహింపఁబడునా? ఇంతియకాక "కల్పనకు" ధర్మకీర్తి యింకొకరీతిగా లక్షణమునుఁ జెప్పియున్నాడు. "అభిలాపసంసర్గయోగ్యప్రతిభాసప్రతీతిః" అని ధర్మకీర్తి కల్పనకర్థముఁ జెప్పెను. ఉద్యోతకారుడు దిఙ్నాగాచార్యుని ప్రత్యక్షలక్షణమును విమర్శించుచు "అథ కేయంకల్పనా? నామజాతియోజనేతి" యత్కిలనాష్న్యభిధీయతే నచ జాత్యాదిభిర్వ్యపదిశ్యతే (న్యాయవార్తికమ్) దానికి వాచస్పతిమిశ్రుడు "లక్షణవాదినాముత్తరమ్" అని పేరుపెట్టినాడు. ఇచ్చట దిఙ్నాగుడు, ఇంకనట్టి యభిప్రాయము గలవారందరు లక్షణవాదులు. భామహుడుకూడఁ వారిలో నొకడైయుండునని మనమూహింపవచ్చును. (ఆయభిప్రాయము నెఱింగినవాడై) "కల్పనాం నామజాత్యాదియోజనాం ప్రతిజానీతే (కావ్యా. V-6) ధర్మకీర్తి చెప్పిన కల్పనాలక్షణము విద్యత్ప్రగల్భ్యములోను ప్రత్యక్షలక్షణము క్తిసామంజస్యములోనుఁ గూడియున్నది. ముఖ్యమైన సారాంశముపై భామహుడు రెండభిప్రాయముల నియ్యగలవాడైనచో ధర్మకీర్తిలక్షణములవలె నుపయోగకరములు ననుగుణములు నైనయెడల యూహన

అభిప్రాయముకూడ నిచ్చియుండునని మేము తలంచెదము. ఈసందర్భమందు మరి యొకటి చెప్పవలసియున్నది. ధర్మకీర్తి తనగ్రంథములయందెచ్చటను అతని శిష్యుడైన దిఙ్నాగునియందు ప్రామాణ్యబుద్ధి గలవాడైనను వసుబంధుని అభిప్రాయములను గురించి గౌరవమును జూపలేదు. ప్రాచీనతార్కికుడైన వసుబంధుని అభిప్రాయములను నిర్దుష్టమైన భాషలోఁ జేర్చెను. ధర్మకీర్తి కాలమునాటికి వసుబంధుని ప్రశస్తి తనకంటె సమర్థులెరుడు తనశిష్యుడునైన దిఙ్నాగునిచేఁ గబళించబడెనని మన మూహించుకొనవచ్చును. వసుబంధువు మనుష్యుల స్మృతిపథమందున్న కాలమున భామహుడు జీవించియుండుట కొంతసంభావ్యముగాఁ గానవచ్చుచున్నది.

ధర్మకీర్తి, దిఙ్నాగుడు భామహుడు వ్రాసిన గ్రంథములను సవిస్తరముగా తైపారు వేయుటవలనఁ గలిగిన ఫలితము నిచటఁజూపించుట మిక్కిలి లాభకరము. కాని గ్రంథవిస్తరమగునని భీతిచే విరమించుచున్నాము పైకివెళ్ళిపోవుచు గొన్నియంశము లుఁ జెప్పెదము. భామహుడారు పక్షాభాసములను (5-13-20 కావ్యా.) ధర్మకీర్తి నాలుగు పక్షాభాసములనుఁ జెప్పెను. (న్యాయబిందువు 84-85) మిక్కిలి సంతోషమును కలుగజేయునది యేమనగా;—భామహుని కొన్నిలక్షణములు, ఉదాహరణములు న్యాయప్రవేశములో నున్నవానితో సరిగా నుండుటయే. ధర్మకీర్తి దృష్టాంతమును త్రిరూపహేతువులో నంతర్భవింపజేసెను. కాని భామహుడు దానిని, న్యాయప్రవేశములోను ప్రమాణసముచ్చయములోనున్నట్లు ప్రత్యేకప్రమాణముగాఁ గ్రహించెను (కావ్యా. V-21, V 26-27) న్యాయప్రవేశమందుఁ బ్రమాణసముచ్చయమందు సాధర్మ్యవైధర్మ్య భేదముచే రెండువిధములుగా విభజింపబడెను. భామహుడుకూడ నిట్లే చేసెను. ధర్మకీర్తి యిట్లు విభజింపలేదు. పైనఁ జెప్పబడినయీ యంశములు కొన్ని భామహుడు ధర్మకీర్తి వలన యెరువుతెచ్చుకొన్నాడని పక్షపాతము లేనివాని నొప్పించుటకు జాలును.

ఈయంశములుకూడ ప్రయోజనకారులు కానియెడలభామహుడు ధర్మకీర్తికి దరువాతవాడని నుమూహించుకొనలేము. ధర్మకీర్తి పైనఁజూపించినట్లు క్రీస్తు వెనుక 650 దాదాపువ జీవించినవాడు. దక్షిణ హిందూస్థానమునుండి వచ్చినవాడు. శాంతరక్షితుడు యెనిమిదవ శతాబ్ద ప్రారంభమందు వంగదేశమందు జీవించెను. మలభముగా రాకపోకలుండని యాకాలమందే బది సంవత్సరములలో నట్టియభివృద్ధి సాధ్యమని తలంపలేము. ధర్మకీర్తి మిగులఁ బ్రసిద్ధుడాయెను, అతనిగ్రంథములు

కాశ్మీరదేశమునకుఁ గొనిపోఁబడెను. భామహుఁడు తనగ్రంథమును రచించుటకు ధర్మకీర్తి గ్రంథముల నుపయోగించెను. భామహుఁడుకూడ గ్రంథకర్తయై ప్రసిద్ధిఁ గాంచెను. భామహుని గ్రంథము వంగదేశమునకుఁ జేరి శాంతరక్షితునిచే గ్రహింపబడెను. ఇదియంతయు నొకఅర్ధశతాబ్దమందు జరిగినది. ఇదిసాధ్యమైనట్లు కనపడదు. కావున బాణుడు భామహుని గ్రంథముతోఁ బరిచయము గలవాఁడై యుండెనని ఆనందవర్ధనుడు చెప్పినమాటను సందేహించుటకు సవబు లేదు కావున A C 600 భామహుని కాలమునకు దిగువనుండు అవధియని నిరపాయముగా మనము గ్రహింపవచ్చును.

అయితే ఊర్ధ్వావధి యేమైయుండవలెను. భామహుఁడు వాచస్పతిమిశ్రుని వచన ప్రామాణ్యానుసారముగా దిఙ్నాగునిఅభిప్రాయములతోఁ బరిచితుఁడైయుండెనని పైవాదమంతయుఁగనపర్చినది. ఒకప్పుడు భామహుని అభిప్రాయములు న్యాయప్రవేశమందున్న వానినిఁ బోలియున్నవని మేము కనపర్చితిమి. నంజియోకాత్సుడను వారలీన్యాయప్రవేశము నాగార్జునుడు వ్రాసినదని చెప్పిరి. నంజయో అను వాని పేరును సంస్కృతము చేయుటలో తప్పివాడని విధుశేఖర భట్టాచార్యుడు తలంచుచున్నాడు. పుస్తకములోనున్న చైనాభాషాపదము. "యూలూన్" దానికి సాంస్కృతిక నామము, దిఙ్నాగ అని Sagnira (సుగీర) Ui' (ఉ) అను వారి అభిప్రాయ ప్రకారము న్యాయప్రవేశము శంకరస్వామి యనువాడు వ్రాసినదని చీనాదేశపు సంప్రదాయము. వీరియభిప్రాయ ప్రకారము దిఙ్నాగుడు వ్రాసినది న్యాయద్వారము. ఇది న్యాయప్రవేశముకంటె వేరైనగ్రంథము. Dr. Randle పండితుడు న్యాయద్వారమునకు కర్త దిఙ్నాగాచార్యులని చీనావారు చెప్పు విషయము నిస్సంశయముగనమ్మదగినదని చెప్పుచున్నాడు. అది యట్లగుటచే దిఙ్నాగుడు న్యాయప్రవేశమును రచించెనని చెప్పుట అసాధ్యము. న్యాయప్రవేశము దిఙ్నాగుడు రచించినదియేయని టిబెటు దేశస్థులు చెప్పిన సంగతి నమ్మకపోవుటకు సవబులేదు. ఆరీతిగానైనయెడల దిఙ్నాగుడుతప్ప తదితరుడు దానిని రచించెనని చెప్పుట దుర్లభము. విధుశేఖర భట్టాచార్యులు న్యాయప్రవేశమును దిఙ్నాగుడే రచియించెనని రుజువుచేయుటకు బలమైన యుక్తులను బహుళముగాఁ జెప్పెను. హుయాన్‌త్సాంగుగాని ఇత్సింగుగాని శంకరస్వామి నెరుగరు. ఇదిమిక్కిలి చిత్రముగా నున్నది. టిబిటియన్ గ్రంథములతని పేరె యెరుగవు. చైనాభాషలోనికనువదింపబడిన న్యాయప్రవేశముయొక్క టిబిటియన్ భాషానువాదము చైనాదేశ

స్థలు శంకరస్వామి పేరునైన యెరుగరని స్పష్టపరచుచున్నది. ఇటీవల కొంతకాలమునకు శంకరస్వామి పేరును న్యాయప్రవేశముతో నెట్లు కలిపిరో చెప్పలేము. ఎక్కడనో యొకచోట దాగియున్న భంగపరుపు గందరగోళమున్నట్లు కానవచ్చుచున్నది. శంకరస్వామికి చైనావారారోపించిన న్యాయప్రవేశకర్తృత్వమునకు మూలాధారమేమియును మనము చెప్పలేము. విధుశేఖర భట్టాచార్యులు ప్రకటించిన టిబెట్ మూలగ్రంథమునుబట్టి చూడగా (Gaekwad Oriental series XXXIX Part II) న్యాయప్రవేశమును దిఙ్నాగాచార్యులు వ్రాసినట్లు నిశ్చయముగాఁ గానవచ్చుచున్నది. ఆగ్రంథసంపాదకుడు చైనాభాషలోను సంస్కృతభాషలోను వ్రాయబడిన పాఠములతో తైపారువేసెను. వానికి భేదములేదని కనిపెట్టెను. గ్రంథకర్తృత్వమును గురించి టిబెట్ భాషాపాఠములో నేమిచెప్పబడినదో యితర భాషాపాఠములయందుఁగూడ నదియే సత్యము. ఆకులముగాఁజేయ నీగూఢప్రశ్న ధ్రువగారు న్యాయప్రవేశమునకు వ్రాసిన సంస్కృతోపోద్ఘాతము విశదముగాఁ జేయుగలదని మాయాశంప న్యాయప్రవేశమును వ్రాసినవాడు శంకరస్వామియని ఋజువుచేయబడినను మాకేమియు నష్టములేదు. ఆశంకరస్వామి దిఙ్నాగుని శిష్యుడని చెప్పబడుచున్నాడు. కావున శంకరస్వామి దిఙ్నాగునికి సమకాలికుడై యుండవలెను. కాబట్టి భామహుని గ్రంథమందున్న అభిప్రాయములకు వచనములకు దిఙ్నాగుని గ్రంథములలోను న్యాయప్రవేశములోనున్న అభిప్రాయములకు వచనములకు సాదృశ్యము స్పష్టముగా మనము చూచినపుడు దిఙ్నాగుని కాలము భామహుని కాలమునకు త్తరావధినిఁ గల్పించుచున్నదని మనము నిస్సంశయముగాఁ జెప్పగలము. దిఙ్నాగునికాలము వానియుపాధ్యాయుడైన వసుబంధుని కాలమున కధీనమైయుండును. A D 401-409 సంవత్సరముల మధ్యను కుమారజీవుడు వసుబంధునియొక్క జీవితము 499-560 లోను పరమార్థుడొకజీవితమును వ్రాసెనని నంజియో అనువాడు చెప్పుచున్నాడు (Nanjeo's catalogue of Chinese Triputika) ఈ వసుబంధువు విక్రమాదిత్యునికి సమకాలికుడని పరమార్థుడు వ్రాసినవసుబంధు చరిత్ర వలన మనము తెలుసుకొనుచున్నాము. ఈవిక్రమాదిత్యుడే గుప్తవంశస్థుడైన ప్రథమ చంద్రగుప్తుడని V. A. Smith చెప్పుచున్నాడు. V. A. Smith చేసినట్లే వాదసరణి అనుసరింపబడిన యెడల 80 సం|| లో మృతినొందిన వసుబంధువు 280-360 మధ్యను జీవించియున్నట్లు చూడబడును. కాని పండితులందరు నేకరీతిగాఁ బలుకువారు కారు. అనేకులగు పండితులనేక విధములుగా వసుబంధుని కాలమును నిర్ణయించిరి. పండితులందరు యేకముఖముగా లేరు. అతడు 420-500 మధ్యను

జీవించెనని కొందరి విశేషాభిప్రాయము. కాని విద్వజ్జన బాహుళ్యము మొదటి అభిప్రాయమునే అవలంబించియున్నది. ఈయభిప్రాయమే నిస్సంశయముగా సంభావ్యముగాఁ గానవచ్చుచున్నది. మనము రెండవ అభిప్రాయము నొప్పుకొన్నయెడల దరువాతి కాలమంతియును భంగమునుపొందును. అప్పుడు కుమారజీవుడు వ్రాసిన వసుబంధుని చరిత్రమంతయు నొకపురాణకథవంటిదగును. వసుబంధువు దేశాభిమానులలో నొకడను సంప్రదాయము, కుమారజీవుడాగ్రంథమును చైనాభాషలోనికిను వాదముచేయుట మొదలగునవియన్నియు నవిశ్వాస్యములగును. 280–360 సంవత్సరముల మధ్యను వసుబంధువు జీవించెననుటకు సంభావన కలదని మనము తెలుసుకొన్నాము. దిఙ్నాగాచార్యులతని శిష్యుడుగావున నతనికంటె కనిష్ఠుడైనను సమకాలికుడు ఇతడు 400 కు ముందుయే సంవత్సరములలోనో జీవించియుండును. 400 సంవత్సరము దిఙ్నాగుని దాదాపుకాలమైనచో ఆకాలము భామహునికాలమున కుత్తరావధినిఁ గల్పించునది యని యాలోచింపబడవలెను. కాబట్టి భామహుడు దిఙ్నాగ బాణుల కాలముమధ్యను అనగా 400–600 మధ్యను జీవించెనని నిరాటంకముగాఁ జెప్పవచ్చును. భామహుని కాలనిర్ణయము మనమింతకంటె కొంచము సరిగా నుండవలెనని కోరినయెడల నతడు దిఙ్నాగునికి దగ్గరగానున్నవాడా లేక ధర్మకీర్తికి దగ్గరగానున్నవాడా అసంగతిని కనుకొనుటకుఁ బ్రయత్నించవలెను. భామహుని అభిప్రాయములు ధర్మకీర్తి అభిప్రాయములకంటె దిఙ్నాగుని అభిప్రాయములతో సంవదించుచున్నవను సంగతి నిదివరకే చూపించినాము. ప్రాచీనోపాధ్యాయులను మనుష్యులు మరువని కాలమందే భామహుడుండెననికూడఁ జెప్పియున్నాము. జనుల వాడుకలో నున్నవారి గ్రంథములతో జాగ్రత్తతో తైపారు వేసినయెడల నీవిషయము స్పష్టమగును. భామహుడు దిఙ్నాగుని గ్రంథములలోఁ గానరాని విషయముల నితరగ్రంథకర్తల గ్రంథములో చూచుకొండని పాఠకులకుఁ గొన్నిచోట్ల నుపదేశించెను. బాణునివంటి మహాకవీశ్వరునికిగూడ నితనిగ్రంథములతో తనకుఁ గొంత పరిచయము గలిగించుకొనవలయునని అభిలాష పుట్టించుటకుఁ దగినట్లు భామహునికీర్తి వృద్ధినొందువరకుఁ గొంతకాలము పట్టునని మనమాలోచించుకొనవలసియున్నది. ఇందుకొక శతాబ్దము పట్టునని అనుకొన్నయెడల భామహుడు 500 సంవత్సరములకు ముందువాడన్నచోఁ దప్పు లేదు. వాడువ్రాయుప్రకారము వాడెచ్చట నుండువాడో వానిమిత్రులెవ్వరో ఆవిషయము మనకేమియుఁ దెలియదు. కాని భామహుడు దిఙ్నాగునికి మిక్కిలి దూరస్థుడు కాడని మేమూహించెదము. (సాక్ష్యము వలన మేము దానిని రుజువుచేయజాలకపోయినను), అతని కావ్యాలంకారములోని

సంశయమపచ్ఛేదము (తత్త్వశాస్త్రముతో నిండి తర్కవాదములను ప్రతిపాదించు) చుండుట వలన నతడు దేశమందెల్లెడలం దర్కవాదములతో నుండియున్న కాలమందు జీవించి యుండెనని తెలియబడుచున్నది. హిందూదేశ చరిత్రలో నట్టికాలము దిఙ్నాగునివంటి మహాపండితులు జీవించియున్న సమయమందు తటస్థించియుండునని తలంచెదము. అచ్చటచ్చట సంగ్రహింపబడిన వృత్తాంతములవలన (Vidyabhushana's History of Indian Logic p. 272-274) దిఙ్నాగాచార్యుడు తన జీవనము నంతయును తీక్ష్ణమైన శాస్త్రముతో నెగడిపెనని తెలియవచ్చుచున్నది. అతనికాల మందతడు తర్కపుంగవుడను బిరుదుతో వ్యవహరింపబడెను. కాని అట్టికాల మెన్నో వత్సరములుండ లేదు. దండి కాలమునాటికి, అలంకారముల తర్కము నేర్పాటుచేయునది (భామహుడు వ్రాసిన అలంకారమునకు ఆవశ్యకమైనదని తలంపబడిన) దియు నగు న్యాయనిర్ణయము నిరుపయోగమైన కర్కశ విచారమని నిరసింపబడెను. "విచారః కర్కశః ప్రాయస్తేనాలీఢేన కిం ఫలం। (కావ్యాదర్శ) బాణుని కాలమందుగూడ దిఙ్నాగుని కాలమందువలె తర్కకర్కశవాదము లున్నట్లెచ్చటను సూచింపబడ లేదు. 5, 6 శతాబ్దములలోనున్న గుప్తరాజుల శాసనములలోగూడ నిందుకేమియు సూచనలగుపడ లేదు. తర్కశాస్త్రార్థములు చేయుకాలము దిఙ్నాగునితో నంతమయ్యెనని మనమునమ్ముటతప్పుకాదు, కావున భామహుడు నానాదేశములయందున్న పండితులతో శాస్త్రార్థములు చేయుట యందుత్సాహముచే దేశాటనము చేసిన దిఙ్నాగునికి సమకాలికుడైనం గావచ్చును లేక అతడు గతించిన పిమ్మట నే పుట్టినవాడైనం గావచ్చును. కావున భామహుడు 400 దాదాపులో జీవించినవాడై యుండవచ్చును. న్యాయప్రవేశము శంకరస్వామి వ్రాసెనని రుజువుచేయబడిన యెడల మఱికొన్ని సంవత్సరములు తరువాతనైన జీవించినవాడై యుండవచ్చును.

## భామహుని గ్రంథములు.

భామహుడీ కావ్యాలంకారమును గాక మరేదైన గ్రంథమును వ్రాసెనాయని కనుగొనుట మిక్కిలి కష్టము. కావ్యాలంకారమందుం గానరాని కొన్ని శ్లోకములతో భామహుని పేరు సంబంధించియున్నది. రాఘవభట్టు డభిజ్ఞాన శాకుంతలమునకు వ్రాసిన అర్థద్యోతికయను వ్యాఖ్యానమందు (కావ్యాలంకారములో నెచ్చటనుకదపడని కొన్నివాక్యములను భామహునివని రెండుపర్యాయములు చెప్పియున్నాడు. ఆవాక్యములలో నొకటి ఛందశ్శాస్త్రమునుండియు నింకొకటి యలంకారశాస్త్రము

నుండియు తీయబడినవి. (క్షేమం సర్వగురుర్ధత్తే మగణో భూమిదైవతః। ఇతిభావహోక్తేః। తల్లక్షణముక్తం భామహేన। పర్యాయోక్తం ప్రకారేణ యదన్యేనాభిధీయతే। వాచ్యవాచక శక్తిభ్యాం శూన్యేనావగమాత్మనా౽ఇతి। ఉదాహృతిశ్చ హాయగ్రీవ వధస్సంపద్యమ్। యంప్రేక్ష్యచిరరూఢాపి నివాసప్రీతిరుజ్ఝితా। మదేనైరావణ ముఖేమానేన హృదయేహరేః॥

తదుక్తం. భామహేన.

అవర్ణాత్సంతతిర్భవతి ముదివర్ణాద్దశతాన్యవర్ణాదఖ్యాతి సర్భసుఖ వర్ణాద్విగ్రహితాత్। తథాహ్యోచస్సౌఖ్యం జఝణరహితాదక్షరగణాత్। పదాదౌవిన్యాసాత్ భరవహలహావిరహితాత్, వృత్తరత్నాకరం p. 6 Benares Edition.

తదుక్తం భామహేన.

దేవతావాచకాశ్శబ్దాయేచ భద్రాదివాచకాః। తేసర్వేనైవనింద్యాస్స్యుర్లిపితో గణతోపివా। కఃఖౌగౌషుశ్చలక్ష్మీంవితరతి వియశోజస్తథా చస్సుఖంభః। ప్రీతింజో మిత్రలాభం భయమరణ కరౌఝఞౌటఠౌ ఖేదదుఃఖే। ఢశ్శోభాం ఢోవిశోభాం భ్రమణమథచణ స్తస్సుఖం యశ్చయుద్ధందోథస్సౌఖ్యం ముదంనః సుఖభయమరణ క్లేశదుఃఖంపవర్గః। యోలక్ష్మీంరశ్చదాహం వ్యసనమథలవౌశస్సుఖం షశ్చఖేదం సస్సౌఖ్యం హశ్చఖేదం విలయమపిచలః క్షస్సమృద్ధింకరోతి। సంయుక్తం చేహసస్యాత్సుఖ మరణపబుర్వర్ణ విన్యాసయోగః పద్యాదౌగద్యవక్త్రే వచసిచసకలే ప్రాకృతా దోసమోయం॥ ఈసవాక్యము (పర్యాయోక్తం ప్రకారేణ అనునది) కొంచము మార్పుతో నుద్భటుని అలంకారసార సంగ్రహమందు చూపట్టుచున్నది. దానియుదాహరణము కావ్యప్రకాశికలోఁ గానవచ్చుచున్నది. నారాయణభట్టు వ్రాసిన వృత్తరత్నాకర వ్యాఖ్యానములో భామహ విరచితములని కొన్నిశ్లోకము లుదాహరింపబడియున్నవి. ఈశ్లోకములు ఛందశ్శాస్త్రగ్రంథమునుండి తీయబడినవిగాఁ గానవచ్చుచున్నవి.

భామహుఁడు వ్రాసినవవి మనకు లభించుచున్న యీశ్లోకములుగాక వరరుచి వ్రాసిన ప్రాకృత ప్రకాశకకు ప్రాకృతమనోరమ యనునొక వ్యాఖ్యానమును వ్రాసెను. ఇది మిక్కిలి ప్రాచీనమైన వ్యాఖ్యానము. పూర్వోక్తములైన గ్రంథములను కావ్యాలంకార ప్రణేతయగు భామహుఁడు వ్రాసినట్లు రుజువు చేయుటకు

బగిన ఆభాగము లెవ్వియు లేవు. భామహుడను పేరుగలవారి నేకులు లేరు. ఆపేరు గలవారందరు భామహునివలెఁ బ్రసిద్ధులు కానేరరు. ప్రాకృతమనోరమను వ్రాసిన వాడె కావ్యాలంకారమును వ్రాసినవాడని ఉభయులకు నైక్యము సమర్థింపఁ బడి నది. Pischel Peterson పండితుని మతము ననుసరించుచున్నవాడై యీ రెండుగ్రంథములను వ్రాసిన భామహులు వేరైనవారని పలికెను. పండితులుచెప్పిన మాటలను నమ్మిరవారట్లు వ్రాసిరని మానమ్మకము. అలంకారశాస్త్రము లో నట్టి మహాగ్రంధమును రచించిన మహాపండితుడగు భామహుడు మరొకగ్రంథమును వ్రాయక సోమరియై తన ఆయుశ్శేషమును గడిపెనని నమ్ముట అసంభావ్యము అతడు మరొకగ్రంథమును వ్రాయలేదనిగాని వ్రాసినాడనికాని యేమియుజెప్పలేము.

## కావ్యాలంకారము.

ఈకావ్యాలంకారగ్రంథముయొక్క ప్రతిపాద్యాంశములను సవిమర్శనముగాఁ బరీక్షించుటకు ప్రోత్సాహులమై యున్నను యిదివరకే దీర్ఘతరమైన యీవ్యాసములో నీప్రసంగమునుకూడ విపులముగాఁ జర్చించుట కవకాశము లభింపనందునఁ జింతిల్లు చున్నాము. భామహుడు తనగ్రంథము నయిదువిషయములఁ బ్రతిపాదించు నారు పరిచ్ఛేదములుగా విభజించెను.

I. కావ్యశరీరము. దీనిలో నరువదిశ్లోకములు. కావ్యము, దానిప్రయోజనములు, దానిలక్షణముఁ జెప్పబడినది.

II. అలంకారములు. ఇందులో నలంకారములు, వానిలక్షణములు, ఉదాహరణములు చెప్పబడినవి. ఇప్పుడెఱుంగని ప్రాచీనకవులపేర్లు యిందులో నక్కాణింపబడినవి. ఇందులో శ్లోకసంఖ్య 160.

III. దీనిలో నేబదిశ్లోకములచే భామహుడు కావ్యదోషములను జెప్పెను.

IV. న్యాయనిర్ణయము. ఇందులో గ్రంథకర్త కావ్యముయొక్క తర్క మూలమునఁ బరిష్కరించుటకుఁ బ్రయత్నించుచున్నాడు ఇది దీనితరువాతది కావ్యదోషముల చర్చలనుఁబ్రతిపాదించుచున్నవి. భామహుని కాలమందు తర్కవ్యాకరణములు ప్రధానములై యుండుటవలన గ్రంథకర్త ఆప్రసంగములను విశేషించి ప్రతిపాదించెను. ఇందులో శ్లోకసంఖ్య డెబ్బది.

V. శబ్దశుద్ధి. ఇందులో గ్రంథకర్త యికముందు కవులగువారు అపశబ్ద ప్రయోగముల జేయకుండ జాగరూకులై యుండవలెనని యుపదేశించుటకుఁ బ్రయత్నించుచున్నాడు. ఇందలి శ్లోకసంఖ్య 60.

గ్రంథాంతమందు భామహుఁడేస్వగ్రంథ ప్రతిపాద్యాంశముల నిట్లు సంగ్రహముగాఁ జెప్పెను.

“షష్ట్యాశరీరం నిర్ణీతం శతషష్ట్యాత్వలంకృతిః। పంచాశతాదోషదృష్టిః సప్తత్యాన్యాయనిర్ణయః॥ షష్ట్యాశబ్దస్య శుద్ధిస్స్యాదిత్యేవం వస్తుపంచకమ్। ఉక్తం షడ్భిఃపరిచ్ఛేదైర్భామహేనక్రమేణవః॥

## అలంకారశాస్త్రచరిత్రలో భామహుని స్థానము.

అలంకారశాస్త్రమును వ్రాసిన గొప్పగ్రంథకర్తలు భామహునియందెంత గౌరవముగలవారై యుండిరో మనము చూచియున్నాము. భిన్నకాలములయందున్న వారు భిన్నాభిప్రాయములు గలవారునగు నుద్భటుఁడు, వామనుఁడు, కుంతకుఁడు, ఆనందవర్ధనుఁడు, అభినవగుప్తుఁడు, మమ్మటుఁడు మొదలగువారు తమతమగ్రంథముల యందతని వచనముల నుదాహరించిరి. అలంకార సర్వస్వకారుఁడు, ప్రతాపరుద్రీయమును వ్రాసిన విద్యానాథుఁడు, ఏకావళీకారుఁడు మొదలగువారుకూడ నై గ్రంథకర్తలవలెనే భామహునియందమిత గౌరవమును జూపిరి. ఇతని విద్వన్మాన్యత్వము మనహృదయమందితని గ్రంథము చక్కఁగా శోధించుటయందు యిష్టమును పుట్టింపదా?

చిరకాలమునుండి ఆర్యులకు సరస్వతీప్రార్థనము మిక్కిలి ప్రీతికరమైన విషయము. మనుష్యజాతియొక్క ఆదిమ పితామహులుకూడ కవిత్వముఁ జెప్పుటకుఁ బ్రయత్నించిరి. దీనికే ఋగ్వేదమని పేరు. ఇందుఁబ్రకాశించు నకృత్రిమమైన కవితారత్నముల నేకములు గలవు. అనాదికాలమునుండి మనఆర్యులు కవనకళావిశారదులై యున్నట్లు కానవచ్చుచున్నది. తరువాతకాలములలో నలంకారగ్రంథముల యందలంకారములు గావ్యవహరింపబడిన రసమయమైన ప్రశస్తవాక్యములు ప్రాచీనకావ్యములలోఁ జూచుచున్నాము.

ఋగ్వేదము I 124-7 అభ్రాతేవపుంసఏతి ప్రతీచీగర్తారుగివసనయేధనానాం।
జాయేవపత్యఉశతీసువాసా ఉషాహస్రేవ నిరిణీతేహప్సః॥

164-20 ద్వాసుపర్ణా సయుజా సఖాయాసమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి॥

164-II ద్వాదశారం నహితజ్జరాయ వవర్త్యర్తిచక్రిం పరిద్యామృతస్య।
అపుత్రాఅగ్నేమిధునాసో అత్రిసప్తశతాని వింశతిశ్చతస్థుః॥

I-3-3 కఠోపనిషత్తు ఆత్మానంరథినం విద్ధిశరీరం రథమేవచ। బుద్ధింతుసారథిం విద్ధిమనః ప్రిగ్రహమేవచ॥

ముండకోపనిషత్తు II-2-3 ప్రణవోధనుశ్శరోహ్యాత్మా బ్రిహ్మతల్లక్ష్య ముచ్యతే। అప్రిమత్తేనవేద్ధవ్యం శరవత్తన్మయోభవేత్ ॥

ఇవియేకాక సంవాదఋక్కులని చెప్పబడు కొన్నిసొగసైన సంవాదములతోఁ గూడిన ఋక్కులుకలవు. X మండలము 10ర 111-33. ఇకముందువచ్చు సంస్కృత నాటకములకీఋక్కులు సూచకములని Dr. Oldenburg మొదలగువారు చెప్పు చున్నారు.

యాస్కుడు నిరుక్తమందు ఉపమకు లక్షణమునుఁజెప్పెను. మఱియొకచోట గార్గ్యుడు చెప్పిన లక్షణమునుఁ బేర్కొనుచున్నాడు (అథాత ఉపమాయదతత్ తత్స దృశమితిగార్గ్యః। తదాసాం కర్మజ్యాయసావాగుణేన ప్రిఖ్యాతతమేనవాకనీయాం సంవాప్రిఖ్యాతం వోపమిమీతే। అథాపికనీయసాజ్యాయాంసం। (నిరుక్తం III-13) యాస్కుడు తరువాతకాలమునఁజేయబడిన ఉపమా సూక్ష్మవిభాగములకు సూచకము లగు విభాగములనుఁ జెప్పుచున్నాడు. పాణిని కాలమునాటికి ఉపమానము, ఉప మేయము మొదలగు పారిభాషిక పదములు బాగుగా స్థిరపర్చబడినవి. (ఉపమానాని సామాన్యవచనైః II-1-55. ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యా ప్రియోగే II-1-56) తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్ (II-3-72) పాణిని వ్యాకరణములో (పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రియోః IV-3-110 కర్మందకృశాశ్వాదినిః VI-3-111) అని నటసూత్రిముల కనుసంధానముకలదు. అవి యెట్టిలక్షణము గలవియైయున్నను నటులతోఁ గొంతసంబంధము గలిగియుండ వలెను. ఈకావ్యములను వ్రాసినవాడు, వ్యాకరణమును వ్రాసినవాడొక్కడౌనా కాదా యను విషయమనిశ్చితముగా నున్నను పాణిని పాతాళవిజయము జాంబవతీ

విజయమునను రెండుకావ్యములను వ్రాసెనని పండిత సంతతిదాయమందుఁ గానవచ్చు చున్నది. "అధికృత్యకృతేగ్రంధే" అను సూత్రమునకున్న "లుబాఖ్యాయికాభ్యో బహుళమ్" అను కాత్యాయను నివార్తికమువలన నాఖ్యాయిక అను నొకకావ్య విశేషము అదివరకే పుట్టెనని స్పష్టమగుచున్నది. మహాభాష్యకర్తయగు పతంజలి మహాభాష్యములో జూపినజాడలనుబట్టి యాకాలమందు కావ్యరచనాప్రయత్నములు బహుళముగా నుండెనని మనమూహించుకొనవచ్చును. పతంజలి తనభాష్యమందొక మహాకావ్యమును, మూడాఖ్యాయికలను, రెండునాటకములను జెప్పెను. ఇవిగాక తననాటికిఁ బ్రాచీనముగానున్న గ్రంధములనుండి యెన్నోశ్లోకములనుఁ జెప్పెను. యత్తేనకృతంనచతే నప్రోక్తం వారరుచంకావ్యం। (Mahabhashya vol. II p. 315) వాసవదత్త, సుమనోత్తర, భైమరధి (vol. II p. 313).

ఈప్రాచీన వ్యాకరణగ్రంధములనుఁ జూడగా మన ప్రాచీనచరిత్రయొక్క ఆరమ్భసమయమందు కావ్యసమితి మెండుగానుండెనని మనమను మేయించవలసి యున్నది. ఉత్తమ కావ్యలక్షణోపేతములగు శ్లోకములతోఁగూడిన మహాభారత రామాయణములు మన యీయూహాకు పష్టంభకములై యున్నవి. వీనిలోని శ్లోకములు కొన్ని నవీన ప్రమాణ గ్రంధములయందుగూడ నుదాహరింపబడియున్నవి. (ధ్వన్యాలోకము p. 68 రవిసంక్రాన్త సౌభాగ్యస్తుషారావృతమండలః। నిశ్వాసాంధ ఇవాదర్శశ్చంద్రమాన ప్రకాశతే) రామాయణమాది కావ్యమని వ్యవహరింపఁ బడుచున్నది. ఈరెండుగ్రంథములకు పండితులు భిన్నభిన్నమైన కాలములను నిర్దేశించిరి. Dr. Jacobi రామాయణను క్రీస్తుకుముందు ఆరవశతాబ్దములోనిదనెను. కౌటిల్యుడు వ్రాసిన అర్థశాస్త్రము వానికాలమందు కావ్యరచనా సంరంభమునుఁ దెలుపుచున్నది.

ఇంతిమట్టుకు కావ్యరచనము జరుగుచున్నను ప్రకృతివిషయమైగాని ధర్మము విషయమైగాని కావ్యవిభాగమువిషయమైగాని చింతనమెచ్చటనుఁ గానరాదు. అశ్వఘోషుని కావ్యములలోను రెండవశతాబ్దమునకు పైగనున్న శాసనములలోను అవిశేషములు గానవచ్చుచున్నవి. (అతని గ్రంధములనుఁ బరిశీలింపగా నలంకారశాస్త్ర విధులతో నతనకిఁ బూర్ణపరిచయమున్నట్లు స్పష్టమగుచున్నది. తనకావ్యములను సర్గములుగా విభజించెను. సర్గాంతమందు భిన్నవృత్తములనుంచెను. అసంపూర్ణమైన తననాటకమునకు ప్రకరణమని పేరుపెట్టెను. అతెడు వ్రాసిన రెండుకావ్యములకు మహాకావ్యములనిపేరు).

రుద్రదాముని శాసనములు భాషాశరీరమునుబట్టియుఁ బ్రతిపాద్యాంశమును బట్టియు విమర్శింపఁగఁ గావ్యాలంకారగుణములతోఁ గూడిన శాసనములలోఁ బ్రాచీనతమములని స్పష్టమగుచున్నది. మచ్చుకుఁగొన్ని గద్యభాగములీడఁగువ వ్రాయఁబడినవానినిఁ జూడుఁడు.

"సర్వక్షత్రావిష్కృత వీరశబ్ద జాతోత్సేకావిధేయానామ్, ప్రసహ్యోత్సాదకేన, శబ్దార్థ గాంధర్వన్యాయాద్యానాం విద్యానాం మహతీనాం పారణ ధారణ విజ్ఞానప్రయోగావాప్త విపులకీర్తినా, స్ఫుటలఘుమధుర చిత్రకాన్తశబ్ద సమయోదారాలంకృత గద్యపద్య। స్వయమధిగతమహాక్షత్రపనామ్నా నరేంద్ర కన్యా నేకమాల్యప్రాప్తదామ్నా మహాక్షత్రపేణ రుద్రదామ్నా॥

ఏగ్రంథము మనకు సరిగా లభ్యముకాకపోయినను భరతుని నాట్యశాస్త్రమును భామహుని కావ్యాలంకారమునుఁ బట్టిచూడఁగా నీవిషయమై వ్రాసిన యప్రఖ్యాతులైన గ్రంథకర్తలు కావ్యాలంకార సిద్ధాంతమునుగురించి నాటకపరిభాషనుగురించి వ్రాసిరి. పైనఁ జెప్పబడిన రెండింటిలో దేనితరువాత నేదివచ్చినదో ఆయంశమునుఁ దృప్తిగా నిర్ణయించుట సాధ్యముకాదు. నాటకపరిభాష యలంకారశాస్త్రముకంటె ముందుపుట్టినదని చెప్పుటకుఁ గొంతసంభావనకలదు. పూర్వకాలమందు కావ్యము నాటకలక్షణములతో గూడినదనియే తలఁపబడెను. అందుకుఁ బ్రమాణముగా భరతనాట్యశాస్త్రములోని శ్లోకమును జూడుఁడు. 16 అ. 118 శ్లో॥ మృదులలితపదాఢ్యం గూఢశబ్దార్థహీనం జనపదసుఖబోధ్యం యుక్తిమన్నృత్యయోజ్యమ్। బహుకృతరసమార్గం సంధిసన్ధానయుక్తం। సభవతిశుభకావ్యం నాటకప్రేక్షకాణామ్. ఈసిద్ధాంతమును వామనుడు తన అలంకారసూత్రములలో దృఢపర్చెను. (కా. సూ. 1.3.30-32) "సందర్భేషు దశరూపకం శ్రేయః। తతోऽన్యభేదక్లృప్తిః। (1-3-32) భరతనాట్యశాస్త్రమునకభినవగుప్తుడు వ్రాసిన వ్యాఖ్యానమగు నభినవభారతి యారవయధ్యాయములో "కావ్యంతావన్ముఖ్యతో దశరూపకాత్మకమేవ"। సర్గబంధాదౌహి నాయికాయా అపిసంస్కృతైవోక్తి రిత్యాదిబహుతరమనుచితమ్। కావున నలంకారశాస్త్రము నాటకలక్షణములోఁ బుట్టినది. కావ్యము భరతమతానుసారముగా నాటకముయొక్క నాలుగంగములలో నొకటియని చెప్పఁబడినది. దానికిఁ బాఠ్యమనిపేరు. అదిఋగ్వేదమునుండి పుట్టినది. (భరతనాట్యశాస్త్రము 1 అ. 17 శ్లో.) "జగ్రాహ పాఠ్యమృగ్వేదాత్సామభ్యోగీతమేవచ। యజుర్వేదాదభినయాన్ర

సానాథర్వణాదపి" ఈహేతువుచేతనే దోషములు గుణములు నలంకారములు మొదలగునవి నాట్యశాస్త్రములో నల్పముగాఁ బ్రతిపాదింపఁబడెను. కాని వాఙ్మయము వృద్ధినొందఁ దొలఁది కావ్యము నాటకమునకధీనముగా లేదు. కాలక్రమమున నది స్వతంత్రమై నాటకమునే తనలో నంతర్భవింపఁజేసికొనెను. (అగ్ని-పు-337 అ. సా-ద-VI పరి-చూడుము).

కావున సంస్కృతాలంకారశాస్త్ర చరిత్రమును మూడుదశలుగా విభజించి కృషిచేయవచ్చును.

I. నాటక లక్షణమునకలంకారమంగమై యుండుదశ.

II. ఉభయము వేరుగా స్వతంత్రముగా నుండుదశ (కా-1-24)

III. అలంకారశాస్త్రమందు నాటకలక్షణమంతర్భూతమై యుండుదశ.

ఈమూడుదశలలో మొదటిది వర్ధమానదశలోనున్న ప్రతిశాస్త్రమువలె నారంభమందు కేవలాసంస్కృత కల్పనలచే విశిష్టమైయున్నది. మూడవదశబహ్వాయాసనిర్మిత కల్పనాకాలముతోఁగూడినదియై పూర్తినిఁ జెందెను. యథార్థముగాఁ జెప్పినచో రసమిదశలకన్నిటికి ముఖ్యమైనదిగాగ్రహింపఁబడవచ్చును. పూర్ణరసానుభవము, సంవాదములు, పాటలు అభినయము మొదలగు వానితోఁగూడిన నాటకమువలననే కలుగుచున్నదని తలంపబడెను. స్వతంత్రావస్థనుబొంది లోకమందుఁ బ్రచురమైన తరువాతగూడ శబ్దార్థములవలనఁజమత్కారజనకముగాని రసజనకము గాదని తలంపబడెను. ఇందువలననే దండి భామహుడు వామనుడు మొదలగువారి గ్రంథములలో రసము ప్రతిపాదింపఁబడలేదు. కాని యానందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము బయలువెడలగా రసముయొక్క నూతన జ్ఞానము కనుగొనబడినదియై యిటీవల గలిగిన అభివృద్ధినడచివేసెను. రసము నాటకాభినయమువలనఁ గార్యమనిగాని జ్ఞాప్యమనిగాని తలంపబడలేదు. శబ్దములనుండియే పుట్టిన వ్యంగ్యమని గ్రహింపబడెను. (అభినవభారతి-6 అధ్యాయమును జూడుడు).

కావ్యరూపమేర్పడుటయు నది పూర్తియగుటయు రెండవదశలో జరిగినది. దీనిలో మరిరెండవాన్తరదశలు. వీనిలో మొదటిదానియందుఁ గావ్యశరీరము రెండవదానిలో నాత్మయు నిరూపింపబడెను. ప్రసిద్ధుడైన కాశ్మీరదేశపు మహాకవి

ఆనందవర్ధనాచార్యుఁడు కావ్యాత్మయగు ధ్వనియొక్క సిద్ధాంతమునకు దృఢమైన పునాదిని వైచెను.

కావ్యశరీరమును మొదట శాస్త్రపద్ధతిగాఁ గృషిచేయుటకుఁ బూనుకొన్న గ్రంథకర్తపేరును వానికాలమును నిర్ణయించుటకుఁ దగినయాధారమెద్దియు లేదు. ప్రసిద్ధులగు నర్వాచీన గ్రంథకర్తల సాక్ష్యమువలన నట్టి యాలంకారిక విమర్శను వ్యాఖ్యానముచేసినవాడు భామహుడేకాని మఱెవ్వడు కాడని మనము నిశ్చయింప వచ్చును.

భామహునికంటె ముందువారైన యనేకులీ విషయమును విమర్శించిరి. భామహుడే తనకావ్యాలంకారములో (II-19-58) రామశర్మను మేధావిని, (II-40) శాఖవర్ధనుని (II-47) పేర్కొనెను. ఇదిగాక రాజశేఖరుడు తనకావ్యమీమాంసలో సురానందుడు, శ్యామదేవుడు, అపరాజితి, ద్రౌహిణి మొదలగు వారలంకారశాస్త్రములో మిగుల గొప్పవారని వ్రాసియున్నాడు. వారిగ్రంథము లెవ్వియు మనకులభించలేదు. కాని వారిగ్రంథముల ప్రాశస్త్యము తరువాతి వారి యుపేక్షచేఁ బైకిరాలేదు. వృద్ధినొందినకొలది దానికావశ్యకలక్షణమగు శాస్త్రరీతి ప్రతిపాదనమొక విషయముయొక్క శైశవావస్థయందుండ నేరదు. భామహుని యందుండనేరదు, భామహునియందుండు గౌరవమునుబట్టి వానిపూర్వులయందు పేక్షనుబట్టి విచారింపగా నలంకారశాస్త్రము విషయమై శాస్త్రరీతిగా మొదట వ్రాయఁబడిన గ్రంథము భామహునిదని మనము నూహింపగలము. అతడు పూర్వులగ్రంథములనుండి సామగ్రిని సంగ్రహించి నిరుపమానమైన తనప్రతిభచే నాసామగ్రిని గ్రంథరూపముగా రచించెను. అతనియభిప్రాయములు నతని సిద్ధాంతములు ఆశాస్త్రములో గొప్పవారైనవారుకూడ వానిని దృఢపర్చునంత విమర్శకుల విమర్శకాగెను.

మఱికొన్ని యుదాహరణములనుఁ బేర్కొని భామహుని గ్రంథముయొక్క ముఖ్యలక్షణములనుఁ గనుపర్చుటకిది యస్థానముగాదు.

అలంకారశాస్త్రమును వ్రాసిన గ్రంథకర్తలందరు కావ్యలక్షణమునుఁ జెప్పుటయందు వివదమానులైయుండిరి. "శబ్దార్థౌ కావ్యమ్" అని భామహుడు "అదోషౌసగుణౌసాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్" అని కావ్యప్రకాశకారుడు,

"విశిష్టశబ్దార్థౌ కావ్యమ్", తద్వైశిష్ట్యం ధర్మముఖేన, వ్యాపారముఖేన, వ్యఙ్గ్యముఖేనేతిత్రయఃపన్థాః". అని జగన్నాథపండితుడు

గుణములుఁకూడ నట్లే విభజింపబడియె. భరతుని నాట్యశాస్త్రములోను, దండికావ్యాదర్శమందుఁ జెప్పఁబడిన గుణములుపది. వామనుడు కావ్యాలంకార సూత్రములో నర్థగుణములు పదియనియు శబ్దగుణములు పదియనియుఁ జెప్పెను. తరువాత వచ్చిన అలంకారికులందరు నోజఃప్రసాదమాధుర్యములు మూడేగుణములనియుఁ దక్కినగుణములు వానిలో నంతర్భూతములనియు జెప్పిరి. ఇట్లు చెప్పినవారిలో భామహుడు మొదటివాడు. ఈశబ్దముల అర్థనిర్ణయములోఁ గొంత భేదమున్నను విభాగముయొక్క వ్యాపకత్వము విషయమై భామహుని అభిప్రాయములు సమంజసము గా నున్నవి.

ఈసందర్భమందు మనము చెప్పవలసిన యితరవిషయమేమనగా భామహుడు చెప్పిన వక్రోక్తి! అలంకారశాస్త్రచరిత్రలో వక్రోక్తిముఖ్యమైనది. భిన్న భిన్న కాలములయందు దానిరీతులను దానిరూపములను బాగుగా విమర్శించినయడల దానికి గూడ నొకచరిత్రవ్రాయవలసివచ్చును. కుంతకుడు దానిని విపులీకరించి వక్రోక్తి జీవితమను గ్రంథమును వ్రాసి యొకక్రొత్తసిద్ధాంతమును స్థాపించెను. కాని వక్రోక్తినిఁ జెప్పుటలో భామహుడు మొదటివాడు. భామహుడు నిరూపించిన వక్రోక్తికి కుంతకుడు చెప్పినట్లు సరియైన అర్థము లేదు. అది కావ్యమునకుఁ బ్రాణభూతమని తెలుసుకొనుటయందు భామహుడు కుంతకునికగ్రగామిఁ. భామహుని వివరణములను గ్రహించుటయందు దగిన ప్రతిభగలవాని నొప్పించుటకుఁ బూర్వోక్తములైన యుదాహరణములు చాలునని మాయభిప్రాయము.

ఈభామహుడు గంభీరమైన వైదుష్యముగలవాడు, బుద్ధివైశద్యముగల తార్కికుడు, విమర్శకుడు గొప్పవైయాకరణి, మహాకవి.

## 8 దండికావ్యాదర్శము.

కావ్యాదర్శము భరతఖండములో ననేకపర్యాయములు ముద్రితమైనది. 1863.వ సంవత్సరములో ప్రేమచంద్ర తర్కవాగీశుని వ్యాఖ్యానముతో కలకత్తా నగరమందును 1910.వ సం॥లో రెండు వ్యాఖ్యానములతో చెన్నపురియందును పూనా నగరమందును ముద్రితమై ప్రకటింపఁబడియెను. గ్రంథమంతయు మూడు పరిచ్ఛేద

ములుగా విభజింపఁబడియున్నది. కాని చెన్నపట్టణపుప్రతిలో నాలుగుపరిచ్ఛేదములున్నవి. ఇందులో మూడవపరిచ్ఛేదము రెండుభాగములుగా విభజింపఁబడియున్నది. దీనిలో నాల్గవపరిచ్ఛేదమందు దోషములు ప్రతిపాదింపఁబడినవి. కలకత్తాప్రతిలోని శ్లోకసంఖ్య 660. చెన్నపట్టణపు ప్రతిలోని శ్లోకములు 663. "లింపతీవతమోఽఙ్గాని" అను సుప్రసిద్ధశ్లోకము ద్వితీయపరిచ్ఛేదములో విడువఁబడినది. రెండుశ్లోకములు తృతీయపరిచ్ఛేదాంతమందును, మఱియొకశ్లోకము చతుర్థపరిచ్ఛేదప్రారంభమందును, "అధివ్యాధిపరీతాయా ద్యశ్వోవావినాశినే। కోహినామ శరీరాయ ధర్మాపేతంసమాచరేత్" అను శ్లోకముమధ్యను చేర్పఁబడినది. కలకత్తా ప్రతినుండియే శ్లోకము లిందుదాహరింపఁబడియె.

కావ్యము గద్యపద్యాత్మకమనియు, గద్య—ఆఖ్యాయిక, కథయని రెండువిధములనియు, నారెండింటికి నామమాత్రభేదమే గాని వాస్తవభేదము లేదనియు, వైదర్భిగౌడీరీతులలక్షణము, ఓజఃప్రసాద మాధుర్యాదిగుణములు, అను ప్రాసలక్షణము దాని యుదాహరణములు, కవియుండవలసిన ప్రతిభాశ్రుతాభియోగములు, ప్రథమపరిచ్ఛేదమందుఁ జెప్పఁబడినవి ద్వితీయపరిచ్ఛేదమందు మొదట నలంకారలక్షణమునుఁ జెప్పి తరువాత ముప్పదియైదలంకారములు వాని యుదాహరణములు చెప్పఁబడియె. 1. స్వభావోక్తి, 2. ఉపమ, 3. రూపకము, 4. దీపకము, 5. ఆవృత్తి, 6. ఆక్షేపము, 7. అర్థాంతరన్యాస, 8. వ్యతిరేకము, 9. విభావన, 10. సమాసోక్తి, 11. అతిశయోక్తి, 12. ఉత్ప్రేక్ష, 13. హేతువు, 14. సూక్ష్మము, 15. లేశము, 16. యథాసంఖ్యము, 17. ప్రేయము, 18. రసవత్, 19. ఊర్జస్వి, 20. పర్యాయోక్తము, 21. సమాహితము, 22. ఉదాత్తము, 23. అపహ్నుతి, 24. శ్లేష, 25. విశేషోక్తి, 26. తుల్యయోగిత, 27. విరోధము, 28. అప్రస్తుతప్రశంస, 29. వ్యాజోక్తి, 30. నిదర్శన, 31. సహోక్తి, 32 పరివృత్తి, 33. ఆశీః, 34. సంకీర్ణము, 35. భావికము. ఈ యలంకారములు క్రమముగా రెండవపరిచ్ఛేదములోఁ జెప్పఁబడినవి. యమక భేదములు, గోమూత్రికార్ధభ్రమక, సర్వతోభద్ర, స్వరస్థానవర్ణనియమాది చిత్రబంధములు, షోడశవిధప్రహేళికలు, దశవిధదోషములు ప్రతిపాదింపఁబడినవి.

దండికావ్యాదర్శము కొంతమట్టుకు రీతిప్రాధాన్యమును, మఱికొంతమట్టు కలంకారప్రాధాన్యమును వివరించుచున్నది. దండివృత్తాంతమేమియు మనకుఁ దెలియదు. ఇతఁడు నర్మదానదికి దక్షిణమందున్నవాఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు.

అతఁడు తానువ్రాసిన గ్రంథమందిచ్చిన యుదాహరణములలోనున్న కావేరీ, కాంచీ, చోళ, కళింగ, అవంతి మొదలగు పేర్లచే నింతమట్టు కూహింపఁబడుచున్నది. "ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్, తేషామసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి॥" (I: 5) "భగవంతౌ జగన్నేత్రే సూర్యాచంద్రమసావపి। పశ్య గచ్ఛత ఏవాస్తం నియతిః కేనలంఘ్యతే॥" (II: 172) ఈ శ్లోకములలోనున్న "పశ్య" అను ప్రయోగమువలన దండి యీ గ్రంథము నొక భూపాలునియాజ్ఞచే వ్రాసెనని యూహింపవలసియున్నది. కాని యీ "పశ్య" అనునది "నశ్యతి" అనుదానితో ననుప్రాసముగా నుండుటకు వ్రాయఁబడినదని చెప్పినను చెప్పవచ్చును.

దీపకావృత్తికి దీపకావృత్తియనియు, లేశమునకు లవమనియు, నప్రస్తుతప్రశంసకు అప్రస్తుతస్తోత్రమనియు, విశేషోక్తికి విశేషమనియు నుండుటచే బెల్వాల్కారు వంటి విమర్శకులు కొందరిందులోని యలంకారములు కొన్ని ప్రక్షిప్తములని శంకించుచున్నారు. ఈ తప్పులు కొంతమట్టు కనుమానాస్పదముగానున్నను యీ హేతువులనుబట్టి యీ శ్లోకములుకూడఁ బ్రక్షిప్తములనుట కవకాశము లేదు. అట్టి యలంకారపట్టికలు ప్రాచీనగ్రంథములలో నలంకారనిరూపణమునకు ముందుండును. భామహోద్భటరుద్రటుల గ్రంథములలో నట్లేయున్నవి. అలంకారముల పేర్లకుఁ బర్యాయపదములను వాడుక చేయుట మన మెఱుఁగనిది కాదు ఉద్భటుడు "కావ్యదృష్టాంతహేతూచేత్యలంకారాన్ నరేవిదుః" (VI: 1) అని తన గ్రంథమందు జెప్పుచున్నాఁడు. ఆ యలంకారములు కావ్యహేతువు కావ్యదృష్టాంతమునని యర్థము. కాని ఆయా యీ అలంకారములను నిరూపించునపుడు వాని సహజమైన పేర్లనే వాడుక చేయవలయును. ఎట్లనగాఁ గావ్యలింగమని యనునుగాని కావ్యహేతువనఁడు. దృష్టాంతమని చెప్పునుగని కావ్యదృష్టాంతమని యనడు. ఇట్లనే లేశమునకు లవమనియుఁ, బ్రశంసకు స్తోత్రమనియు దండికూడ వాడుకచేసియున్నాఁడు. విశేషోక్తి విశేషమనెను.

కావ్యాదర్శమంతయు సొగసైనశైలిలో వ్రాయఁబడియున్నది. కొన్నివిషయములయందు భామహుఁడు దండికంటె నధికుడైయున్నను గవిత్వశైలిలో దండి యధికుడుగాఁ గానవచ్చుచున్నాఁడు. ఒకటి రెండు శ్లోకములు తప్ప తక్కిన యుదాహరణ శ్లోకములన్నియును దండి స్వయముగా రచించినవిగాని మఱియొకని గ్రంథము నుండి యెరువు తెచ్చుకొన్నవిగావు.

ఛందోవిచితి, బృహత్కథ, సేతుబంధము మొదలగు గ్రంథములను కావ్యాదర్శము చెప్పుచున్నది. మహాపండితులొకప్పుడు ఛందోవిచితి దండికృతమని అభిప్రాయపడిరి. ఛందోవిచితియనఁగా వేదాంగమైన ఛందస్సుకే పేరు. ఇది పింగళనాగునిచే రచింపబడినదని వాడుక. దండికావ్యాదర్శమందు పేర్లుచెప్పక కొందఱి గ్రంథకర్తలను కొన్నిగ్రంథములనుఁ జేర్కొనెను. ఎట్లనగా;నోపమానతిజం తేనేత్యతిక్రమ్యాప్తభాషితం (కావ్యా. 2-227) అను శ్లోకమందాప్తభాషితశబ్దముచే పతంజలి మహాభాష్యమును."యచ్చసంధ్యంగవృత్త్యంగలక్షణాద్యాగమాన్తరే। వ్యావర్ణితమిదం చేష్ట మలంకారతయైవనః॥" (2-367) అను శ్లోకమందున్న ఆగమాన్తరశబ్దముచే భరతనాట్యశాస్త్రమును సూచించెను. సంధ్యంగవృత్త్యంగలక్షణములు మూడునువరుసగా నాట్యశాస్త్రముయొక్క 19,20.16 అధ్యాయములయందుఁ జెప్పఁబడియున్నవి. మఱియొక స్థలమందు భామహునివలెనే దండియును వ్రాయుచున్నాఁడు. "మిశ్రాణి నాటకాదీని తేషామన్యత్రవిస్తరః" (I: 31) ఇతర గ్రంథకర్తలవలె నితఁడును నామనిర్దేశశూన్యముగాఁ బూర్వాచార్యులను సామాన్యశబ్దములచేఁ జెప్పెను. పూర్వశాస్త్రాణిసంహృత్య (I: 2) గ్రంథకర్తలిట్లు నిర్దేశింతురు. "సమాహృత్యాన్యతంత్రాణి" అని అమరుడు నుడివెను. I: 9, 10 లో "సూరయః" అనియును, "ఇతి వాచామలంకారాదర్శితాః పూర్వసూరిభిః (II: 7) "ఏతాఃషోడశనిర్దిష్టాః పూర్వాచార్యైఃప్రహేళికాః। కింతుబీజంవికల్పానాం పూర్వాచార్యైఃప్రదర్శితః॥" (II:2) అనిచెప్పియున్నాఁడు. ఇతఁడు నితరగ్రంథకర్తల యభిప్రాయములను జెప్పునపుడు "కేషాంచిత్," "కేచిత్" "ఏకే" మొదలగు శబ్దములచేఁ జెప్పెడివాఁడు. లింపతీవతమోఽంగానివర్షతీవాంజనంనభః" అను అర్ధశ్లోకము నుదాహరించి పెద్ద చర్చ చేసెను. కొందఱీశ్లోక ముపమయని భ్రాంతినొందిరి. మఱికొందరుత్ప్రేక్షయనిరి. ఈ వాదముద్భటుని విషయమై ప్రతీహారేందురాజువ్రాసిన గ్రంథములోనున్నది. ఈ శ్లోకముమృచ్ఛకటికలోను, భాసునిచారుదత్తలోను, బాలచరితలోనుగూడఁ గానవచ్చుచున్నది.

శార్ఙ్గధరపద్ధతిలో దండిమూడు గ్రంథములను రచించెనని చెప్పు రాజశేఖరుని శ్లోకమొకటి కానవచ్చుచున్నది. "త్రయోఽగ్నయ స్త్రయో వేదా స్త్రయోదేవా స్త్రయోగుణాః। త్రయోదండి ప్రబంధాశ్చ త్రిషులోకేషు విశ్రుతాః॥" కొందరు పండితులు దండికృతములైన యీమూఁడు గ్రంథము లెవ్వియోయని కనుఁగొనుటకు మిక్కిలి ప్రయత్నించిరి. Pischel పండితుఁడు "లింపతీవతమోఽంగాని" అను శ్లోకము

గుతి:చిన వాదమును బాగుగాఁ దెలిసికొనఁజాలక మృచ్ఛకటికదండి వ్రాసినదనియు, కావ్యాదర్శదశకుమారచరిత్రలను గలుపుకొన్నయెడల దండిగ్రంథములు మూఁడగు దానికి సరిపోయినదని యొక యూహఁజేసెను. Pischel పండితుని మతమనుసరించినయెడల నీశ్లోకము యీరెండు నాటకములలో నుదాహరింపఁబడియున్నదిగావున నా రెండు గ్రంథములుకూడ దండికృతములే కావలసివచ్చును. Peterson, Jacobi పండితులు ఛందోవిచితిదండివ్రాసిన గ్రంథమని వాదించిరి. కాని యిదికూడ తిప్పభిప్రాయమే. దండి మూఁడవగ్రంథము కలాపరిచ్ఛేదమని మఱికొందరభిప్రాయపడిరి.

కలాపరిచ్ఛేదము దండియొక్క మూఁడవ గ్రంథమని నిశ్చయపరచుటకు ముందు, దండి కలాపరిచ్ఛేదమనునొక గ్రంథము నెప్పుడైన వ్రాసియున్నాడా? ఇది స్వతంత్రమైన గ్రంథమగునా కాదా? దండి అట్టిగ్రంథము నొకదానినివ్రాసెనని రాజశేఖరునికిఁ దెలియునా? అను నీ మూఁడంశములు స్థిరపరుపబడవలసి యున్నవి. ఈ వివాదకుఁదోడింకొకటి కలదు. కొందరు పండితులు కావ్యాదర్శమును వ్రాసిన దండియే దశకుమారచరిత్రమును వ్రాసినవాఁడగునా కాఁడాయని సంశయించుచున్నారు. త్రివేదిపండితుఁడు అగాషీ (Agashe) పండితుఁడు కావ్యాదర్శకారుఁడు దశకుమారచరిత్రము వ్రాయలేదని వివదించుచున్నారు. వారివాదమంతయు నిచట సవిస్తరముగఁ జర్చించుట స్థానమైనను సంగ్రహముగాఁ గొన్ని యంశములు చెప్పఁదగియున్నవి. కావ్యాదర్శకారుఁడు దోషనిబద్ధదృష్టిఁగలవాఁడు "తదల్పమపినోపేక్ష్యం కావ్యేదుష్టం కథంచన। స్యాద్వపుస్సుందరమపిశ్విత్రేణైకేన దుర్భగమ్॥" అని కావ్యమందు దోషలేశమున్నను శరీరమందు శ్విత్రమువలెఁ (బొల్లి) గావ్యమునంతయునుఁ జెడుపును, అల్పదోషమైన నుపేక్ష్యముకాదని కవులనందరిని శాసించెను. "కస్యైకామయమానంమాం నత్వంకామయసేకథమ్। ఇతిగ్రామ్యోయమర్థాత్మా వైరస్యాయప్రకల్పతే॥" (కావ్య.1-63) ఇత్యాది నిర్దుష్టమయినవాక్యమును కూడ గ్రామ్యమని నిందించెను దశకుమారచరిత్రలోఁ గొన్నివ్యాకరణపు తప్పులు గ్రామ్యకర్మప్రసంగము పలుచోట్ల గానవచ్చుచున్నవని అగాషీపండితుని వాదము. కాని యిచట రెండుసంగతులు విచారింపఁదగియున్నవి. చెప్పుటకుఁ జేయుటకుఁ జాల భేదము గలదు. ఇది విమర్శకులందఱొప్పుకొన్న విషయమే. మహాకవులయందుఁ గూడ నతఁడు తప్పులుపట్టుటవిషయమై వ్యక్తివివేకకారుఁడిట్లు చెప్పుచున్నాఁడు. "స్వకృతిష్వయంత్రితః కథమనుశిష్యాదన్యమయ మితివాచ్యమ్," "వారయతిభిషగ

కస్యా దితరాఙ్ స్వయమాచరన్న పితత్" స్వగృ్రధనులయందు విశృంఖలము గానున్న వాఁడు పరుల నెట్లు శాసించునని యనఁగూడదు. ఏమనఁగా వైద్యుఁడు తానపథ్యాశియై యున్న నితరులను పథ్యముఁజేయుమని శాసించును. అట్లనే క్షేమేంద్రుఁడు తాను వ్రాసిన ఔచిత్యవిచారచర్చలో (30–31) కారికలలోఁ దన కవిత్వమందుఁ దానుచేసిన తప్పులను గనపరచెను. "సాన్వయంశోభతే వాక్య ముచితైరేవ కారకైః జలాధరణమైశ్వర్య మౌదార్యచరితైరివ॥" సద్వంశభూషితమైన ఐశ్వర్యము సచ్చరిత్రులచేఁ బ్రకాశించునట్లు చితకారకములచే సదన్వయపద్వాక్యము రాజిల్లును.

"కర్తృపదౌచిత్యం యథా భట్టబాణస్య" (భట్టబాణుని కవిత్వమందు కర్తృపదౌచిత్యము.)

"స్తనయుగమశ్రుస్నాతం సమీపతరవర్తి హృదయశోకాగ్నేః। చరతివిముక్తాహారం వ్రతమివభవతో రిపుస్త్రీణామ్॥"

ఇచట శత్రుస్త్రీలు వ్రతమాచరించుచున్నారని చెప్పుటకు బదులుగాఁ గన్నీటిలో స్నానముచేసి శోకాగ్నికాసన్నవర్తియై, విముక్తాహారమై స్తనయుగము వ్రతమాచరింపుచున్నదియని చెప్పుటచేఁ గర్తృపదౌచిత్యమును బుట్టించుచున్నది.

"నతుయథా పరిమళస్య" (పరిమళుని శ్లోకమందట్లు లేదు.)

"ఆహారం నకరోతి నాంబుపిబతి స్త్రైణం నసంసేవతే శేతే యత్సికతాసు ముక్తవిషయశ్చండాతపం సేవతే, త్వత్పాదాబ్జరజః ప్రసాద కణికాలాభోన్ముఖస్తన్మరో మాలవసింహ గుర్జర పతిస్తీవ్రంతపస్తప్యతే॥"

ఆహారమునొల్లఁడు, నీరుత్రాగఁడు, స్త్రీలను సేవింపఁడు, తీవ్రమైనయెండ కాయుచుండఁగా నిసుకలోఁ బండుకొనియుండును. ఓ మాలవసింహుఁడా! నీపాదారవిందరజః ప్రసాదలాభమందుఁ దృష్ణుఁడై గుర్జరదేశపురాజు మరుప్రదేశమందుఁ దీవ్రమైన తపంబొనరింపుచున్నాఁడని తలంచెను. గుర్జరదేశపురాజు నీవలన భయపడి పరుగిడి మరుగహనమునఁ బ్రవేశించి స్రక్చందనవనితాదిభోగములఁ బరిత్యజించి యుండలోఁ గూర్చొని తపమాచరింపుచున్నాఁడని చెప్పఁబడినది. దీనిలోఁ గర్తృపదము నను విశేషాభిప్రాయము చితమైనదెద్దియుఁ గానరాదు. శత్రువులచేఁ బాఱఁద్రోలఁ

బడి మసుకాంతారప్రవిష్టుఁడై సకలసుఖవిషయములను విడిచియున్నవాఁడు తపస్సు గాక మఱేమిచేయును. పైశ్లోకమందుఁ గర్తృపదమైన స్తనయుగమునకువలె నిచట చమత్కారోచితమైనదేమియుఁ జెప్పఁబడలేదు.

"కర్మపదౌచిత్యంయథామమలావణ్యవత్యామ్" (క్షేమేంద్రుఁడు తానువ్రాసిన లావణ్యవతియను గ్రంథమందుఁ గర్మపదౌచిత్యమునుఁ గనపఱచుచున్నాఁడు.)

"సదాసక్తంశైత్యంవిమలజల ధారాపరిచితంఘనోల్లాసః క్ష్మాభృత్పృథుకటకపాతీవహతియః। విధత్తేశాగ్యశ్రీశ్రవణ నవనీలోత్పలరుచిస్సదిత్రం శత్రూణాంజ్వలదనలతాపంభవదసిః॥" (శౌర్యలక్ష్మీకర్ణోత్పలసదృశమైన నీఖడ్గము విమలజలధారాపరిచితమైన శైత్యమును (వాడి, చలువ) వహించునదియైనను శత్రువులకు జ్వలదనల తుల్యమైన సంతాపమునుఁ గలుగఁజేయుచున్నదియని చెప్పుటలోఁ గర్మయయిన తాపము శిశిరసామగ్రిజన్యమని చెప్పుట వైచిత్ర్యమును, ఔచిత్యమును సూచింపుచున్నది.

"నతుయథామమైవావసరసారే" (నేనురచించిన అవసరసారమందట్లు లేదు.)

"భగ్నాహితశ్వసితవాత విబోధ్యమానః కాష్ఠాశ్రయేణసహసైవవివృద్ధిమాప్తః। తాపంతనోతినిహతారి విలాసినీనాంవహ్ని ద్యుతిర్భువననాథభవత్ప్రతాపః॥"

"విద్రుతారినిశ్వాస పవనసంధుక్షితమై కాష్ఠాశ్రయముచే వృద్ధినొందిన వహ్నితుల్యమగు నీ ప్రతాపము శత్రుకాంతలకుఁ దాపముగలుగఁ జేయుచున్నది" అని చెప్పుటలో సమూచితమైన ఆశ్చర్యమేమియున్నది.

లింగౌచిత్యమునుగురించి.

"ఉచితేనైవలింగేన కావ్యమాయాతిభవ్యతామ్। సామ్రాజ్యసూచకేనేవ శరీరంశుభలక్ష్మణా॥"

(సామ్రాజ్యసూచకమైన శుభలక్షణముచే శరీరమువలెఁ బ్రస్తుతార్థమునకుచితమైన లింగముచేఁ గావ్యము ప్రకాశించును.)

"యథామమలలితరత్నమాలాయామ్" (లలితరత్నమాలయను నాగ్రంథమందు)

"నిద్రాంనస్పృశతిత్యజత్యపిధృతింధత్తేస్థితింనక్వచిద్దీర్ఘాం వేత్తికథాంవ్యథాం ...ఖజతేసర్వాత్మనా నిర్వృతిమ్। తేనారాధయతాగుణస్తవ జపధ్యానేనరత్నావళీం ...సంగేన పరాంగనాపరిగతిం నామాపినోసహ్యతే॥"

ఈశ్లోకమందు రత్నావళీ విరహావిధురచేతస్కుఁడైన వత్సరాజు యితరాంగ...నా నామస్మరణమాత్రమునైన సహింపక నిద్రాదులను విడిచి తదేకాసక్తుఁడై యున్నాఁడని చెప్పుటలో స్త్రీలింగములగు నిద్రాధృతిస్థితికథా నిర్వృతులను జెప్పుట ...మాచిత్యమునుఁ బోషించుచున్నది.

"వతుమ థామమసీతిలతాయామ్." (నేను వ్రాసిన నీతిలతయను గ్రంథము.దిలి ...యీ శ్లోకమునందట్టి లింగౌచిత్యము లేదు.)

"వరుణరణసమర్థాస్స్వర్గ భంగాత్కృతార్థా యమనియమనశక్తామారుతోస్నాథ ...శక్తా। ధనదనిధిః సజ్జాలజ్జతేమ ర్త్యయుద్ధేదహనదశనచండామండలీ మద్భుజానామ్॥"

ఇది స్వపరితాపమును వెల్లడిచేయుచున్న రావణుఁడు చెప్పుమాట. వరుణాది ...దిక్పాలకుల జయించుటచేఁ బ్రచండమగు నా భుజమండలి మనుష్యునితో యుద్ధముఁ జేయుటకు లజ్జించుచున్నదని చెప్పుటలోఁ త్రైలోక్య విజయార్జితమగు పరితాపము ...యొక్క కఠోరత నపహరించుచు ననౌచిత్యమును సూచింపుచున్నది. ఇట్లు కొందరు ...పులు తమ కవిత్వమందున్న తప్పులనుఁ దామే వెల్లడిచేసికొందురు.

దండిచిన్నవాఁడై లోకానుభవము లేకుండ నున్నకాలమందు దశకుమారచరిత్ర ...మును వ్రాసియుండవచ్చును. పాండిత్యము ప్రౌఢమైన తరువాతఁ గావ్యాదర్శమును ...రచించియుండవచ్చును. ఇంతియకాక "కన్యేకామయమానంమామ్" అను శ్లోకమం ...దున్న గ్రామ్యార్థమును అగాషీపండితుఁడు విశదముగా గ్రహింపఁజాలఁడయ్యెను. ...ఎప్పుడును శృంగారము వ్యంగ్యముగా నుండవలెను గాని వాచ్యము కాకూడదని దండి ...వెండించెను. దీని తరువాతి శ్లోకములో నా యర్థమునే భంగ్యంతరముగా దండి చెప్పు ...చున్నాడు. "కామంకందర్పచండాలో మయివామాక్షినిర్దయః। త్వయినిర్మత్సరో ...దిష్ట్యేత్యగ్రామ్యోఽర్థోరసావహః॥" (I 64) కావ్యాదర్శరచనలలితమై విశుద్ధవా ...క్యరచనతోఁ గూడినదియైయున్నది. దశకుమారచరిత్రము దీర్ఘసమాసభూయిష్ఠమై ...పరుషశైలితో గూడియున్నదని అగాషీపండితుని రెండవ యాక్షేపము. ఇందులో ...నూర నాతఁడు భ్రాంతినొందెను. పద్యరూపముగా నుండుటవలనఁ గావ్యాదర్శ

ముందు దీర్ఘసమాసముల కవకాశము లేదు. అయినను అర్ధశ్లోకమందు దీర్ఘసమాసముండవచ్చును. "పయోధరతటోత్సంగ లగ్నసంధ్యాతపాంశుకా। కస్య కామాతురం చేతో వారుణీనకరిష్యతి॥" (కా. I-84) దశకుమారచరిత్రము గద్యకావ్యముగావున దీర్ఘసమాసములతోఁ గూడియుండును. పద్యములయందు దీర్ఘసమాసములుండఁగూడదని కావ్యాదర్శము నిషేధించుచున్నది. గద్యమునకే దీర్ఘసమాసము జీవితమని దండి చెప్పియున్నాడు. "ఓజస్సమాసభూయస్త్వమ్ ఏతద్గద్యస్యజీవితమ్। పద్యేప్యదాక్షిణాత్యానా మిద మేకంపరాయణమ్॥" (I-80) సుబంధుడు వాసవదత్తా ప్రారంభమందు వ్రాసిన శ్లోకములకు నందలి గద్యకు జాల భేదముగలదు. అట్లనే దశకుమారచరిత్రలోను, దశకుమారచరిత్ర దండి వ్రాసినది కాదని సమర్థించుటకుఁ దగిన యుపపత్తు లిదివర కెవ్వరును జెప్పియుండలేదు. "బ్రహ్మాండచ్ఛత్రదండః" అను దశకుమారచరిత్రలోని ప్రథమశ్లోకము సరస్వతీకంఠాభరణమం దుదాహరింపఁబడియున్నది. ఇదిగాక కావ్యాదర్శములోని శ్లోకములుకూడ ననేకములు సరస్వతీకంఠాభరణమం దుదాహరింపఁబడియున్నవి. దండి వ్రాసిన మూఁడు గ్రంథము లెవ్వియో యిదివఱకు నిశ్చయింపఁబడలేదు.

దండి భామహుల గ్రంథములలో నొకయక్షరమైన భేదము లేకుండ సామాన్యముగానున్న శ్లోకము లీదిగువ వ్రాయఁబడుచున్నవి.

| దండి కావ్యాదర్శము | భామహుని కావ్యాలంకారము. |
|---|---|
| 1. సర్గబంధో మహాకావ్యమ్. (I-14) | 1. సర్గబంధో మహాకావ్యమ్ (I-19) |
| 2. మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయైరపి. (I-17) | 2. మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయైరపి. (I-20) |
| 3. కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాదయః. (I-29) | 3. కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాన్వితా. (I-27) |
| 4. అద్యయా మమగోవింద. (II-276) | 4. అద్యయా మమగోవింద. (III-5) |
| 5. తద్భావికమితిప్రాహుః ప్రబంధవిషయంగుణం. (II-364) | 5. తద్భావికమితిప్రాహుః ప్రబంధవిషయంగుణం. (III-52) |
| 6. అపార్థంవ్యర్థమేకార్థం ససంశయమపక్రమమ్. (III-125) | 6. అపార్థంవ్యర్థమేకార్థం ససంశయమపక్రమమ్. (IV-1,2) |
| 7. సముదాయార్థశూన్యం యత్తదపార్థక మిష్యతే. (III-128) | 7. సముదాయయార్థశూన్యం యత్తపార్థక మిష్యతే. (IV-8) |

### దండి కావ్యాదర్శము.

8. గతోఽస్తమర్కో భాతీందుర్యాంతి వాసాయపక్షిణః. (II-244)
9. ఆక్షేపోఽర్థాంతరన్యాసో వ్యతిరేకో విభావనా. (II-4)
10. ప్రేయోరసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్. (II-5)

### భామహుని కావ్యాలంకారము.

8. గతోఽస్తమర్కో భాతీందుర్యాంతి వాసాయపక్షిణః. (II-87)
9. ఆక్షేపోఽర్థాంతరన్యాసో వ్యతిరేకో విభావనా. (II-66)
10. ప్రేయోరసవదూర్జస్వి పర్యాయోక్తం సమాహితమ్. (III-1)

## దండిభామహుల కాలనిర్ణయము.

దండిభామహుల కాలనిర్ణయమునుగురించియు, న్యాసభామహులగురించియు నిరూపకులైన పండితులు భిన్నాభిప్రాయులై కొంతకాలమునుండి వివదించుచున్నారు. త్రివేదీపండితుఁడు, జాకోబీపండితుఁడు, రంగాచార్యులుగారు, గణపతిశాస్త్రి, భామహుఁడు దండికంటెఁ బ్రాచీనుఁడనిసమర్థించిరి. టి. నరసింహఅయ్యంగారు భామహునికంటె దండియే ప్రాచీనుఁడని వాదించెను. ఉభయవాదుల అభిప్రాయములను సంగ్రహించి విమర్శించి దానిపై నా యభిప్రాయమును బ్రకటించెదను.

ఈ విమర్శన మారంభింపకముందు రెండంశలను విశదపర్చవలసియున్నది.

భామహుఁడు దండిప్రాచీనాలంకారికుల గ్రంథములఁజూచి తమగ్రంథములను వ్రాసితిమని స్పష్టముగాఁజెప్పియున్నారు. వీరిలో భామహుఁడట్టి ప్రాచీనాలంకారికులలో నొకఁడైన మేధావిని తనగ్రంథమందుఁ జెప్పియేయున్నాఁడు. ఈ యంశ మొకటి. రెండుగ్రంథములలోని కొన్ని శ్లోకము లొక్కటియై యున్నంత మాత్రమున నొకఁడు మఱియొకని గ్రంథమునుండి యెరవుతెచ్చుకొన్నాఁడని మనము నిశ్చయింపఁగూడదు. దండిభామహులకంటె ముందున్న గ్రంథకర్తలనువారు వ్రాసిన గ్రంథములను మనమెఱుఁగకపోవుటచే వారుభయులు ప్రాచీన గ్రంథములనుండి యాశ్లోకములను దీసికొనిరనియు, నిప్పుడంతరించిన యాగ్రంథములనువారు ఖండించుచున్నారనియు మనము తలంపము. రెండవ యంశ మేమనగా—వీరుభయులు ప్రాచీనులు. ఎనిమిదవ శతాబ్దమందున్న ఉద్భటుఁడు భామహుని కావ్యాలంకారమున కొక వ్యాఖ్యానమును వ్రాసెను. భామహుఁడు 750 సంవత్సరములకంటె నవీనుఁడై

యుండఁడు. ఈదిగువ వ్రాసిన యుపపత్తులనుబట్టి విచారింపఁగా దండికూడ నించుమించుగా నాకాలపువాఁడేయని చెప్పకతీరదు. వేయిసంవత్సరములక్రిందట రచింపఁబడిన లోచనములో దండి పేరు, అతఁడు చెప్పిన చంపూకావ్యలక్షణము పేర్కొనఁబడినది. (లోచనము. 141-వ పే. యథాహ. దండీ. గద్యపద్యమయీచంపూరితి.) ఉద్భట కావ్యాలంకార వ్యాఖ్యాతయగు ప్రతీహారేందురాజుకూడ దండినిఁ జెప్పియున్నాఁడు. ఇతడు 950-వ సం॥లో జీవించినవాఁడు. రాష్ట్రకూటపురాజైన నృపతుంగ మోఘవర్షునిచేఁ గన్నడభాషలో వ్రాయఁబడిన కవిరాజమార్గమను నలంకార గ్రంథమందు దండి వ్రాసిన శ్లోకములనేకములు కన్నడభాషలో ననువదింపఁబడియున్నవి. ఈకవిరాజమార్గము 815-865-వ సంవత్సరములమధ్యను రచింపఁబడి యుండవచ్చును. Dr. Barnett పండితునిచే సింహళభాషలో వ్రాయఁబడిన (Siya-bas-lokara) స్వభాషాలంకారమను అలంకారగ్రంథము దండికావ్యదర్శము నాధారముగాఁ జేసికొని వ్రాయఁబడినది. దండిపేరుకూడ దానిలోఁ జెప్పఁబడినది. ఆ గ్రంథమును రచించినవాఁడు ప్రథమ సేనుఁడనియు, (Sena I.) నతఁడు 846—866-వ సంవత్సరములలో నుండెననియు మహావంశమను బౌద్ధగ్రంథమువలనఁ దెలియవచ్చుచున్నది. ఉద్భటుని ఉపమారూపకాలంకార నిరూపణమును, దండి నిరూపణమును కావ్యలింగదృష్టాంత పునరుక్తవదాభాసచ్ఛేకానుప్రాసాదులను దండి చెప్పిన లక్షణమును, సంసృష్టిసంకరముల కతఁడుచెప్పిన భేదమును వామనుని గుణనిరూపణమును, దండి గుణనిరూపణమును, ఆయుభయుల దోషనిరూపణమును బాగుగా విమర్శించినయెడల నుద్భటవామనులకంటె దండి కొంతకాలము ముందువాఁడై యుండునని తోచును. కావున దండికూడ 750 సంవత్సరములకంటె దిగువవాఁడనిపించుకోఁబడును.

దండికంటె భామహుఁడు ప్రాచీనుఁడని నమ్మి వాదించువారి యుపపత్తుల నన్నిటినిగాని, కొన్నింటినిగాని యిపుడు చెప్పఁబూనుకొన్నాను.

(1) అలంకార సర్వస్వకారుఁడు భామహునిఁ జిరంతనుఁడని వ్యవహరించె ననియు రాఘవభట్టు భామహునిగ్రంథ మాకరమని శకుంతలావ్యాఖ్యానములో వ్రాసెననియు, "పూర్వేభ్యోభామహాదిభ్యః, ప్రాచా భామహేన" అని భామహుని ప్రతాపరుద్రీయకారుఁడు ప్రాచీనుఁడని చెప్పెననియు త్రివేదిమొదలైన పండితులు చెప్పుచున్నారు. త్రివేదీపండితుని మతప్రకారము రుద్రటాలంకార వ్యాఖ్యాతయగు

సాధువొక్కఁడే భామహునికంటె దండి ప్రాచీనుఁడని చెప్పినవాఁడు. అలంకార సర్వస్వకారుఁడు చిరంతనుఁడనియు, ప్రతాపరుద్రీయకారుఁడు పూర్వుఁడనియు, రఘువభట్టీతనిగ్రంథ మాకరమనియుఁ జెప్పినంతమాత్రమున భామహుఁడు దండి కంటెఁ బ్రాచీనుఁడని రుజువుచేయుటకు శక్యముకాదు. భామహుఁడు ప్రాచీను లలో నొకఁడు. అతఁడు పూర్వుఁడని చెప్పినచో విశేషమేమియు లేదు. ప్రాచీన గ్రంథకర్తలెప్పుడైనఁ బరామర్శింపఁబడినప్పుడు ప్రాచీనుల పేరులన్నియు రావలెనని విమర్శకుల అభిప్రాయమా? త్రివేదిచేఁ జెప్పఁబడిన గ్రంథకర్తలందరికంటె నమి సాధు ప్రాచీనతముఁడు. భామహునికంటె ముందువాఁడైన మేధావికంటె దండి ప్రాచీ నుఁడని చెప్పినచోఁ దక్కిన వాదములనన్నిటిని భగ్నముచేయుట కిదియే చాలును. ఎనిమిదివందల సంవత్సరములు ప్రాచీనులైన గ్రంథకర్తలవిషయమై 14_వ శతాబ్ద మున జీవించినవారి అభిప్రాయములఁబట్టి నిష్కర్షించుట న్యాయముకాదు. అలం కార సర్వస్వముకూడ నుద్భటుని ప్రాచీనుఁడనుచున్నది. కావున దండి ఉద్భటుని కంటె నవీనుఁడని త్రివేదిపండితుఁడు తలంచునా? అలంకార సర్వస్వమునకు వ్యాఖ్య వ్రాసిన జయరథుఁడు దండికూడఁ బ్రాచీనులలో నొకఁడని చెప్పెను సంగతిని వేది మరచిపోయెనేమో? కావున నీ యంశము మిక్కిలి యసారము.

(2) దండి యమకభేదములను, యితర శబ్దాలంకారభేదములను విపులముగా నొక అధ్యాయముచేఁ బ్రతిపాదించుటచేతను, ఉపమాలంకార భేదములను విశేష ముగా నిరూపించుటచేతను నవీనుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. భామహుఁ డన్ని సూక్ష్మభేదములఁ జెప్పలేదు. భామహుఁడు పంచవిధయమకములను, భరతుఁడు దశవిధ యమకములనుఁ జెప్పెను. ఏవిమర్శకుఁడైనను నాట్యశాస్త్రకర్తయగుభరతుని కంటె భామహుఁడు ముందువాఁడని చెప్పఁజాలఁడు. కాళిదాసుకూడ యమకమందు హెచ్చుగౌరవముగలవాఁడై తనరఘువంశములోని తొమ్మిదవసర్గయందుఁ బ్రతిశ్లోక మయొక్క చతుర్థపాదమందు యమకమునుఁ గూర్చెను. "నృపతిమన్యమసేవతదే వతా సకమలాకమలాఘవమర్థిషు (రఘు. 9 స. 16_వ శ్లో.) క్రీస్తువెనుక 150_వ సంవత్సరములోఁ బుట్టిన రుద్రదాముఁడనురాజు వ్రాయించిన శాసనములోఁగూడ నీ యమకము కన్పట్టుచున్నది. అర్వాచీన గ్రంథకర్తలుయమకమందు మందాదరులైరి. దాని ప్రాసమును విస్తరముగాఁ బ్రతిపాదించినను ఉద్భటుఁడు యమకముయొక్క భేదములనైన నెత్తుకొనలేదు. మమ్మటుఁడు దానిని సంగ్రహముగాఁ జెప్పెను. ఇతర శబ్దా లంకారములనుఁగూడ నట్లనే. ప్రాచీనులైన బాణసుబంధ్వాదులుకూడ శృంఖలా

బంధము, అక్షరచ్యుతకము, ప్రహేళికామొదలగు శబ్దచిత్రముల నెఱుంగనివాఁ కారు, దండి చేసిన ఉపమాలంకార వర్గీకరణము శాస్త్రీయముగానున్నది. అతఁడీ విషయములో భరతుని అనుసరించెను. భామహుఁడు మమ్మటోద్భటులవలె నుపమాని రూపణమును జక్కఁగాఁ జేసెను. ఈయంశములఁబట్టి దండి భామహునికంటెఁ బ్రాచీనుఁడని నావాదము. పూర్వోక్తములైన రెండు వాదములు తుల్యముగా హేత్వాభాసములు. దండిభామహులిరువురు భిన్నసంప్రదాయము ననుసరించిరి. వీరిలో మొదటివాఁడైన దండి భరతమతావలంబి. భామహుఁడు సామాన్యాలంకారికుల మతము ననుసరించెను.

(3) వ్యాఖ్యాతయగు తరుణవాచస్పతి భామహుని మతమును దండి ఖండించెనని స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. ఇతఁడు చాల నవీనుఁడు. దశరూపకమునుండి కొన్ని శ్లోకములను సరస్వతీకంఠాభరణమునుండి రీతులనుఁ జెప్పు శ్లోకములను తాను వ్రాసిన కావ్యాదర్శవ్యాఖ్యానమం దుదాహరించెను. కావున నీతఁడు పదునొకండవ శతాబ్దముకంటె నిటీవలవాఁడు. రెండు విరుద్ధాభిప్రాయములనుఁ జూచి యితఁడు భామహుని మతమును దండి ఖండించుచున్నాఁడని తలంచెను. కాలనిర్ణయమును గురించి మనము నవీనవ్యాఖ్యాతల మాటలను విశ్వసించుట యెంత అపాయకరమో చూడుఁడు. చక్రవర్తి భట్టాచార్యులు తానువ్రాసిన కావ్యప్రకాశవ్యాఖ్యానములో "రాజతితదీయమభిహతదానవ రాసాతిపాతిసా రావనదా। గజతాచయూధమవిరతదానవ రాసాతిపాతిసారావనదా" అను నీశ్లోకమునుగురించి అలంకార సర్వస్వకారునికున్న అభిప్రాయమును మమ్మటుఁడు ఖండించుచున్నాఁడని తలంచెను. నాగోజీభట్టుకూడ నట్లనేచెప్పుచున్నాఁడు. పండ్రెండవ శతాబ్దములో నున్నవాఁడు మమ్మట సర్వస్వకారులకు దగ్గరవాఁడునైన జయరథుఁడు సర్వస్వకారుఁడు కావ్యప్రకాశమతమును ఖండించుచున్నాఁడని తలంచెను. కావున నితరప్రబల ప్రమాణము లేకుండ మనము తరుణవాచస్పతి చెప్పినమాటల నెంతమాత్రము విశ్వసింపఁగూడదు.

(4) భామహుఁడు కథాఖ్యాయికలకు భేదముకలదనెను.

"ప్రకృతానాకులశ్రవ్య శబ్దార్థపదవృత్తినా। గద్యేనయుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఖ్యాయికామతా। వృత్తమాఖ్యాయతేతస్యాం నాయకేనస్వచేష్టితమ్। వక్త్రంచాపరవక్త్రంచకాలేభావ్యర్థశంసిచ, కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదఙ్కితా।

కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాన్వితా । నవక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తా నోచ్ఛ్వాసవత్యపి । సంస్కృతం సంస్కృతా చేష్టా కథాపభ్రంశభాక్తథా॥" (భా. కా. 25, 26, 27, 28.) దండి కథాఖ్యాయికలకు సంజ్ఞామాత్రభేదమే గాని వాస్తవముగా భేదము లేదని సమర్థించెను. "తత్కథాఖ్యాయికేత్యేకా జాతిస్సంజ్ఞాద్వయాంకితా" (కా. వ్యా. I. 28.) ఇందులో భామహుని అభిప్రాయమును దండి ఖండించెనని యూహింపఁబడినది. భామహుఁడు కథాఖ్యాయికలకీ దిగువ వ్రాసిన భేదములఁ జూపించెను. (1) సోచ్ఛ్వాసాఖ్యాయికా మతా (అఖ్యాయికలో నుచ్ఛ్వాసములుండును.) (2) వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితం (స్వవృత్తాంతము నాయకుఁడు చెప్పును.) (3) వక్త్రం చాపరవక్త్రం చ కాలే భావ్యర్థశంసి చ (భావ్యర్థమును సూచించు వక్త్రాపరవక్త్ర శ్లోకములు రెండుండును.) (4) కవేరభిప్రాయకృతైః కథనైః కైశ్చిదంకితా (కవియొక్క అభిప్రాయముచేఁ జేయఁబడిన కొన్ని కథలచే నంకితమై యుండును.) (5) కన్యాహరణసంగ్రామ విప్రలంభోదయాన్వితా (కన్యాహరణసంగ్రామ విప్రలంభములచేఁ గూడియుండును.) కడపటి రెండును అఖ్యాయికాలక్షణమునఁ జెప్పుచున్నవి. కాని, కథ–నవక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తా–కథకు వక్త్రాపరవక్త్రములుండవు. "నోచ్ఛ్వాసవత్యపి" కథకుచ్ఛ్వాసములను విభాగములుండవు. "అన్యైస్స్వచరితం తస్యాం నాయకేన తు నోచ్యతే" (కథలో నాయకుని చరిత్ర మన్యులచేఁ జెప్పఁబడును. నాయకుఁడు చెప్పఁడు. దండి మతప్రకారముగా నాఖ్యాయికలో నాయకుఁడే తనకథను వక్కాణించువాఁడని కొందరు చెప్పుచున్నారు. కథలో నాయకుఁడో పైవాఁడో కథఁ జెప్పువాఁడైయుండవచ్చును. కథాఖ్యాయికలకు భామహుఁడు చెప్పిన భేదమిది కాదు. "తయోరాఖ్యాయికా కిల। నాయకేనైవ వాచ్యాన్యా నాయకేనేతరేణ వా॥" (అఖ్యాయికలో నాయకుఁడే నిజకథాప్రవక్తయై యుండవలెను. కథయందా నియమము లేదు. ప్రవక్త నాయకుఁడైన కావచ్చును. ఇతరుఁడైన కావచ్చును. "అపి త్వనియమో దృష్టస్తత్రాప్యన్యైరుదీరణాత్" అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదలక్షణమ్" (కథలో నాయకవృత్తాంతము నితరులే చెప్పవలయునను నియమము కనఁబడదు. వక్త అన్యుఁడు, నాయకుఁడు అను భేదమెట్టిది. అఖ్యాయికలలోఁ గథాప్రవక్తలు నాయకునికంటె నితరులని దండి అభిప్రాయము. కథలో నార్యావృత్త శ్లోకములు వాడుక చేయఁబడినవని దండి చెప్పుచున్నాఁడు గావున వక్త్రాపరవక్త్రములెందుకు వాడుక చేయఁబడకూడదు. బృహత్కథయందువలెఁ గథలో విచ్ఛేదములు లంబములని చెప్పఁబడుచున్నవి. అఖ్యాయి

కలలో విచ్ఛేదము ఉచ్ఛ్వాసములని వ్యవహరించినయెడల నేమి దోషమున్నది. ఆఖ్యాయికలయందేకాక సర్గబంధమగు కావ్యమందుఁగూడ కన్యాహరణాదులు వర్ణింపఁబడుచున్నవి. కథాఖ్యాయికలు పతంజలికాలములోఁగూడ నున్నట్లాతని గ్రంథమువలననే తెలియవచ్చుచున్నది. కావున భామహుఁడు చెప్పినదానిని దండి ఖండించెనని పలుకుట కవకాశము లేదు.

(5) "దండి—నలింగవచనే భిన్నే నహీనాధికతాపివా। ఉపమాదూషణాయాలం యత్రోద్వేగోనధీమతామ్॥" (కా. II. 51) అను కారికచే లింగభేదము, వచనభేదము, హీనోపమ, అధికోపమ కొన్ని విషయములయందు దోషములని చెప్పుచున్నాఁడు. భామహుఁడుపమాదోషము లేదని చెప్పెను కాని యితఁడు ప్రాచీనుఁడని చెప్పుటకిది యుక్తి కాదు. మేధావి ఉపమాదోషము లేదని చెప్పెనని భామహుఁడే వ్రాసెను. కావున నీయుపమాదోషసంఖ్య ప్రాచీనముగా వచ్చుచున్నది. ఇది దండి ప్రాచీనుఁడనుటకుఁ గొంతపనికివచ్చును. ఏలయన నతఁడుపమాదోషములు నాలుగని చెప్పెను. మేధావి యేడనెను. భామహుఁడు వానినే అనుసరించెను. కావున దండి యా యుపమాదోషవిషయమందు మార్గప్రదర్శకుఁడు.

(6) "గతోఽస్తమర్కో భాతీందుర్యాంతివాసాయపక్షిణః" అనునదికూడఁ గొన్ని సమయములయందు మంచి కవనమని దండి చెప్పెను. కాని భామహుడు దీనినిఁ దిరస్కరించెను, కొందరు దీనిని వార్తయనిరి. "గతోఽస్తమర్కో భాతీందుర్యాంతివాసాయపక్షిణః। ఇత్యేవమాదికింకావ్యం వార్తామేనాం ప్రచక్షతే॥" (II-87) త్రివేదీపండితులు మొదలైనవారు భామహుని ప్రాచీనతను సమర్థించుటకు యీముఖ్యమైనశ్లోకమని నమ్మియున్నారు. కానియిలరులెవ్వరో వార్తకుదాహరణము గానిచ్చినదిగాని యీవాక్యమితనిదికాదు. వార్త యొక యలంకారమని భట్టి చెప్పియున్నాడు. (X-45) "తచ్చవార్తాభిధానేషు వర్ణనాస్వపిదృశ్యతే" అనిదండికూడ దీనినిఁ జేర్చెను. దీనియుదాహరణములను స్వభావోక్తిలో నంతర్భవింపఁ జేసెను. ప్రాచీనగ్రంథకర్త చెప్పిన "గతోఽస్తమర్కః" అనుపూర్వోక్తశ్లోకమందు వ్యంగ్యము గ్రహించినయెడల సత్కావ్యమగును. సామాన్యార్థము గ్రహించినచోనుత్తమకావ్యము కానేరదు. కావ్యప్రకాశికావంచమోల్లాసమందు యీ శ్లోకమువలన స్ఫురించు ననేకార్థములు చెప్పబడినవి,

(7) దండిభామహులిరువురు "అద్యామామమగోవింద" అను శ్లోకమును

ప్రేయోలంకారమునకుదాహరణముగానిచ్చెను. భామహు డితరగ్రంథములనుండి ప్రమాణశ్లోకముల నుదాహరించినయెడల నా గ్రంథకర్తలనుగూడఁ బేర్కొనును. దండి సామాన్యముగా నితరుల శ్లోకముల నుదాహరించుటయేగాని తత్కర్తలనుఁ జెప్పడని త్రివేదిపండితుడు వాదించును. కాని యీ మాట విచారవిధురము. దండికూడ నితర గ్రంథకర్తలశ్లోకములను తనగ్రంథమందుదాహరించునపుడు "ఇతీదమపి" అనిస్పష్టముగా జెప్పును. పైఁ జెప్పినట్లు భామహునిగ్రంథము అట్టివిశ్వాసమునుఁ బుట్టించునంత విస్పష్టశంకముగా నుండ లేదు. ఇంకను విచారింపదగిన యంశములు కొన్ని గలవు. భామహుడు ప్రేయస్సునకు, ఊర్జస్వికి లక్షణము చెప్పకయే యుదాహరణములిచ్చెను. దండి యీయలంకార ద్వయమునకు లక్షణముచెప్పి యుదాహరణములిచ్చెను. భామహుఁడీయలంకారములకుఁ బూర్వులు లక్షణమునుఁ జెప్పియున్నారు గావున నుదాహరణమిచ్చిన జాలుననుకొనెను. కాబట్టి దండిభామహుని గ్రంథమునుండి యీయుదాహరణములను గ్రహించెనని చెప్పుట యసమంజసము. భామహుడే యీయలంకార ద్వయమునకుదాహరణములను దండిగ్రంథమునుండి యెరువు తెచ్చుకొనెనని యొకఁడు వివదింపవచ్చును. "అద్యయామమగోవింద" అనుశ్లోకమయొక్క యర్థము. "యా ప్రీతిః పుండరీకాక్షతవాగమనకారణాత్। సాకిమాఖ్యాయతేతుభ్య మంతరాత్మాసిదేహినామ్" అనుశ్లోకమునయొక్క అర్థము ననువదించుచున్నది. (భా. ఉద్యోగ. 49, 24.)

(8) భామహుడుపమారూపకము (III-34) ససందేహము (III-42) అనన్వయము (III-44) ఉత్ప్రేక్షావయవము (III-48) అను నీయలంకారములను స్వతంత్రాలంకారములని చెప్పెను. దండి వీనిని స్వతంత్రాలంకారములని యొప్పుకొనక ఉపమారూపకమును రూపకములోను, సందేహానన్వయముల నుపమాలంకారములోను, ఉత్ప్రేక్షావయవము నుత్ప్రేక్షలోను అంతర్భవింపజేసెను. "అనన్వయససందేహావుపమాస్వేవదర్శితౌ। ఉపమారూపకంచాపి రూపకేష్వేవదర్శితమ్। ఉత్ప్రేక్షాభేదఏవాసావుత్ప్రేక్షావయవోపిచ॥" (II-358, 359) భామహుడు ప్రాచీనుడని చెప్పుటకిది యొకయుపపత్తిగా వాడుక చేయబడినది. ఈయలంకారములకన్నిటికి భట్టి వేఱువేఱుగా నుదాహరణములిచ్చెను. భట్టికంటె ముందున్న అలంకారికులను విడిచిపెట్టిదండి, భామహునొక్కనినే తన గ్రంథమందే నిర్దేశింపవలెనన్నందుకుఁ దగిన యుపపత్తి యేమియుఁ గానరాదు. ప్రతిపక్షులసిద్ధాంతమును సంశయగ్రస్తముగాఁ జేయుటకు మఱియొక యుక్తి కలదు. భామహుడుపమేయోపమను వేఱుగా నిర్వచించెను. దండి

దానిని జెప్పక దానికిబదులుగా ననన్యోన్యోపమను జెప్పెను. దండి భామహునిగ్రంథమును మఱుదుఁచుకొని తన కావ్యాదర్శమును వ్రాసినయెడల నుపమేయోపమను పమాంతర్భూతమని చెప్పియుండును.

(9) దండిచెప్పిన పదికావ్యదోషములనే భామహుడును చెప్పి "ప్రతిజ్ఞాహేతుదృష్టాన్తహీనం దుష్టం చ నేష్యతే" అని పదునొకండవ దోషమునుగూడ జెప్పి యీ దోషవిమర్శనముకొఱకొక పరిచ్ఛేదమును వ్రాసెను. ప్రతిజ్ఞాహేతుదృష్టాంత హాని దోషమగునా కాదాయని విమర్శించుట కాక తంతపరీక్షవలె నిష్ప్రయోజనమని దండి చెప్పుచున్నాడు. "ప్రతిజ్ఞాహేతుదృష్టాంత హానిర్దోషో నవా ప్యసౌ విచారః కర్కశ ప్రాయస్తేనాలీఢేన కిం ఫలమ్" (III-127) అలంకారశాస్త్రమందు వాదములనారంభించుటకు భామహుడే మొదటివాడని తలంపగూడదు. నాట్యశాస్త్రకారుడు చెప్పిన పదికావ్యదోషములలో న్యాయాపేతమనునది యొకటి. "న్యాయాదపేతం విజ్ఞేయం ప్రమాణపరివర్జితమ్" (నాట్య. శా. 16, 89) ప్రమాణములు తర్కశాస్త్రగతములు, భామహుని కావ్యాలంకారములోని పంచమపరిచ్ఛేదమునంతయును జూచి దండి దురాగ్రహముగలవాడై "తేనాలీఢేన కిం ఫలమ్" అని శాంతముగాఁబలికి భామహుని విడిచిపెట్టెననుట మిక్కిలి సంశయాస్పదమైనసంగతి. నాట్యశాస్త్రములోఁ జెప్పబడిన కావ్యదోషములు. అర్థహీనము, ఏకార్థము, గూఢార్థము, అర్థాంతరము, విసంధి, శబ్దహీనము, విషమము, భిన్నార్థము, అభిప్లుతార్థము, న్యాయాపేతమునని పది. వీనిలో మొదటియేడును యించుమించుగా ననేకార్థము, ఏకార్థము ససంశయము, అపక్రమము, విసంధి, శబ్దహీనము, భిన్నవృత్తము అనువానితో సరిగానున్నవి. నాట్యశాస్త్రములోఁ జెప్పబడిన భిన్నార్థమనుదోష మితరాలంకారికులు చెప్పిన అసభ్యగ్రామ్యము లే. "యత్పాదేన సమస్యతే" అని అభిప్లుతార్థలక్షణము. భామహుడు చెప్పిన యతిభ్రష్టదోషమును నాట్యశాస్త్రకారుడు విషమమను దోషములో నంతర్భావింపఁజేసెను. అలంకారశాస్త్రములను వ్రాసినవారు దోషములయొక్క పేర్లను తరుచుగా న్యాయసూత్రమునుండి గ్రహించియున్నారు. ఎట్లనగా; ప్రతిజ్ఞాహానిః, ప్రతిజ్ఞాంతరం, ప్రతిజ్ఞావిరోధః, ప్రతిజ్ఞాసన్న్యాసః, హేత్వంతరం, అర్థాంతరం, నిరర్థకం అవిజ్ఞాతార్థం, అపార్థకం, అప్రాప్తకాలం, న్యూనమధికం, పునరుక్తం, అననుభాషణ మజ్ఞానమప్రతిభా, నిగ్రహస్థానాని.

భామహుఁడు దండికిదరువాతవాడని సమర్థించుటకుదగిన కొన్ని యంశముల నీదిగువ వ్రాయుచున్నాను.

(10) దండి "విజితాత్మభవద్వేషి గురుపాదహతో జనః। హిమాపహామిత్రధరై ర్వ్యాప్తం వ్యోమాభినందతి" అను శ్లోకమును ప్రహేళికావిశేషమునకుదాహరణముగా నిచ్చెను. భామహుఁడర్థశ్లోకమునుమాత్రమే యుదాహరించెను. శార్ఙ్గధరుఁడీ శ్లోకము దండివ్రాసినదని చెప్పెను. భామహుఁడే గ్రంథమునుండి శ్లోకముల నుదాహరించెనో ఆ గ్రంథమునుండియే దండికూడ నుదాహరించెనని చెప్పినయెడల నీవాదము తప్పించుకొనవచ్చును. "లింపతీవతమోఽంగాని" అను శ్లోకమునుతప్ప దండిని యే శ్లోకము నితరగ్రంథమునుండి యుదాహరింపలేదని చెప్పలేము. ఇతర గ్రంథకర్తలనుండి తీయఁబడినవని యూహింపఁబడిన శ్లోకములు వివాదగ్రస్తములైనవి. "గోపానపరిసంఖ్యేయా స్మన్యమానానయంపుకః। సాథ్వీరేవాభిధాస్యాచు స్తాదుష్టా యా స్స్వలక్షణాః॥" (కావ్య. III-107) అను శ్లోకమువలనఁ బ్రహేళికలను దండి స్వకీయశ్లోకములనే యుదాహరణముగా నిచ్చెనని యూహింపఁబడుచున్నది.

(11) భామహుని ఉపమానిరూపణముకంటె దండి యుపమానిరూపణము విస్తీర్ణముగానున్నది. దండి అనుప్రాసమును సంగ్రహముగాను, యమకమును విపులముగాను ప్రతిపాదించెను. భామహునిగ్రంథమునుండి యెరువుతెచ్చుకొన్న అగ్నిపురాణముకూడ నుపమాప్రకరణమును దండివలెనే ప్రతిపాదించెను.

(12) ఇతరగ్రంథకర్తల అభిప్రాయములఁ దెలియఁజేయుశ్లోకములు భామహుని గ్రంథమందనేకములున్నవి. భామహుఁడు గౌడీవైదర్భరీతులకు భేదమును చెప్పినవారిని ఖండించెను. వీనిలో గౌడీరీతిమంచిదని చెప్పియున్నాఁడు. వైదర్భరీతి మంచిదనువారిని "సుధియః" అని పరిహసించుచున్నాఁడు. "వైదర్భమన్యదస్తీతి మన్యంతే సుధియోఽపరే। తదేవచకిలజ్యాయః సదర్థమపినాపరం। గౌడీయమిదమేతత్తు వైదర్భమితికిం పృథక్। గతానుగతికన్యాయా న్నానాఖ్యేయమమేధసామ్॥" (I-31,32) కావ్యాదర్శము వైదర్భమార్గమే మంచిదని చెప్పుచున్నది. "అస్త్యనేకో గిరాంమార్గః సూక్ష్మభేదః పరస్పరం। తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ। ఇతి వైదర్భమార్గస్య ప్రాణాదశగుణాః స్మృతాః। ఏషాం విపర్యయః ప్రాయోదృశ్యతే గౌడవర్త్మని" (I.40–42) దండికంటె ముందనేకరీతులున్నవని "అనేకో మార్గః" అని అతఁడు చెప్పిన మాటలవలననే స్పష్టమగుచున్నది. కాని దండికంటె ముందువారైన గ్రంథకర్తల గ్రంథములన్నియును మనకు లభించునంతవఱకు భామహుఁడొక్కఁడు దండినే పరీక్షించెననియు నితరులఁ బరీక్షింపలేదనియు నిశ్చయముగాఁ జెప్పఁజాలము.

"గౌడేష్వక్షరడమ్బరః" అని హర్షచరిత్రలో బాణుఁడుకూడ గౌడీరీతిని బ్రశంసించుచున్నాఁడు.

(13) నాట్యశాస్త్రకారుఁడు చెప్పిన పదిగుణములనే దండికూడ చెప్పెను. భామహుఁడు గుణములనుగుఱించి యేమియుఁ జెప్పలేదు. "శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః। తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి॥ రౌద్రాదయో రసాదీప్త్యా లక్ష్యంతే కావ్యవర్తినః। తద్వ్యక్తిహేతూ శబ్దార్థా వాశ్రిత్యౌజో వ్యవస్థితం॥ సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ప్రతి। సప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః॥" (ధ్వని. ౮, 10, 11) అను ధ్వనికారికను శ్లాఘించినవారిలో భామహుఁడు మొదటివాఁడు. అతఁడు మూఁడుగుణములనే చెప్పెను. "మాధుర్యమభివాంఛంతః ప్రసాదంచ సుమేధసః। సమాసవంతి భూయాంసి నపదానిప్రయుంజతే॥ కేచిదోజోఽభిధిత్సంతః సమస్యంతిబహూన్యపి। శ్రవ్యం నాతిసమస్తార్థం కావ్యం మధురమిష్యతే। ఆవిద్వదంగనాబాల ప్రతీతార్థం ప్రసాదవత్॥" (II-1, 3) అని ఓజస్సును నిందించెను. ఇది కొందఱి నవీనులమతమని తెలియఁజేయుచున్నది. కాని దండి భరతుని ప్రాచీనాభిప్రాయముల ననుసరించుచున్నాఁడు. గుణసంఖ్యను తగ్గించు నాభిముఖ్యమాలంకారికులలో నెన్నఁడు కలిగెనో తెలియదు. భామహునికంటె నిశ్చయముగా నవీనుఁడైన వామనుఁడుకూడ పదిగుణములను జెప్పెను. "ఓజస్సమాసభూయస్త్వం" అని స్పష్టముగాఁ జెప్పినను దండి మాధుర్యప్రసాదగుణములలో దీర్ఘసమాసములకవకాశముండదని స్పష్టముగాఁ జెప్పలేదు.

(14) "యదుక్తం త్రిప్రకారత్వం తస్యాః కైశ్చిన్మహాత్మభిః, నిందాప్రశంసాచిఖ్యాసాభేదాదత్రాభిధీయతే। సామాన్యగుణనిర్దేశాత్త్రయమప్యుదితం నను। మాలోపమాదిస్సర్వోఽపి నజ్యాయాన్విస్తరో ముధా॥" (II-37, 38) నిందోపమ, ప్రశంసోపమ, ఆచిఖ్యాసోపమ అని ఉపమ మూఁడువిధములని చెప్పెను. ఈ విభాగము కావ్యాదర్శములోఁగూడ గనుపట్టుచున్నది. నాట్యశాస్త్రకారుఁడు ప్రశంసోపమను, నిందోపమను జెప్పెను. ఆచిఖ్యాసోపమను చెప్పలేదు. భామహుని నిరూపణమునకు సరిగా సగ్ధముచెప్పినయెడల నుపమ మూఁడువిధములనే అతని యభిప్రాయము. దండి ముప్పదిమూఁడువిధములుగా నుపమను విభాగించెను. తక్కిన ఉపమా భేదములన్నియు నేమూఁడింటియొక్క భేదములేయని దండియొక్క అభిప్రాయమైనయెడల "ప్రకారాంత్రయ ఏ తేఽపి సస్యాదుక్తాః" అని దండి చెప్పియుండవలెను.

(15) కావ్యాదర్శకారుఁడు "హేతుశ్చసూక్ష్మలేశౌ చ వాచాముత్తమభూష
ణమ్" (II-235) అని చెప్పియున్నాఁడు. భామహుఁడు "హేతుశ్చసూక్ష్మో లేశోఽ
థ నాలంకారతయామతః" అని (II-86) దండి అలంకారములని యొప్పుకొన్న హేతు
సూక్ష్మలేశములను వానియందు వక్రోక్తి లేదని అలంకారములుగా నొప్పుకొనలేదు.
దండి వాని నుత్తమాలంకారములని ప్రతిపాదించెను.

(16) "స్వభావోక్తిరలంకార ఇతి కేచిత్ప్రచక్షతే। అర్థస్యతదవస్థత్వం స్వభా
వోఽభిహితో యథా॥" అని భామహుఁడు కొందరి మతము ననుసరించి స్వభావోక్తి
ని చెప్పెను. దండి దానికి జాతియని నామాంతరమిడి అది అలంకారములలో
ప్రథమమైనదని యెన్నుకొనెను. "నానావస్థం పదార్థానాం రూపం సాక్షాద్వివృణ్వతీ।
స్వభావోక్తిశ్చ జాతిశ్చ॥" (II-8) అని భామహుని లక్షణముకూడ నిట్లనే యున్నది.
స్వభావోక్తి మిక్కిలి ప్రాచీనాలంకారము.

(17) "ఎతదేవాపరేఽన్యేన వ్యాఖ్యానేనాన్యథావిదుః। నానారత్నాదియుక్తం
యత్తత్కిలోదాత్తముచ్యతే॥" (III-12) అని భామహుఁడుదాత్తాలంకారమునకు
లక్షణము జెప్పెను. "ఆశయస్య విభూతేర్వా యన్మహత్త్వమనుత్తమమ్। ఉదాత్తం॥"
అని దండిలక్షణము "రత్నభిత్తిషు సంక్రాంతైః ప్రతిబింబశతైర్వృతః। జ్ఞాతో లంకేశ్వ
రః కృచ్ఛ్రాత్ప్రాంజనేయేన తత్త్వతః। పూర్వత్రాశయమాహాత్మ్య మత్రాభ్యుదయగౌర
వం। సువ్యంజితమితి వ్యక్త ముదాత్తద్వయమప్యదః॥" (కా II-300, 302, 303)
దండియిచ్చిన ఉదాహరణము 'రత్న' శబ్దముతో నారంభమగుచున్నది. పూర్వోక్త
శ్లోకమందు భామహుఁడు "అపరే" అని దండిని నిర్దేశించుచున్నాఁడు. కావున
యీయుదాత్తాలంకారము మిగులఁ బ్రాచీనము. భట్టి ద్వివిధమైన యీ యలంకార
మున కుదాహరణద్వయమునొసంగెను.

(18) "ఆశీరపి చ కేషాంచి దలంకారతయామతః" (III-54) కొందఱి గ్రంథ
కర్తల మతప్రకారమాశీస్సుకూడ నొక యలంకారముగాఁ జెప్పఁబడినదని చెప్పి
భామహుఁడు దానికి రెండుదాహరణములనిచ్చెను. దండి "ఆశీర్నామాభిలషితే వస్తు
న్యాశంసనం యథా। పాతు వః పరమం జ్యోతి రవాఙ్మానసగోచరమ్॥" (II-357) అని
యీ యలంకారమునకు లక్షణము జెప్పి లక్ష్యము గనపఱ్చెను. భామహుఁడు తన
శ్లోకమందు "కేషాంచిత్" అని దండి నుద్దేశించిచెప్పెనో మరెవ్వరినుద్దేశించి చెప్పెనో
మనము నిశ్చయింపలేము. భట్టి యీ యలంకారమును నిరూపించెను.

(19) "పునరుక్తమిదం ప్రాహు రన్యే శబ్దార్థభేదతః। అత్రార్థపునరుక్తం యత్ర దేవైకార్థమిష్యతే। తాముత్కా మనసః నూనం కరోతిధ్వనిరంభసామ్। సాకోషఘనముక్తానాం ప్రణాళీముఖపాతినామ్॥" (IV-12, 15. 16) అని భామహుఁడును, "అవిశేషేణపూర్వోక్తం యదిభూయోపికీర్త్యతే। అర్థతశ్శబ్దతోవాపితదేకార్థం మతం యథా। ఉత్కాఉన్మనయంత్యేతే బాలాంతదలకత్విషః। అంభోధరా స్తటిద్వంతో గంభీరాస్స్తనయిత్నవః॥" (కావ్యా. III-135, 136) అని దండియు నేకార్థమును నిరూపించిరి. కాని వీరిరువురి యుదాహరణములు సదృశముగానున్నవి.

(20) పైనఁ జెప్పినట్లు నమిసాధు తానువ్రాసిన రుద్రటాలంకారవ్యాఖ్యానములో "దండిమేధావిరుద్రభామహాదికృతాని" అని దండిమేధావిప్రభృతులు వ్రాసిన అలంకారశాస్త్రములనుఁ బేర్కొనెను. మేధావి భామహునికంటె ముందువాఁడు గావున నమిసాధు కావలెనని యీ గ్రంథకర్తలపేర్లను వారి వారి కాలక్రమానుసారముగాఁ జెప్పియున్నాఁడుగనుక దండి మేధావికంటెగూడఁ బ్రాచీనుఁడని తెల్పఁబడినది. కాని నమిసాధువారి కాలానుపూర్విని దెలియఁజేయు సంకల్పముతో నట్టి ద్వంద్వసమాసమునుఁ జేసెనన్నందుకుఁ బ్రమాణము లేదు. రుద్రటునికంటె ముందు కొందఱు గ్రంథకర్తలుండిరని తెలియఁజేయుటయే అతని ముఖ్యప్రయోజనము.

కావున పూర్వోక్తవాదమువలన దేలినఁ ఫలితమేమనగా భామహునికంటె దండి ప్రాచీనుఁడని వాదించువారివాదము తగినంత బలముకలదియైయుండలేదు. వీరుభయులు స్వతంత్రాధారములను, స్వతంత్రసంప్రదాయములను అనుసరించిరని చెప్పనొప్పు. ఎట్లనఁగా దండి అలంకారశాస్త్రసంప్రదాయమును, భామహుఁడు భరతముని సంప్రదాయము నవలంబించియుండవచ్చును. వీరిలో నెవరు ప్రాచీనులైనను వీరుభయులు దగ్గఱకాలపువారై యుండవచ్చును. క్రీ. శ. 500—630 సం॥ మధ్యను జీవించినవారై యుండవచ్చును. పూర్వోక్తములైన యుక్తులవలన వీరిలో నొకఁడు మఱియొకనిని ఖండించెననిగాని, అనుసరించెననిగాని చెప్పవలెనుగాని మఱియొకరీతిగాఁ జెప్పుట కవకాశము లేదు. అందువలన భామహునికంటె దండియే ప్రాచీనుఁడని నా యభిప్రాయము.

భామహన్యాసకారులనుగుఱించి పాశ్రివేదిపండితులకు జరిగిన వాదము నిచటఁ

గొంచెము చెప్పవలసియున్నది. "శిష్టప్రయోగమాత్రేణ న్యాసకారమతేన వా। తృచా సమస్తషష్ఠీకం నకథంచిదుదాహరేత్। సూత్రజ్ఞాపకమాత్రేణవృత్రహన్తా యథోదితః॥ అకేనచనకుర్వీతవృత్తిం తద్గమకో యథా॥" (VI-36, 37) అని భామహుఁడు తన గ్రంథమునందు వ్రాసియున్నాఁడు. (తృజంతముతోను, 'క' అను ప్రత్యయము అంతమందుఁగల శబ్దముతోను షష్ఠీసమాసము చేయఁగూడదు. వృత్రహంతి, ఉద్గమక మొదలైన శబ్దములుండఁగూడదు.) ఈ న్యాసగ్రంథమునకు కాశికావివరణపంచిక యని నామాంతరముగలదు. ఇది జినేంద్రబుద్ధియనువానిచే వ్రాయఁబడినది. కాఁబట్టి భామహుఁడు కాశికావృత్తికిఁదరువాతివాఁడైన న్యాసకారునికంటె నర్వాచీనుఁడని యిందువలనఁ దేలుచున్నది. చీనాదేశపు యాత్రికుఁడైన ఇత్సి-గను వాఁడు పాణిని సూత్రములయొక్క వ్యాఖ్యాన గ్రంథములనుగురించి చెప్పిన వృత్తాంతమంతయు గందరగోళముగానుండెను. దానిని మనము ప్రమాణముగా గ్రహించినయెడల కాశికావృత్తి క్రీ. శ. 660 సం॥లోను, దాని వ్యాఖ్యానమైన న్యాసగ్రంథము సుమారు 700 సంవత్సరములలోను రచింపఁబడినచో భామహుఁడు 750 సం॥లో నున్నవాఁడు కావచ్చును. (Prof. Pathak) పాఠక్పండితుఁడుదాహరించిన కాశికాన్యాసకారవచనములలో భామహుఁడు చెప్పిన యభిప్రాయ మెంతమాత్రము లేదనియు, భామహుఁడు చెప్పిన వృత్రహన్తృశబ్దము లేదనియు త్రివేదిపండితుఁడు వాదించుచున్నాఁడు. త్రివేదిపక్షము న్యాయముగానున్నదని నా యభిప్రాయము. బాణుఁడు హర్షచరిత్రలో "ప్రసన్నవృత్తయో గృహీతవాక్యాః కృతగురుపదన్యాసాః" అని చెప్పియున్నాఁడు. కాని యీ న్యాసము కాశికాన్యాసమైయుండ లేదు. ఏలయన బాణుఁడు సప్తమశతకపూర్వార్ధమందున్నవాఁడు. భామహుఁడు చెప్పిన న్యాసము ప్రాయికముగా బాణుఁడు చెప్పినదైయుండును.

ప్రాచీనగ్రంథకర్తల గ్రంథములయందున్న శ్లోకములతో సరియైన అభిప్రాయములుగల శ్లోకములనుబట్టి దండి భామహులకాలమును నిర్ణయించుటకు ప్రయత్నములు చేయఁబడినవి. "సంవాదాస్తుభవంత్యేవ బాహుల్యేన సుమేధసామ్" అని ధ్వని కారుఁడు చెప్పినట్లు సజాతీయబుద్ధులగు మహాకవుల గ్రంథములయందు తుల్యాభిప్రాయములుగల శ్లోకములు మెండుగానుండును. దండి గ్రంథమందలి "ఇందోరిందీవరద్యుతి, లక్ష్మలక్ష్మీం తనోతీతి ప్రతీతిసుభగం వచః॥" అను శ్లోకము శాకుంతలములోనున్న "మలినమపిహిమాంశోర్లక్ష్మలక్ష్మీం తనోతి" అనుదానితో.

సదృశము గానున్నది. "ప్రిభామాత్రిం హితరళం దృశ్యతేనతదాశ్రియః" (కావ్యా. II-129) అనునది "సప్రిభాతః ళంజ్యోతిరుదేతివసుధాతలాత్" (శాకుంతలము) అట్లనే కావ్యాదర్శము రెండవ పరిచ్ఛేదములోనున్న 28వ శ్లోకము రఘువంశకుమార సంభవములలోనున్న శ్లోకములను బోలియున్నది. "అరత్నాలోకసంహార్య మవార్యం సూర్యరశ్మిభిః। దృష్టిరోధకరంయూనాం యౌవనప్రభవంతమః॥" (కావ్యా. II-197) అను శ్లోకము బాణుని కాదంబరిలో "కేవలంచనిసర్గత ఎవాభానుభేద్యమరత్నాలోకోచ్ఛేద్యమ ప్రిదీపప్రిభాపనే యమతిగహనంతమో యౌవనప్రిభవమ్" అను వాక్యము యొక్క అభిప్రాయముతో సంవదించుచున్నది.

నిర్వర్త్య, వికార్య, ప్రాప్య భేదముచేగర్మమూఁడువిధములనునంశమును దండి వాక్యపదీయమునుండి గ్రిహించెనని పాఠకపండితుఁడు తలంచుచున్నాఁడు గాని యిట్టి విభాగమును మొదట వాక్యపదీయకారుఁడేచేసెనని రుజావుచేయువరకు నీవాదము సారము.

"నాసిక్యమధ్యాపరితశ్చతుర్వర్ణవిభూషితా। అస్తికాచిత్పురీయస్యా మష్టవర్ణాహ్వయానృపాః॥" (కావ్యా. III-114) కావ్యాదర్శవ్యాఖ్యాతయగు తరుణవాచస్పతి యీ ప్రిహేళిక కాంచీపురము నేలిన పల్లవరాజులను దెలుపుచున్నదియని చెప్పెను. "ఇతిసాక్షాత్కృతేదేవే రాజ్ఞోయద్రాజవర్మణః। ప్రీతిప్రికాశనంతచ్చ ప్రేయఇత్యవగమ్యతామ్॥" (కావ్యా. II-279) అనుశ్లోకమందు దండి రాజవర్మయనునొకరాజునుఁ జెప్పియున్నాఁడు. కాని మతికొందఱు విమర్శకులు యీరాజవర్మయొక పల్లవరాజనియు 690 సం॥ మొదలుకొని 715 సం॥వఱకు రాజ్యముచేసిన ద్వితీయ నరసింహవర్మయే యని సమర్థించిరిగాని గట్టిగా శోధించియెడల నిదినిలువదు. రాజవర్మ పల్లవరాజగునో కాడో మనకుఁ దెలియదు. కావ్యాదర్శముయొక్క మతియొక వ్యాఖ్యానమైన శ్రుతానుపాలినియను గ్రంథమితఁడు కేరళదేశపురాజని చెప్పుచున్నది. రాజవర్మయను పేరు యీ భరతఖండములోఁ బ్రాచీనకాలమందనేక రాజులకుండెను. కావున "నాసిక్యమధ్యా" అను శ్లోకమొక ప్రహేళిక ఇందు జెప్పఁబడిన పట్టణము కొచ్చిదగ్గఱనున్న వంచిరాయైయుండవచ్చును

## ఉద్భటాలంకార సంగ్రిహము.

ఈ గ్రింథమారధ్యాయములుగా విభజింపఁబడినది. గ్రింథకర్త అధ్యాయములను వర్గములని పేరిడెను. ఇందు డెబ్బదిలొమ్మిది కారికలచే నలువదియొక

అలంకారములు ప్రతిపాదింపఁబడెను. ఉదాహరణశ్లోకములు సుమారుగా నొక నూఱున్నవి. ఈ యలంకారసంగ్రహమునకు ప్రతీహారేందురాజొక వ్యాఖ్యానమును రచించెను. ఇందులో నాయాయి అలంకారములకుదాహరణముగా నియ్యఁబడిన శ్లోకములన్నియు నుద్భటుఁడు రచించిన కుమారసంభవమనునొక కావ్యమునుండి తీయఁబడినవని వ్యాఖ్యాత చెప్పుచున్నాఁడు. "అనేనగ్రంథకృతాస్వోపరచితకుమారసంభవైకదేశో౽త్రోదాహరణత్వేనోపన్యస్తః। తత్ర పూర్వం దీపకస్యోదాహరణాని। తదనుసంధానావిచ్ఛేదాయాత్ర ఉద్దేశక్రమః పరిత్యక్తః।" (పేరా 15.) పునరుక్తవదాభాసము, ఛేకానుప్రాసము, పరుషావృత్తి, ఉపనాగరిక గ్రామ్యాది భేదభిన్నమైన అనుప్రాసము, లాటానుప్రాసము, రూపకము, ఉపమ, ఆదిమధ్యాంత దీపకము, ప్రతివస్తూపమ ప్రథమవర్గమందును, ఆక్షేపము, అర్థాంతరన్యాసము, వ్యతిరేకము, విభావనసమాసోక్తి, అతిశయోక్తి ద్వితీయవర్గమందును, యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి. తృతీయవర్గమందును, ప్రేయోరసవదూర్జస్వులు, పర్యాయోక్తి, సమాహితము, ఉదాత్తము, శ్లిష్టము, చతుర్థవర్గమందును, అపహ్నుతి, విశేషోక్తి, విరోధము, తుల్యయోగిత, అప్రస్తుతప్రశంస, వ్యాజస్తుతినిదర్శన, ఉపమేయోపమ, సహోక్తి, సంకరము, పరివృత్తి, అనన్వయము, ససందేహము, సంసృష్టి భావికము, కావ్యలింగము, దృష్టాంతము, పంచమషష్ఠవర్గములయందు నిరూపింపఁబడినవి. ఉద్భటుఁడును భామహుని అలంకారక్రమమునే అవలంబించెను. ఈ గ్రంథకర్త విడిచిపెట్టిన యమకము, ఉపమారూపకము, ఉత్ప్రేక్షావయవమును భామహుఁడు నిరూపించెను. భామహుఁడు విడిచిపెట్టిన పునరుక్తవదాభాసమును, సంకరమును. కావ్యలింగమును, దృష్టాంతమును, ఉద్భటుఁడు నిరూపించెను. ఆక్షేపము, విభావన, అతిశయోక్తి, యథాసంఖ్యము, పర్యాయోక్తి, అపహ్నుతి, విరోధము, అప్రస్తుతప్రశంస, సహోక్తి, అనన్వయము మొదలగు నలంకారముల లక్షణములను చెప్పు శ్లోకము లుద్భటభామహగ్రంథములలో నత్యల్పభేదముతో నొక్కరీతిగా నున్నవి. ఎట్లనఁగా:—

(1) నిమిత్తతో యత్తువచో లోకాతిక్రాంతగోచరం। మన్యన్తే౽తిశయోక్తిం తామలంకారతయా బుధాః॥ (ఉద్భటుఁడు.)

(2) నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాన్తగోచరం। మన్యన్తే౽తిశయోక్తిం తామలంకారతయా యథా॥ (భామహుఁడు.)

(3) ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా। ఆక్షేప ఇతి తం సంతః శంసంతి కవయస్సదా॥ (ఉద్భటుఁడు.)

(4) ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా। ఆక్షేప ఇతి తం సంతశ్శంసంతి ద్వివిధం యథా॥ (భామహుఁడు.)

(5) అపహ్నుతిరభీష్టాచ కించిదంతర్గతోపమా। భూతార్థాపహ్నుతేనాస్యా నిబంధః క్రియతే బుధైః॥ (ఉద్భటుఁడు.)

(6) అపహ్నుతిరభీష్టాచ కించిదంతర్గతోపమా। భూతార్థాపహ్నువాదస్యాః క్రియతే చాభిధా యథా॥ (భామహుఁడు.)

ఉద్భటుఁడు భామహాలంకారమునకు భామహవివరణమను నొకవ్యాఖ్యానమును వ్రాసెనని ఉద్భటాలంకారవ్యాఖ్యాతయగు ప్రతీహారేందురాజు వ్రాసియున్నాఁడు. "ఏకదేశవృత్తీత్యత్రహి ఏకదాఽన్యథా ఈశః ప్రభవిష్ణుర్న్యో వా కావ్యార్థస్తద్వ్యుత్పత్త్యర్థం రూపకస్యాభిమతమ్। విశేషోక్తిలక్షణే చ భామహవివరణే భట్టోద్భటేన ఏకదేశశబ్ద ఏవం వ్యాఖ్యాతో యథేహాస్మాభిర్నిరూపితః। తత్ర విశేషోక్తిలక్షణం। ఏకదేశస్య విగమే యా గుణాంతరసంస్తుతిః। విశేషప్రథనాయాఽసౌ విశేషోక్తిర్మతా యథా॥ (భామహుఁడు 3-22.) ఈ భామహవివరణము మిక్కిలి విపులమైనగ్రంథముగాఁ గానవచ్చుచున్నది. ఇతఁడు వ్రాసిన అలంకారసంగ్రహము దీని సంగ్రహమే. ఇటీవల గ్రంథకర్తలు కొందఱు భామహవివరణమును తఱుచుగా దమ గ్రంథములయందుఁ జేర్చి యున్నారు. "భామహోక్తమ్। శబ్దశ్ఛందోఽభిధానార్థ ఇత్యభిధానస్య శబ్దాద్భేదం వ్యాఖ్యాతుం భట్టోద్భటో బభాషే। శబ్దానామభిధా వ్యాపారో ముఖ్యో గుణవృత్తిశ్చేతి. (లోచనము పేరా 40.( యత్తు వివరణకృత్, దీపకస్యానన్వయోపమాన్వయోఽస్తీతి బహునోదాహరణ ప్రపంచేన విచారితవాన్, తదనుపయోగినిరర్థకం సప్రతిక్షేపం చ। ధ్వనిలోచనకర్త నిమిత్తమగు విశేషోక్తి కుదాహరణముగాఁ జెప్పఁబడిన "ఆహూతోఽపి సహాయైరేమీత్యుక్త్వా విముక్తనిద్రోఽపి। గంతుమనా అపి పథికస్సంకోచం నైవ శిథిలయతి॥" ఈశ్లోకము విషయమై లోచనమిట్లు వ్రాయుచున్నది. "శీతకృతాఖ్యాతిరత్రనిమిత్తమితి భట్టోద్భటః" ఆచార్య హేమచంద్రుఁడుకూడ నుద్భటుని వాక్యములను తన కావ్యానుశాసనమందుదాహరించెను. "రసవద్దర్శితస్పష్టశృంగారాది రసోదయమ్। ఇత్యేతద్వ్యాఖ్యానావసరే యద్భట్టోద్భటేన॥" "పంచ

రూపారసా ఇత్యుపక్రమ్య స్వశబ్దాశ్శృంగారాదేర్వాచకాః శృంగారాదయశ్శబ్దా ఇత్యుక్తం॥" ఉద్భటునిగురించి సముద్రబంధుఁడిట్లు చెప్పుచున్నాడు. "ఉద్భటేన చకావ్యాలంకార వివృతౌ — సత్కవిత్వవిఃహితాయావిదగ్ధతాయా అస్థైర్యస్యా శోభనస్యచ ప్రతిపాదనాయ నిదర్శనద్వయమితి వదతా శ్రీరిత్యస్య శ్రీసస్థిరేత్య స్థాభిప్రేతః॥".

అలంకారశాస్త్రమందుద్భటునికి ప్రబలమైన సామర్థ్యముకలదు. ఇతఁడు భామహునికీర్తినిఁ గబళించినవాఁడు. ఉద్భటుని అభిప్రాయములతో నేకీభవింపని వారైనను తరువాత గ్రంథకర్తలాతనిగ్రంథమును ప్రమాణముగా నెన్నుకొనిరి. ఇతఁడాలంకారిక మతమునకు మొదటివాఁడు. అనేకాలంకారశాస్త్ర సిద్ధాంతములతో నీతని పేరు సంబంధించియున్నది. అనేక ముఖ్యాంశములయందు భామహునికంటె భిన్నాభిప్రాయముగలవాఁడై యున్నాఁడు. ఎట్లనఁగా; "భామహోహి గ్రామ్యోప నాగరికావృత్తిభేదేన ద్విప్రకారమేవానుప్రాసం వ్యాఖ్యాతవాన్। తథా రూపకస్యయేచత్వారో భేదావత్యుం తే తిన్మ ఖ్యాదాద్యమేవ భేదద్వితయం ప్రాదర్శయత్। తత్సహోక్త్యుపమా హేతునిర్దేశాత్త్రివిధంయథా। ఇతశ్లిష్టస్య త్రైవిధ్యమాహ॥" అని ప్రతీహారేందురాజు వ్రాసియున్నాడు. "భామహేనహిగుడుదేవవృపతి పుత్రవిషయప్రీతివర్ణనం ప్రేయోలంకార ఇత్యుక్తమ్ — ఉద్భటమతేహి భావాలంకార ఏవ ప్రేయ ఇత్యుక్తః॥" అని లోచనకారుఁడు చెప్పుచున్నాఁడు. భామహుఁడు పరుష గ్రామ్యోపనాగరికవృత్తులను నిరూపించలేదు — ఉద్భటుఁడు వానిని నిరూపించెను. "శిత్రిభవద్భిరుద్భటాదభిః" అనిత్రలు కారసర్వస్వకారుఁడు "ఇహతావద్భామహోద్భట ప్రభృతయశ్చిరంతనాలంకారకారాః" అనివ్యక్తివివేకటీకాకారుఁడు, నుద్భటుని సగౌరవముగాఁ జేర్కొనియున్నారు. ఉద్భటునిసిద్ధాంతములు కొన్నివిచిత్రముగాఁ గాన వచ్చుచున్నవి ఎట్లన; (1) అర్థభేదేనతావచ్ఛబ్దాభిద్యం తే "ఇతభట్టోద్భటస్యసిద్ధాంతః" అని ప్రతీహారేందురాజు చెప్పుచున్నాఁడు. (2) శబ్దశ్లేషయనియు నర్థశ్లేషయనియు శ్లేష రెండువిధములు. ఈరెండు నర్థాలంకారములే. ఈయంశమును మమ్మటభట్టు కావ్యప్రకాశికలోతొమ్మిదవ యుల్లాసమందు ఖండించెను. "శబ్దశ్లేష ఇతిచోచ్యతే అర్థాలంకార మధ్యేచలక్ష్యతే ఇతికో౽యంనయః" (3) తక్కిన అలంకారములకంటె శ్లేష బలీయమైనదని యాతనియభిప్రాయము. దీనితో నితరాలంకారములు కలిసియున్నపుడు శ్లేషమే ప్రధానాలంకారము. (4) తక్కినఅలంకారములు దీనిచేఁ దిరోహితము

లై యుండును. "అలంకారాంతరగతాం ప్రతిభాంజనయత్పదైః" అని చెప్పియున్నాఁడు. (5) మమ్మటుఁడు దీనినిగూడ నిరసించెను. "తస్యచత్రిధాభిధావ్యాపార ఇతిభౌద్భటాః" అని రాజశేఖరుని కావ్యమీమాంసలో నున్నది. "కింతుద్వైరూప ఏవా సావిచారిత సుస్థోఽవిచారితరమణీయః, తయోఃపూర్వమాశ్రితాని శాస్త్రాణి తదుత్తరం కావ్యానీత్యౌద్భటాః॥" అని రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో వ్రాసి యున్నాఁడు. వ్యక్తి వివేకటీకాకారుఁడుకూడ నీయంశమును నిట్లు తెలిపి యున్నాఁడు. "శాస్త్రేతిహాసవైలక్షణ్యంతు కావ్యస్యశబ్దార్థవైశిష్ట్య దేవనాభిధావైశిష్ట్యాదితి భట్టోద్భటాదీనాం సిద్ధాన్తః" (6) "సంఘటనాయాధర్మగుణా ఇతి భట్టోద్భటాదయః" అని లోచనము చెప్పుచున్నది.

కొందరలంకారికులు "రసాద్యధిష్ఠితంకావ్యం జీవద్రూపతయాయతః, కథ్యతే తద్రసాదీనాం కావ్యాత్మత్వంవ్యవస్థితం॥" అను శ్లోకముద్భటునిదనియు. కావ్యమునకు రసమే యాత్మయనియు, నాతని సిద్ధాంతమని వాదించుచున్నారు. కాని మరి కొందరు దీని నొప్పుకొనలేదు. ఈశ్లోకమును ప్రతీహారేందురాజు ఉద్భటాలంకార వ్యాఖ్యానమందుదాహరించెను. కావున నిది ప్రతీహారేందురాజుకంటె ప్రాచీనుఁడైన గ్రంథకర్త యెవ్వఁడో వ్రాసిన శ్లోకమై యుండవచ్చును. ఇంతియుకాక ఇది యుద్భటుఁడు వ్రాయుచున్న క్రమమునకు భంగము సాపాదించుచున్నది. ఈశ్లోకము కావ్యలింగనిరూపణ ప్రకరణమందు వ్రాయఁబడినది. అలంకారలక్షణమునుఁ జెప్పిన తరువాత వెంటనే దాని ఉదాహరణముండుట యుచితము. ఉదాహరణశ్లోకమిది. "ఛాయేయంతవశేషాంగకాంతేః కించిదనుజ్వలా, విభూషఘటనాదేశాన్ దర్శయంతీ దునోతిమాం॥" పూర్వోక్తపండితుల అభిప్రాయము ననుసరించినయెడల "రసాద్యధిష్ఠితంకావ్యం" అను శ్లోకము కావ్యలింగలక్షణమునకు దాని యుదాహరణమునకు మధ్యనుంచినయెడల క్రమభంగమేకాక ఔచిత్యహీనముగానుండును. ఇంతియే కాక కావ్యమునకు రసమే యాత్మయను ఉద్భటుని అభిప్రాయముతోను అతఁడు నిరూపించిన రసవదలంకార లక్షణముతోను విరోధించుచున్నది. ఇవి అలంకార సర్వస్వకారుని అభిప్రాయముతోఁగూడ విరోధించును. ఎట్లనఁగా "ఉద్భటాదిభిస్తు గుణాలంకారాణాం ప్రాయశఃసామ్యమేవసూచితం, తదేవమలంకారాఏవ కావ్యే ప్రధానమితి ప్రాచ్యానాంమతం॥"

ఉద్భటుఁడు కుమారసంభవమను నొక కావ్యమును రచించెను. తన అలంకార

శాస్త్రమందు దానిలోని శ్లోకములనే ఉదాహరణముగా నిచ్చెను. ఇది కాళిదాసు రచించిన కుమారసంభవమునకు సరిగానున్నది. అట్టి సాదృశ్యమును జూపుటకు కొన్ని శ్లోకముల నీ దిగువ వ్రాయుచున్నాను. ఉద్భటకుమారసంభవము— "ప్రచ్ఛన్నాశస్య లేవృత్తిః స్త్రీణాంభావపరీక్షణే, ప్రతస్థేధూర్జటిర తస్తనుంస్వీకృత్యవాటవం||" కాళీ||కుమార|| "అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్జ్వలన్నివబ్రహ్మమయేన తేజసా, వివేశకశ్చిజ్జటిలస్తపోవనం శరీరబద్ధః ప్రథమాశ్రమోయథా||" (V-30) "అపశ్య చ్చాతికష్టాని తప్యమానాంతపాంస్యుమాం, అసంభావ్యపతీచ్ఛానాం కన్యానాంకాప రాగతిః||" (ఉద్భట. కుమార. II-12) "ఇయేషసాకర్తుమవంధ్య రూపతాం సమాధిమాస్థాయతపోభిరాత్మనః, అవాప్స్యతేవాకథమన్యథా ద్వయంతథావిధం ప్రేమపతిశ్చతాదృశః||" (కాళీ. కుమార. V-2.)

"శీర్ణపర్ణాంబువాతాశ కష్టేపిలపసిస్థితం" (ఉద్భట. కుమార. II-17.) "స్వయం విశీర్ణద్రుమపర్ణవృత్తితా" (కాళీ. కుమార. V-28.)

ఉద్భటునికాలము నిశ్చయించుటలో నేమియు శ్రమలేదు. 779-813 సం|| లలో కాశ్మీరదేశము నేలిన జయాపీడునికి సభాపతిగానుండెనని "విద్వాన్ దీనారలక్షేన ప్రత్యహంకృతవేతనః, భట్టోభూదుద్భటస్తస్య భూమిభర్తుస్సభాపతిః||" అను రాజతరంగిణీ వచనమునుబట్టి స్పష్టమగుచున్నది. కాబట్టి యితడు క్రీ. శ. 800 సం||లో నుండెను. తరుచుగా ననేక స్థలములయందీ యుద్భటునిం జేర్కొను ధ్వన్యాలోకముచే నిది బలపరుపఁబడుచున్నది. నవమశతకముయొక్క పశ్చిమార్థమందు వ్రాయఁబడినది.

ప్రతీహారేందురాజు వ్రాసిన వ్యాఖ్యానము మిగులఁ బ్రాచీనమైనది. ఇతఁడు ముకులుఁడనువాని శిష్యుఁడనని ఈదిగువ శ్లోకములో జెప్పుచున్నాఁడు.

"విద్వదగ్ర్యాన్ముకులకా దధిగమ్యవివిచ్యతే, ప్రతీహారేందురాజేన కావ్యాలంకారసంగ్రహః||" ఇతఁడు తానువ్రాసిన వ్యాఖ్యానముయొక్క కొసనున్న శ్లోకముచే దన గురువైన ముకులునిట్లు కొనియాడెను. "మీమాంసాసారమేఘాత్పదజలధివిధోస్తర్కమాణిక్య కోశాత్సాహిత్యశ్రీమురారేర్బుధ కుసుమమధోశ్శౌరి పాదాబ్జభృంగాత్, శ్రుత్వాసౌజన్యసింధోర్ద్విజ వరముకులాత్కీర్తి వల్ల్యాల వాలాత్కావ్యాలంకారసారే లఘువివృతిమధాత్ కౌంకణశ్శ్రీందురాజః||" అమరుకశవ

ఉద్భటుఁడు, కాత్యాయనుఁడు, వార్తికకారుఁడు (పతంజలి) దండి భామహుఁడు, వామనుఁడు మొదలగు గ్రంథకర్తలను, భరతుని నాట్యశాస్త్రమును, రుద్రటుని కావ్యాలంకారమును యిందు రాజు తనవ్యాఖ్యానమందు చేర్కొనెను. ముకులుఁడు 925 సం॥ములలో నుండెను. గావున నతని శిష్యుఁడగు నీప్రతీహారేందురాజు 950 సంవత్సరప్రాంతమున నుండవచ్చును. అభినవగుప్తుని గురువైన యిందురాజు ఉద్భటుని కావ్యాలంకారమునకు వ్యాఖ్యానమువ్రాసిన యీ యిందురాజు నొక్కఁడేనా లేక భిన్నులాయను సంశయము తరువాతఁ జర్చింపఁబడును. రాజానకతిలకుఁడు ఉద్భట విచారమనునొక గ్రంథమును వ్రాసినట్లును, అలంకారసర్వస్వకారుఁడు ఆ తిలకుని అభిప్రాయముల ననుసరించినట్లును, జయరథుఁడు వ్రాసిన విమర్శినివలనఁ దెలియ వచ్చుచున్నది.

## వామనుని కావ్యాలంకార సూత్రము.

ఇది సూత్రము, వృత్తి, ఉదాహరణమునని మూఁడు భాగములుగా విభజింపఁబడియున్నది. సూత్రములే కాక సూత్రవృత్తికూడ వామనునిదే. "ప్రణమ్య పరమంజ్యోతిర్వామనేన కవిప్రియా। కావ్యాలంకారసూత్రాణాం స్వేషాం వృత్తిర్విధీయతే॥" అని వామనుఁడే చెప్పియున్నాఁడు. ప్రాచీనుఁడైన ప్రతిహారేందు రాజుయొక్క వచన ప్రామాణ్యముచేగూడ నీయంశమే దృఢపర్చఁబడుచున్నది. లోచనకారుఁడు కూడ స్వగ్రంథమందీవామనుని అలంకారలక్షణములను పలుచోట్ల నుదాహరించెను. వృత్తిలో నుదాహరింపఁబడిన శ్లోకములు ప్రాచీనప్రబంధముల నుండి తీయఁబడినవని వామనుఁడే చెప్పియున్నాఁడు. "ఏభిర్నిదర్శనైస్స్వీయై పరకీయైశ్చపుష్కలైః। శబ్దవైచిత్ర్యగర్భేయ ముపమైవప్రపంచితా॥" ఈగ్రంథమైదు అధికరణములుగా విభజింపఁబడియున్నది. ప్రత్యధికరణమునకు రెండో మూఁడో అధ్యాయములుండును. మొత్తముపైని 12 అధ్యాయములు కలవు. ప్రథమ చతుర్థాధికరణములయందు మూఁడేసి అధ్యాయములున్నవి. తక్కిన అధికరణముల యందు రెండేసి అధ్యాయములుకలవు. సూత్రసంఖ్య 319. మొదటి అధికరణమునకు శారీరాధికరణమనిపేరు. ఇందులో కావ్యప్రయోజనములు, అధికారిలక్షణము, కావ్యమునకు రీతి ఆత్మయనియు, వైదర్భీగౌడీ పాంచాలీరీతుల లక్షణము, కావ్య విభాగము మొదలైనవి ప్రతిపాదింపఁబడినవి. దోషదర్శనమను పేరుగల ద్వితీయాధికరణమందు పదదోషములు, వాక్యదోషములు, వాక్యార్థదోషములు వర్ణింపఁ

బడినవి. గుణవివేచనమను తృతీయాధికరణమందు గుణాలంకారవివేచనము, ఓజః ప్రసాదాదిగుణములు, అర్థగుణములు నిరూపింపఁబడినవి. ఆలంకారికమను చతుర్థాధికరణమందు యమకానుప్రాసాదిశబ్దాలంకారములు, ఉపమానిరూపణము, ఉపమాదోషములు చెప్పఁబడినవి. ప్రాయోగికమను పంచమాధికరణమందు కొన్ని కవి సమయములు, సంధి, వ్యాకరణవిషయములు మొదలగునవి ప్రతిపాదింపఁబడినవి. శబ్దశుద్ధియను పంచమాధ్యాయము భామహాలంకారముయొక్క ఆరవ పరిచ్ఛేదమునకు సరిగానున్నది. యమకము, అనుప్రాసము, ఉపమ కాక దీనియందు ప్రతివస్తూపమ సమాసోక్తి, అప్రస్తుతప్రశంస, అపహ్నుతి, రూపకము, శ్లేష, వక్రోక్తి, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, సందేహము, విరోధము, విభావన, అనన్వయము, ఉపమేయోపమ, పరివృత్తిక్రమము, దీపకము, నిదర్శన, అర్థాన్తరన్యాస, వ్యతిరేకము, విశేషోక్తి, వ్యాజస్తుతి, వ్యాజోక్తి, తుల్యయోగిత, ఆక్షేపము, సహోక్తి, సమాహితము, సంసృష్టి, ఉపమారూపకము, ఉత్ప్రేక్షావయవము నిరూపింపఁబడినవి. వామనుఁడు పర్యాయోక్తి, ప్రేయోలంకారము, ఊర్జస్వి, ఉదాత్తము, భావికము, సూక్ష్మము నను అలంకారములను విడిచిపెట్టెను.

వామనుఁడు తన గ్రంథమందు పేర్కొనిన గ్రంథములు గ్రంథకర్తలు;— కవిరాజు, కామందకీయ నీతిశాస్త్రము, కామశాస్త్రము. ఛందోవిచితి, నామమాల, కలాశాస్త్రమును వ్రాసిన విశాఖిలుఁడు, శూద్రకుఁడు, హరిప్రబోధము, అమరుశతకము ఉత్తరరామచరిత్రము, కాదంబరి, కిరాతార్జునీయము, కుమారసంభవము, మాలతీమాధవము, మృచ్ఛకటిక, మేఘదూత, రఘువంశము, విక్రమోర్వశి, వేణీసంహారము, శాకుంతలము, శిశుపాలవధ, హర్షచరితము మొదలగు గ్రంథములనుండి శ్లోకములుదాహరింపఁబడినవి. "శరచ్ఛశాంకగౌరేణ వాతావిద్ధేన భామిని। కాశపుష్పలవేనేదం సాశ్రుపాతం ముఖం కృతమ్॥" అను స్వప్నవాసదత్తశ్లోకమును వామనుఁడు వ్యాజోక్తి కుదాహరణముగా నిచ్చెను. "పదార్థే వాక్యవచనం వాక్యార్థే చ పదాభిధా। ప్రౌఢిర్వ్యాససమాసౌ చ సాభిప్రాయత్వమస్య చ॥" (3-2-2.) ఈ కారికలోఁ జెప్పఁబడిన సాభిప్రాయత్వమున కుదాహరింపఁబడిన "సోఽయం సంప్రతి చంద్రగుప్తతనయశ్చంద్రప్రకాశో యువా జాతో భూపతి రాశ్రయః కృతధియాం దిష్ట్యా కృతార్థశ్రమః॥" అను శ్లోకమందున్న చంద్రగుప్త తనయుఁడైన రాజెవ్వఁడో అని వాదులు మీమాంస సేయుచున్నారు. ఇతరాలంకారికుల మతమును వామనుఁడు తరుచుగా తన గ్రంథమందు తెలియఁజేయుచుండెను. ఎట్లనఁగా "ఉత్ప్రేక్షైవాతిశయోక్తిరితి కేచిత్"

(IV-3-10.) "అర్థాంతరన్యాసస్య హేతురూపత్వాద్ధేతోశ్చాస్వయ వ్యతిరేకాత్మకత్వాన్నతతఃపృథగ్వ్యతిరేకఇతికేచిత్" (IV-3-21.) "ఉపమానాధిక్యాత్తదపోహ ఇత్యేకే" (IV-2-18.) "అనయోర్దోషయోర్విపర్యయాఖ్యస్య దోషస్యాంతర్భావాన్నపృథగుపాదానమ్। అతఏవాస్మాకంమతేషడ్దోషా ఇతి॥" (IV-2-11.) వామనుఁడు తఱచుగా "శ్లోకాశ్చాత్రభవంతి" అని అచ్చటచ్చటఁ గొన్నిశ్లోకముల నుదాహరించియున్నాఁడు. ఇవి పైవారివని ఊహింపవచ్చును.

కావ్యమునకు రీతియే ఆత్మయని వామనుని సిద్ధాంతము. ఇతని సిద్ధాంతములు మఱికొన్నికలవు.

I. గుణములకు అలంకారములకుఁగల భేదము. (కావ్యశోభాయాః కర్తారో ధర్మగుణాః। తదతిశయహేతవస్త్వలంకారాః.) (III-2-12.) ఈ యంశము కావ్యప్రకాశకారునిచే ఖండింపఁబడెను.

II. వైదర్భి, గౌడీ, పాంచాలీ రీతులను జెప్పెను.

III. వక్రోక్తి నర్థాలంకారములయం దంతర్భవింపఁజేసి "సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః" అని లక్షణముజెప్పి యీ దిగువశ్లోకము నుదాహరించెను. "ఉన్మిమీల కమలంసరసీనాం కైరవంచనిమిమీలముహూర్తాత్" "అత్రనేత్రధర్మావున్మీలననిమీలనే। సాదృశ్యాద్వికాస సంకోచాలక్షయతః॥" (IV-3-8.)

IV. "ఏకగుణహానికల్పనాయాం సామ్యదార్ఢ్యంవిశేషోక్తిః" అని విశేషోక్తిలక్షణము. (IV-3-123.) దీనిని జగన్నాథపండితుఁడు మొదలగువారు రూపకమనిరి.

V. ఆక్షేపమునకు రెండర్థములు. (ఉపమానస్యఆక్షేపః। ప్రతిషేధః। తుల్యకార్యార్థస్య నైరర్థక్యవివక్షాయామాక్షేపః ఉపమానస్యాక్షేపతః ప్రతిపత్తిరిత్యపినూత్రార్థః) ఈ రెండర్థములు క్రమముగా మమ్మటుఁడు చెప్పిన ప్రతీపసమాసోక్తులను పోలియున్నది.

అలంకారసూత్రవ్యాఖ్యాతయగు సహదేవుఁడు వామనుని గ్రంథమొకకాలమందంతరింపఁగా భట్టముకులుఁడనువాఁడొక ప్రతిని సంపాదించి దానినిమరల నుద్ధరించెనని వ్రాసియున్నాఁడు. "వేదితాసర్వశాస్త్రాణాం భట్టోభూన్ముకులాభిధః।

శబ్దాశతశ్చేదాదర్శం భిష్టామ్నాయంసముద్ధృతమ్। కావ్యాలంకారశాస్త్రంయత్తే నేతద్వామనోదితమ్। అసూయాతస్సకర్తవ్యా విశేషాలోకిభిః క్వచిత్। (రాజశేఖరుని కావ్యమీమాంస) అరోచకినస్సతృణాభ్యవహారిణశ్చకవయః॥" కవులు అరోచకులు సతృణాభ్యవహారులు అని రెండుతెగలవారని వామనుఁడు చెప్పినదానిని "తేచద్విధా అరోచకినః సతృణాభ్యవహారిణశ్చేతిమంగళః । కవయోపిభవంతీతివామనీయాః॥" అని రాజశేఖరుఁడును చెప్పుచున్నాఁడు. మంగళుని పరిభాషనే వామనుఁడుకూడ నవలంబించెనని రాజశేఖరుఁడు చెప్పుచున్నాఁడు.

రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసలో వామనునిమతమును జెప్పియున్నాఁడు ఇతఁడు దశమశతక పూర్వార్ధమందున్నవాఁడు. ప్రతీహారేందురాజు, లోచనకారుఁడుగూడ నీవామనుని మతమును తమగ్రంథములయందుఁ జేర్చుకొనిరి. కావున వామనుఁడు తొమ్మిదవశతాబ్దమునకు ముందువాఁడని యూహింపవచ్చును. "అనురాగవతీసంధ్యా దివసస్తత్పురస్సరః। అహోదైవగతిః కీదృక్తథాపినసమాగమః॥" అను శ్లోకమునుగూర్చి లోచనకారుఁడు "వామనాభిప్రాయేణాయమాక్షేపః, భామహాభిప్రాయేణతుసమాసోక్తి రిత్యముమాశయం హృదయేకృత్వా సమాసోక్త్యాక్షేపయోరిదమేకమేవోదాహరణంవ్యతరద్గ్రంథకృత్" అని వ్రాసియున్నాఁడు. కావున లోచనకారుని వచనమునుబట్టి విచారింపఁగా వామనుఁడు నవమశతకచరమార్ధమందు వ్రాయఁబడిన ధ్వనికంటె ముందువాఁడనియుఁ గ్రీస్తుశతకము 850 లో నుండెననియుఁ దలఁపవచ్చును. "అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వమేతద్యథోదితం। అశక్నువద్భిర్వ్యాకర్తుం రీతయస్సంప్రవర్తితాః॥" (III-53) అను ధ్వనికారికవామనుని యుద్దేశించి చెప్పియుండవచ్చును. వామనుఁడు "ఇయంగేహేలక్ష్మీః" (౪-౩-౬) అను భవభూతిశ్లోకమును రూపకాలంకారమునకు "పక్ష్మలీపింగలీమ్నః" అను దానిని గుణవచనముతో షష్ఠీసమాసమునకు నుదాహరించియుండుటచే సప్తమశతకమందున్న భవభూతికిఁ దరువాతవాఁడని తోఁచుచున్నది. "మనోరథశ్శంఖదత్తశ్చటకస్సంధిమాంస్తథా। బభూవుఃకవయస్తస్య వామనాద్యాశ్చమంత్రిణః॥" (IV-497) అను రాజతరంగిణీశ్లోకమునుబట్టి జయాపీడనరపాలుని ఆస్థానమందు మంత్రియొక వామనుఁడున్నట్లు స్పష్టమగుచున్నది. బుహిలర్ (Buhler) పండితుఁడు జయాపీడుని మంత్రియగు వామనుఁడే కావ్యాలంకారసూత్రమును వ్రాసినవాఁడని సమర్థించియున్నాఁడు. ఇతని మాటను మనము విశ్వసించినయెడల వామనుఁడు అష్టమశతకమువాఁడై యుండవలెను. అట్లైనచో వామనుఁడు ఉద్భటునికి సమ

కాలికుఁడై యుండవలెను. ఉద్భటవామనులు తమ తమ గ్రంథములయందొకరిని మఱియొకరు పేర్కొనలేదు. కావున బుహిలర్ పండితుఁడు చెప్పినది సరిగానుండలేదు. మఱియొకరీతిగా వామనుని కాలమును నిర్ణయింపవచ్చును. వామనుఁడు మాఘుని శిశుపాలవధనుండి "ఉభౌయదివ్యోమ్ని పృథక్ప్రవాహా మాకాశగంగాపయసః ప్రవాహః," "సితంసితిమ్నా" అను రెండుశ్లోకములను తనగ్రంథమందుదాహరించెను. మాఘుఁడు "అనుత్సూత్రపదన్యాసా సద్వృత్తిస్సన్నిబంధనా" అను శ్లోకములో న్యాసమును, వృత్తిని, మహాభాష్యమును వర్ణించుచున్నాఁడు. ఇచట మాఘునిచేఁ జెప్పఁబడిన న్యాసము కాశికావృత్తియొక్క వ్యాఖ్యానము. ఇతర ప్రమాణములవలన నీ కాశిక క్రీ. శ. 660 సంవత్సరములో వ్రాయఁబడినదని తెలియవచ్చుచున్నది. కావున న్యాసము సప్తమశతకముకంటెఁ బ్రాచీనమైయుండదు. మాఘుని కాలమేమైయున్నను కాశికావృత్తిని వ్రాసిన వామనుఁడు కావ్యాలంకారసూత్రమును వ్రాసిన వామనుఁడు నొక్కఁడైయుండరు. ఏలయనఁగా — కొన్ని వ్యాకరణాంశములయందు వామనుఁడు కాశికావృత్త్యభిప్రాయమునకు విరుద్ధముగాఁ జెప్పెను.

ఈ కావ్యాలంకారసూత్రమునకు గోపేంద్రతిప్పభూపాలుఁడు కామధేనువను నొక వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతఁడు పదునైదవ శతాబ్దమునాఁడు. ఈ వ్యాఖ్యానమందు మమ్మటుఁడు, విద్యాధరుఁడు, విద్యానాథుఁడు మొదలగు యలంకారశాస్త్రప్రణేతలు పేర్కొనఁబడిరి. దీనికి సహదేవుఁడు మఱియొక వ్యాఖ్యానమును వ్రాసెను.

భట్టి, భామహుఁడు, దండి, ఉద్భటుఁడు నిరూపించిన అలంకారముల వివరము. (1) అతిశయోక్తి, (2) అనుప్రాస, (3) అపహ్నుతి, (4) అర్థాంతరన్యాసము, (5) ఆక్షేపము, (6) ఉత్ప్రేక్ష, (7) ఉదాత్తము, (8) ఉపమ, (9) తుల్యయోగిత, (10) దీపకము, (11) నిదర్శన, (12) పరివృత్తి. (13) ప్రతివస్తూపమ, (14) రూపకము, (15) విభావన, (16) విరోధము, (17) వ్యతిరేకము, (18) వ్యాజస్తుతి, (19) శ్లేష, (20) సంసృష్టి, (21), సమాసోక్తి, (22) సమాహితము. ఈ యిరువది రెండలంకారములను పైఁజెప్పఁబడిన నలుగురు గ్రంథకర్తలు నిరూపించియున్నారు. కొందరు కొన్ని యలంకారములను నిరూపించలేదు. అయ్యంశమీదిగువ వివరింపఁబడుచున్నది.

హేత్వలంకారమును భట్టి, దండి ప్రతిపాదించిరి. భామహుఁడు దానికలంకారత్వమే లేదనెను. ఉద్భటుఁడు దానిని కావ్యలింగములో నంతర్భూతమని చెప్పెను. స్వభావోక్తిని దండి, ఉద్భటుఁడు, వామనుఁడు నిరూపించిరిగాని దానికి దండిజాతియని నామాంతరమునుఁ గల్పించెను. భట్టివార్తలో నంతర్భవింపజేసెను. దండి యొక్కఁడే సూక్ష్మాలంకారమునుఁ జెప్పెను. భామహుఁడది అలంకారమే కాదనెను. ససందేహమును దండి సంశయోపమయని పలికెను. దండిచెప్పిన సమాహితము ఉద్భటుని సమాహితముకంటె భిన్నమైయున్నది. అది అర్వాచీనాలంకారికులసమాధి. ఈనలుగురిలో నుద్భటుఁడొక్కఁడే సంకరమును నిరూపించెను. వామనుని వ్యాజోక్తిని యితరులు మాయోక్తియనిపలికిరి. వామనుని విశేషోక్తి యితరులు చెప్పిన రూపకముతోఁ దుల్యముగానున్నది. వామనుఁడొక్కఁడే వక్రోక్తియలంకారమును చెప్పెను. లేశాలంకారమును దండియే చెప్పెను. ఇది మమ్మటుని వ్యాజోక్తి. యథాసంఖ్యమనఁదు వామనుఁడు క్రమమనియు, దండి సంఖ్యానమనియుఁ బేరిడిరి. వామనుఁడు ప్రేయోలంకారమును విడిచిపెట్టెను. భట్టి ప్రతివస్తూపమాలంకారమును బ్రతిపాదింపలేదు. దానిని దండిభామహులుపమావిశేషమనిరి. వామనుఁడు పర్యాయోక్తినిఁ జెప్పలేదు. పరివృత్తికి దండిభామహులు అర్థాంతరన్యాసవతియని పేరుపెట్టిరి. నిపుణాలంకారమును భట్టియొక్కఁడే చెప్పెను. దృష్టాంతమును, కావ్యలింగమును ఛేకానుప్రాసము నుద్భటుఁడొక్కఁడే ప్రతిపాదించెను. ఊర్జస్విని వామనుఁడు నిరూపింపలేదు. ఉపమేయోపమను దండి అన్యోన్యోపమయని పేరుపెట్టెను. ఉపమారూపకమును దండి రూపకాంతర్భూతమని వ్రాసెను. ఉత్ప్రేక్షావయవమును దండి ఉత్ప్రేక్షలోఁ జేర్చెను. ఉదాత్తమును భట్టి ఉదారమనెను. అనన్వయమును దండి అసాధారణోపమయని వ్యవహరించెను.

## రుద్రటుని కావ్యాలంకారము.

రుద్రటుని కావ్యాలంకారము నమిసాధువు వ్రాసిన వ్యాఖ్యానముతో కావ్యమాలయందు ముద్రితమైనది. ఈగ్రంథమలంకారశాస్త్రమును విపులముగాఁ బ్రతిపాదించుచున్నది. ఇది షోడశాధ్యాయములుగా విభజింపఁబడినది. ఒకటి రెండు అధ్యాయాంతశ్లోకములుతప్ప తక్కిన శ్లోకములన్నియు నార్యావృత్తములు. ఇందలి ఉదాహరణశ్లోకములన్నియు రుద్రటుఁడు రచించిన శ్లోకములే. ఇందలి శ్లోకసంఖ్య యేడువందల ముప్పదినాలుగు. ద్వాదశాధ్యాయమందు పదునాలుగు శ్లోకములచే

సప్తవిధశృంగార నాయికాలక్షణము ప్రతిపాదింపఁబడియున్నదిగాని యీశ్లోకములు ప్రక్షిప్తములని కొందరభిప్రాయపడుచున్నారు. ఈగ్రంథముయొక్క షోడశాధ్యాయములయందుఁ బ్రతిపాదింపఁబడిన విషయములీదిగువ వ్రాయఁబడుచున్నవి. వానిలో మొదటి అధ్యాయమందు కావ్యప్రయోజనములు, కవులకపేక్షితములైన ముఖ్యాంశములు, వాని నిర్వచనములు ప్రతిపాదింపఁబడినవి. రెండవ అధ్యాయమందు వక్రోక్తి, అనుప్రాసము, యమకము, శ్లేష, చిత్రమునను శబ్దాలంకారములు వైదర్భి, పాంచాలి, లాటీగౌడీరీతులు, ప్రాకృతసంస్కృతమాగధపైశాచీశూరసేన్యపభ్రంశాదిభాషలు, యీభాషలలో వ్రాయఁబడిన కావ్యములు, వక్రోక్త్యనుప్రాసముల లక్షణము, విభాగము, వానియుదాహరణములు. మధుర, లలిత, ప్రౌఢ, పరుష, భద్ర మొదలగు ననుప్రాసముయొక్క పంచవృత్తులు వ్యాఖ్యానింపఁబడినవి. మూఁడవ అధ్యాయమందు యేఁబదిరెనిమిది శ్లోకములచే యమకము నిరూపింపఁబడినది. నాలుగవ అధ్యాయమందు శ్లేష, వర్ణపదలింగభాషాప్రకృతి ప్రత్యయవిభక్తివచనాద్యష్టభేదములు చెప్పఁబడినవి. అయిదవ అధ్యాయమందు చక్రబంధము, మురజబంధము, అర్ధభ్రమకముఁ సర్వతోభద్రము, మాత్రాచ్యుతకము, ప్రహేళిక మొదలగు శబ్దచిత్రములు వర్ణింపఁబడినవి. ఆరవ అధ్యాయమందు పదదోషములు వాక్యదోషములు చెప్పఁబడినవి. ఏడవ అధ్యాయమందు అర్థాలంకారములకు మూలమైన వాస్తవౌపమ్యాతిశయశ్లేషలు, వాస్తవమూలకములైన యిరువదిమూఁడలంకారముల లక్షణములు, ఎనిమిదవఅధ్యాయమందు ఔపమ్యమూలకములైన 21 అలంకారములలక్షణములు, తొమ్మిదవ అధ్యాయమందు అతిశయమూలకములైన 12 అలంకారముల లక్షణములు, పదియవ అధ్యాయమందు దశవిధశుద్ధశ్లేషలు, ద్వివిధమైన సంకరశ్లేష, పదునొకండవ అధ్యాయమందు అర్థదోషములు, చతుర్విధోపమాదోషములు, పన్నెండవ అధ్యాయమందు దశవిధరసములు, శృంగారరసలక్షణము, సంభోగవిప్రలంభశృంగారవర్ణనము, నాయకుని లక్షణము, వానినర్మసఖులు, నాయికానాయకభేదములు, త్రయోదశాధ్యాయమందు సంభోగశృంగారము, దేశకాలవిశేషములయందు నాయికల శృంగారచేష్టలు, చతుర్దశాధ్యాయమందు విప్రలంభశృంగారలక్షణము, విప్రలంభముయొక్క దశావస్థలు, సామదాన భేదప్రణత్యుపేక్షా ప్రసంగభ్రంశముల నెడు షడ్విధోపాయములు, పంచదశాధ్యాయమందు వీరరసము, తక్కినరసములు. షోడశాధ్యాయమందు కథాఖ్యాయికాది కావ్యభేదములు, వానిలక్షణములును బ్రతిపాదింపఁబడినవి.

అలంకారములను వాస్తవౌపమ్యాతిశయశ్లేషమూలకములుగా విభజించి తర

గతులుగా నేర్పాటుచేయుటకుఁ బ్రయత్నించినవారిలో రుద్రటుఁడు మొదటివాఁడు దీని ఫలితమేమనఁగా నొక యలంకారమే పూర్వోక్తములైన వాస్తవౌపమ్యాది మూలములలో రెండుమూఁడాధారములపైఁ బుట్టుచున్నది. ఇందుకుదాహరణముగా సహోక్తిసముచ్చయాలంకారములు వాస్తవౌపమ్యమూలకములై ద్వివిధములగుచున్నవి. ఆరీతిగా నుత్ప్రేక్షయు నౌపమ్యాతిశయమూలకమై ద్వివిధమగుచున్నది. ఉద్భటభామహాదులు వేర్వేరుగా నిరూపించిన అలంకారములను రుద్రటుఁడు వేరుగాఁ జెప్పలేదు. ఇందుకుదాహరణముగా భిన్నములైన ఉపమేయోపమానన్వయాలంకారములను ఉపమేయోపమ, అనన్వయోపమ అని ఉపమాభేదములుగాఁ జెప్పియున్నాఁడు. ప్రాచీననవీనాలంకారికులచే నిరూపింపఁబడిన అలంకారములకు రుద్రటుఁడు మారుపేర్లుపెట్టెను. ఎట్లనగా; భామహుఁడు మమ్మటుఁడుచెప్పిన వ్యాజస్తుతికి వ్యాజశ్లేషయని పేరిడెను. ఉద్భటమమ్మటులుచెప్పిన ద్వితీయోదాత్తాలంకారమును అవసరమనిపలికెను. దండిమమ్మటులుచెప్పిన స్వభావోక్తిని జాతియని వ్యవహరించెను. నాల్గవ అతిశయోక్తికి పూర్వమని పేరుపెట్టెను. రుద్రటుఁడు నిరూపించిన కొన్ని అలంకారములను తక్కిన గ్రంథకర్తలొప్పుకొనలేదు. "హేతుమతా సహ హేతోరభిధాన మభేదకృద్భవేద్యత్ర" (7-82) అని రుద్రటుఁడు నిరూపించిన హేత్వలంకారమును మమ్మటుఁడిది అలంకారమేకాదని నిషేధించెను. రుద్రటుఁడు "యస్యవికారః ప్రభవన్నప్రతిబద్ధేన హేతునాయేనఁగమయతితదభిప్రాయం తత్ప్రతిబంధంచభావోఽసౌ (7—38) గ్రామతరుణంతరుణ్యానవవంజులమంజరీసనాథకరమ్। పశ్యంత్యాభవతిముహుర్నితరాంమలినామఖచ్ఛాయా (7—39) అభిధేయమభిదధానంత దేవతదసదృశసకలగుణదోషమ్। అర్థాంతరమవగమయతి యద్వాక్యం సోఽపరోభావః (7—40) ఏకాకినీయదబలాతరుణీ తథాహమస్మిన్గృహే గృహపతిశ్చగతోవిదేశం। కింయాచసేతదిహవాసమియం వరాకీశ్వశ్రూర్మమాంధబధిరా ననుమూఢపాంథ॥" (7—41). అను శ్లోకములచే భావమనునొక యలంకారమును సోదాహరణముగా నిరూపించి అది రెండువిధములని చెప్పెను. వీనిలో మొదటిశ్లోకమును మమ్మటుఁడు, రెండవశ్లోకమును లోచనకారుఁడు తమ గ్రంథమందుదాహరించిరి. వాచ్యాతిశాయివ్యంగ్య మీరెండుశ్లోకములందును కలదు. "మతము" (తన్మతమితి యత్రోక్త్వా వక్త్రాన్యమతేన సిద్ధముపమేయమ్। బ్రూయాదథోపమానంతథావిశిష్టం స్వమతసిద్ధమ్.) (8—69.) ఇందుకుదాహరణము (మదిరామదబలపాటలమలికులనీలాల కాళిధమ్మిల్లమ్। తరుణీముఖమితియదిదంకథయ తిలోకస్సమస్తోయం.) (8—70.) సామ్యము. (అర్థక్రియయాయస్మిన్నుపమా నస్యేతి సామ్యముపమేయం,

తత్సామాన్యగుణాదిక కారణయాతద్భవేత్సామ్యమ్.) (8—105.) ఇందుకుదాహరణము. (అభిసరరమణం కిమిమాందిశమైంద్రీహానలం విలోకయసి। శశినః కరోతి కార్యం సకలంముఖమేవ తేముగ్ధే (8—106.) పిహితము. (యత్రాతిప్రబలతయా గుణస్సమానాధికరణమసమానం। అర్థాన్తరంపిదధ్యాదా విర్భూతమపితత్పిహితమ్.) (9—50.) ఇందుకుదాహరణము. (ప్రియతమవియోగజనితా కృశతాకథమివత వేయమంగేషు। లసదిందుకలాకోమల కాంతికలాపేషులక్ష్యేత.) (9—51) ఈ మూఁడలంకారములను ప్రాచీనులెవ్వరు చెప్ప లేదు.

రుద్రటుని చరిత్రము మనకేమియుఁ దెలియదు. అతని నామధేయమునుబట్టి చూడఁగా గాశ్మీరదేశస్థుఁడని యూహింపవచ్చును. గ్రంథారంభమందు గణపతిని, గౌరిని నుతించెను. గ్రంథాన్తమందు భవానిని, మురారిని, గజాననునిఁ బ్రశంసించెను. అయిదవ అధ్యాయములోనున్న 12—14 శ్లోకములకు వ్యాఖ్యానమును వ్రాయుచు నమిసాధు "అత్రచచక్రేస్వనామాంక భూతోయంశ్లోకః కవినాఽన్తర్భావితోయథా "శతానందపరాఖ్యేన భట్టవామకనూనునా। సాధితంరుద్రటేనే దంసామాజా ధీమతాహితమ్॥" ఇందువలన నీరుద్రటునికి శతానందుఁడని నామాన్తరమున్నట్లును, అతని తండ్రిపేరు వామకుఁడనియు, సామవేదీయుఁడనియుఁ దెలియవచ్చుచున్నది. అచ్చటచ్చట రుద్రటుఁడు "ఆచార్యాః" అని చెప్పుటచే నాట్యశాస్త్రకర్తయగు భరతునిఁ జేర్కొనెనని యూహింపవచ్చును. "నుత్యాతథాహిదుర్గాం కేచిత్తీర్ణా దురుత్తరాంవిపదమ్। అపరేరోగవిముక్తింపర మన్యేలేభిరేఽభిమతమ్॥" (1—9.) ఈ శ్లోకమందు రుద్రటుఁడు మయూరకవినుద్దేశించియున్నాఁడు. ఇతఁడు భరతుని రససిద్ధాంతము నెఱిఁగియున్నవాఁడైనను, "తస్మాత్తత్కర్తవ్యంయత్నే నమహీయసారసైర్యుక్తమ్" (12—2), అని చెప్పినను అలంకారములే ప్రధానములని అభిప్రాయపడుచున్నాఁడు. రీతులనుఁ జేర్కొన్నను వానికిఁ బ్రాధాన్యము చెప్ప లేదు. గుణనిరూపణమును చేయనే లేదు.

రుద్రటునికాలమును మనము నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. ఇతఁడు భామహుఁడు, దండి, ఉద్భటుఁడు మొదలగువారికంటె నెక్కుడలంకారములనుఁ జెప్పెను. కావున నితఁడు వారికంటె నర్వాచీనుఁడు. దశమశతకమునకుఁ దరువాత నున్న గ్రంథకర్తలచే నీతని శ్లోకములు తరుచుగా నుదాహరింపఁబడెను. "కాకు వక్రోక్తిర్నామ శబ్దాలంకారోయమితిరుద్రటః" అని రాజశేఖరుఁడు కావ్య

ప్రమాంసలో వ్రాసియున్నాఁడు. ప్రతీహారేందురాజు రుద్రటుని పేరు చెప్పకుండ నతని శ్లోకములను దరుచుగా తన వ్యాఖ్యానమందుదాహరించుచున్నాఁడు. ధనికుని దశరూపకటీకయందు రుద్రటుని శ్లోకము లుదాహరింపఁబడినవి. లోచనకారుఁడు రుద్రటుని భావలక్షణమును, దాని యుదాహరణము నుదాహరించెను. భామహుఁడు రుద్రటుని పేరు వక్కాణించి హేతుసముచ్చయ వ్యతిరేకములకతఁడు చెప్పిన లక్షణమును ఖండించెను. కావున నితఁడు తొమ్మిదవశతాబ్దమువాఁడని తోఁచుచున్నది. రుద్రటుఁడు ధ్వనిసిద్ధాంతము నెఱింగినవాఁడుకాఁడు. కావున ధ్వనికారునికంటె కొంత ప్రాచీనుఁడని యూహింపవచ్చును. వ్యాఖ్యాతయగు నమిసాధు అను వాఁడొక శ్వేతాంబర జైనుఁడుఁ శాలిభద్రునిశిష్యుఁడు. 1068—69 సంవత్సరములలో నీవ్యాఖ్యానమును వ్రాసెను. "పూర్వమహామతివిరచితవృత్త్యను సారేణకిమపిరచయామి" అని ప్రాచీనవ్యాఖ్యాతల ననుసరించితినని నమిసాధువే చెప్పియున్నాఁడు. ఇతఁడీవ్యాఖ్యానములోఁ బ్రాచీనగ్రంథకర్తల శ్లోకములను బహుళముగా నుదాహరించెను. అర్జునచరితము, కాదంబరి, కిరాతార్జునీయము, తిలకమంజరి, పాణినిపాతాళవిజయము, బృహత్కథ, భరతనాట్యశాస్త్రము, మాఘకావ్యము, మాలతీమాధవము, మృచ్ఛకటిక, మేఘదూత, రత్నావళి, వేణీసంహారము, హర్షచరిత మొదలగు గ్రంథములను, ఉద్భటుఁడు, భర్తృహరి, భామహుఁడు, మేధావిరుద్రుఁడు మొదలగు గ్రంథకర్తలను తన వ్యాఖ్యానమందుదాహరించెను. రుద్రటుని కావ్యాలంకారమునకీ నమిసాధువు వ్రాసిన వ్యాఖ్యానమేకాక 1236 సంవత్సరములో ఆశాధరుఁడనువాఁడు వ్రాసిన వ్యాఖ్యానమొకటికలదు. వసతరంగిణియను మఱియొక వ్యాఖ్యానముకూడనున్నది.

రుద్రభట్టుఁడనువాఁడొకఁడు శృంగారతిలకమనునొక యలంకారగ్రంథమును రచించెను. రుద్రటుఁడు నీ రుద్రభట్టుఁడొకఁడేయని (Weber, Aufrecht, Pischel) పండితులు చిరకాలము వివదించిరి. దుర్గాప్రసాదశాస్త్రి, (Jocobi) పండితుఁడు, వారిరువురు వేరని అభిప్రాయపడిరి. ఈయంశమిచటఁ గొంత చర్చింపవలసియున్నది. ఈశృంగారతిలకము కావ్యమాలలోఁ బ్రచురింపఁబడినది. ఇది మూఁడు పరిచ్ఛేదములుకలది. వానిలోఁ బ్రథమపరిచ్ఛేదమందు నవరసములు, భావములు, అష్టవిధశృంగారనాయికలు మొదలగు విషయములు, ద్వితీయపరిచ్ఛేదములో విప్రలంభశృంగారము, దశమన్మథావస్థలు, ఉపాయపట్కము, తృతీయపరిచ్ఛేదములో కైశిక్యాదివృత్తులు ప్రతిపాదింపఁబడినవి. శృంగారాదిరసములు

నాట్యముతో సంబంధించినవని భరతాదులు చెప్పిరిగాని యవి కావ్యములతోనే హెచ్చుసంబంధము కలవియని నేను చెప్పుచున్నానని రుద్రభట్టుడు వ్రాసెను. "ప్రాయో నాట్యం ప్రతిప్రోక్తా భరతాద్యైరసస్థితిః। యథామతి మయాప్యేషా కావ్యం ప్రతినిగద్యతే (I—5) కావ్యాకావ్యకథా, కీదృగ్వ్యదగ్ధీకోరసాగమః। కింగోష్ఠిమండనంహాంత (శృంగారతిలకం వినా॥" త్రిపురవధాదేవగతామల్లా సముయాంసమస్తదేవనతాం। శృంగారతిలకవిధినా పునరపి రుద్రః ప్రసాదయతి॥" ఇవి యీ శృంగారతిలకమందలి కొనశ్లోకములు. రుద్రభట్టుడు త్రిపురవధయను మఱియొక గ్రంథమును రచించినట్లీ రెండవశ్లోకమువలన స్పష్టమగుచున్నది.

ఈ శృంగారతిలకములో గొన్నిచోట్ల రుద్రటుడనియు, మఱికొన్నిచోట్ల రుద్రభట్టనియునున్నది. శార్ఙ్గధరపద్ధతి మొదలగు గ్రంథములలోగూడ రుద్రటుడనియు, రుద్రభట్టనియు, మఱికొన్నిచోట్ల రుద్రుడనియు గానవచ్చుచున్నది. ఈ శృంగారతిలకమందలి యుదాహరణ శ్లోకములుకూడ గ్రంథకర్తరచించినవియే. రుద్రటుని కావ్యాలంకారములోని కొన్నిశ్లోకములు పదియవ శతాబ్దప్రారంభమందున్న గ్రంథకర్తలు తమ గ్రంథములయందుదాహరించియున్నారు. వారిలో హేమచంద్రుడొకడు. ఈశృంగారతిలకము యొక్క పేరైన వారెవ్వరెత్తిగి యున్నట్లే గ్రంథమందు నిదర్శనము కనపడదు. దీనినిబట్టిచూడగా శృంగారతిలకము 11 శతాబ్దమందు రచింపబడియుండునని మనము తలంపవలెను. రుద్రట రుద్రభట్టులు వేరని సమర్థించుటకు దగిన ప్రబలప్రమాణములు కలవు. అందుకీ దిగువను సంగ్రహముగా గొన్ని హేతువులు కనుపరుపబడుచున్నవి. రుద్రటుని కావ్యాలంకారములోని 12, 14 అధ్యాయములు రుద్రభట్టుని శృంగారతిలకమును బోలియున్నవి. రుద్రటుని గ్రంథమునుజూచి రుద్రభట్టుడు తన శృంగారతిలకమును వ్రాసియుండును. ఇంతియకాక, యీ యుభయులగ్రంథములయందు పరస్పరవిరోధములు కొన్నిగలవు. ఒకగ్రంథకర్తయే యీ రెండు గ్రంథములను వ్రాసినయెడల నిట్టి పరస్పర విరుద్ధాంశములెట్లుండును. శృంగారతిలకమందు రసములు తొమ్మిదియనియు, రుద్రటుని కావ్యాలంకారమందు పదిరసములనియు జెప్పబడియున్నది. శృంగారతిలకము కైశిక్యాదివృత్తిచతుష్టయమును జెప్పుచున్నది. రుద్రటుడు ప్రసిద్ధమైన కైశిక్యాదివృత్తులను జెప్పక మధురాప్రౌఢాదివృత్తులైదింటిని జెప్పెను. రుద్రటుడు స్వీయపరకీయవేశ్యయని నాయికలను మూడు తరగతులుగా విభజించి యీమూగ్గుఱు అభిసారికగాగాని, ఖండితగాగాని యుండవచ్చు

నియు స్వీయస్వాధీనపతిక, ప్రోషిత భర్తృకయని రెండువిధములనియుఁ జెప్పెను. శృంగారతిలక మష్టవిధశృంగారనాయికలనుఁ జెప్పెను. రుద్రటుఁడు "సర్వాంగ్రాహి వేశ్యాసమ్యగసౌలిప్సతేధనంకామాత్। నిర్గుణగుణినోస్తస్యా నద్వేష్యోనప్రియః కశ్చిత్" అని వేశ్యలను నిందించెను. శృంగారతిలకకారుఁడు "సామాన్యవనితావేశ్యా సావిత్తంపరమిచ్ఛతి। నిర్గుణోపినవిద్వేష్యోన రాగస్స్యాద్గుణిన్యపి। తత్స్వరూపమిదం ప్రోక్తం కైశ్చిద్భ్రామోవయంపునః" అని చెప్పెను. శృంగారతిలకకారుని పూర్వోక్తశ్లోకమందున్న "కైశ్చిత్" అను పదమనుమానింపఁదగియున్నది. దీనిచే రుద్రటుని నుద్దేశించినాఁడని మనము స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. ఈ యుభయ గ్రంథకర్తల గ్రంథములయందుండు నీశ్లోకములెంత సమానముగా నున్నవో చూడుఁడు. "సాక్షాచ్చిత్రేస్వప్నేస్యాద్దర్శనమేవమింద్రజాలేవా। దేశేకాలేభంగ్యా సాధు తదాకర్ణనంచస్యాత్॥" (రుద్రట, 12, 13).

"సాక్షాచ్చిత్రే తథాస్వప్నే తస్యాస్స్యాద్దర్శనంత్రిధా। దేశేకాలేచభంగ్యాంచ శ్రవణంచాస్యతద్యథా" (శృంగార. 1—51.) ఈరీతిగా నీరెండు గ్రంథముల యందున్న శ్లోకములకు శబ్దమందు అర్థమందుగల సాదృశ్యమునుజూడగా నొక గ్రంథమునుజూచి మఱియొక గ్రంథము వ్రాయబడినదని సులభముగాఁ జెప్పవచ్చును. పూర్వోక్తాంశములను జక్కఁగాఁ బరిశీలింపఁగా శృంగారతిలకకారుఁడైన రుద్రభట్టు రుద్రటునికంటెఁ దరిమిలావాఁడనియు, వాని కావ్యాలంకారమునుజూచి తన శృంగారతిలకమును వ్రాసెననియు నీరుద్రభట్టు 9—11 శతాబ్దములమధ్య నున్న వాఁడనియుఁ దేలుచున్నది.

## కావ్యమీమాంస.

ఈ గ్రంథమును రచించిన మహాకవి రాజశేఖరుఁడు. ఇతఁడు దీనినేగాక బాలరామాయణము, బాలభారతము, విద్ధసాలభంజిక, కర్పూరమంజరియను మఱి నాలుగు నాటకములను వ్రాసెను.

రాజశేఖరునివంశము:—ఈ కవి తాను యాయావరవంశములోనివాఁడనని యీ కావ్యమీమాంసలోను, బాలరామాయణములోను వ్రాసికొనియున్నాఁడు. ఇతనికిఁ దరువాతఁబుట్టిన గ్రంథకర్తలుకూడ నీతనిని యాయావరుఁడని వ్యవహరించిరి. తిలకమంజరిలో ధనపాలమహాకవి యీకవిపుంగవుని యాయావరకవియని ప్రశం

సించెను. "సమాధిగుణశాలిన్యః ప్రసన్నపరిపక్త్రిమాః। యాయావరకవేర్వాచో మునీనామివవృత్తయః॥" (తిలకమంజరి. 33.) ఉదయసుందరీ చంపూప్రబంధకర్త యీరాజశేఖరుని యాయావరుఁడనియే వ్రాసెను. "యాయావరః ప్రాజ్ఞవరో గుణజ్ఞైరాశంసితఃసూరిసమాజవర్యైః। నృత్యత్యుదారంభణితే రసస్థానటీవయస్యోధరసాపదశ్రీః॥" (ఉదయసుందరీ అష్టమోచ్ఛ్వాసము.) ఈరాజశేఖరుఁడు నాటకరచనయందు మిక్కిలి ప్రవీణుఁడు. ఇతఁడువ్రాసిన నాటకములవలన నీతని వృత్తాంతము గొంత మనకుఁదెలియును. తన పూర్వులందరు విద్వాంసులనియు, దనకుటుంబము విద్వత్కుటుంబమనియు నీతఁడు గర్వముగలవాఁడైయున్నాఁడు. ఈకవిముత్తాతయగు నకాలజలదుఁడనువాఁడు కావ్యరత్నములచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. "సమూర్త్తోయత్రాసీద్గుణగణ ఇవాకాలజలదస్సురానంద స్సోపిశ్రవణపుటపేయేనవచసా, నచాన్యేగణ్యాం తేతరళ కవిరాజప్రభృతయోమహాభాగ స్తస్మిన్న యమజనియాయావరకులే॥" (బాలరా. I-13.) "అకాలజలదేందోస్సా హృద్యావచనచంద్రికా, నిత్యంకవిచకోరైర్యా పీయతేనచహీయతే॥" (సూక్తిముక్తావళి.) ఈయకాలజలదుని శ్లోకములను కాదంబరీరాముఁడనుకవి దొంగిలించి తన నాటకమందుఁ జేర్చుకొనెను. ఈయంశమును సూక్తిముక్తావళి యిట్లు చెప్పుచున్నది. "అకాలజలదశ్లోకైశ్చిత్రమాత్మకృతైరివ। జాతఃకాదంబరీరామో నాటకేప్రవరకవిః॥" సురానందుఁడు, తరళుఁడు, కవిరాజు నీరాజశేఖరుని కుటుంబములోనివారే. సురానందుఁడు చేదిభూపాలుని యాస్థానమందుండి ప్రసిద్ధికెక్కిన మహాకవి. నదీనాం మేకలసుతా నృపాణాం రణవిగ్రహః। కవీనాంచసురానందశ్చేదిమండలమండనమ్॥" (సూక్తిముక్తావళి) కావ్యమీమాంసలోఁజెప్పఁబడిన యీసురానందుని యభిప్రాయమునుబట్టి జూడఁగా నితఁడుకూడ నొక యలంకారశాస్త్రమును వ్రాసినట్లు కానవచ్చుచున్నది. తరళుఁడుకూడఁ గొంత ప్రసిద్ధిగలకవియే. కవిరాజునుగురించి యేమియుఁదెలియదు. రాజశేఖరుని తండ్రిపేరు దుహితుఁడు, తల్లిపేరు శైలవతి. ఈకవి యాయావరకుటుంబములోనివాఁడని మనకుఁ దెలియునుగాని బ్రాహ్మణుఁడో, క్షత్రియుఁడో నిశ్చయించి చెప్పలేము. మహేంద్రపాలుఁడను రాజున కుపాధ్యాయుఁడై యుండుటనుబట్టి యితఁడు బ్రాహ్మణుఁడని తోచుచున్నదిగాని యతనిభార్య చాహుఆనాకుటుంబములోనిదై యుండుటచే నీతఁడు క్షత్రియుఁడేమోయని సంశయము పొడముచున్నది. "చాహుఆణకులమోలీమాలి అశాఅనేహరక ఇంద గేహిణీ। భత్తుణోకఇమవందిసుందరీ సాపఉజ్జవిదుమేఅమిచ్ఛఇ॥"

రాజశేఖరుఁడు శైవుఁడా వైష్ణవుడా?:—ఈకవిహరవిలాసమను శైవకావ్యము నొకదానిని రచించియుండుటచే నితఁడు శైవుఁడేమోయను సంశయము కలుగుచున్నది గాని కావ్యమీమాంసలో నుదాహరింపఁబడిన విష్ణుపరమైన శ్లోకములనుబట్టి విచారింపఁగా నీతఁడట్టి మతాభినివేశముగలవాఁడని తోఁచదు. త్రిమూర్త్యైక్యమందు నమ్మకము గలవాఁడని హరవిలాసముయొక్క మంగళశ్లోకమువలన స్పష్టమగుచున్నది. ఆయాయిసమయములయందు జైనులవిషయమైకూడ రాజశేఖరుఁడు గౌరవమును గనపరిచినట్లీక్రింద వ్రాసిన సోమదేవకృతయశస్తిలక చంపూవాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది. "తదాఉర్వభారవిభవభూతి భర్తృహరిభర్తృమేంఠ కంఠగుణాఢ్యవ్యాసభాసవోసకాళిదాస బాణమయూర నారాయణకుమార మాఘ రాజశేఖరాది మహాకవికావ్యేషు, తత్రతత్రావసరేభరత ప్రణీతే కావ్యాధ్యాయే, సర్వజనప్రసిద్ధేషు తేషు తేషూపాఖ్యానేషు చకథంమద్విషయాఃమహాలీప్రసిద్ధిః" (4 ఆశ్వా. 113 పే.) ఇతనిభార్యయగు నవంతిసుందరి గొప్ప వైదుష్యముగలది. ఈకావ్యమీమాంసలో గొన్నివిషయములందామె అభిప్రాయము నితఁడు మూఁడుచోట్లఁ దెలిపియున్నాఁడు. "ఇయమశక్తిర్న పునఃపాకః" ఇత్యవంతిసుందరీ. (20 పే.) "విదగ్ధభణితివివేద్యం వస్తునోపరూపమేవని, యతస్వభావమిత్యవంతిసుందరీ, తదాహ, వస్తుస్వభావోఽత్ర కవేరతన్త్రంగుణాగుణావుక్తివశేన కావ్యేస్తువన్నిబధ్నాత్యమృతాంశుమిందుం నిందంస్తుదోషాకరమాహధూర్తః" (46 పే.) ఇందువలన నీమెకూడ నేదోయొక అలంకారశాస్త్రమును రచించినదని తోఁచుచున్నది. ఆమె మనఃప్రహ్లాదనముకొరకు కర్పూరమంజరి మొదటఁ బ్రదర్శింపఁబడినది.

రాజశేఖరుని కాలనిర్ణయము:—ఇతఁడు కాన్యకుబ్జేశ్వరుఁడగు మహేంద్రపాలుని కుపాధ్యాయుఁడనియు, నాతని యనంతరము రాజ్యమేలిన యాతని కుమారుని కేఁగూడఁ బోషింపఁబడెననియు నీతని నాటకప్రస్తావనవలననే తెలియవచ్చుచున్నది. మహేంద్రపాలుఁడు క్రీ. శ. 903-907 వత్సరములమధ్యను రాజ్యమేలెనని సియొడొనిశాసనము (Siyodoni Inscription) తెలియఁజేయుచున్నది. మహీపాలుఁడు క్రీ. శ. 917 లో రాజ్యముచేసెనని ఎపిగ్రాఫియా ఇండికా (Epigraphia Indica, Vol. I, p. 171) వలనఁదెలియుచున్నది. మహేంద్రపాలుని కాలమును నిర్ణయించుటకు రాజశేఖరకవి వ్రాసిన నాటకములేగాక యితరాధారములుగూడఁగలవు. రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలో గౌడవధయను ప్రాకృతకావ్యమును వ్రాసిన వాక్పతిరాజును, 779 మొదలుకొని 813 వరకు

రాజ్యముఁ జేసిన కాశ్మీర దేశాధిపతియగు జయాపీడుని సభాపతియైన ఉద్భటుని 857 మొదలుకొని 884 వరకు రాజ్యమేలిన కాశ్మీరమహీనాథుని కాలములోనున్న ఆనందవర్ధనునిఁ బేర్కొనియున్నాఁడు. 960 సంవత్సరమందు రచింపఁబడిన సోమదేవుని యశస్తిలక చంపూకావ్యమందు రాజశేఖరుని పేరు చెప్పఁబడినది. 990 సంవత్సరప్రాంతమందున్న సొడ్డలునిచే నీతఁడు ప్రశంసింపఁబడెను. ఇందువలన రాజశేఖరుఁడు 880-920 సంవత్సరముల మధ్యనున్నట్లు మనము నిశ్చయింపవచ్చును. రాజశేఖరుఁడు తన్ను మహాకవియనియేగాక కవిరాజనికూడఁ జెప్పుకొనుచున్నాఁడు. (బాలకవి కవిరాజ కర్పూర మంజరి.)

కవి విశేషములు:—కవిభేదములను కావ్యమీమాంస యిట్లు చెప్పుచున్నది. "దశ చకవేరవస్థా భవంతి, తత్రబుద్ధిమదాహార్యబుద్ధ్యోస్సప్త, తిస్రశ్చౌపదేశికస్య, తద్యథా, కావ్యవిద్యాస్నాతకః హృదయకవిః, అన్యాపదేశీ, సేవితా, ఘటమానః మహాకవిః, కవిరాజః, ఆవేశికః, అవిచ్ఛేదీ, సంక్రామయితాచ యః కవిత్వకామః కావ్యవిద్యోపవిద్యాగ్రహణాయ గురుకులాన్యుపాస్తే సవిద్యాస్నాతకః। యోహృదయ ఏవకవతే నిహ్నుతే చ సహృదయకవిః। యస్స్వకావ్యం దోషభయాదన్యస్యేత్యపదిశ్య పఠతి సోఽన్యాపదేశీయః ప్రవృత్తవచాః పౌరస్త్యానామన్యతమచ్ఛాయామభ్యస్యతి ససేవితా యోఽనవద్యం కవతే నతు ప్రబధ్నాతి సఘటమానః। యోఽన్యతరప్రబంధే ప్రవీణః సమహాకవిః। యస్తుతత్రతత్రభాషావిశేషేషు ప్రబంధేషు తస్మింస్తస్మింశ్చరసే స్వతంత్రస్స కవిరాజః। తేయదిజగత్యపి కతిపయే। యోమంత్రాద్యుపదేశవశాల్లబ్ధసిద్ధిరావేశ సమకాలంకవతే సఆవేశికః। యోయదైవేచ్ఛతి తదైవా విచ్ఛిన్నవచాః సోఽవిచ్ఛేదీ। యఃకన్యాకుమారాదిషు సిద్ధమంత్రస్సరస్వతీం సంక్రామయతి ససంక్రామయితా॥" ఈ రీతిగాఁ గావ్యమీమాంసలోఁ జెప్పఁబడినట్లు కవితాప్రావీణ్యము పదివిధములు. వానిలో నాఱవవాఁడు మహాకవి, ఏడవవాఁడు కవిరాజు. నానా భాషాప్రవీణుఁడు, నానావిధ ప్రబంధనిర్మాత, రసభావనిరంతరముగాఁ గవనము జెప్పఁగలవాఁడు కవిరాజని నిర్వచింపఁబడినది. ఇట్లు కవిరాజు మహాకవికంటె నధికతరుఁడు. కవిరాజులు లోకములో నరుదు.

రాజశేఖరుని ప్రబంధములు:—రాజశేఖరుఁడు బాల్యమునుండి కవనము చెప్పుట ప్రారంభించెనని కర్పూరమంజరివలనఁ దెలియవచ్చుచున్నది. బాలభారత బాలరామాయణములను రచించియుండుటచే నీతనికి బాలకవియని పేరుకలిగెనని

కొందరభిప్రాయపడుచున్నారు. పూర్వోక్తగ్రంథద్వయము నీకవిబాల్యమందే రచించియున్నట్లిందువలన స్పష్టమగుచున్నది. కావ్యమీమాంసా కర్పూరమంజరులను కవిరాజప్రసిద్ధినిఁ గాంచినపిమ్మట వ్రాసియున్నాఁడు. ఇతని నాటకత్రయములోని శ్లోకములు కావ్యమీమాంసలో నుదాహరింపఁబడినవి. హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనవివేకమందు (335 పే.) రాజశేఖరుఁడువ్రాసిన హరవిలాసము గ్రంథకర్త నామాంకితమైన కావ్యమని,వ్రాసియున్నాఁడు "స్వనామాంకతా యథా హరవిలాసే" హరవిలాసముయొక్క ప్రథమసర్గనుండి రెండుశ్లోకములను దన కావ్యానుశాసనమందుదాహరించియున్నాఁడు. వీనిలో మొదటిది గ్రంథాదిమంగళశ్లోకము, రెండవది సదసజ్జనవర్ణనము. "ఆశీర్యథా హరవిలాసే. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ శ్రుతీనాంముఖమక్షరమ్। ప్రసీదతు సతాం స్వాంతే ష్వేకం త్రిపురుషీమయమ్। సుజనదుర్జనస్వరూపం యథా హరవిలాసే। ఇతస్తతో భషన్భూరి నపతేత్పిశునశ్శునః। అవదాతతయాకించిన్న భేదో హంసతస్సతః॥" ఉజ్జ్వలదత్తుఁడు ఉణాదిసూత్రవృత్తిలో హరవిలాసములోని యొక యర్ధశ్లోకము నుదాహరించెను. "దశాననక్షిప్తఖురప్రఖండితః క్వచిద్గతార్ధో హరదీధితిర్యథా ఇతి హరవిలాసే" (11-28.) రాజశేఖరుఁడు పూర్ణపాండిత్యమును సంపాదించి కవిరాజనిపించుకొన్నతరువాత నీ హరవిలాసమును రచించియుండును. ఇందులోఁ బ్రథమాశ్వాసమందుఁ బ్రాచీనకవి ప్రశంసచేయఁబడినది. ఈ శ్లోకములు జల్హణుని సూక్తిముక్తావళిలో నుదాహరింపఁబడినవి. తరుచుగాఁ బ్రాచీనకవిస్తుతి, తచ్చరిత్రములు, ఉదయసుందరి, తిలకమంజరి, హర్షచరిత్ర మొదలగు నాఖ్యాయికలయందు, కథలయందు గానవచ్చుచున్నవి; మహాకావ్యములయందుఁ బురాణకవుల నుతించుట సంప్రదాయమైయున్నది. శ్రీకంఠచరిత్రలో మంఖకవి ప్రాచీనకవులను, తనకు సమకాలికులైన కవులను నుతించియున్నాఁడు. కీర్తికౌముదిలో సోమేశ్వరుఁడు పురాతనకవులనుఁ బ్రశంసించెను. కావ్యాదినిఁ బ్రాచీనకవిశిఖామణుల నుతించువాడుక హేమచంద్రునిగురువైన దేవచంద్రుఁడు వ్రాసిన శాంతినాథచరిత్ర మొదలగు ప్రాకృతకావ్యములయందుఁగూడ గానవచ్చుచున్నది. రాజశేఖరుఁడు కవివిమర్శయను నొకగ్రంథమును రచించెననియు, దానిలో శ్లోకములు కొన్ని సూక్తిముక్తావళిలో నుదాహరింపఁబడెననియుఁ గొందరు వక్కాణించుచున్నారు. దీని యాథార్థ్యమును నిశ్చయించుటకుఁ దగిన యాధారము లెవ్వియుఁ గానరావు. రాజశేఖరుఁడు హరవిలాసముగాక భూగోళశాస్త్రముఁ బ్రతిపాదించు భువనకోశమను మఱియొక గ్రంథమునుగూడ వ్రాసెను. కావ్యమీమాంసలో పదునేడవ అధ్యాయము

కొసను రాజశేఖరుఁడీగ్రంథమును జూచెనని పాఠకులకుపదేశించెను. "ఇత్థం దేశవిభాగోముద్రా మాత్రేణసూచితస్సుధియాం। యస్తుజిగీషత్యధికంపశ్య తుమద్భువనకోశమసౌ॥" రాజశేఖరుని గ్రంథములనుండి శివపర్యాయపదములను దీసి ఉజ్జ్వలదత్తుఁడొక యర్ధశ్లోకమును జెప్పెను. "చండీకాంతో భగాలీచ కేలిహానోవృషధ్వజః" (II-16.) ఇందువలన రాజశేఖరుఁడొక నిఘంటువునుకూడ వ్రాసియుండవచ్చునని మనమూహించుకొనవలెను. ఇప్పుడు మనకుఁ దెలిసియున్న గ్రంథములకంటె హెచ్చు గ్రంథములను రాజశేఖరుఁడు వ్రాసియుండును. ప్రకృతగ్రంథము (కావ్యమీమాంస) రాజశేఖరుఁడు వ్రాయ సంకల్పించిన యొక పెద్ద యలంకారశాస్త్రమునకు విషయసూచికయని శాస్త్రసంగ్రహరూపమైనప్రథమాధ్యాయమువలన మనమూహించుకొనవలసియున్నది. దైవయోగముచేఁ బ్రథమాధికరణమొక్కటియే యిప్పటికి మనకు లభించినది. "రీతయస్తుతిస్రస్తాః పురస్తాదౌపనిషదికేవక్ష్యామః" (II-I-10) అని చెప్పుటచేఁ బ్రథమాధికరణమందుఁ దెలియఁజేసినవిషయములనన్నింటినిఁ జర్చించి విపులముగా నొక పెద్దగ్రంథమును రచింప సంకల్పించియుండెనని యిందువలన స్పష్టమగుచున్నది. గాని యాగ్రంథకర్త తాను వ్రాయదలంచుకొన్న గ్రంథమునంతయుఁ బూర్ణముగా వ్రాసెనో లేదో మనము నిశ్చయింపలేము. అలంకారశేఖరకారుఁడు రాజశేఖరుని గ్రంథమునుండి రెండు శ్లోకములనుదీసి తన గ్రంథమందుదాహరించెను. "తదాహ రాజశేఖరః, సమానమధికంన్యూనం సజాతీయంవిరోధిచ। సమల్యంసోదరంకల్ప మిత్యాద్యాస్సామ్యవాచకాః॥ అలంకారశిరోరత్నం సర్వస్వం కావ్యసమ్పదామ్। ఉపమాకవివంశస్య మాతైవేతిమతిర్మమ॥" (అలంకారశేఖరే ఏకాదశే మరీచౌ) నిజముగా నీశ్లోకములు మనగ్రంథకర్త రచించినవే అయినయెడల నివి ఔభయాలంకారికాధికరణమునుండి తీయఁబడియుండును. అయ్యలంకారశేఖరమే వైనోదికాధికరణమునుండియు ధృతమైన మఱియొకశ్లోకము నుదాహరించుచున్నది. "ఉత్పాటితైర్నభోభీతైః శ్వైవైరామూలబధనాత్। తాంస్తానర్థాన్సమాలోక్య సమస్యాంపూరయేత్కవిః॥" (ఏకోనవింశతిమరీచౌ.)

కావ్యమీమాంసాశైలి:— కౌటిల్యుని అర్థశాస్త్రమువలెను, వాత్స్యాయనుని కామశాస్త్రమువలె నీకావ్యమీమాంసకూడ నొకరీతి సూత్రగ్రంథము. దీనిశైలిసూత్రప్రాయమై సంగ్రహముగాను, మృదుమధురముగాను ప్రకాశించుచున్నది.

## అర్వాచీనాలంకారికులు.

హేమచంద్రుడీ కావ్యమీమాంసలోని నాల్గవ భాగమును చాల్యవృత్తితోఁ దన కావ్యానుశాసనమందు సంగ్రహించెను. 17, 18 అధ్యాయములను కొంచము మార్చి తనగ్రంథమునకుఁ జేర్చెను. నేమికుమారుని పుత్రుఁడగు వాగ్భటుఁడు కావ్యగ్రంథమీమాంసనుండి హేమచంద్రుఁడు దొంగిలించినభాగముననే తనగ్రంథమందుఁ జేర్చుకొనెను. క్షేమేంద్రుడు, అమరుకుడు, వినయచంద్రుడు, దేవేశ్వరుఁడు మొదలగు నర్వాచీనాలంకారికు లెవ్వరియో కొన్ని యంశములను తమగ్రంథములలోనికి దెచ్చుకొన్నవారే. సరస్వతీకంఠాభరణములోఁ గావ్యమీమాంసాశ్లోకములు కొన్ని కానవచ్చుచున్నవి. తద్వ్యాఖ్యాతయగు రత్నేశ్వరుఁడుకూడఁ గావ్యమీమాంసాశ్లోకము నొకదానిఁ దద్గ్రంథముం దుదాహరించెను. శాకుంతలనాటకమునకు శంకరుఁడను వాఁడు వ్రాసిన వ్యాఖ్యానములోఁ గావ్యమీమాంసాకారుడైన రాజశేఖరుని పేరు కానవచ్చుచున్నది.

## అలంకారశాస్త్రోత్పత్తి లోకమందు దానివ్యాప్తి.

ఇతరశాస్త్రకారులవలెనే యీగ్రంథకర్తకూడ నలంకారశాస్త్రమీశ్వరుని వలనను దేవతలవలననుఁ బుట్టినదని చెప్పుచున్నాడు. తొల్లి శివుడీశాస్త్రమును బ్రహ్మవిష్ణువు మొదలగు నరువదినలుగురు శిష్యులకు నేర్పెననియు వారిలో బ్రహ్మ తన మానసపుత్రులైన శిష్యులకు గఱపెననియు నట్టి బ్రహ్మశిష్యులలో సరస్వతీపుత్రుడైన కావ్యపురుషుఁ డొకఁడుండెననియుఁ బ్రజాపతి వానిని ముల్లోకములయందున్న వారి హితముకొరకు కావ్యవిద్యనుఁ బ్రవర్తింపజేయుమని నియోగించెననియుఁ నాసారస్వతేయుఁ డష్టాదశాధికరణ పరిమితిగల యీశాస్త్రమును కావ్యవిద్యాస్నాతకులైన దివ్యుల కుపదేశించెననియుఁ గావ్యమీమాంసా శాస్త్రసంగ్రహాధ్యాయములోఁ జెప్పబడెను. అట్లు సారస్వతునిచే శిక్షింపబడినవారిలో నింద్రుఁడు కవిరహస్యమును, ఉక్తిగర్భుఁ డౌక్తికమును, సువర్ణనాభుఁడు రీతినిర్ణయమును, ప్రచేతయును వాడానుప్రాసికమును, చిత్రాంగదుఁడు చిత్రయమకములను, శేషుడు శబ్దశ్లేషను, పులస్త్యుడు వాస్తవమును, ఔపకాయను డౌపమ్యమును, పారాశరుడతిశయమును, ఉతథ్యుడర్థశ్లేషను, కుబేరుడు భయాలంకారికమును, కామదేవుడు వైనోదికమును, భరతుఁడు రూపకనిరూపణీయమును, నందికేశ్వరుడు రసాధికారికమును, ధిషణుఁడు దోషాధికరణమును, ఉపమన్యుడు గుణౌపాదనికమును, కుచమారుఁ డౌపనిషదికమును రచించిరి. ఇట్లీదేవతలు తాము నేర్చుకొన్న శాస్త్రభాగములను వేరువేరు గ్రంథములుగా నొనర్చిరి. భిన్నభిన్నమైన యీగ్రంథములవలననే యీశాస్త్రము కొంతమట్టుకు ఛిన్నమైనది. కావున నీరాజశేఖరుఁడాపదునెనిమిది అధికరణములను నొకగ్రంథముగా సంగ్రహించి వ్రాసెను.

లౌకికవైదిక వాఙ్మయములందలంకారశాస్త్రమున కుచ్చపదవి యొసంగబడవలెనని యాగ్రంథకర్తల అభిప్రాయము. అలంకారశాస్త్రము వేదమునకు సప్తమాంగమనియు దానిస్వరూపపరిజ్ఞానము లేకుండ వేదార్థమెఱుంగ శక్యముకాదనియు వ్రాసెను. "ఉపకారకత్వాదలంకారస్సప్తమాఙ్గమ్, ఋతేచ తత్స్వరూపపరిజ్ఞానాద్వేదార్థానవగతిః (కా. మీ. 3 పే) సాహిత్యవిద్య అయిదవశాస్త్రమనియు నది చతుర్దశ విద్యాస్థానములలో పంచదశవిద్యాస్థానమనియు మఱియొకచోటఁ జెప్పియున్నాడు. "పంచమీసాహిత్యవిద్యేతియాయావరీయః" "సకల విద్యాస్థానైకాయతనం పంచదశం కావ్యం విద్యాస్థానమితి యాయావరీయః" (4-పే. కా. మీ.)

## కావ్యపురుషుఁడు.

కావ్యపురుషుఁడు, అతనిభార్య సాహిత్యవిద్యావధువు. అను కల్పనసంస్కృతవాఙ్మయములో నొకనూతనమైన విషయము. "చత్వారిశృంగాః త్రయోఽస్య పాదాః" అని వేదపురుషుని చెప్పినట్టిదియే కావ్యపురుషస్తుతిపరమని గ్రహింపవలెను. ఒకకాలమందు సరస్వతి పుత్రార్థినియై బ్రహ్మనుగురించి హిమాలయమందు తపమొనరించెను. నలువ ఆమె తపస్సునకు మెచ్చి యొక పుత్రునొసంగెను. వానికిఁ గావ్యపురుషుఁడని పేరిడెను. ఛందోబద్ధమైన వాణి మొదట నాదివ్యపురుషునివలననే యుత్పన్నమాయెను. శబ్దార్థములు అతనిశరీరము. నానావిధభాషలతని యవయవములు. రసమాతని యాత్మ. ఉపమాద్యలంకారము లాతని యాభరణములు. ఒకానొక కాలమందు సరస్వతి ప్రాశ్నికపద మధిష్ఠించుటకై దేవసభకుఁ బోవుచుండగా నీకావ్యపురుషుడు తల్లి వెనువెంటఁ జనుటకుఁ బట్టుఁ బట్టెను. అపుడు సరస్వతి వీనిని నివారించుటకు సాహిత్యవిద్యావధువను నొక యువతిని సృజించి యాకావ్యపురుషుని వెనుకఁ బొమ్మని యాజ్ఞాపించెను. ఆవరవర్ణిని తన వేషభావలచేతను సౌందర్యముచేతను వానిని మోహింపజేసి వశపర్చుకొనెను. అంతివత్సగుల్మమను ప్రదేశమందు వారిరువురికి 'గాంధర్వవివాహము జరిగెను. ఆమెధరించిన వేషములు ఆమెచూపించిన నాటకాభినయములు నానాదేశములయందు నివసించు మనుష్యులచే ననుకరింపబడినవి.

రాజకీయ కవిసభ:—స్వయముగాఁ గవియైయున్న రాజు కావ్యములను బరీక్షించుట కొక సభనుఁ గావింపవలెను. ఆసభాస్థానము షోడశ స్తంభోపేతమై చవాటచతుష్టయయుక్తమై గోపురాష్టకోపశోభితమై యుండవలెను. రాజక్రీడా

గృహము దానితో సంబంధించినదియై యుండవలెను. ఆ సభామధ్యమందున్న యెత్తయిన వేదికపై రాజు కూర్చొనవలెను. ఆ నృపాసనమున కుత్తరపువైపు సంస్కృతకవులు, వారివెనుక వైదికులు, తార్కికులు, పౌరాణికులు, ధర్మశాస్త్రజ్ఞులు, వైద్యులు, మౌహూర్తికులు, మొదలగువారాసీనులై యుండవలెను. తూర్పువైపున ప్రాకృతకవులు వారివెనుక నటులు, నర్తకులు, గాయకులు, వందిమాగధులు, మొదలగువారుండవలెను. పశ్చిమభాగమందు దేశభాషాకవులు, వారివెనుకం జిత్రలేఖకులు, మాణిక్యబంధకులు. వైకటికులు స్వర్ణకారులు, వర్ధకులు, లోహకారులు, కూర్చొనవలెను. దక్షిణపువైపునం బైశాచభాషాకవులు, వారివెనుక విటులు, గణికలు, ప్లవకశౌభికజంభకమల్లులు, శస్త్రోపజీవులు నుండవలెను. (రాజాకవిః కవిసమాజం విదధీత, రాజని కవౌ సర్వోలోకః కవిస్స్యాత్। సకావ్యపరీక్షాయై సభాంకారయేత్। సాషోడశభిస్తంభైశ్చతుర్భిర్ద్వారైరష్టభిర్మత్తవారణీభిరుపేతాస్యాత్। తదనులగ్నం రాజ్ఞః కేళీగృహమ్, మధ్యేసభం చతుస్స్తమ్భాన్తరా హస్తమాత్రోత్సేధాస మణిభూమికావేదికాతస్యాం రాజాసనమ్, తస్యచోత్తరతస్సంస్కృతాః కవయః నివిశేరన్, బహుభాషాకవిత్వేయోయత్రాధికం ప్రవీణః సతేనవ్యపదిశ్యతే, యస్త్వనేకత్రప్రవీణస్స సంక్రమ్య తత్రతత్రోపవిశేత్। తతః పరంవేద విద్యావిదః ప్రామాణికాః పౌరాణికాః స్మార్తాభిషజో మౌహూర్తికా అన్యేపి తథావిధాః। పూర్వేణ ప్రాకృతాః కవయః తతః పరంనటనర్తకగాయన వాదకవాగ్జీవన కుశీలవతాళావచరాఅన్యేపి తథావిధాః। పశ్చిమేనాపభ్రంశినః కవయః తతః పరంచిత్రలేప్యకృతో మాణిక్యబంధకా వైకటికాస్స్వర్ణకారవర్ధకిలోహకారా అన్యేపి తథావిధాః। దణిణతో భూతభాషాకవయః తతః పరం భుజంగగణికాః। ప్లవకశౌభికజంభకమల్లాశ్శస్త్రోపజీవినోఽన్యేపి తథావిధాః। తత్రయథా సుఖమాసీనః కావ్యగోష్ఠీంప్రవర్తయేత్ భావయేత్పరీక్షేతచ।" (54-55 పే.)

కావ్యపరీక్షులు:— ఉత్తమకవులు రచించిన కావ్యములను బరీక్షించుటకు రాజు సభలనుం గావింపవలెను. రాజు కవులను బోషింపవలెను. వాసుదేవుడు, శాతవాహనుండు, శూద్రకుండు, సాహసాంకుండు మొదలగు ప్రాచీనకవులవలె దాను సభాపతిగా నుండియే కవులకావ్యహేయము పరీక్షానికషమందుజ్జ్వలమై యుండునో అట్టికవులను దానమానాదులచే సత్కరింపవలెను. కావ్యములను శాస్త్రములనుం బరీక్షించుటకు రాజు పెద్దపట్టణములయందు బండితసభలను గావింపవలెను. విజయము నొందిన మహాకవులను బ్రహ్మరథముచే నూరేగించి పట్టబంధము జుట్టవలెను. పూర్వ

కాలమందుఁ గావ్యపరీక్షకట్టి సభ ఉజ్జయినీ నగరమందు జరిగెను. ఇచ్చటఁ గాళిదాసుడు, మేంఠుడు, అమరుఁడు, శూరుఁడు, హరిశ్చంద్రుడు, చంద్రిగుప్తుడు, పరీక్షింపఁబడిరి. పాటలీపుత్రిము శాస్త్రపరీక్షాస్థానమై యుండెను. ఇచ్చట జరిగిన పరీక్షలలో నుత్తీర్ణులైన పిమ్మటనే ఉపవర్షుడు, వర్షుడు, పాణిని, పింగళుడు, వ్యాఢి, వరరుచి, పతంజలిశాస్త్రకారులని ప్రిసిద్ధినొందిరి.

## కావ్యమీమాంసలోఁ జెప్పబడిన ఐతిహ్యములు.

సంస్కృతవాఙ్మయ చరిత్రిమందు ముఖ్యమైన ఐతిహ్యములను రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో వక్కాణించెను. మేధావిరుద్రిఁడు కుమారదాసుడు నను వారుభయులు జాత్యంధులు. మగధదేశాధీశ్వరుడగు శిశునాగుఁడు ట, శ, ష, హ అను వర్ణములనుతప్ప తక్కిన మూర్ధన్యముల నుచ్చరింపగూడదని స్వీయాంతఃపురస్త్రీల కొక నియమమేర్పరిచెను. వైదికబ్రాహ్మణవ్యవహృతమైన భాషలోనున్న క్షట్ ఛ్ఛాగణ వర్ణములయందు ద్వేషముజూపిన యీరాజు వ్రాత్యుడని ఋజువుచేయుట కిది ప్రిబలప్రిమాణము. శూరసేనదేశముల కధిపతియగు కువిందుడను వాడు పలుకుటకుఁ గష్టమైన ద్విత్వాక్షరములను వాడుకచేయగూడదని తనప్రిజల కాజ్ఞాపించెను. కుంతల దేశము నేలిన శాతవాహనుఁడు ప్రాకృతభాషను వాడుకచేయగూడదని తన యంతఃపురస్త్రీలకు త్తరువొసంగెను. ఉజ్జయినీనగరపాలకుడైన సాహసాంకుఁడు సంస్కృతభాషను సంభాషింపగూడదని శాసించెను.

## లేఖనసామగ్రి.

ఒకపెట్టె, సుద్దముక్కలు, ఫలకము, తాళీపత్రిములు, భూర్జపత్రిములు, కలములు, సిరాబుడ్లు, తాళపత్రిములు, ఇనుపమేకులు, సంతతము కవి తనవద్దనుంచుకొన వలెనని రాజశేఖరుడు చెప్పుచున్నాడు. (తస్యసంపుటికా, సఫలకా, సముద్గకః, సలేఖనకమషీభాజనాని, తాళీపత్రాణి భూర్జత్వచో వాసలోహకంటకాని, సుసంపుష్టాభిత్తయః, సతత సన్నిహితాస్స్యుః) దాక్షిణాత్యులు తాటియాకులమీదను, జైనులు తాళీపత్రిములమీదను వ్రాయువారని చెప్పబడియున్నది.

## కావ్యమీమాంసలో నుదాహృతశ్లోకములు.

ఈ గ్రంథమందుదాహరింపబడిన శ్లోకములు రత్నములవంటివి. ఇవి శ్రీరామాయణము, మహాభారతము, భగవద్గీత, రఘువంశము, కుమారసంభవము, విక్రమోర్వశీయము, శాకుంతల, కిరాతార్జునీయము, జానకీహరణము, కాదంబరి, హయగ్రీవవధ, మాలతీమాధవము, సూర్యశతకము, వేణీసంహారము, శిశుపాలవధ మహానాటకము, మహిమ్నస్తోత్రము, రాజశేఖరుని నాటకములు మొదలగువానినుండి తీయబడినవి. ఈయుదాహరణ శ్లోకములలో ననేకము లేయేగ్రంథములనుండి యుద్ధృతములో యెవ్వరికిఁ దెలియదు. శిశుపాలవధలోని శ్లోకములు, వేణీసంహారములోని శ్లోకములు, నీకావ్యమీమాంసలోఁగానవచ్చుటచే నాగ్రంథకర్తలు తొమ్మిదవ శతాబ్దమునకు ముందుండిరని తోచుచున్నది.

## కావ్యమీమాంసలోని ఆలంకారికులు.

రాజశేఖరుఁడీకావ్యమీమాంసలో సురానందుఁడు, శ్యామదేవుఁడు, వామనుఁడు, ఉద్భటుఁడు, అపరాజితి, ద్రౌహిణి, రుద్రటుఁడు, కాళిదాసుఁడు, వాక్పతిరాజు, ఆనంద్ధుఁడు, అవంతిసుందరి మొదలగు నాలంకారికుల మతములఁ బ్రకటించెను.

## కాన్యకుబ్జమందు పాంచాలదేశమందు రాజశేఖరునికి గల పక్షపాతము.

రాజశేఖరకవి కాన్యకుబ్జాధిపతులైన రాజుల కుపాధ్యాయుఁడని నేనిదివరకే తెలిపియున్నాను. మహోదయమందుఁ బాంచాలదేశమునందు నతనికున్న పక్షపాతము నీగ్రంథమునుబట్టి మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. సప్తమాధ్యాయమందు మహోదయమునుండి దిక్కులు కొలవబడవలసినదని చెప్పుచున్నాఁడు. ("తత్రాపిమహోదయం మూలమవధీకృత్య" ఇతియాయావరీయః-కా-మీ-పే 94) మహోదయ స్త్రీలవేష మత్యుజ్జ్వలమని తృతీయాధ్యాయములో వర్ణించియున్నాఁడు. (తాటంకవల్గనతరంగిత గండలేఖమానాభి లంబిదరదోలిత తారహారమ్। ఆశ్రోణి గుల్ఫపరిమండలితోత్తరీయ వేషం నమస్యత మహోదయసుందరీణామ్) కాన్యకుబ్జమతి పవిత్రమైదని బాలరామాయణములోఁగూడఁ జెప్పెను. ఆదేశపు స్త్రీల వేషము, అలంకరణవిధి, కేశపాశము, వాణి మొదలగునవి యితరదేశపుస్త్రీలచే ననుకార్యము

లని చెప్పియున్నాడు. అరీతిగానే పాంచాలదేశ మంతర్వేదికాభరణమని వర్ణింప బడినది. ఆదేశస్థులు మనోజ్ఞములైన నూతనకావ్యములయందు మిక్కిలి యభిలాష గలవారు. ఆదేశపుకవులు రచించిన కావ్యములు మిగుల భవ్యములు. వారిశ్లోక పఠనరీతి శ్రోత్రలకర్ణములకు మధుధార. (ఇమే అంతర్వేదిభూషణం పంచాలాః యోమార్గః పరిభావకర్మణిగిరాం యాసూక్తిముద్రాక్రమే భంగిర్యాకబరీచయేషురచనం యద్భూషణాళీషుచ। దృష్టం సుందరి కాన్యకుబ్జలలనా లోకైరిహాన్యచ్చయచ్ఛిక్షంతే సకలాసుదిక్షుతరసాలత్కౌతుకిన్యస్త్రియః శశ్వత్సుధామ వసుధామహితం ద్విష ద్భిరోన్నగాహితం భవతిగాధిపురం పురస్తాత్। వైదేహిదేహి శఫరీ సదృశం దృశంత దస్మిన్నితం బినినితం బవహద్వ్యసింధా॥ ఇదంద్వయం సర్వమహాపవిత్రం పరస్పరా లంకరణైకహేతుః। పురంచహేజానకి కాన్యకబ్జం సరిచ్చగౌరీపతి మౌళిమాలా॥)

తనకుఁ బోషకుడైన మహేంద్రపాలునిఁబట్టి రాజశేఖరునికి లాటదేశముతో హెచ్చు సంబంధమున్నట్లు కానవచ్చుచున్నది. తద్దేశాధిపతియొక్క పుత్రికయైన కర్పూరమంజరినిఁ దానురచించిన కర్పూరమంజరియను సట్టకమునకు నాయికగా నొన ర్చెను. విద్ధసాలభంజికకూడ నాదేశపురాజుదే బాలరామాయణములో నాదేశమును విశ్వంభరాశిరశ్శేఖరమని వర్ణించియున్నాడు. ఆదేశపుస్త్రీల శరీరలావణ్యమును వాఙ్మాధుర్యమును విపులముగా బాలరామాయణమందుఁ గావ్యమీమాంసయందు గొనియాడెను. "పఠంతి లటభంలాటాః ప్రాకృతంసంస్కృతద్విషః। జిహ్వయా లల్లితోల్లాసలబ్ధసౌందర్యముద్రయా (కా-మీ-పే 34) యద్యోనిః కిలసంస్కృతస్య సుదృశాం జిహ్వాసుయన్మోదతే యత్రశ్రోత్రపథావతారిణి కటుభాషాక్షరాణాం రసః (గద్యం చూర్ణపదం పదం రతిపతేస్తత్ప్రాకృతం యద్వచస్తాన్ లాటాన్ లలితాంగిపశ్యనుదతో దృష్టేర్నిమేషవ్రతమ్। లక్ష్మీకర్తుం వ్రివృత్తోపిలాటీలడహ వీక్షితైః। లక్ష్మీభవతికం దర్పస్స్వేషామే వాత్రి పత్రిణామ్ - (బాల-రా-10 అం- 48-49)

కావ్యమీమాంసానుసారముగాఁ బ్రాచీనభరతఖండముయొక్క భూగోళము.

రాజశేఖరుడు ప్రాచీనహిందూదేశపు భూగోళముతో విశేషపరిచయముగల వాడని యీకావ్యమీమాంసవలననే తెలియుచున్నది. బాలరామాయణనాటక దశ మాంకమందు సింహళద్వీపమునుండి అయోధ్యాపురమునకుఁ బోవు మార్గమందున్న

దేశములనన్నింటినిఁ బూసగుచ్చినట్లు వక్కాణించెను. కావ్యమీమాంసాసప్తదశాధ్యాయము భరతఖండస్థిత నానాదేశవృత్తాంతమును సవిస్తరముగాఁ బ్రతిపాదించుచున్నది. వాగ్భట హేమచంద్రులీవృత్తాంతమునంతయును దొంగిలించి తమగ్రంథములయందుఁ జేర్చుకొనిరి. ఇంతకంటె నధికతరవృత్తాంతము కావలసినయడలఁ దాను రచించిన భువనకోశమను గ్రంథమునుఁ జూచుకొమ్మని చెప్పెను.

రాజశేఖరుడు 1 పూర్వదేశము 2 దక్షిణాపథము 3 పశ్చాద్దేశము 4 ఉత్తరాపథము 5 మధ్యదేశమనని ఆర్యావర్తము నయిదుభాగములుగా విభజించియున్నాడు.

1 పూర్వదేశము—కాశికిఁ దూర్పుగానున్న దేశభాగము, దీనిలో నంగ, కళింగ, కోసల, తోసల, ఉత్కళ, మగధ, ముద్గర, విదేహ, నేపాళ, పుండ్ర, ప్రాగ్జ్యోతిష, తామ్రలిప్తి మలద, మల్లవర్తక, సుహ్మబ్రహ్మోత్తరదేశము మొదలగు దేశములు, బృహద్గృహ, లోహితగిరి, చకోర, దర్దుర, నేపాళకామరూపాది పర్వతములు, శోణ, లౌహిత్య, గంగ, కరతోయ, కపిశ మొదలగు నదులునుకలవు.

మాహిష్మతికి పైభాగము దక్షిణాపథము.

ఇందున్న దేశవిశేషములు:—మహారాష్ట్ర, మాహిషక, అశ్మక, విదర్భ, కుంతల, క్రథకైశిక, సూర్పారక, కాంచీ, కేరళ, కావేర, మురళ, వానవాసక, సింహళ, చోళ, దండక, పాండ్య, పల్లవ, గాంగ, నాసిక్య, కొంకణ, కొల్లగిరి, వల్లర మొదలగునవి.

ఇందలి పర్వతములు:—వింధ్య దక్షిణపాదము, మహేంద్రము, మలయము మేకల, పాల, మంజర, సహ్యశ్రీపర్వతములు.

ఇందలి నదులు:—నర్మద, తాపీ, పయోష్ణీ, గోదావరి, కావేరి, భైమరథి, వేణ, కృష్ణవేణ, వంజుర, తుంగభద్ర, తామ్రపర్ణి, ఉత్పలావతి, రావణగంగ మొదలగునవి.

3 దేవసభకు పైగానున్న భూభాగము పశ్చాద్దేశము.

ఇందలి దేశములు:—దేవసభ, సురాష్ట్ర, దసేరక, త్రివణ, భృగుకచ్ఛ, కచ్ఛీయ, ఆనర్త, అర్బుద, బ్రాహ్మణవాహ, యవనదేశము మొదలగునవి.

ఇందున్న పర్వతములు:—గోవర్ధన, గిరినగర, దేవసభ, మాల్యశిఖర, అర్బుద మొదలగునవి.

నదులు:—సరస్వతి, శ్వభ్రవతి, వార్త్రఘ్ని, మహి, హిడిమ.

4 పృథూదకమునకు పైనున్న భూభాగ ముత్తరాపథము.

ఇందలి దేశములు:—శక, కేకయ, వ్హాణ, వోక్కాణ, వానాయుజ, కాంభోజబాహ్లిక, బహ్లవ, లిమ్పాక, కులూత, కీర, తంగణ, తురుష్క, బర్బర, హార, హూణ, హుడుక, సహుడ, హంసమార్గ, దమథ, కరకంఠ ప్రభృతులు.

ఇందలి పర్వతములు:—హిమాలయకళిందచ, ఇంద్రకీలచంద్రాదలాదులు.

ఇందలి నదులు:—గంగ, సింధు, సరస్వతి, శతద్రు, చంద్రభాగ, యమున ఇరావతి, వితస్త, విపాశ, కుహూ, దేవిక మొదలగునవి.

5 దేవసభకు పృథూదకమునకు మధ్యనున్నది మధ్యదేశము.

భరతఖండముయొక్క నానాదేశములయందు వ్యవహరింపబడు దేశభాషలు.

ఈభరతఖండముయొక్క యేయేదేశములయందేయేభాషలు వ్యవహరింపబడుచున్నవో ఆవిషయమైన కొంతజ్ఞానమును మనకీకావ్యమీమాంస కలుగజేయుచున్నది. కొందరు గౌడులు, సంస్కృతభాషను, లాటదేశస్థులు ప్రాకృతమును, మర్వారు, టక్క, బండానకదేశస్థులు అపభ్రంశభాషను, అవంతి, పారియాత్రదశపురదేశములవారు. భూతభాషను మాట్లాడువారు మధ్యదేశమందున్నవారు సకలభాషాపరిచయము గలవారు (గౌడాద్యాస్సంస్కృతస్థాః పరిచితరుచయః ప్రాకృతే లాటదేశ్యాః। సాపభ్రంశ ప్రయోగాస్సకలమరు భువః టక్కభాదానకాశ్చ। ఆవంత్యాః పారియాత్రాస్సహ దశపుర్కైర్భూతభాషాం భజంతేయో మధ్యేమధ్యదేశం నివసతి సకవిస్సర్వభాషానిషణ్ణః (కా-మీ. పే 51)

రాజశేఖరుని ప్రాకృతభాషాప్రీతి.

బాలరామాయణ నాటక ప్రస్తావనయందు రాజశేఖరుడు సకల భాషా విచక్షణుడని చెప్పబడియున్నది. కవిరాజ బిరుదాంకితునికి ముఖ్యముగా నుండవలసిన

సకల భాషావైచక్షణ్యమొకటి కవిరాజైన రాజశేఖరునికి గలదు. కర్పూరమంజరి యిందుకుదాహరణము. కవిపుంగవుడు తనశక్తికొలది తనరుచికొలది యథాకౌతుకముగా సకల భాషలయందవహితుడైయుండవలెను. (సంస్కృతవత్స కలాస్వపి భాషాసు యథాసామర్థ్యం యథారుచి యథాకౌతుకం చావహితస్స్యాత్ అని కావ్యమీమాంస 49 పే) ఒకకల్పనయే వేరువేరు పదజాలముచేఁ జెప్పఁబడినపుడు దాని భాషనుబట్టి యనేక విధముల సొగసులనుఁ గలిగియుండును (ఏకో౽ర్థస్స్వస్కృతోక్త్యాసను కవిరచనః ప్రాకృతే నాపరో౽స్మిన్నన్యో౽ పభ్రంశగీర్భిః కిమ పరమపరో భూతభాషాక్రమేణ। ద్విత్రాభిః కోపివాగ్భిర్భవతి చతసృభిఃకించ కశ్చిద్వివేక్తుం యస్యేర్థాధీః ప్రపన్నాస్నపయతి సుకవేస్తస్య కీర్తిర్జగంతి) (కా-మీ-పే-48-49) సకల భాషా కోవిదుడైన కవి జగద్వ్యాప్రింత కీర్తిని సంపాదించును. ప్రాకృతభాష సహజమాధుర్యము గలది. అపభ్రంశ మనోహరము గానుండును. భూతభాష సరసరచనము (గిరశ్శ్రవ్యాదివ్యాః ప్రకృతి మధురాః ప్రాకృతధురః సుభవ్యో౽పభ్రంశస్సరపరచనం భూతవచనం (విభిన్నాః పంథానః కిముపికమనీ యాశ్చతఇమే నిబద్ధాయస్తేషాం సఖలు నిఖిలే౽స్మిన్కవివృషా (బాల-రా. 1 అం. 10 శ్లో.) సంస్కృతకవనము పరుషమనియు ప్రాకృతకవనము సుకుమారమనియుఁ గర్పూరమంజరిలో వ్రాసియున్నాడు. (పరుసాసక్కఅబంధాపాఉఅబంధోవి హోయిను ఉమారో। పురిసమహిలాణం జేత్తిఅమిహన్తరం తేత్తి అమిమాణమ్ (కర్పూర-ప్ర-అ 4).

## ప్రాచీన భారతీయుల సంభాషణరీతి, పఠనరీతి.

ప్రాచీన భరతఖండములో నున్న నానావిధదేశములయందు నివసించు మనుష్యుల సంభాషణరీతి పఠనరీతి కావ్యమీమాంసా సప్తమాధ్యాయము విపులముగాఁ బ్రతిపాదించుచున్నవి. కాశికిఁదూర్పున నున్న మాగధులు యింక మఱికొందరు సంస్కృతభాషను జక్కగా మాట్లాడువారు కాని ప్రాకృతభాష నెఱుంగరు గౌడదేశస్థుడు ప్రాకృతభాషను బాగుగా మాటలాడనేరడు వాడు ప్రాకృతమును మాట్లాడు ప్రయత్నముసైన విడువవలెను. లేక యాప్రాకృతభాష రూపాంతరము. నైన ధరింపవలెను. గౌడ బ్రాహ్మణుని యుచ్చారణము స్పష్టముగానుండదు. రూక్షముగానుండదు. కోమలముగానుండదు. మంద్రముగానుండదు. తారముగా నుండదు. రసమెద్దియైయుండినను కర్ణాట దేశస్థులు మాట కొసను టంకారత్తో,

సగర్వముగాఁజదువుదురు. ద్రావిడులు గద్యమునుగాని పద్యమునుగాని రాగముతోఁ జదువుదురు. సంస్కృతభాషాద్వేషముగల లాటదేశస్థులు లలితమైన జిహ్వలతోఁ బ్రాకృతమునుఁ జక్కగామాటాడుదురు. సురాష్ట్రత్రవణదేశ ములయందు నివసించువారు తమ వాణికి సౌష్టవమును గలిగించుట కపభ్రంశశబ్దములతో గలిపి సంస్కృతభాషను సంభాషింతురు. కాశ్మీరదేశస్థులు సరస్వతీకటాక్షముచే మంచి కవులైనను వారి యుచ్చారణ మెంతమాత్రము స్పష్టముగానుండదు. ఉత్తరపథ మందున్న కవులు మంచి సంస్కారము గలవారైనను ముక్కుతో మాటాడుదురు. పాంచాలదేశపు కవులకావ్యపాఠము సంపూర్ణవర్ణరచనతోగూడి యతివిభక్తమై శ్రావ్యమైయుండును.

## రాజశేఖరుని కాలమందు స్త్రీ విద్య.

పురుషులవలె స్త్రీలు కూడ కవులు గ్రంథకర్తలు కావచ్చును. సంస్కార మాత్రమది. అది జాతిప్రతి నియతముకాదు. అతని కాలమందు మహారాజకుమారికలు, మంత్రిపుత్రికలు, గణికలు మొదలగువారు కవులు శాస్త్రజ్ఞానము గలవారునై యుండిరి.



శ్రీ వేదవ్యాస ముద్రాక్షర శాల, విజయనగరము.

# గ్రంథకర్త రచించిన గ్రంథములు.

1. పార్థసారథి శతకము.
2. ఆంధ్రగీర్వాణ శతకోపసహాసము (రెండుభాగములు).
3. దేవవ్రత చరిత్రము (పద్యకావ్యము).
4. ఆంధ్రహర్ష చరిత్రము. (వచనము)
5. శ్రీకృష్ణ చరిత్రము. (వచనము)
6. అలంకార శాస్త్రచరిత్రము.